The Largest Circulated Telugu Monthly

# చతుర

నవంబరు 1992
రూ. 5/-



వి. నాగరత్న నవల స్వర్శ

# ప్రియ ఘుమఘుమలు మీకోసం

అద్భుతం... ఇది అమోఘం... ఔనండీ - ఈ ప్రియ పచ్చళ్లు మీ కోసమే ! మేలైన దినుసులు,
నోరూరించే మధురిమల సమ్మేళనం - ప్రియ ఏ వేళైనా... ఏ వంటకమై అది భోజనమైనా -
అల్పాహారమైనా - అతిథి సత్కారమైనా... 'ప్రియ' జోడించండి... మరచిపోలేని అనుభూతిని పొందండి!

**ప్రియ - ఇప్పుడు మీ కెంతో ఇష్టమైన 15 వేర్వేరు రుచుల్లో**







ఊరగాయలు
ఉషోదయా ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్
ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాదు- 500 482.





# చతుర కతలు

## అందెవేసిన చెయ్యి

మచిలీపట్నం రోల్డ్‌గోల్డ్ వ్యాపారస్థులొకరు వర్థమాన నటి ప్రవర్థతో కాంట్రాక్టు కుదుర్చుకున్నారు. "సినిమాలలో ఆమె ధరించే నగల డిజైన్లను తయారుచేసే హక్కు తమ కంపెనీ వారికి మాత్రమే ఉన్నదని ఆ ఒప్పందం.

ఈ నాలుగేళ్ళనుండీ ఆమె సినిమాలలో ధరించే నగలను వారే తయారుచేస్తూ లాభాలు బాగా ఆర్జించారు. ఆమె నటించే సినిమాలన్నీ హిట్ అవుతున్నాయి. ఆమె ధరించే ఆభరణాలు, వేసుకునే డ్రస్సులూ, హెయిర్‌స్టైయిలూ, బొట్టు ఒకటేమిటి, చివరికి ఆమె పాదరక్షల్ని కూడా శ్రద్ధగా గమనించి, అనుకరించే సినీ ప్రేక్షక నారీమణులు తెలుగునాట అసంఖ్యాకంగా ఉన్నారు.

ప్రవర్థ ధరించే ఆభరణాల డిజైన్లను చాలా వరకు ఆ రోల్డ్‌గోల్డ్ కంపెనీవారే తయారుచేస్తారు. ఆర్ట్ డైరెక్టర్ ముందస్తుగా గీసి ఇచ్చే డిజైన్లను ప్రవర్థ 'ఒకే' చేసి, దాని ఆర్డర్ వీరికే ఇప్పిస్తుంది.

ఆమె సినిమాలతోపాటే, ఆ కంపెనీవారి తయారీలు కూడా వెనువెంటనే మార్కెట్లోకి దూకేస్తాయి. ఫలితాలెప్పుడూ ప్లస్ పాయింట్స్‌లోనే దూసుకుపోతూ ఉన్నాయి.

అప్పుడప్పుడూ ప్రవర్థ తన స్నేహితుల సలహాతో, తనకు నచ్చిన పద్ధతిలో కూడా కొన్ని నగలు చేయిస్తూంటుంది. అలా చేయించిన వాటి డిజైన్లను కూడా తను కాంట్రాక్టు కుదుర్చుకున్న ఆ రోల్డ్‌గోల్డ్ కంపెనీవారికే అందజేస్తుంది.

ఆ రంగంలో ఈ కంపెనీవారిది అందెవేసిన చెయ్యిగా మార్మోగిపోయింది. ఎన్నో అవార్డులను పొందారు కూడా.

నటి ప్రవర్థ చేయించుకునే ఆభరణాల డిజైన్లు ఎలా ఉంటాయో వారికే తెలును. ప్రేక్షక నారీమణుల అభిరుచిని కూడా వారు



కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: గౌరీశంకర్

బాగా ఎరుగుదురు.

ఈ వారం విడుదలయిన ఆమె లేటెస్ట్ పిక్చర్‌లో ఆమె ధరించిన చెవి జూకాలు, గొలుసులు, గాజులూ అన్నీ వింతడిజైన్లలో ఉన్నాయి. వాటిని చూసి, ఆశ్చర్యపోతూనే ఆ కంపెనీవారు ఆ మోడల్స్‌లో ఆభరణాలు తయారుచేసి షాపులకు పంపారు. అవి బ్రహ్మాండంగా అమ్ముడయిపోయాయి.

ఆ కంపెనీ డిజైనర్ వేణుకు ఆ డిజైన్ స్వరూపానికి ఆధారం ఏమిటో ఎంత ఆలోచించినా అర్థంకాలేదు.

ఫారన్ డిజైన్ల కేటలాగులన్నిటినీ కూడా తిరగేశాడు. కానీ ఈ డిజైన్ జాడ దొరకనేలేదు. అతని ప్రయత్నాలన్నీ విఫలమై ఇక లాభం లేదనుకున్నాడు.

ఒక శుభ ముహూర్తాన అప్పాయింట్‌మెంటు తీసుకుని నటి ప్రవర్ధను కలుసుకున్నాడు.

ఆమె షూటింగ్ కోసం 'రెడీ' అవుతూ మేకప్‌రూమ్‌లో చాలా బిజీగా ఉంది. ఎలాగో వీలు చేసుకుని 'గుడ్‌మార్నింగ్ మేడమ్!' అని పలకరించాడు. చిరపరిచితులే అవడంతో, వెంటనే అతన్ని గుర్తించి 'హలో' అన్నది ఆమె.

''మీరు 'మామిడి పూతలు' పిక్చర్‌లో చాలా బాగా నటించారు'' అని ప్రశంసించాడు, ఉపోద్ఘాతంగా.

ఆమె తన చెవి జూకాలు, చేతివేలికున్న ఉంగరమూ మ్యాచింగ్ బాగున్నాయో లేదోనని అద్దంలో చూసుకుంటూ ''థాంక్యూ'' అన్నది.

''ఆ పిక్చర్‌లో మీరు వేసుకున్న ఆభరణాలు, డిజైన్స్ చాలా బాగున్నాయి. ఆ ఐడియాలు మీకు ఎవరిచ్చారోగాని, అద్భుతమండీ! వీలైతే వారిని పరిచయం చేస్తారా?'' అన్నాడు వేణు.

ఆ ప్రశ్నకు ఆమె గట్టిగా నవ్వింది.

''భలేవారే! ఆ డిజైనర్ ఎవరోకాదు! నేనే! ఇదివరకు నేను వేసిన సినిమాలన్నిటిలోని చిన్నచిన్న చెవి జూకాలను కలిపి ఒకే గొలుసుగా కుట్టేశాను. అన్ని రకాల జూకాలూ వ్రేళ్ళాడుతూ, కొత్తగా అగుపిస్తూ ఉన్నదికదా అని అనిపించింది. అంతే! ఆ సరికొత్త గొలుసును మెళ్ళో వేసుకుని, షూటింగులో పాల్గొన్నాను'' అంది ఆమె నవ్వుతూ.

''అదా!'' అన్నాడు తెల్లబోయిన, వేణు సీక్రెట్ తెలిశాక నవ్వేస్తూ!

**-పి.కుసుమకుమారి**

---

# థాంక్స్

**చు**క్కపల్లి ముఖాన ఉన్న ఆ మర్రిచెట్టే ఆ ఊరికి బస్టాపైనా, రిక్వెస్టెడ్ స్టాపైనా. దానికింద నిలబడి లక్ష్మీపూర్‌కి బస్‌కోసం ఎదురుచూస్తోంది శ్యామల ఒంటరిగా- చేతిలో పుస్తకాలతో.

ఆ చుట్టుపక్కల పల్లెలన్నింటికీ లక్ష్మీపూరే టౌను- కాలేజ్ అక్కడే ఉంది.

ఈమధ్యన విద్యార్థుల సంఖ్య పెరిగి, తుఫాన్వల్ల భవనాల సంఖ్య తరగటంతో కాలేజ్‌లో ''షిఫ్ట్ సిస్టమ్'' ప్రవేశపెట్టారు. ఉదయం ఏడిరటినుండి పన్నెండింటివరకూ ఆర్ట్స్ వాళ్ళకి, పన్నెండింటినుండీ సాయంత్రం అయిదింటివరకూ సైన్స్‌వాళ్ళకీ క్లాసులు జరుగుతున్నాయి.

చుక్కపల్లినుండి కాలేజీకి వెళ్ళే స్టూడెంట్సంతా ఆర్ట్స్‌వాళ్ళే కావటంవల్ల అంతా ఫస్ట్ షిఫ్ట్‌కి వెళ్ళిపోతూండటంతో శ్యామల ఒక్కతే సెకండ్ షిఫ్ట్‌కి వెళ్ళిరావాల్సొస్తోంది.

''టౌనుకా అమ్మాయిగారూ?'' అన్న పిలుపుకు శ్యామల తలతిప్పి చూసింది. తమ పాలేర్ల పిల్లలు ముత్యాలు, బయ్యన్నలు కనిపించారు.

''ఊఁ... మీరు టౌనుకేనా?'' అంది.

ఔనని చెప్పి వాళ్ళిద్దరూ తమ ధోరణిలో పెద్దగా అరుస్తూ, నవ్వుకుంటూ ఏదో సినిమా గురించి చర్చించుకోసాగారు.

అంతలో-

అదేరోడ్డున స్కూటర్‌మీద టౌనువైపుకు పోతున్న ఒక యువకుడు టక్కున స్కూటరాపేసి పరిగెత్తుకుంటూ వచ్చి ముత్యాలు,



బయ్యన్నలమీద విరుచుకుపడ్డాడు. వెర్రి ఆవేశంతో ఇద్దర్నీ తన్నసాగాడు.

ఆ హఠాత్పరిణామానికి మెదళ్లు మొద్దుబారటంతో ఆంతటి మనుషులూ కూడా తక్షణం ఏం చెయ్యాలో ఆలోచించలేక ఊళ్లోకి పరిగెత్తారు.

శ్యామల భయంతో చూస్తూ ఉండిపోయింది.

స్కూటరిస్ట్ క్రాఫ్ సరిచేసుకుని శ్యామల వైపు ఒకచూపు చూసి చిన్నగా నవ్వి స్కూటర్ వైపుకు రెండడుగులు వేసి మళ్ళీ వెనక్కి వచ్చి శ్యామలతో-

"కనీసం థాంక్సయినా చెప్పక్కర్లేదా?" అన్నాడు విజయగర్వంతో.

శ్యామలకు అతని మాటలు అర్థం కావటానికి రెండు మూడుక్షణాలు పట్టాయి.

ఆలోగా-

ముత్యాలు, బయ్యన్నలు ఎంత వేగంగా వెళ్ళారో అంతే వేగంగా- మరో నలుగురితో చేతిలో కర్రలతో ప్రత్యక్షమయ్యారు.

వాళ్ళను చూడగానే స్కూటరిస్ట్ ముఖంలోని గర్వం స్థానంలో రవ్వంత భయం తచ్చాడసాగింది. వాళ్లను చూస్తూ అలా నిలబడిపోయాడు.

క్షణంకంటే తక్కువ సమయంలో సదరు స్కూటరిస్ట్ పని ఖాళీ అయిపోయుండేదే! కానీ...

"ఆగండాగండి! మీరిద్దరూ నన్ను అల్లరిపెడుతున్నారనుకుని అతనలా ప్రవర్తించాడు తప్ప మరేం కాదు" అంది శ్యామల.

వాళ్లందరూ కర్రలు దించుతూ ఆశ్చర్యపోయారు.

"ఏమైనా మీరడ్డు పడకపోతే ఇయ్యాలతో ఈడికి నూకలు సెల్లిపోయేవి" అన్నాడు ఒకడు ఆ స్కూటరిస్ట్ వంక కోపంగా చూస్తూ.

"బుల్లోడా కాత్త ఎనకాముందు సూసుకుపో! లేపోతే కరుసైపోగలవ్!" అన్నాడు మరొకడు.

పాపం, స్కూటరిస్ట్ పాలిపోయిన ముఖంతో స్కూటర్ స్టార్ట్ చేస్తుంటే-

"కనీసం థాంక్సయినా చెప్పొద్దా?" అంది శ్యామల నవ్వుతూ.

ఎత్తిన తల దించకుండా "థాంక్స్" అని స్కూటర్‌మీద తుర్రుమన్నాడు.

**-కళ్ళేపల్లి తిరుమలరావు**





# చతుర ప్రపంచం




## చావుకోసం తిప్పలు

**చే**స్తున్న ఉద్యోగం కాస్తా పుటుక్కుమని ఊడిపోవడంతో ఇరవై రెండేళ్ల రాబర్ట్ బల్లార్డ్‌కు జీవితం మీద విరక్తి కలిగింది. వాళ్లమీద, వీళ్లమీద ఆధారపడి బ్రతకడంకన్నా చావడంమేలని భావించాశాయువకుడు. వెంటనే నిద్రమాత్రల ప్యాకెట్లు ఓ అరడజను కొనుక్కొచ్చాడు. వాటితోపాటు మరికొన్ని విషపూరితమైన మందుల్ని పట్టుకొచ్చాడు. తర్వాత తీరిగ్గా ఇంట్లో ఎవరూ లేని సమయంలో వాటన్నింటినీ మింగి నాలుగు పెగ్గుల విస్కీతాగాడు. ఆపైన తనకికచావు ఖాయమేనను కుంటూ మత్తుగా పడుకుండిపోయాడతను.

కానీ అతను చావలేదు పైపెచ్చు మగతవదిలాక చూసుకుంటే మునుపటికంటే ఆరోగ్యంగా ఉన్నాడతను.

ఇలాలాభంలేదని వంటింట్లోకి పరుగెత్తి చాకుతో మణికట్టు దగ్గరి నరాల్ని కోశాడు. చాకు పదునుగా లేనందున ఆ ప్రయత్నమూ ఫలించలేదు. ఎలాగో ఓ బ్లేడ్ సంపాదించి కోసుకున్నాడు. నెత్తురు ఫౌంటిన్‌లా చిమ్మింది. మరికొన్ని క్షణాలలోనే అతను స్పృహతప్పాడు. తెలివివచ్చి చూసుకునేసరికి నెత్తురు మడుగులో పడి ఉన్నాడతను. చేతినుండి కారుతున్న రక్తం ఎందుచేతో ఆగిపోవడంతో మృత్యువు అతన్ని సమీపించలేకపోయింది. ఇది మార్గం కాదని వంటింట్లోని గ్యాస్ పొయ్యి మీద

ముఖం ఉంచి గ్యాస్ వదిలాడు. అరగంట గడిచినా ఫలితం లేకపోయింది. తర్వాత దూలానికి తాడుబిగించి ఉరివేసుకున్నాడు. తాడు తెగి కిందపడ్డాడే తప్ప పైకి పోలేదు.

ఇకవిసిగివేసారిన రాబర్ట్ మళ్లీకిచెన్‌లో దూరి తలుపులన్నీ బిడాయించుకొని గ్యాస్ లీక్‌చేశాడు. గది మొత్తంగ్యాస్ ఆవరించడంతో స్పృహ తప్పిపడిపోయాడతను. అదే సమయంలో మిత్రలిద్దరు వచ్చారతనికోసం. గ్యాస్‌లీక్ అవుతున్న వాసన పసిగట్టి ఆ ఇద్దరూ కిచెన్ తలుపులు పగులకొట్టి లోపలికివెళ్లి కిటికీలు తెరిచారు.

అయితే ఆ ప్రక్కనే ఒక ఎలక్ట్రిక్ హీటర్ పనిచేస్తోంది. గదినుంచి బయటపడిన గాస్ సరాసరి వెళ్లి ఆ హీటర్‌ని ఆవరించింది. అంతే పెద్ద విస్ఫోటనం. ఆ దెబ్బకు మిత్రులిద్దరూ అక్కడికక్కడే మరణించారు. ఇల్లు కూలిపోయింది. కాని ఆశ్చర్యం. రాబర్ట్ మాత్రం మరణించలేదు. స్పృహలేని స్థితిలో కిచెన్‌లో ఓ మూల పడి ఉన్నాడు.

ఆత్మహత్యా ప్రయత్నం చేసినందుకు అతనికి రెండేళ్ల జైలు శిక్ష విధించింది న్యాయస్థానం. అతని మిత్రుల చావుకి కారణ భూతుడైనందుకు 50,000 డాలర్ల జరిమానా కూడా విధించింది. "నేను చావాలనుకున్నానే తప్ప నేనెవరినీ చంపాలనుకోలేదు. నాకు ఈ జరిమానా విధించడం అన్యాయం" అని లబలబలాడాడతను. కానీ ఫలితం లేకపోయింది. అప్పోసప్పో చేసి అతని తండ్రి ఆ జరిమానా చెల్లించాడు.

కొన్నాళ్లకి మళ్లీ రాబర్ట్‌కి మంచి ఉద్యోగం దొరికింది. ఆ తర్వాత అందమైన భార్యా వచ్చింది. హాయిగా ఉద్యోగం చేసుకుంటూ భార్యతో ఆనందంగా గడుపుతున్నాడతను ప్రస్తుతం. ఇప్పటికీ అప్పటి ఆత్మహత్యకు పూనుకున్న రోజు గుర్తొస్తే భయంతో వణకిపోతాడతను. ఈ సంఘటన 1985, మార్చి 15న ఇంగ్లాండ్‌లోని మాంచెస్టర్‌లో జరిగింది.




అమెరికా, చైనా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ వంటి పదిదేశాలు పాల్గొన్న ఒక 'ఇంటర్నేషనల్ అథ్లెటిక్ మీట్'లో మనదేశం 20 స్వర్ణాల్ని 9 రజతాల్ని మూడు కాంస్యపతకాల్ని చేజిక్కించుకొని అగ్రభాగాన నిలిచింది. మీరు నమ్మినా నమ్మకపోయినా ఇది మాత్రం వాస్తవం. కేవలం వృద్ధులకే పరిమితమైన



పోటీ కావడంవల్ల దాని గురించి చాలామందికి తెలియదు. హాంకాంగ్‌లో ఆమధ్య జరిగిన నద రు పోటీకి మనదేశంనుంచి 35 మంది బామ్మ లు, తాతయ్యలు, అమ్మమ్మలు వెళ్లి ఎడాపెడా వీరవిహారంచేసి పతకాలవంట పండించారు. కనీసం ముసలాళ్లయినా మన'పరువు' కాపాడి నందుకు వాళ్లని మనం మెచ్చుకుతీరాల్సిందే.

ఎనిమిదిమంది కొడుకులూ, కూతుళ్లూ, అయిదుగురు మనవళ్లూగల 63 ఏళ్ల వనలతా సేన్ అనే బామ్మగారు ఆ 'మీట్'లో మూడు బంగారు పతకాల్ని సాధించింది. పదేళ్లక్రితమే కట్టుడుపళ్లు కట్టించుకున్న వనలతాసేన్ పశ్చిమబెంగాల్‌కి చెందిన వ్యక్తి. ఆమె భర్త జగన్‌ఘోష్ ఓ మాజీ అథ్లెట్. అయిదేళ్లక్రితం సరదాగా భర్తతోపాటే ఉదయాన్నే వాకింగ్‌కి బయలుదేరిందామె. "58 ఏళ్ల వయస్సులో వాకింగ్‌కి, రన్నింగ్‌కి వెళ్లడమేమిటి?" అని చుట్టుప్రక్కల అమ్మలక్కలు బుగ్గలు నొక్కుకున్నారు. అయినా వనలత వాళ్ల విమర్శల్ని లెక్కచేయలేదు. భర్త ప్రోత్సాహంతో దీక్షగా సాధనచేసి, అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపును సాధించింది.

"18 ఏళ్లకి నా పెళ్లయింది. ఆ తర్వాత సంసారం, పిల్లలు, పిల్లల పెళ్లిళ్లు, ఆ తర్వాత మనుమళ్లు... ఇవన్నీ అయ్యాక 58వ ఏట నా అథ్లెట్ కెరియర్ మొదలయింది... అసలు ఈ కెరియర్‌ని ఎప్పుడో పెళ్లికిముందే అంటే చిన్నతనంలోనే ప్రారంభించి ఉంటే ఎంత బావుండేదోకదా అని ఇప్పుడనిపిస్తోంది నాకు. పోన్లే ఇప్పటికయినా ఇందులో ప్రవేశించి ఈ మాత్రం గుర్తింపు పొందగలిగాను. అదే పదివేలు..." అంటోంది వనలత.

---

## ఫలించిన అన్వేషణ

**43**ఏళ్ల తర్వాత ఎట్టకేలకు తన సుదీర్ఘ అన్వేషణ ఫలించినందుకుగాను ఆనందంతో తబ్బిబ్బవుతున్నాడు ఎనభైనాలుగేళ్ల రాల్ఫ్ ఫ్రాని. ఇంగ్లాండ్‌కు చెందిన ఆ పెద్దమనిషి రెండవ ప్రపంచయుద్ధకాలంలో సైనికుడిగా పనిచేశాడు. ఆ సందర్భంగా 1945 జూన్ 4న ఇంగ్లాండ్‌లోని బోర్నియో అడవుల్లో అవసానదశలోనున్న మరో సైనికుడతని కంటపడ్డాడు. అతను కొన ప్రాణంతో కొట్టుకుంటూనే రాల్ఫ్ చేతికి ఓ తెల్లకాగితం అందించాడు. ఆకాగితం మీద పెన్సిల్‌తో గీసిన ఇద్దరు పిల్లల బొమ్మలున్నాయి. "వీళ్లు నా పిల్లలు... దయచేసి వాళ్లని ఆదుకుంటావుగదూ?..." అని చెప్పి తల వాల్చేశాడతను. ఆ కాగితంమీద ఆ పిల్లల పేర్లుకానీ వారి చిరునామాకానీ లేదు. కనీసం ఆ చనిపోయిన సైనికుడిపేరు కూడా రాల్ఫ్‌కి తెలియదు.

యుద్ధానంతరం ఆ పిల్లల గురించి ఇంగ్లాండంతా గాలించాడతను. కాని ప్రయోజనంలేకపోయింది. అలా ఒకటికాదు రెండుకాదు నాలుగు దశాబ్దాలే గడచిపోయాయి. ఇక పూర్తిగా ఆశలు వదులుకోవాలనుకుంటున్న తరుణంలో ఓనాటి రాత్రి కలలో ఓ అపరిచిత వ్యక్తి కనబడి "స్టాథమ్, స్టాథమ్" అని నాలుగుసార్లు అరిచాడు. దిగ్గునలేచి కూర్చున్నాడు రాల్ఫ్. ఆ పేరు అంతకుముందెప్పుడూ అతను వినలేదు. ఒకవేళ మరణించిన సైనికుడి పేరు అదేనేమో అనుకున్నాడతను.

అది జరిగిన నాలుగైదురోజులకే రెండవప్రపంచయుద్ధంలో అసువుల బాసిన అమరవీరుల పేర్లు ఫొటోలు విపులంగా ప్రకటించిందో పత్రిక. అందులో ఛార్లీస్టాథమ్ ఫొటోని గుర్తించాడు రాల్ఫ్. అతనే అవసాన దశలో తనకి కన్పించిన సైనికుడు. వెంటనే ఒక స్థానిక పత్రిక కార్యాలయానికి వెళ్లి స్టాథమ్ అంతిమ ఘడియలలో తన బిడ్డల విషయం తనతో చెప్పాడని వివరాలు కావాల్సినవారు తనని సంప్రదించవచ్చునని పేపర్లో ప్రకటించాడు.

దానికి ప్రతిస్పందనగా స్టాథమ్ పిల్లలిద్దరూ అతన్ని వెదుక్కుంటూ వచ్చేశారు. అతని కూతురు డాఫ్నే అప్పటికే యాభయ్యవపడిలో పడింది. ఆమె తమ్ముడు పీటర్ కూడా నలభై ఏళ్లు దాటాడు. ఆ అక్కాతమ్ముళ్లిద్దరూ తమ తండ్రి చివరిఘడియల్లో పెన్సిలుతో వేసిన తమ బొమ్మని చూసుకొని కన్నీరు కార్చారు.



# చతుర

సంపుటి: 15 సంచిక: 10 నవంబర్: 1992

అతడు చేసే ఓ చిరుసంజ్ఞ... ఆమె మనోనిశీథిలో అనంత కాంతిపుంజాల ఆవిర్భావం. ఆమె కనిపించనిదినం అతడి పాలిట స్తంభించిన యుగం.

అనుక్షణం అతని ఆలోచనలే ఊపిరిగా బతికే ఆమె జీవనోద్యానంలోకి అతడి ఆగమనం ఆమనియై విరిసినవేళ...

ఆమె ప్రేమసింహాసనాన్ని అతడు చక్రవర్తిలా అధిష్టించబోయిన వేళ... వారి ప్రేమకథ తిరిగిన ఊహించని మలుపులు ఏమిటి?



రసహృదయ స్పందనలకు రమ్యాక్షరరూపం

వి. నాగరత్న రచన

# స్పర్శ

ఈ నెల చతుర సమగ్ర నవల.



ఉదయం పది గంటలు కావస్తుంది.

'జ్ఞాన్‌భవన్' ఆవరణంతా పిల్లలతో కోలాహలంగావుంది. ఉపాధ్యాయులు ఒక్కొక్కరే వస్తున్నారు.

కాంపౌండ్‌వాల్ దాటితే పెద్ద ప్లేగ్రౌండు. ఆ స్థలంలోనే ఒక చివరగా స్టేజి, దానికి దగ్గరలోనే అసలు భవనముంది. ఆ భవనంలో క్రింది భాగంలో ఉన్నత పాఠశాల, పైభాగంలో కళాశాల ఏర్పాటు చేశారు. భవనానికి వెళ్ళే దారిలో అటూ ఇటూ రకరకాల, రంగురంగుల పూల మొక్కలున్నాయి.

ఫిబ్రవరి నెల కావడాన ఎండలో తీక్షణత లేదు. హాయిగొలిపే చల్లగాలి వీస్తోంది.

జ్ఞాన్‌భవన్ గేటు దగ్గర ఒక ఆటో ఆగింది. ఆటో ఫేర్ చెల్లించి, హాండ్‌బాగ్ భుజానికి తగిలించుకుని స్మిత ఆటో దిగింది. ఆమెకి ముప్పయి అయిదేళ్ళుంటాయి. అయిదడుగుల మూడంగుళాల ఎత్తుకి తగ్గ లావుకంటే కాస్త ఎక్కువేవుంది. ఆ లావు ఆమెకి నిండుతనాన్ని ఇచ్చిందే తప్ప మరీ భారీగా అన్పించేట్లు లేదు. పొడవాటి కురులే కరువైన కాలంలో బారెడు జడ అందంగా వేళ్ళాడుతుంటే వెంకటగిరి చీర ఆమెకి వయసుకి తగ్గ హుందాతనాన్ని తెచ్చిపెట్టింది. ముక్కు మీదికి జారుతున్నట్లున్న కళ్ళజోడు పైకి ఎగదోసుకుంటూ ఆమె చకచకా లోపలికి నడుస్తుంటే "గుడ్‌మార్నింగ్! మేడమ్" అంటూ పిల్లలు, ఉపాధ్యాయులు పలకరిస్తున్నారు. ఆమె చిరునవ్వుతో ప్రతి నమస్కారాలు చేస్తూ నడుస్తోంది. కొందరు పిల్లలు తమ ప్రేమని, గౌరవాన్ని పూవుల రూపంలో అందించారు. కృతజ్ఞతా సూచకంగా చిరునవ్వు నవ్వుతూ, ధన్యవాదాలు తెలియజేస్తూ స్మిత ప్రిన్సిపాల్ రూం చేరుకుంది.

స్మితని చూస్తూనే ప్యూన్ నారాయణ ఫాన్ ఆన్ చేశాడు. మంచినీళ్ళ గ్లాసు తెచ్చి టేబుల్ మీద పెట్టాడు.

"నారాయణా! డాన్స్ టీచరొచ్చారా? ఆవిణ్ణో సారి రమ్మన్నానని చెప్పు" అంది స్మిత మంచినీళ్ళ గ్లాసు అందుకుంటూ.

నారాయణ స్టాఫ్ రూం వైపు పరుగులాంటి నడకతో వెళ్ళాడు.

కొద్దిసేపట్లో ఇద్దరూ వచ్చారు. డాన్స్ టీచర్ విష్ చేసింది.

ప్రతి నమస్కారం చేసి కూర్చోమన్నట్లు సైగ చేసింది స్మిత.

"ఏం కరుణా!, ప్రోగ్రాం లిస్టంతా రెడీగా వుందా? స్పీచెస్‌కాక, కల్చరల్ ప్రోగ్రాంస్‌కి ఎంత టైం తీసుకుంటుందంటారు?"

"తేలిగ్గా నాలుగ్గంటలు పట్టచ్చు మేడం. లిస్ట్ రెడీగావుంది తెచ్చివ్వమంటారా?" అన్నది కరుణ.

"ఆఁ ఇవ్వండి. మీరు కూడా వుండాలి. ముందు ప్రేయర్ కానివ్వండి. నారాయణా! ఇంకా బెల్ కొట్టలేదే?!"

"ఈరోజు కూడా ప్రేయరుందామ్మా?!"

"అదేం ప్రశ్న?! సాయంత్రం ఏన్యువల్‌డే ఫంక్షన్ వున్నంతమాత్రాన ఇప్పుడు ప్రేయర్ ఎందుకుండదు?" అంది స్మిత.

నారాయణ వెళ్ళి బెల్ కొట్టాడు.

పిల్లలంతా క్లాసులవారీగా, ఎత్తుల ప్రకారం రోజూలాగే గ్రౌండులో నిలబడి, క్రమశిక్షణతో ప్రార్థన చేశారు.

ప్రార్థన ముగిసిన అనంతరం స్మిత "మీరంతా మీమీ క్లాసులకెళ్ళి కూర్చోండి. ప్రోగ్రామ్స్‌కి పేర్లిచ్చిన వాళ్ళు మాత్రం ఆఫీసురూంకి రండి" అంటూ మైకులో చెప్పింది.

ఈలోపు తెలుగు లెక్చరర్ వచ్చి, తాను ఆ సాయంత్రం చదవాల్సిన పరిచయవాక్యాలు చూపాడు. అందుకుని చదివింది స్మిత.

"ఓ ముఖ్య విషయం మర్చిపోయారు... చూడండి" అంది.

అతను చూసి కూడా "అన్నీ రాశాను కదండీ. కాకపోతే క్లుప్తంగా రాశాను. పోనీ విపులంగా రాయమంటారా?" అన్నాడు.

"ఏమక్కర్లా ఇంతకంటే విపులంగా ఎందుకు? కాకపోతే మనం ఏయే కోర్సులు నడిపిస్తున్నామో అది చెప్పడం ముఖ్యం. చాలామందికి ఇన్ని కోర్సులు మన జ్ఞాన్‌భవన్‌లో వున్నాయనే విషయం కూడా తెలియకపోతే మన శ్రమ వ్యర్థమేకదా! అసలు మనమిచ్చే పబ్లిసిటీనే చాలా తక్కువ. సంవత్సరానికో సారి అడ్మిషన్ల టైంలో మాత్రం పేపర్లో ఎడ్వర్టయిజు చేస్తున్నాం. ఇక ఇలాంటి ఫంక్షన్ రోజయినా నోరు విప్పి చెప్తే వచ్చిన వాళ్ళలో ఒక





అవగాహన కలగచ్చు. మరి కొద్దిమంది విద్యార్థులకది ఉపయోగపడచ్చు'' అంది స్మిత.

ఆయన పేపరందుకుని వెళ్ళిపోయాడు.

నారాయణ టీ కప్పులందించాడు.

''కరుణా! ఛీఫ్ గెస్టుకోసారి ఫోన్ చేయండి'' అంది స్మిత.

''నంబరెంత మాడమ్?!'' అడిగింది కరుణ టెలిఫోన్ సమీపిస్తూ.

''డైరెక్టరీ చూడండి. రెసిడెన్షియల్ నంబర్కే చేయండి''

కరుణ నంబరు వెతికి తీసి, తెల్ల కాగితం మీద రాసుకుని ''మేడం! జస్ట్ రిమైండ్ చేయడమేనా, ఇంకేమైనా చెప్పాలా?'' అంది.

''ఇంకేముంటుంది? సరిగ్గా ఐదింటికి కదూ! ఆ టైంలోపు వచ్చేయమని చెప్పండి''

''మన భారద్దేశంలో పంక్చువాలిటీ నూటికోటికి ఏ ఒక్కర్లోనో వుంటుంది. అయిదంటే ఆరింటికొస్తారు. పోనీ నాలుగని చెప్పమంటారా?''

''వాళ్ళు సమయానికి రావడం కోసం అబద్ధం చెప్పాల్సిన అవసరం లేదు. ఎవరి పద్ధతి వాళ్ళది. అసలు విషయం చెప్పడం మన బాధ్యత. తర్వాత ఏ టైముకి రావాలో, వస్తారో అదంతా వాళ్ళిష్టం. మనం అనుకున్న సమయానికి ఎప్పట్లాగే మొదలుపెడ్దాం'' అంది స్మిత నిశ్చితంగా.

''కానీ ముఖ్య అతిథి లేకుండా మనం ఎలా మొదలుపెట్టగలం?'' అంది కరుణ సందేహంగా.

''మీరీ సంవత్సరమే వచ్చారు, కొత్త కాబట్టి అలా అనుకోవచ్చు. చర్చలెందుకు, సాయంత్రం చూద్దురుగాని. ముందు ఆ లిస్టిచ్చి, మొదటి ప్రోగ్రాం ఎవరిదో, ఆ స్టూడెంట్స్‌ని పిలవమని చెప్పండి నారాయణతో'' అంది.

కరుణ అలాగే చేసింది.

ఆఫీసు రూమ్‌లో స్మిత, కరుణ మాత్రం వున్నారు. నారాయణ బయటికెళ్లి నిలబడ్డాడు. విద్యార్థులు క్యూ కట్టుకువచ్చి నిలబడ్డారు.

కరుణ ఆజ్ఞ మేరకు ఆ విద్యార్థులు నిర్భయంగా జానపద నృత్యం చేశారు. రిహార్సల్సన్నీ అయిపోయాయి. కరుణ గైడెన్సులోనే నృత్య, నాటక, ఏకపాత్రాభినయాలన్నీ రూపొందాయి. ఒక్క మిమిక్రీ మాత్రం ఇంగ్లీషు లెక్చరరుకు స్వతహాగా అందులో కొంత అనుభవం వున్నందున ఆయనకి అప్పగించారు. ఇక పాటలన్నీ మ్యూజిక్ టీచర్ ఆధ్వర్యంలో సరికొత్త బాణీలతో రూపుదిద్దుకున్నాయి. అయితే అస్వస్థత కారణంగా మ్యూజిక్ టీచర్ రెండ్రోజులుగా సెలవు పెట్టింది. అయినా ఆమె ముందే అంతా సిద్ధం చేసినందువల్ల ఆ లోటు కన్పించడం లేదు.

ఇక ఇప్పుడు స్మితది ఫైనల్ జడ్జిమెంటు.

''మేడమ్! కాలేజ్ స్టూడెంటు, గణేష్‌ది చివరి ప్రోగ్రాం'' అంది కరుణ.

''ఓఁ... గణేష్... మంచి స్కిల్‌వుంది వాడికి. చాలాబాగా నటిస్తాడు. ఇంతకీ టైటిల్...?'' అంది స్మిత ఆ విద్యార్థి ప్రతిభని గుర్తు చేసుకుంటూ

''సారీ, సరిగ్గా చెప్పలేదు మేడం. సిగ్గుపడ్తూ ఏదో లవ్‌స్టోరీ... చిన్న బిట్... నాకో పది నిమిషాలివ్వమని అడిగితే కాదనలేకపోయా. మొన్న ఆగస్టు పదిహేనున, రిపబ్లిక్ రోజున కూడా బాగా చేశాడు కదా, ఆ నమ్మకంతో..'' కరుణ తను చూడకుండానే సెలక్ట్ చేసినందుకు కాస్త గిల్టీగానే ఫీలవుతూ చెప్పింది.

''మంచి పని చేశారు కరుణా! మనమిలాంటి కల్చరల్ ప్రోగ్రాములు పెట్టుకునేది విద్యార్థుల ప్రతిభని బయటికి తీసుకురావడానికే. వాడిమీద ఆపాటి భరోసా, నమ్మకం వుంచారంటే నాకు చాలా సంతోషంగా వుంది'' అంది స్మిత.

అప్పటికి సమయం ఒకటి దాటింది. ''మేడం! మీరు లంచ్ తీసుకోండి. ఈలోపు నేను గణేష్ సంగతి కనుక్కుంటాను'' అంది కరుణ, బయటకి దారి తీస్తూ.

నారాయణ నీళ్ళగ్లాసు అందించి, బయటకొచ్చి నిలబడ్డాడు. చాలా వేగంగా భోజనం ముగించింది స్మిత. నారాయణ టిఫిన్ బాక్సు కడిగి ప్రక్కనే టేబుల్‌మీద పెట్టాడు. స్మిత ఆవేళొచ్చిన ఉత్తరాలు చూస్తుంటే నారాయణ స్ప్రింగుడోరు ప్రక్కగావున్న స్టూలు మీద కూర్చున్నాడు.

ఇంతలో లేత గులాబీరంగు చీరలో ఒకామె, ఎరుపు, నలుపు చూడీదార్లో మరొకామె అక్కడికొచ్చారు.

ఇద్దరూ నారాయణ దగ్గరగా వచ్చి ''స్మితా మేడమ్ వున్నారా?'' అన్నారు. వుందన్నట్లు తలూపాడు నారాయణ.

''ఆవిడతో మాట్లాడాలి'' అంది ఒకామె లోపలికి దారి తీస్తూ.

''ఉహూ కుదర్దు. ఈ రోజావిడకి తీరికలేదు, ఇంకోసారి రండి'' నిస్సంశయంగా చెప్పేశాడు నారాయణ.

ఆ ప్యూను కూడా కొత్తగా వచ్చినవాడే. పరస్పరం ముఖ పరిచయాలు లేవు.

''మేమెవరో కాదయ్యా... పాత స్టూడెంట్స్‌మే. ఈ కాలేజీలోనే చదివాము. పాత ప్యూను ఎల్లయ్య తెల్సా నీకు?!'' గులాబీరంగు చీరామె అమాయకంగా నిరూపించబోతోంది తాము పాత విద్యార్థులమని.

''ఏమో, నాకెవరూ తెలీదుగానీ మీరు మాత్రం ఇంకోరోజు రండి. ఈ రోజు మేడం ఖాళీగా లేరని చెప్పాగా'' అన్నాడు నారాయణ.

''పోనీ, నువ్వెళ్ళి వనజ, భానుమతి వచ్చారని చెప్పు. ఆవిడ లోపలికి రమ్మంటే వెళ్తాం, లేకుంటే తిరిగి వెళ్ళిపోతాం'' అంది చుడీదారామె.

''ఏమమ్మా! ఏం చదువుకున్నారు? ఎదయినా ఒక మాట చెప్తే కాస్త అర్థంచేసుకోవాలి. ఈరోజు సాయంత్రం ఏదో పెద్ద సంబరముంది. మూడ్రోజులుగా ఆవిడ క్షణం తీరిక లేకుండావున్నారు. ఇప్పుడు మిమ్మల్ని లోనికి పంపితే తర్వాత నన్ను తిట్టచ్చు. మీకు పుణ్యముంటుంది ఇంకోరోజు తీరిగ్గా రండి'' అన్నాడు చాలా విసుగ్గా, కాస్త కంపరంగా.

ఆ యువతులిద్దరూ బిక్కమొహాలేసుకుని వెనుదిరిగారు.

''వీడెక్కడి శనిగ్రహమే!'' అంది రోడ్డు మీదికొచ్చాక చీరామె.

''మేడం మనని చూస్తే ఇలా తిప్పి పంపుతారా? దేవుడు వరమిచ్చినా, పూజారివ్వడని ఇలాంటివాళ్ళని చూసే అనుంటారు మనవాళ్ళు''

''సరేగానే, నాకో ఐడియా తట్టిందే. అదిగో పబ్లిక్ బూత్ కనిపిస్తోంది. మేడంకి ఫోన్ చేస్తే...'' అంది చీరామె.

''బాగుంది, ఆలోచన, సరే పద''

ఫోను స్మితే రిసీవ్ చేసుకుంది.

''హలో, మేడం! నేను వనజని... గుడాఫ్టర్నూన్!'' అంది చీరామె.

''ఆఁ ఏం వనజా! ఎక్కణ్ణుంచి ఫోను? జంటకవుల్లా తిరిగేవాళ్ళు... భానుమతీ, నువ్వూ...'' అంది స్మిత.

''చాలా థాంక్స్ మేడం, అంత గుర్తుంచుకున్నారు మమ్మల్ని. ఏ వనజ? అంటారేమోనని భయపడ్డాను''

''బుద్ధి లేదూ, ఆ మాటనడానికి? మిమ్మల్నెలా మర్చిపోతాననుకున్నావు? ఇంతకీ ఎక్కడనుండి చేస్తున్నావు?''

''ఇక్కడే, కాలేజ్ బయట, పబ్లిక్ బూత్ నుండి''

''ఏం లోపలికొచ్చే తీరిక లేదా?'' కోపంగా అంది స్మిత.

''ప్యూను రానివ్వలేదు, అందుకే...'' నసిగిందామె.

''సరే, నేనతనికి చెప్తాగానీ, ఫోన్ పెట్టేసి రండి'' అంటూ ఫోన్ పెట్టేసింది స్మిత.

బజర్ నొక్కగానే నారాయణ వచ్చి నిలబడ్డాడు.

''ఏం నారాయణా! నా కోసం ఎవరైనా వస్తే తిప్పి పంపమని నీతో చెప్పానా?'' కోపంగా అడిగింది స్మిత.

''అది కాదమ్మా! మీరు చాలా అడావిడిగా వున్నారాయె. అందులో వాళ్ళు పెద్దవాళ్ళు కాదు...'' నసిగాడు నారాయణ.

''వచ్చింది పెద్దలా, పిన్నలా అదంతా నీకనవసరం. ఎవరూ రాకుండా కాపలాగా నిన్నక్కడ కూర్చోమనలేదు. నాకేమైనా అవసరమై అడిగితే చేసిపెట్టు. ఎవరైనా వచ్చినప్పుడు పేరు, వివరాలు కనుక్కుని నాతో వచ్చి చెప్పు. నేనేం సీయంనో, పీయంనో కాను. నన్నెవరో చంపుతారన్న భయం నాకు లేదు. ఒక వేళ వచ్చినవాళ్ళు నా టైము వేస్టు చేస్తున్నారనుకుంటే వాళ్ళనెలా పంపేయాలో, అదంతా నే చూసుకుంటాను'' చిన్నపాటి ఉపన్యాసమి

చ్చింది స్మిత. వృత్తిపరంగా ఆమెకి అనర్గళంగా మాట్లాడే శక్తివున్నా అన్నిసార్లూ ఇలా మాట్లాడదు. కానీ మరీ కోపమొస్తే, ఆవేశమొస్తే ఇక ఆమె ధోరణి కొంతసేపు ప్రవాహంలా దొర్లిపోతుంది.

ఇలా చెప్పేసి స్మిత ఏవో కాగితాలు చూసుకుంటూ కూర్చుంటే నారాయణ నీరుగారిన ముఖంతో బయటికొచ్చాడు.

అప్పుడే ఇద్దరమ్మాయిలూ అక్కడికొచ్చారు.

నారాయణ ఒక్కసారి వాళ్ళ ముఖాల్లోకి సూటిగా చూశాడు. ఆ చూపు వీలైతే వాళ్ళని భస్మం చేయాలన్నంత కోపంగావుంది.

ఆ ఇద్దరమ్మాయిలూ చూపులు మరల్చుకుని, అతన్ని ఏమీ అడక్కుండానే స్ప్రింగుడోరు తోసుకుని లోనికి ప్రవేశించారు.

ఇద్దరూ ఒకేసారి విష్ చేశారు.

"ఆఁ ఏమిటి విశేషాలు? చాలా కాలానికి గుర్తొచ్చినట్లున్నాను"

"మీ దగ్గరికి రాకపోయినా, మిమ్మల్ని రోజూ గుర్తు చేసుకుంటాం మేడం" అంది భానుమతి.

"సంతోషం... సరేగానీ మీ పెళ్ళిళ్ళయ్యాక్కూడా మీరిద్దరూ ఇలా కలిసి వుండగల్గితే..." అంది నవ్వుతూ స్మిత.

"పెళ్ళే కాదు, పోయేవరకూ కలిసే వుంటాం" అంది భానుమతి.

"మేగం! మీకో గుడ్ న్యూస్ చెప్పాలని వచ్చాం. నాకు రిపోర్టర్‌గా జాబొచ్చింది" అంది వనజ స్వీట్ బాక్సు అందిస్తూ.

"మొత్తం బాక్సంతానా?! అర్జంటుగా నాకు షుగర్ రావాలనా ఏం?!" అంటూ ఒక హల్వా పీస్ తీసుకుంది.

"ప్లీజ్! కాదనకండి" బాక్స్ అందించబోయింది వనజ.

"నా సంగతి తెల్సుగా ఏదైనా ఒక్కసారి చెప్పగానే వినాలి. ఇప్పుడే అన్నం తిని కూడా నీకోసం ఇది తీసుకున్నానా లేదా?" అంది స్మిత.

మళ్ళీ తనే "ఇంతకీ, ఎందులో?" అంది స్మిత.

"గ్లోరీ మేగజైన్‌లో. నా అదృష్టం, నాకు ఇంట్రెస్టున్న ఫీల్డులో ఉద్యోగమొచ్చింది. పైగా ఎట్రాక్టివ్ సబ్జెక్ట్..." ఆనందంతో వనజ కళ్ళు మెరిసిపోతున్నాయి.

సరిగ్గా చెప్పమన్నట్లు "ఆఁ" అంది స్మిత.

"అవును మేడం... ఇంటర్వ్యూనూ, రీసెర్చి టాపిక్సూ ఇస్తారట నాకు" అంది వనజ.

"బావుంది... ఒకరకంగా జీవితంలో స్థిరపడబోతున్నావు. మరి నీ సంగతేమిటి?" అంది భానుమతి వంక తిరిగి.

భానుమతి తల దించుకుని "నన్ను, ఉద్యోగం చేయనివ్వరు మేడం మా యింట్లో" అంది.

"మరేం చేయమంటారు? ఈగలు తోలమంటారా?" వ్యంగ్యంగా అంది స్మిత.

భానుమతికి అవమానకరంగా అన్పించింది. ఆమె తలెత్తలేదు.

"నా దగ్గర మూడేళ్ళు చదివి, నువ్విలా మాట్లాడ్తే ఎలా భానుమతీ?! కొందరు పెద్దలు అలాగే వుంటారు, చాదస్తపు భావాలన్నీ మూటకట్టుకుకూర్చుంటారు. మంచి మాటలతోనే వాళ్ళని మార్చగల్గాలి తప్ప, అలాంటి ప్రయత్నం లేకుండా అవే వల్లించేట్లయితే అసలీ చదువులకి ప్రయోజనమేముంది చెప్పూ?" అంది స్మిత.

"కన్విన్స్ చేయడానికే చూస్తున్నానండీ" అందామె.

"మరి, నీ స్వీట్ కోసం ఎదురు చూడనా?" మెల్లగా నవ్వింది స్మిత.

ఇద్దరమ్మాయిలూ నవ్వారు.

"మేడం! నాదో చిన్న రిక్వెస్టు. కాదనని మాటిస్తేనే అడుగుతాను" అంది వనజ.

"ఇది మరీ బాగుందే. విషయం చెప్తే ఆలోచించి మాటిస్తా. ముందే మాటిస్తే ఎలా, నా ప్రాణం కావాలన్నావనుకో ఇవ్వగలనా?" నవ్వింది స్మిత.

"ఛఛ... అలా అనకండి మేడం ప్లీజ్!"

"సర్లే, ఏంటో చెప్పు"

"నా జాబ్... అదే నా మొదటి ఇంటర్వ్యూ మీతోనే మొదలెట్టాలని"

"సర్లే, ఇలాంటి పిచ్చి మాటలు ఆపు. ఈ హైదరాబాదులో హేమాహేమీలైన వాళ్ళు ఎందరోవున్నారు. వాళ్లందర్నీ వదిలి..."




''మేడం గొప్పవాళ్ళు లేరనడం లేదు. కానీ మీతో మొదలు పెట్టాలన్నది నా కోరిక''

''నీ కోరిక సబబుగా లేదు...''

''ప్లీజ్ మేడం, అలా అనకండి. వాళ్ళెంత గొప్పవాళ్ళయినా మీరు నా గురువు. నేను మీ వల్ల ఇన్‌స్పైర్ అయ్యాను తప్ప, వాళ్ళవల్ల కాదు'' ఆవేశంగా అంది వనజ.

''డోంట్ బీ ఫూలిష్ వనజా! వాళ్ళంతా నీకు గురువులు కాలేదంటే, అది నీ దురదృష్టం. అంతమాత్రాన వాళ్ళని తక్కువ అంచనా వేస్తావా?''

''యూ ఆర్ మిస్ టేకెన్ మేడమ్, నేను వాళ్ళని తక్కువ చేయడం లేదు. వాళ్ళు మహానుభావులని ఒప్పుకుంటాను. కానీ మీ ఇంటర్వ్యూతో నా ఉద్యోగం మొదలెట్టాలని నేను అనుకున్నంతలో ఇతర్లని అవమానించినట్లుకాదు. పైగా వాళ్ళు గొప్పవాళ్ళంటున్నారే తప్ప, మీరు మాత్రం గొప్పవాళ్ళు కారా?''

''ఊ ఊఁ నేనేంటో నాకు తెల్సుగానీ నన్ను మాత్రం మునగచెట్టు ఎక్కించకు''

''నిజం మేడం, మా అందరి మనసుల్లో మీరెప్పటికీ నిలిచిపోతారు''

''సంతోషించాగానీ భట్రాజుగా ఎప్పుడు కన్వర్టయ్యావు?''

వనజ బుంగమూతిపెట్టి ''ఇంతకీ సరే అంటున్నారా లేదా మేడం?'' అంది.

''కాదంటే నిరాహార దీక్ష చేస్తావా?'' నవ్విందామె.

''అసలు ఉద్యోగంలోనే చేరను'' మొండిగా అంది.

''సరేగానీ, సాయంత్రం వరకూ వుంటారా, ఈ రోజు ఏన్యువల్‌డే అని తెల్సేమో?!'' అంది స్మిత.

''వుంటాం... మీరసలు విషయం చెప్పండి''

''ఇదిగో, ఇంటర్వ్యూ అని పేరుపెట్టకు. తీరికుంటే రేపు సాయంత్రం ఇంటికి రా, హాయిగా కబుర్లు చెప్పుకుందాం'' అంది స్మిత.

వనజకి మనసు కుదుటపడింది.

ఇంతలో డాన్సు టీచర్ ప్రవేశించింది.

''మేడం! వాడు, గణేష్...''

''ఆఁ గణేష్... ప్రిపేర్డ్‌గా వున్నాడా?''

''ఉహూఁ ఒద్దంటాడు. తన ప్రోగ్రాం కాన్సిల్ చేయమని చెప్పాడు''

''సరే, కాన్సిల్ చేయండి''

''అది కాదు మేడం. వాడేదో అప్‌సెట్ అయినట్లు కనిపించాడు'' కరుణ బాధగా చెప్పింది.

''ఏం? ఎవరైనా అవమానించారా? పిలిపించండి'' రెండు నిమిషాల్లో గణేష్ వచ్చాడు.

''ఎక్స్‌క్యూజ్‌మీ, మేడం...''

''ఎస్, గెటిన్!''

''పిల్చారట...''

''ఆఁ నువ్వేదో డ్రామా కోసం పేరిచ్చావట...''

''కానీ చేయాలని లేదు మేడం?''

''ఎందుకని?''

''...''

''అడిగిందానికి సమాధానం లేకుండా ఏంటా నిర్లక్ష్యం?''

''దటీజ్‌మై పర్సనల్ ప్రాబ్లం మేడం. ఐ కుడుంట్ స్పీకవుట్...'' అతని కళ్ళు ఎర్రగా వున్నాయి.

''పర్సనలా, ఇంపర్సనలా అని నేనడగలేదు. నా దృష్టిలో నువ్వింకా చిన్న పిల్లవాడివే. వాట్స్ యువర్ ప్రాబ్లం? నాతో చెప్పు''

''మీతో చెప్పేది కాదు. ప్లీజ్ ట్రై టు అండర్‌స్టాండ్ మేడం!''

''మళ్ళీ అదే వరస. డోంట్ వేస్ట్ మై టైం. ఎవరైనా ఇన్సల్ట్ చేశారా నిన్ను?!''

''ఉహూ!'' గణేష్‌కి చెప్పక తప్పలేదు. ''మేడం! మాధురి అంటే నాకిష్టం. ఆమెని పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. తన కోసమే అసలీ ప్లే రాసింది. తీరా ఈరోజే తెల్సింది మాధురికెవరితోనే పెళ్ళి సెటిలైందని...''

స్మిత ఆశ్చర్యంగా వింటోంది. ఆమే కాదు, ఇంకా అక్కడున్న కరుణ, వనజ, భానుమతి కలా, నిజమా అన్నట్లు చూస్తున్నారు.

''సో, వాట్?! అంతమాత్రానికే నువ్వు కాన్సిల్ చేసుకోవాలా?'' అంది స్మిత కాస్త తేరుకుని.



"అంతా విని కూడా అలా అంటారేం మేడం?! నేను రాసిందే మాధురి కోసం. ఆమె నాకు దక్కదని తెలిశాక ఇంక ఎవరికోసం డ్రామా వేయాలి?"

"ఈ లోకంలో ఆ పిల్ల తప్ప ఇంకెవరూ లేనట్లు మాట్లాడ్తున్నావే? నీ డ్రామా చూసి, మరో పిల్ల ఎవరైనా ఇన్స్పయిర్ అవుతుందేమో..."

"ప్లీజ్ మేడం, ఎగతాళి చేయకండి. చెప్పనంటే బలవంతంగా మీరే చెప్పించారు"

"నిన్నేమన్నానిప్పుడు?"

"ఇంకొక అమ్మాయంటున్నారు. నాకు మాధురి తప్ప ఎవరూ అక్కర్లేదు. మాధురి నాకు దూరమైతే అసలీ జీవితమే అక్కర్లేదు"

"పుట్టిందగ్గర్నుంచీ మాధురే నిన్ను బతికించిందా?"

"మేడం! మీరు నన్ను తిట్టినా, కొట్టినా ఫర్లేదు. కానీ ఒక్కమాట మాత్రం అనకుండా వుండలేకపోతున్నా. మీ పెద్ద వాళ్ళెవరికీ ప్రేమంటే ఏమిటో ఎలా చెప్పినా అర్థంకాదు" అనేసి తలొంచుకున్నాడు గణేష్.

"చాలా గొప్ప సత్యం కనిపెట్టావే, సరే నువ్వెళ్ళు" అన్నది స్మిత.

"సారీ, మేడం. వాణ్ణసలు తీసుకురాకపోతే

బాగుండేది. మీ మూడంతా ఆఫ్ చేసినట్లున్నాడు.

"నోనోనో... అదేం లేదు కరుణా! రేపో రోజు కాస్త వాడికి బ్రెయిన్ వాష్ చేయాలి. వాడికి మంచి టాలెంటుంది. వాడి జీవితం ఆశల చిగుర్లు తొడిగి ఆనందంగా వుండాలేతప్ప, అప్పుడే ఇలాంటి తెగులు సోకి నాశనం కావడం నాకిష్టం లేదు" అంది స్మిత.

ఇంతలో వనజ "మేడం! మీరు స్టూడెంట్సుకంత చనువివ్వకండి. ఒక టీచర్‌తో, అందులో ప్రిన్స్‌పాల్‌తో ఎలా మాట్లాడాలో కూడా తెలీదు వీళ్ళకి" బాధగా అంది వనజ.

"చనువు మీకివ్వలేదా?"

"మీరిచ్చినా మేం లీనియన్స్ తీసుకోలేదు. అందరూ ఒకలా వుండరుకదా మేడం" అంది భానుమతి.

"చూడు భానుమతీ! ఎవరికైనా తాగడానికి బాటిల్స్ దొరక్కుండా చేసి వాళ్ళు తాగరని చెప్తే అది వాళ్ళ గొప్పతనమా? అవి అందుబాటులో వుండీ, ఒకవేళ ఉచితంగా ఇచ్చినా తాగకపోతే వాళ్ళు... వాళ్ళు నిజంగా తాగనివాళ్ళు... అర్థమైందా? నేను మొదట అందరికీ చనువిస్తాను. సద్వినియోగం చేసుకుంటే సరే. లేకపోతే అది వాళ్ళ ఖర్మ"

ఆ ఇద్దరు యువతులేగాక కరుణ కూడా స్మిత మనస్తత్వాన్ని వ్యక్తిత్వాన్ని అంచనా వేసుకుంటున్నారు మనసుల్లో.

"అలాగని గణేష్ మీద ప్రస్తుతానికయితే నాకేం కోపంగా లేదు. ఎందుకంటే అతడన్న మాటల్లో పట్టి అమాయకత్వం తప్ప మరో ఉద్దేశ్యం లేదు. ఎంత ఫ్రాంక్‌గా అసలు విషయం చెప్పాడు? వాడి నిజాయితీ నాకు చాలా నచ్చింది. నిజమయిన ఆర్టిస్టు లక్షణాలు వున్నాయికాని గణేష్ ఆ నిరాశలో వుండడానికి వీల్లేదు" అంది స్మిత.

అప్పటికి సమయం రెండు గంటలయింది. లాంగ్‌బెల్ కొట్టించారు. అంతా ఇళ్ళకెళ్ళి రిఫ్రెషయి నాలుగూ, నాలుగున్నరకల్లా వచ్చేయమని నోటీసు పంపింది స్మిత. కొందరు పిల్లలకి ఆరోజు సాయంత్రం చేయాల్సిన ఏర్పాట్లలో రకరకాల పనులు, బాధ్యతలు అప్పగించారు. ఉపాధ్యాయులక్కూడా ఒక్కొక్కరికీ ఒక్కో బాధ్యత అప్పజెప్పింది స్మిత. అంతా వెళ్ళిపోయారు.

స్మిత కూడా వనజ, భానుమతులని తీసుకుని ఆటోలో బయల్దేరింది.

సంజీవరెడ్డినగర్ చేరేసరికి అరగంట పట్టింది. ఇల్లు తాళం తీసి, కిటికీలన్నీ తెరిచి, ఫాన్ ఆన్ చేసింది. తాను మంచినీళ్ళు తాగి, ఇద్దరికీ అందించింది. మామూలు విషయాలు మాట్లాడుకుంటూ కూర్చున్నారు. ఇద్దరమ్మాయిలూ గోడలకున్న తైల వర్ణ చిత్రాలు, వస్తువుల అమరిక పరికిస్తున్నారు. స్మిత లోపలికెళ్ళి ఫ్రిజ్‌లో వున్న ఐస్ క్రీం మూడు బౌల్సులో పెట్టుకు తెచ్చింది. ఇద్దరూ మొహమాటపడ్తూ తీసుకున్నారు.

"మేడం! మీరు ఇల్లు చాలా బాగా సర్దుతారు" అంది భానుమతి.

"థాంక్యూ... బట్ ఆ క్రెడిట్ నాకు దక్కదులే. మా అమ్మాయికి ఇక వేరే పనేం లేదు. ఏ వస్తువు ఎక్కడ వుండాలో అక్కడుంటే తప్ప దానికి తోచదు" నవ్వింది.

"మీకంత పెద్దమ్మాయుందా?" అంది భానుమతి.

"మా అమ్మాయంటే, నాకు పుట్టేనే మా అమ్మాయనాలా? ఆ మాటకొస్తే నా విద్యార్థులంతా నా పిల్లలే అనుకుంటాన్నేను"

"ఎంతైనా సొంత పిల్లలకీ, మాకూ కాస్త తేడా వుంటుంది కదా మేడం?" అంది వనజ.

"ఇప్పటికయితే లేదు. ఇకముందు కూడా అలాంటి భావం నాలో రావద్దనే కోరుకుంటున్నాను"

వనజ, భానుమతులు పరవశంగా చూశారు.

"మేడం! మన కబుర్లు ఇప్పుడే మొదలెడ్తే?" అడిగింది వనజ.

"మొదలెడ్తే ఏంటి? మనమిప్పుడు మాట్లాట్టం లేదా?"

"అది కాదండీ... ఇంట... ర్వ్యూ..."

"అయితే నువ్వింకా అదే పట్టుదల్లో వున్నావా? ఈ స్కూలూ, కాలేజీ పెట్టడానికి మించి నేనేం గొప్ప సాధించానని?"

"మేడం! మీరు మళ్ళీ మొదటికొస్తున్నారు. మీరు మళ్ళీ భట్రాజని పేరెట్టకపోతే... చిన్న

ఎగ్జాంపుల్... చల్లగాలి గొప్పతనం అనుభవించే వాళ్ళకి తెలుస్తుంది'' అని నవ్వింది వనజ.

''నిన్ను కలిసి చాలా కాలమైంది, మాటలు బాగా నేర్చావే?!''

''అసలు విషయం చెప్పండి మేడం'' అంది వనజ.

''జాబ్‌లో చేరీచేరగానే రిపోర్టర్ లక్షణం వచ్చేసిందే. ఇప్పుడే కాదు జీవితంలో ఎప్పటికీ గుర్తుంచుకో. ఎంత హేమాహేమీలనయినా సరే ఇంటర్వ్యూ చేసేప్పుడు ఒక్కోసారి అడిగిన ప్రశ్నకి సూటిగా సమాధానం చెప్పక ఏవేవో కథలు చెప్పబోతారు. అప్పుడు నువ్వెంత సున్నితంగా చెప్తావో, అది నీ కల్చర్ని వెల్లడిస్తుందనుకో. మొత్తానికి చెప్పాల్సింది మాత్రం కంటుది పాయింటనే. పోతే నా ఇంటర్వ్యూ అంటావా? రేపే ముందు నువ్వడగదలచిన ప్రశ్నలు తయారుచేసుకో'' అంది స్మిత.

వనజకి నిరుత్సాహం కలిగింది, కానీ ప్రదర్శించలేదు.

''మీరేవన్నా మొహాలు కడుక్కుంటారా?'' అడిగింది స్మిత.

''అఖ్ఖర్లేదు మేడం, చల్లగానేవుంది కదా, హాయిగానే వుంది'' అంది వనజ.

''సరే, మీరు మాట్లాడ్తూ కూర్చోండి, నేను కాస్త టీ చేసి తెస్తా''

''అయ్యో, మీరు కూర్చోండి మేడం, టీ నేపెట్టనా?'' అడిగింది భానుమతి.

''ఏమొద్దు, మీరు పాటలు వింటూండండి. నేను టీ ఎంత వేగంగా పెడ్తానో, ఎంత రుచిగా పెడ్తానో చూద్దురుగాని'' అని నవ్వింది స్మిత.

భానుమతి, వనజ పెద్దగా నవ్వారు. అందులో హాస్యమేమీ లేనప్పటికీ ఆమె కళ్ళెగరేస్తూ చెప్పిన పద్ధతి వారికి తమాషాగా అన్పించింది.

స్మిత ముకేష్ హిట్స్ పెట్టి, వంటింట్లోకెళ్లింది.

రెండోపాట అవుతుండగా ట్రేలో బిస్కెట్లు, టీ కప్పులు పెట్టుకుని తెచ్చింది స్మిత.

ముగ్గురూ టీ తాగారు.

''మేడం! మీరన్నది నిజమే. టీ ఫాస్టుగానూ పెట్టారు, టేస్టీగాను వుంది'' అంది భానుమతి.

స్మిత పెద్దగా నవ్వింది. కెరటాలుగా నవ్వింది.

భానుమతి కంగారుగా ''నేనేం తప్పు మాట్లాడానా?'' అని అడిగింది.

''నువ్వేం అనలేదు, నాకే ఏదో గుర్తొచ్చింది'' అంది స్మిత. కానీ ఆమె ముఖంలో అంతలోనే ఏదో మార్పు చోటు చేసుకుంది. అంతలోనే నవ్వేస్తూ ''ఇక వెళ్దామా?! ఇంకా అరేంజ్‌మెంట్స్ ఎలా వున్నాయో చూడాలి'' అంది.

ఖాళీకప్పులు తీసికెళ్లి సింకులో పెట్టింది. టేప్ ఆఫ్ చేసి, హాండ్‌బాగ్ తీసుకుని, ఇల్లు లాక్ చేసి బయల్దేరారు.

★ ★ ★

ఆరోజు జరిగిన కార్యక్రమానికి ముఖ్య అతిథి ఓ నాటక రచయిత.

అనేక కల్చరల్‌ప్రోగ్రామ్స్ వున్నప్పటికీ అన్నిటికంటే విశిష్టమయినది హాస్యనాటిక. దాన్ని ఉపాధ్యాయ, అధ్యాపకులే నటించడంతో మరింత ఆసక్తికరంగా రూపొందింది.

స్వయంగా రచయితే తన నాటకానికి ఈ ఉపాధ్యాయులు జీవం పోశారని ప్రశంసించారు.

ప్రపంచంలో వున్న ఆనందమంతా ఆరోజు ఆ గ్రౌండులోనే తాండవించినట్లు అక్కడున్న అందరూ పరవశంగానే వున్నారు.

కొందరు విద్యార్థులు చిత్రించిన డ్రాయింగులు, పెయింటింగులు, ఫొటోగ్రాఫ్‌లు ఒక గదిలో అందంగా అమర్చారు. ఆ విద్యార్థుల కళా నైపుణ్యానికి పిల్లలు, పెద్దలు కూడా సంబరపడ్డారు.

కాలేజీ మాగజైన్ కాపీలు అందరికీ పంచిపెట్టారు.

అన్ని కార్యక్రమాలూ ముగిసిన అనంతరం మరుసటిరోజు సెలవుగా ప్రకటించింది స్మిత.

''మేడం! అయితే రేపు నేనొస్తాను'' అంది వనజ వెళ్ళబోతూ.

''సరే, నేనింట్లోనే వుంటాను. టైం పదవుతోంది, ఒంటరిగా వెళ్ళగలరా, నేను డ్రాప్ చేయనా?'' సందేహంగా అడిగింది స్మిత.

''అయ్యయ్యో మీరెందుకు? మా ఇద్దరిళ్ళూ




దగ్గరే, ఆటోలో వెళ్ళిపోతాం మేడం'' అన్నారిద్ద రూ.

నరేనని స్మిత తనకి ఆటో మాట్లాడుకుంది.

జరిగిన కార్యక్రమాలు, అతిథుల ప్రశంస లు గుర్తొచ్చాయి స్మితకి. అన్నీ అలా లీలా మాత్రంగా స్ఫురణకొచ్చినప్పటికీ గణేష్ మాత్రం ఉదయం నుండే ఆమె బుర్రని గట్టిగా తొలుస్తున్న భావన కలిగింది. ఉదయం గణేష్‌తో సంభాషణ జరిగాక ఆమె ఒంటరిగా లేదు. అందువల్లే ఆ విషయమై పెద్దగా ఆలోచనలు ముసరలేదు. కానీ ఆ సంఘటన లోనికి దూసుకుపోయిన మాట మాత్రం వాస్తవం.

"వాడికింత చిన్న వయసులో ప్రేమ జబ్బు అంటుకుందేం? వాడి చిన్నారి మనసుని అర్థంచేసుకోని ఆ అమ్మాయెవరు?'' అను కుంది. గణేష్ అన్న మాటలు ఆమె చెవుల్లో వినిపిస్తున్నాయి. "మీ పెద్దవాళ్ళెవరికీ ప్రే మంటే ఏమిటో, ఎలా చెప్పినా అర్థంకాదు'' అని ఏ అనుభవంతో వాడలా మాట్లాడాడు? పెద్దవాళ్ళు మాత్రం ఒకనాటి పిల్లలు కాదా? ఒకేసారి నలభయ్యేళ్ళ వయసుతో ఎవరైనా పుట్టారా? అందులో నాకు... నాకు ప్రేమంటే ఏమిటో తెలీదా?'' స్మిత తనలోతనే నవ్వు కుంది. ఆ నవ్వులో ఆహ్లాదం లేదు.

"మేడం! సంజీవరెడ్డినగరొచ్చింది, ఇల్లెటో చెప్పండి'' పెద్దగా అడిగాడు ఆటో డ్రైవరు.

ఇల్లొచ్చింది. ఆటోఫేర్ చెల్లించి కాలింగ్ బెల్ నొక్కింది.

"ఎంత సేపయిందమ్మా వచ్చి?'' తలుపు తీసిన తల్లిని అడిగింది స్మిత.

"రెండు గంటలైంది. నీకోసం ఎదురు చూ స్తూనే నిద్రపోయాను. మరీ ఇంత లేటౌతుంద నుకుంటే, కాస్తాగి బయల్దేరి వచ్చేదాన్ని''

స్మిత బదులు చెప్పలేదు. ఆమె స్నానం చేసి వచ్చేటప్పటికి పళ్ళాల్లో అన్నం పెట్టి వుంచింది.

"నాన్న కూడా వస్తే బాగుండేది''

"నేనూ రమ్మనే అన్నాను. రేపొస్తానన్నారు'' చెప్పిందావిడ.

భోజనం ముగించి ఇద్దరూ పడుకున్నారు. తల్లి వెంటనే నిద్రపోయింది. కానీ స్మితకి మాత్రం ఒక పట్టాన నిద్ర పట్టలేదు. గణేష్ మాటలు ఆమెని పాత జ్ఞాపకాల్లోకి తీసికెళ్ళా యి.



శ్రీశైల పర్వత ప్రాంతంలో వేగంగా వెళ్తోంది బస్సు. ప్రయాణీకులు కిటికీల్లోంచి కన్పించే కొండల్నీ కోనల్నీ మలుపుల్నీ వాటి సౌందర్యా న్నీ ఉత్సాహంగా పరికిస్తూ, పరవశిస్తూ ముచ్చ టించుకుంటున్నారు. బస్సు కదలికలోవుండే రొదలో ఈ కోలాహలం కలిసిపోయి గందరగో ళంగావుంది.

స్మిత, సుచరిత ఒక సీటులో కూర్చున్నారు. వారికి ముందు సీటులో సంధ్య, అహల్య, అంతకుముందు సీటులో రాజారాం, జగదీష్ వెనక సీటులో శిరీష, శరత్ కూర్చున్నారు. వీరంతా హైదరాబాదునుండి శ్రీశైలం వెళ్తు న్నారు.

స్మిత మౌనంగా ప్రకృతిని తిలకిస్తోందే తప్ప ఏమీ మాట్లాడ్డంలేదు.

సుచరిత ఆమె వీపు మీద ఛళ్ళున చరిచి "ఏమాలోచిస్తున్నావు? తన గురించేనా చె ప్పవూ?'' అంది.

"అబ్బా! నామీద ఎంత కక్ష నీకు? ఇంత గట్టిగానా కొట్టేది?'' అంటూ వీపు తడుము కుంది స్మిత.

"అందుకే త్వరగా చెప్పు మరి''

"చూడూ, వాళ్ళ చెవులిక్కడే వేసుంచుతా రు. ఆ విషయాలేం మాట్లాడకు'' అంటూ తల్లి, అత్తలని చూపింది కళ్ళతో.

"ఖర్మ, నాకెక్కడ దొరికావు మౌనకంపెనీ?''

అని తలపై కొట్టుకుని, ''శిరీషాదినా! నువ్విక్కడికి రా'' అంది వెనక్కి తిరిగి.

స్మిత కోపంగా లేచి, ''మరీ హాయి... నీపక్కన నాకూ బాలేదు'' అని విసురుగా లేచివెనకసీటులోకి తానెళ్ళి శిరీషని ముందుకి పంపింది. శరత్‌తో కూడా స్మిత మాట్లాడే ప్రయత్నం చేయలేదు. ప్రకృతిని తదేకంగా చూస్తోంది.

కొంతసేపటికి శరత్ తటాలున లేచి నిలబడి, ''స్మితక్కా! నీ వీపు మీద పాము'' అన్నాడు భయంగా, కంగారుగా.

అంతే స్మిత హడలిపోయింది. ''ఆఁ...'' అని కెవ్వున అరిచి, ఏడ్చినంత పని చేస్తూ, ''తియ్యవా శరత్, అలా చూస్తావే త్వరగా తియ్యి ప్లీజ్...'' అంది.

శరత్ అంతకంటే నటించలేక గట్టిగా నవ్వేశాడు. వాడు జోక్ చేశాడని అర్థమై ''య్యూ... ఫూల్'' అని కొట్టి కూర్చుంది.

''మా తెలుగు మాస్టారు జడని పాముతో పోలుస్తారని చెప్పారు. అందుకే నీ జడ పాములా కన్పించి, భయపడ్డా'' అన్నాడు శరత్ కూర్చుంటూ.

''ఏడ్చినట్లుంది నీ బోడి జోకు''

''వెక్కిరిస్తూ కూడా నిజం ఒప్పుకున్నావు. మా ప్రిన్స్‌పాల్ చెప్తుంటారు, నవ్వుతోబాటు ఓ కన్నీటిబొట్టు తెప్పించేది ఉత్తమ హాస్యమని''

''ఆయన ఆశయం బాగుందిగానీ, తమరి అన్వయం మాత్రం కుదర్లేదు''

''పోన్లే, ఎంత బాగున్నా సమకాలికులెప్పుడూ మెచ్చుకోరని ఓ కవి అన్నాడు''

''వాళ్ళదన్నారు, వీళ్ళిదన్నారు అని తప్ప నీకై నువ్వు స్వతహాగా మాట్లాడలేవా తండ్రీ'' వ్యంగ్యంగా అంది స్మిత.

''వాళ్ళవన్నీ టేప్ చేసి వినిపిస్తున్నానా? నా సొంత గొంతుతోనే వినిపిస్తున్నాను కదా కూతురా!'' అన్నాడు శరత్.

శరత్ తలమీద చిన్నగా మొట్టి, మళ్ళీ తల కిటికీలోకి తిప్పింది.

''స్పీక్ సంథింగ్‌యార్, అస్తమానం ఆ కొండలేం చూస్తావు?''




''నువ్వూ చూడు, అందులోవున్న అందమేంటో అర్థమౌతుంది. అలా చూస్తుంటే ఏదో లోకంలో విహరిస్తున్నట్లుంది. ప్రకృతి ఎంత ఉన్నతమైంది? ఎంత ఉదాత్తమైంది?! ఒక అందమైన వ్యక్తిని పదేపదే చూస్తే పిచ్చివాళ్ళని బిరుదిస్తారు. అనకపోయినా చులకనగా చూస్తారు. కానీ ప్రకృతి మాత్రం చూసినకొద్దీ ఆనందాన్నిస్తుంది''

''అబ్బా! మాట్లాడమంటే స్పీచ్ దంచుతావా? అదీ ఇంకేం టాపిక్కే లేనట్లు ప్రకృతి మీద...'' అన్నాడు శరత్.

''సారీ, నాదే తప్పు. చెవిటాళ్ళముందు శంఖమూదినట్లు ఆనందించే హృదయం లేనప్పుడు కళ్లకేం తెలుస్తుంది వాటి గొప్పతనం'' అంది స్మిత కాస్త కోపంగా.

శరత్ తండ్రి దగ్గరికెళ్ళి ఒక కామిక్ తెచ్చుకుని చదవసాగాడు.

సాయంత్రం నాల్గింటికి బస్సు శ్రీశైలం చేరుకుంది.

రాజారాం, జగదీష్ కాటేజ్ కోసం వెళ్ళారు. లగేజంతా పట్టుకుని మిగిలినవాళ్ళు కొంతసేపు బస్టాండులోనే ఆగారు. ఒక అరగంటలో తాళాలు తెచ్చి, ఒక కాటేజీకి తీసికెళ్ళారు.

అంతా వరసగా స్నానాలు చేసి గుడికి బయల్దేరారు.

గుడి ప్రాంగణం చూసిన స్మిత పరవశించిపోయింది. అక్కడ ఆవరించిన ప్రశాంత వాతావరణానికి పులకించిపోయింది. అక్కడ అంతమందివున్నా, అంతా తనవాళ్ళే అయినా ఆ ఆనందాన్ని మాటల రూపంలో వారితో పంచుకోవడం ఆమెకి తెలియలేదు. ఆ ఆవరణంతా కలయతిరుగుతూ తననితాను మర్చిపోయింది. కన్నీళ్ళు కారుతున్నాయి.

''హలో, డ్రీమ్ గాళ్'' అంది సుచరిత స్మితని సమీపిస్తూ.

స్మిత పెదవి విరిచి, ''ఏం... శిరీషాదిన లేదా పాపం?'' అంది.

స్మిత బుగ్గని గట్టిగా గిచ్చి, ''ఎంతైనా మనిద్దరం ఒకటిగా'' అంది సుచరిత.

''అబ్బా'' అని బుగ్గ సవరించుకుంటూ ''ఎందులో?'' అంది స్మిత.

''కాలు జారి పట్టంలో''

''నాకెప్పుడూ కాలు జారలేదు''

''నిజంగా నేనూ పడలేదులే. ఎల్వోవీయీ అనే గుంటలో తప్ప''

''ఎక్కడుందబ్బా ఆ గుంట?''

''నాకంటే నీకే బాగా తెలియాలి''

''ఛీ... ఛీ... నేనింకా చిన్న పిల్లని''

''ఔనౌను, నోట్లో వేలెడితే కొరకడం కూడా రాదు''

''చాక్లెట్లో, బిస్కెట్లో అయితే కొరకచ్చుగానీ, వేలూ, కాలూ పెడ్తే కొరకను''

''సంతోషించాగానీ ఈ గుడి చూస్తుంటే నీకేమనిపిస్తోంది?''

''నిజం చెప్పనా?! పెళ్ళిచేసుకుంటే ఇక్కడే చేసుకోవాలన్పిస్తోంది''

''ఆహాహా! ఇప్పుడేగదా చంటి పాపాయిన న్నావు''

''నా పెళ్ళన్నానా? మామూలుగా జనాల సంగతి చెప్పాను''

''ప్లేటు మార్చడంలో నీ తర్వాతే ఎవర యినా''

''నేర్పమంటావా, నీక్కూడా?''

''అక్కర్లేదుగానీ దేవుణ్ణేం కోరుకుంటావు?''

''ఏమీ అడగను''

''మరి...'' సందిగ్ధంగా ఆపింది సుచరిత.

''అవును... ఏది జరగాల్సుంటే అదే జరు గుతుంది, కేవలం నేను కోరుకున్నంతలో జరు గుతుందనే నమ్మకం లేదు''

''అమ్మదొంగా! విస్తరిముందు కూర్చుని నేనేం అడగను, పెడ్తే పెడ్తారు, లేకుంటే లేదు అన్నట్లుంది'' అంటూ వీపు మీద కొట్టింది.

''ఊరుకోవే తల్లీ! నీదేదో సెటప్ చేశానను కుని పదిమందీ నన్ను వాయించేను''

''నా కళ్ళకి అంత భాగ్యం కూడానా?''

''అంటే నీ వుద్దేశం, నిజంగా నన్ను కొడ్తే బాగుండుననా?''

''ఎవరో కాదుగానీ, నీ మానసచోరుడు కొ డ్తుంటే చూడాలనుంది''

స్మిత ఏదో అనేలోపు శిరీష కోపంగా వచ్చి, ''గుళ్ళోకొస్తారా? ఇక్కడే కాలక్షేపం చేస్తారా?'' అంది.

''కావాలంటే నువ్విక్కడే వుండు, మేం మాత్రం గుళ్ళోకెళ్తాం'' అంది సుచరిత.

స్మిత కిసుక్కున నవ్వింది. ''హి... హి... హి'' వెక్కిరించింది శిరీష.

''ఏయ్, పరువు నష్టందావా వేస్తాన క్కోయ్!''

''నక్కోయా? ఎంతమాట. శిరీషాదిన నక్కా?'' అంది సుచరిత.

''నిన్ను... నిన్ను... నీ మాటకి నవ్వడం నాదే బుద్ధి తక్కువ'' అంది స్మిత.

''నిజం ఒప్పుకున్నావు, బుద్ధి తక్కువేగా'' అలా మాట్లాడుకుంటూ ముగ్గురూ పెద్ద గుళ్ళోకి వెళ్ళారు.

దేవుడి దర్శనం చేసుకున్నాక అంతా మళ్ళీ గుడి ప్రాంగణంలో కూర్చుని, ప్రసాదం తింటూ మాట్లాడుకుంటున్నారు.

స్మిత, సుచరిత మాత్రం వారి నుండి వేరుపడి విడిగా కూర్చుని ముచ్చట్లో పడ్డారు.

''అబ్బ ఎంత బాగుందీ శ్రీశైలం, నాకైతే ఇక్కడే వుండిపోవాలన్పిస్తోంది''

''మా కాబోయే అన్న దేవదాసయిపోతా డేమో''

''చాల్లే నీ వ్యంగ్యం. అతన్ని చూడకపోతే నాకు పిచ్చెక్కుతుంది తప్ప, నేను లేకున్నా అతను నిక్షేపంగా వుంటాడేమో''

''నీదంతా అనుమానం. అలా ఎందుకను కుంటావు?''

''సర్లే... నీకు చెప్పినా అర్థం కాదుగానీ ఇక్కడి వాళ్ళెంత అదృష్టవంతులు కదూ, రోజూ గుడికి రావచ్చు'' అంది స్మిత.

''నా మొహం. దగ్గరుంటే అశ్రద్ధ. మనం బిర్లా మందిరానికి రోజూ వెళ్తున్నామా?'' అంది సుచరిత.

''నిజమే, అందనప్పుడు కన్పించే అందం అందాక కన్పించదేమో. అప్పుడప్పుడూ కలు సుకునే లవర్స్ ఎంత ప్రేమగా వుంటారు? వాళ్ళు పెళ్ళిచేసుకుని మరింత దగ్గరయ్యాక అరుపులూ, కేకలూ, పోట్లాటలూ, ఘర్షణలూ... ఇవన్నీ తల్చుకుంటేనే భయమేస్తుంది. దగ్గ రుండి పోట్లాడుకోవడం కంటే ఎప్పటికీ ప్రేమి కులుగా దూరంగా వుండిపోవడం మేలేమో కదూ!'' అంది స్మిత.

"నువ్వే పిచ్చిదానివి. ఇలాంటి అపశకునాలు మాత్రం పలక్కు. అయినా పోట్లాడుకునే భార్యాభర్తల్నే ఆదర్శంగా తీసుకోవాలా? ఎంత మంది హాయిగా కలసిమెలసి వుండడం లేదూ?" అంది సుచరిత.

"ఏమో, మనిద్దరి ఆలోచనలు కలవ్వులే గానీ ఆకలేస్తోంది నాకు"

"నాకూ ఆకలిగానే వుంది పద" అంటూ సుచరిత గట్టు మీదనుండి లేచింది. ఇద్దరూ పెద్దవాళ్ళని సమీపించి, అంతా హోటల్‌కెళ్ళి భోజనం చేసి, కాటేజ్‌కెళ్ళి కబుర్లు చెప్పుకుంటూ పడుకున్నారు.

ఉదయం లేచిన దగ్గర్నుండీ స్నానాలు, కాఫీలు ముగించి కెమేరా తీసుకుని గుడికి వెళ్ళారు. రకరకాలుగా ఫొటోలు దిగి, శ్రీశైల శిఖరాన్ని కూడా చూసి, భోజనాలు చేసి, దార్లో షాపింగ్ చేస్తున్నారు. పెద్దవాళ్ళు దీపపు కుందులు, పూల సజ్జలు, దేవుడి ఫొటోలు మొదలైనవి బేరాలు చేస్తుంటే పిల్లలు ఉంగరాలు, గొలుసులు, పజిల్స్‌వంటివి తీసుకుంటున్నారు.

కాటేజ్‌కి వచ్చాక ఒకటి రెండు రోజులు వుండడమా లేక ఆరోజే వెళ్ళిపోవడమా అని మీమాంస బయల్దేరింది. ఖర్చుల దృష్ట్యా బుద్ధికి ప్రాధాన్యతనిచ్చే అందరూ వెళ్ళిపోదామన్నారు. కానీ వాస్తవంకంటే కలల్లోనే ఎక్కువ కాలక్షేపం చేసే స్మిత, అహల్య, జగదీష్‌లకి ఇంకా వుండాలనుంది. మెజారిటీకే ప్రాధాన్యత కాబట్టి చివరికి వెళ్ళడానికే నిర్ణయించుకున్నారు. మూడింటి బస్సుకి టిక్కెట్లు కూడా తెచ్చేశారు.

విడిచిన బట్టలు వేరేగా, మంచివి వేరేగా ప్రసాదాలు, పూజా సామగ్రివంటివి వేరేగా - ఇలా లగేజంతా పాక్ చేసేశారు. స్వెట్టర్లు, షాల్స్ ఎవరివి వాళ్ళ దగ్గరే వున్నాయి.

కాటేజ్‌కి తాళాలు, డబ్బులు ఇచ్చి వచ్చారు జగదీష్, రాజారాం.

ఎక్కాల్సిన బస్సు కూడా సిద్ధంగా వుంది. మళ్ళీ సుచరిత, స్మిత ఒక సీట్లోనే చేరారు. వాళ్ళు కాలక్షేపానికి వీలైన ఆటలు మొదలెట్టి, చివరికి సామాన్యంగానే వున్నా తమాషా కలిగించే పాటల ఆటలో సెటిలయ్యారు. అందులో ఒకరు "ఊ ఊ... అంటూ శబ్దాలు లేకుండా గొంతెత్తి ట్యూన్ పాడితే, రెండోవారు ఆ పాట ఏదో చెప్తారు. ఒకవేళ కనుక్కోలేకపోతే స్టుపిడ్ అనే ఆంగ్లపదంలో వుండే మొదటి అక్షరం 'ఎస్' వస్తుంది. అలా రెండోసారి కనుక్కోలేకపోతే 'టి' వస్తుంది. ఈ విధంగా స్టుపిడ్స్ అవుతుంటారు. తోటివాళ్ళని స్టుపిడ్ చేయడం కోసం ఒక్కోసారి చాలా పాత పాటలు వెతికి పాడడం లేదా అస్సలు పాపులర్ కాని పాటలు పాడడం చేస్తుంటారు. కొన్నిసార్లు కనుక్కునేవారికి ఆ పాటేదో తెలియకపోతే తమ తెలియనితనాన్ని ప్రదర్శించడం ఇష్టంలేక "నువ్వంత సొంపుగా పాడావు, నీకసలు పాడడమే రాదు" అని ఎదురు ఎక్కిరిస్తారు. ఇలా సమయం తెలియకుండా వాళ్ళు కాలక్షేపం చేశారు. చివరికి ప్రయాణం అంతా అయిపోయాక "అయ్యో ఈ ఆట కొండలూ, కోనలూ చూడకుండా చేసింది, మళ్ళీ ఎప్పుడొస్తామో ఏమో" అంది స్మిత బాధగా.

మెడలో గొలుసులా చేతులు పెట్టి చూపి 'అయ్యాక' అంది సుచరిత.

స్మిత కూడా నవ్వేసింది.

హైదరాబాద్ చేరేసరికి రాత్రి పదిన్నరయింది. చలికి అంతా గజగజా వణికిపోతున్నారు. ఎవరికి వారే మునగదీసుకుని నిలబడ్డారు. రెండు ఆటోలు మాట్లాడుకుని అందరూ జగదీష్ ఇంటికే వెళ్ళారు.

అహల్య, సంధ్య ప్రయాణపు బడలిక తీరక మునుపే వంట చేయడానికి నడుం బిగించారు. కుక్కర్ పెట్టి పప్పులో టొమేటో కూర మాత్రం చేసి, వడియాలు, అప్పడాలు, ఫ్రిజ్‌లో వున్న పెరుగులతో అంతా భోజనాలు చేశారు.

స్మిత తప్ప మిగిలిన వాళ్ళందరూ ఒళ్ళు మరిచి నిద్రపోతున్నారు. ఆమెకి కునుకు పట్ట లేదు. గత అయిదు రోజులుగా అలాగే వుంటోంది. ప్రయాణానికి మూడ్రోజుల ముందే తామంతా అహల్య ఇంటికి వచ్చారు. అతన్ని చూసి అయిదు రోజులయింది. తనకి మాత్రం ఐదు సంవత్సరాలయినట్లే వుంది. తనకోసం ఎదురుచూసి వుంటాడు. ఇప్పుడింకా నిద్రపోయాడో లేక నిరీక్షిస్తూ నిలబడ్డాడో అదే ఆమె ఆలోచన. తానే ఒక పక్షి అయ్యుంటే ఆ క్షణంలో రెక్కలు కట్టుకువెళ్ళి వాలేది. కనీసం




మగవాడయినా వెళ్ళొచ్చే పని' అంటూ నిట్టూర్చింది. తెల్లవారితే జనవరి ఫస్టు. ఆ విషయం తెలిసినా అక్కడున్న వారంతా హాయిగా నిద్ర పోతున్నారు. కానీ స్మితకి మాత్రం చెవుల్లో ఎవరో లౌడ్‌స్పీకర్ పెట్టి పదేపదే ఆ విషయం చెప్పినట్లుగా వుంది. అతని రూపం ఎదురుగా గోచరమై "ఏయ్ పిల్లా! ఎక్కడికి పోయావు? నిన్ను చూడకుండా నేనెన్ని అవస్థలు పడ్డానో తెల్సా?" అని ప్రశ్నిస్తున్నట్లుంది. తెల్లవారితే అతనికెలా గ్రీటింగ్స్ చెప్పాలని ఆలోచిస్తుండగానే అర్ధరాత్రి పన్నెండయింది. ఒక్కసారిగా 'య్యా', 'ఓ', 'హ్హూ' అంటూ గగ్గోలుగా అరుపులు దానితోపాటుగా బాణసంచా కాల్పుల టపటపలు, తాగిన మత్తు స్వరాల కేకలు అన్నీ కలగూరగంపలా' వినిపించాయి.

స్మిత తనలోతనే నవ్వుకుంది. తను కూడా నూతన సంవత్సరాన్ని వాళ్ళతో పంచుకున్నట్లనిపించింది. ఆ స్వరాలన్నీ ఏకస్వరమై అదే అతని స్వరంగా మారి తనకి శుభాకాంక్షలు చెప్తున్న భావన కలిగింది. ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురుచూస్తూ ఎప్పటికో నిద్రపోయింది.

"స్మితా, లేమ్మా! టైం చూడు తొమ్మిదవుతోంది" అంటూ రాజారాం లేపేవరకూ స్మితకి మెలకువ రాలేదు.

ఆమాట వింటూనే పిడుగుపాటులా వులిక్కిపడి లేచి 'బాప్రే' అనుకుని "హాపీ న్యూ ఇయర్ నాన్నా" అంది.

"ఆఁ... ఆఁ... విష్యూ ది సేమ్" అంటూ తల పంకించారాయన.

రగ్గు మడిచిపెట్టి, పక్క దులిపేసి, గది లోంచి బయటకొచ్చి పేరుపేరునా విష్ చేసింది. మొహం కడిగి, టిఫిన్ తిని, టీ తాగింది. స్నానం చేద్దామంటే బాత్రూం ఖాళీగా లేదు. అతను వుంటాడో చూసి, చూసి వెళ్ళిపోతాడేనని దిగులు. శిరీష బయటికి రావడం ఆలస్యం బాత్రూంలో దూరి అయిదు నిమిషాల్లో స్నానం చేసొచ్చింది.

"అత్తయ్యా! ఇంటికెళ్ళొస్తా" అంది స్మిత తాళాలు తీసుకుని.

"ఇప్పుడెందుకే? సాయంత్రం అంతా కలిసి వెళ్ళొచ్చులే" అంది అహల్య.

"కాదత్తయ్యా! మొక్కలన్నీ ఎండిపోయుంటాయి. వాటిక్కాస్త నీళ్ళు పోసి, గ్రీటింగ్ కార్డులు కొనుక్కుని వచ్చేస్తాగా" అంది స్మిత.

"మొక్కలంటే నీకెంత శ్రద్ధ? మంచిదేలే ఆ పాటి వుండాలి" మెచ్చుకోలుగా అని "సరే, త్వరగా రా మళ్ళీ" అంది అహల్య.

స్మితకి దార్లో నవ్వొచ్చింది. ఆమెకి మొక్కలంటే చాలా ఇష్టమైనమాటైతే నిజమే కానీ ఆ క్షణంలో మాత్రం ఆమె కేవలం వాటికోసమే పోవడం లేదు. అతనికోసం వెళ్తూ వాటిని సాకుగా చెప్పింది. స్వతహాగా అబద్ధాలు చెప్పే అలవాటు లేకపోయినా, ఈ ప్రేమలో పడ్డప్పట్నుంచీ అడపాదడపా అబద్ధాలు చెప్తూనే వుంది. కానీ అందుకు బాధపడ్తూనే వుంది.

తినబోతూ రుచికోసం ఆలోచించినట్లు దార్లో 'అయిదు రోజులుగా తనకోసం చాలా ఎదురు చూసి వుంటాడు. ఇప్పుడు తనని చూసి చాలా ఆనందంగా వుంటాడా లేక అలక ప్రదర్శిస్తాడా? అసలు ఇంట్లో వుండి వుంటాడా లేక పర్కుకి పోయి వుంటాడా?' అని ఆలోచిస్తూ దార్లో కన్పించిన ప్రతి హీరోహోండాని అతనిదేనా అని పరికిస్తూ శరవేగంతో మెట్లెక్కి ఇల్లు చేరింది. బయటి తాళం తీసింది. కొంత కప్పులేని ఖాళీప్రదేశం వుంటుందక్కడ. అక్కడ పూలమొక్కల కుంపట్లు, తడిసినా, ఎండినా పర్లేదనే కొన్ని అనవసరమైన సామాన్లు, చెప్పుల స్టాండు వుంటాయి. నీరు లేక వాడిపోయిన మొక్కల్ని చూసి అయ్యో అనుకుంటూ ఇంటి తాళం తీసింది. చెప్పులు విడిచి లోనికి వెళ్ళి బాల్కనీ తలుపు తెరిచి, ఎదురింటి మేడమీదికి చూసింది. గదికి తాళం వేళాడ్తోంది. ఆ తాళానికి పెద్ద కాగితం పెట్టుంది. దానికర్థం వారి సింబాలిక్ భాషలో కొంతసేపట్లో వస్తానని. పక్కగా బ్లూకలర్ బకెట్, కిటికీ ఊచలకి నీలంరంగు టంబ్లరు తగిలించి వుంది. అంటే బిల్డింగులోనే ఎవరితోనో బాతాఖానీ కొడ్తూనో, తన ద్విచక్రవాహనాన్ని తుడుచుకుంటూనో వుండాలి.

స్మిత బాల్కనీ తలుపు తెరిచి లోనికి వచ్చి డ్రమ్ములోంచి నీళ్ళు తోడి కుండీల్లోని మొక్కలకి పోసింది. నీళ్ళు పోస్తుంటే మట్టి ఆత్రంగా పీల్చుకొంటోంది.

'ఎండున్నా నీరులేక మీరెండిపోయారు -



తండున్నా అతను లేక నేవాడిపోయాను అనుకుంది. నీళ్ళు పోసి మళ్ళీ బాల్కనీలోకి వచ్చింది.

ఆ హీరో ఇంకా రాలేదు.

చికాగ్గా అటూ ఇటూ పచార్లు చేసింది. మాటిమాటికీ అటు చూస్తుంది. వినుక్కుంటుంది. కోపంగా గుప్పిళ్ళు బిగించింది. పళ్ళు బిగపట్టింది. కానీ ఈ చేష్టలన్నీ అతనికి తెలియజేయడానికి అక్కడే పావురమూ లేదు.

అంతలో అదే మేడమీద ఆరేళ్ళ పాప కనిపించింది. ఆ పిల్లతో సంభాషణ మొదలెట్టింది. అది వినిపిస్తే వస్తాడని ఆమె ఆశ.

"ఏయ్ పాపా! నీ పేరేంటి?"

ఆ పాప ఎగాదిగా చూసి, సందేహిస్తూ "'అవంతి" అంది. స్మితకి వినిపించింది కానీ ఆమె వుద్దేశం కేవలం పేరు తెల్సుకోవడం కాదు కాబట్టి "ఏంటీ?" అంది మళ్ళీ.

"అవంతి" అంది పెద్దగా.

"పేరు బాగుందే. ఏం చదువుతున్నావు?"

"ఫస్టుక్లాసు"

"ఏ స్కూలు?"

"ఆక్స్‌ఫర్డ్ గ్రామర్ స్కూలు"

''పెద్దగా చెప్పు'' కావాలని అడిగింది స్మిత.

''మీకు చెవుడా ఆంటీ?'' అంది పాప.

స్మిత బిక్కచచ్చిపోయి, కొంపతీసి అతను వినలేదు కదాని చూసింది. ఎప్పుడొచ్చాడోగానీ ఓ పక్కగా నిలబడి, అదంతా విన్నట్లే చిలిపిగా నవ్వుతున్నాడు. ఎప్పుడూ అంతే. అతనేం చూడకూడదనుకుంటుందో అవి తప్పక చూస్తాడు. ఏవి చూస్తే బాగుండనుకుంటుందో అవి చూట్టానికి అతను వుండనే వుండడు. అంతే ఆ పాప సంగతి మర్చిపోయింది. దృష్టి అటు తిప్పింది.

అతనింకా నవ్వుతున్నాడు. స్మిత ''వ్వెవ్వెవ్వె'' అని వెక్కిరించింది.

అతను తల పంకించి నవ్వి, ఎవరూ లేరుకదాని చుట్టూ చూశాడు. లేకపోవడం గమనించి లిప్ మూమెంట్‌తో న్యూ ఇయర్ గ్రీటింగ్స్ చెప్పాడు. స్మిత కూడా అదే పద్ధతిలో ''విష్యూది సేమ్'' అంది.

ఎక్కడికెళ్ళావని సైగ.

చేతులు రెండూ జోడించి దేవుడి దగ్గరికని సైగ.

మళ్ళీ తల పంకించి నవ్వాడు.

చేతులు కట్టుకుని పచార్లు చేస్తూ, ఇటు చూస్తున్నాడు.

స్మిత కూడా అలాగే నడిచి, నవ్వి, నవ్వించింది. అంతే అతను ఒకచోట ఆగిపోయాడు. అలా కొంతసేపు చూపులయ్యాక,

''నే వెళ్తున్నా'' అని సైగ చేసింది.

''ఎక్కడికి?'' అడిగాడు.

అత్తయ్య ఇంటికని చెప్పడం ఎలానో తెలియలేదు. ఒక నిమిషం ఆలోచించి బొటనవేలు చూపి, ఫ్రెండింటి కన్నట్లు చెప్పింది. అతను సరేనని చిరునవ్వుతో తలూపి, ఆమె తాళమేసి రోడ్డుమీదకి వచ్చి కనిపించేంతవరకూ చూస్తూ నిలబడ్డాడు.

స్మితకి సంతోషంతో గాల్లో తేలిపోతున్నట్లుంది. చాలా శ్రమపడి, పది గ్రీటింగ్ కార్డులు సెలెక్ట్ చేసి, కొని తెచ్చింది. చూసిన వాళ్ళంతా కార్డులు బాగున్నాయని ప్రశంసించారు. భోజనాలు, కబుర్లు అయ్యాక తీరిగ్గా సూట్‌కేసులు తీసుకుని రాజారాం ఫామిలీ బయల్దేరింది.

ఇంటికొచ్చాక డైరీ తెరిచి వరుసగా ఒక్కో స్నేహితురాలి చిరునామా వ్రాసింది. లోపల కార్డులు తెరచి అందరిలా ప్రియమయిన, డియర్ అని వ్రాయలేదు. స్మిత చిలిపితనానికి మారుపేరు. అందరూ చేసే పన్లు ఆమె చేయదు. ఆమెలాగా దాదాపు మరొకరు చేయరు.

హారతి, రమ్య, నాన్సీ ఆమెకి అత్యంత సన్నిహితులయిన స్నేహితులు. వారి ముగ్గురికీ ఆమె మనసులో వున్న స్థానం విశిష్టమైంది. తర్వాత చెప్పుకోదగిన స్నేహితులు వీణ, గౌతమి, కవిత. ఈ ఆరుగురూ ఆమెకి చాలా ఇష్టమయిన స్నేహితులే అయినప్పటికీ తర్వాతి ముగ్గురితో లోతైన విషయాలు మాట్లాడాలంటే కొంత ఆలోచిస్తుంది. చెప్పనా, వద్దా-అని సందేహిస్తుంది. మొదటి ముగ్గురితో మాత్రం, వాళ్ళ స్పందన ఎలా వుంటుందని ఆలోచించినప్పటికి తన భావాలెలా వుంటాయో, తనెలా ప్రవర్తిస్తుందో అలాగే తప్ప అంతకంటే రవ్వంతైనా భిన్నంగా వుండదు. ఆ ముగ్గురితో ఇరవైనాలుగు గంటలూ గడపడమయినా ఆమెకి ఇష్టమే. దేవుడు తనకి ప్రసాదించిన ఒకేఒక వరం అంత మంచి స్నేహితులు లభించడం అనుకుంటుంది. స్నేహమాధుర్యం చవిచూస్తేతప్ప ఎవరో చెప్తే విని అర్థంచేసుకునేది కాదని భావిస్తుంది.

హారతి, కవిత, గౌతమి, స్మితకి పాఠశాలలో పరిచయమయ్యారు. వారిలో హారతి పెళ్ళి చేసుకుని చదువు ఆపేసింది. కానీ స్మితతో స్నేహం మాత్రం తెగిపోలేదు. హారతి భర్తే కాదు ఆమె కుటుంబసభ్యులంతా స్మితని ఇంట్లో మనిషిలా చూస్తారు.

రమ్య ప్రస్తుతం ఫైనార్ట్స్ కాలేజీలో క్లాస్‌మేట్. అతి స్వల్పకాలంలోనే వారి పరిచయం గొప్ప స్నేహంగా పరిణమించింది. ఒక్క ప్రేమ విషయంలో తప్ప తక్కిన అన్ని విషయాల్లో వారిద్దరివీ ఏకాభిప్రాయాలు.

నాన్సీతో ఆమె పరిచయం కాస్త చిత్రమైందనే చెప్పాలి. తెలుగు పత్రికల్లో నాలుగయిదుసార్లు చిన్నచిన్న కథలు, స్కెచెస్ చదివిన స్మితకి అవి చాలా నచ్చి, మెచ్చుకుంటూ ఉత్తరం రాసింది. అందుకు కృతజ్ఞతలు

తెల్పుతూ నాన్సీ స్మితకి జవాబు రాసింది. క్రమంగా అలా వుత్తరాలు రాసుకుంటూ, అప్పుడప్పుడూ కలుసుకుంటూ వారిద్దరూ ప్రాణస్నేహితులుగా రూపొందారు.

వీణతో టైపు ఇన్‌స్టిట్యూట్‌లో పరిచయం ఏర్పడింది. టైపు అయిపోయాక చాలాసేపు మాట్లాడుకుంటూ వుండేవారు. కొన్నాళ్ళకి విసుగొచ్చి టైపు మానేసినా నాకో వీణ దొరికిందనుకునేది. వీణ నిజాం కాలేజీలో డిగ్రీ చదువుతోంది. గౌతమి విజయవాడలో ఎల్లెల్బీ చేస్తోంది. కవిత బెంగుళూరులో ఫార్మసీ చేస్తోంది.

స్మిత మొదట ఒక కార్డు తీసుకుని "హాయ్ హాతీ! వ్వెవ్వెవ్వే... స్మిత..." అని రాసింది హారతికి. మరో కార్డు హారతి భర్త కరుణాకర్‌కి మాత్రం సభ్యత ప్రదర్శించి "డియర్ బ్రదర్" అని రాసింది.

రమ్యకి అడ్రెస్ స్థానంలో రెండు డాషులు పెట్టింది. ముందు ఏయ్... అంతా కలసి "ఏయ్ ...మ్యా" అయ్యింది.

ఈ విధంగా ఒక్కొక్కరికీ ఒక్కో విధంగా రాసి అన్నిటిమీదా స్టాంపులు అంటించి పోస్టాఫీసుకి బయల్దేరింది. కిందికి దిగేసరికి హీరో హోండా కనిపించింది. కాస్త దూరంలో హీరో మరో వ్యక్తితో కలసి సిగరెట్ తాగుతూ నిలబడ్డాడు. స్మితని చూసి, అతను తెచ్చిపెట్టుకున్నట్లే శరవేగంతో మాట్లాడసాగాడు. మొహంనిండా నవ్వు. ఆమెక్కూడా నవ్వొచ్చింది.

స్మిత కాళ్ళలో సన్నగా ఒణుకు. నడుస్తుంటే పాదాలు తన స్వాధీనంలో లేనట్లు తడబడసాగాయి. 'ఛ, కుంటిపిల్లలా అయ్యానేం' అనుకుంది. అతను సమీపంలోవుంటే ఆమెకి నడవడమే కష్టమన్పిస్తుంది. ప్రపంచంలో మరే ఇతర వ్యక్తయినా ఆమె భయపడదు. తనకెంతో శ్రద్ధాభక్తులున్న, గౌరవాదరణలున్న గొప్ప పండితులయిన తమ ప్రిన్స్‌పాల్‌తో కూడా అవసరమైనపుడు ఎంతో చనువుగా మాట్లాడింది. తను విపరీతంగా అభిమానించే కొందరు ఆర్టిస్టులతో ఆమె ఒక స్నేహితురాలిలా మసలుకోగల్గింది. అవకాశం రాదేమోగానీ వస్తే మాత్రం భారతదేశ ప్రధానమంత్రే కాదు, అమెరికా ప్రెసిండెంటుతోనైనా హాయిగా మాట్లాడగలదు. చనువుగా దగ్గరికెళ్ళి కూర్చోగలదు. కానీ ఇదేం విచిత్రం, ఇతను వాళ్ళందరికంటే గొప్పవాడా? ఇంత కాన్షస్‌గా ఫీలవడమెందుకు?' అని అనేకసార్లు తనకు తనే ప్రశ్నించుకుని సమాధానం చెప్పకోలేకపోయింది.



ఏదయినా క్లాసు జరగకపోయినా, లంచ్ బ్రేక్‌లోనూ స్మిత, రమ్య కాలేజ్ ఆవరణలో ఒక మూలగా వుండే గోరింటాకు చెట్టుదగ్గర కూర్చుంటారు. వాళ్ళ తొలి పరిచయం ఆ చెట్టు దగ్గరే అయింది. ఆ చెట్టే వారిని దగ్గర చేసింది. ఆ సెంటిమెంట్‌తో వాళ్ళక్కడే కూర్చుంటారు. ఇది గమనించిన పోకిరీ అబ్బాయిలు కావాలని ఆ స్థలాన్ని ఆక్రమిస్తుంటారు.

రమ్య రావడం ఆలశ్యం అయితే స్మిత ఆ చెట్టు దగ్గరే పరధ్యాన్యంగా కూర్చునుంది. రమ్య రాకను గమనించకపోయేసరికి రికార్డుతో వీపు మీద కొట్టింది. స్మిత ఈ లోకంలోకొచ్చింది.

"ఎక్కడికి పోయావు?" అడిగింది రమ్య.

"ఇక్కడే వున్నాగా, కన్పట్టంలా" స్మిత నవ్వింది.

"అదే మనసెక్కడ పోయింది?"

"ఇంకా పోలేదుగానీ, అక్కడికి పోవాలనుంది" అని పైకి చూపింది.

"నేనసలు నీతో మాట్లాడను" అని కోపంగా లేచింది రమ్య.

"ఏయ్ రమ్యా! నీక్కూడా కోపమొస్తే నే భరించలేను" స్మిత ఆమె గడ్డం ఫట్టుకుంది.

"తమాషా అనుకోకు. ఇంకోసారిలా పిచ్చి మాటలు మాట్లాడావంటే చూడు"

"ఏం చేస్తావు? నాతో మాట్లాడనంటావు, నా ముఖమే చూడనంటావు. కానీ అలా చేయగలవా నువ్వు?" నవ్వింది స్మిత.

"అదేలే నీ ధీమా. ఒకవేళ నిన్ను చూస్తూ నీతో మాట్లాడకుండా వుండలేనంటే అసలు కాలేజీ మానేస్తా"

"నీతో వచ్చిన చిక్కే ఇది. చీటికి మాటికి అలుగుతావు"

"ఆఁ నువ్వు గొప్పగా మాట్లాడుతుంటే సంతోషించలేక. సర్లేగానీ సెమినార్ పేపర్ పూర్తయ్యిందా?"

"ఆఁ రాశాను, పోట్రెయిట్స్ మీదేగా?"

"తెచ్చావా?"

"ఊహూ గుర్తులేదు"

"మనసెక్కడో వుంటే ఇవెలా గుర్తుంటాయి? స్మితా! నీకున్న తెలివిని నువ్వెందుకు ఉపయోగించుకోవు సరిగ్గా?"

"నువ్వు తప్ప, నా తెలివిని మెచ్చుకున్నవాళ్ళులేరు"

"అందుకే నాక్కోపం ఒస్తుంది. నువ్వు నాకు అన్ని విధాలా నచ్చుతావు. కానీ నీలో ఇంత నిరాశ ఎందుకు ధ్వనిస్తుంది? ప్రపంచంలో వున్న కష్టాలన్నీ నీ తలమీద మోపినట్లు. మనిషెప్పుడూ ఆశాజీవిగా వుండాలి తప్ప..."

"రమ్యా! నిరాశా, నిస్పృహలు నాకూ నచ్చవు. కానీ నా పరిస్థితులు నన్ను సుఖంగా, శాంతంగా వుండనివ్వడం లేదు"

"ఏంటా పరిస్థితులు? ఇంతకుముందు చాలాసార్లు అడిగాను. నా పిచ్చిగానీ, నాతో ఎందుకు చెప్తావు? అసలు నీతో పరిచయమెందుకయిందో? నా మీద నీకేపాటి నమ్మకం లేదని తెలిసీ, నీ వెంటపడడం నాబుద్ధిలేనితనమే"

"కోపంలో బలే ముద్దొస్తున్నావే. నిజంగా బుద్ధిలేదా? నాకూ లేదు, ఇద్దరం కలసి హోల్‌సేల్‌గా కొనుక్కుందామా?" అంది స్మిత.

"నీ బోడి జోక్కి నవ్వు రావడంలేదు' అన్నట్లు ముఖం పెట్టి బాగ్ భుజాన తగిలించుకుని, చెప్పులు వేసుకుంటోంది రమ్య.

"ఎక్కడికీ, అప్పుడే లేస్తున్నావు?" అంది స్మిత.

"నీతో చెప్పాలా?"

"చెప్పొద్దులే నేనూ వస్తా" అని స్మిత కూడా లేచింది.

"నువ్వెందుకు మధ్యలో?, నాకేదో తోడూ, నీడా అయినట్లు"

"అసలు తోడొచ్చేవరకూ నాకు తప్పదుగా మరి"

"ఈ మాటల్తోనే బుట్టలోపడ్డాను. ఇహనుండీ మనం స్నేహితులం కాము" అంటూ స్మిత పిలుస్తున్నా వినిపించుకోకుండా కోపంగా వెళ్ళిపోయింది.

రమ్య కోపాన్ని కళ్ళప్పగించి చూస్తూండిపోయింది స్మిత. ఆమెకి బాధ కలిగింది. కొంతసేపయ్యాక క్లాస్‌రూంలోకి నడిచింది. రమ్య రోజూ తామిద్దరూ కలసి కూర్చునే దగ్గరగాక వేరేగా కూర్చుంది. స్మితకి ఆమె పక్కన చోటులేదు. స్మిత మౌనంగా మరో దగ్గర కూర్చుంది కానీ శ్రద్ధగా వినలేకపోయింది. కొద్దిసేపట్లోనే ఆమెకి తలనొప్పి ప్రారంభమైంది. ఆ క్లాసు అయిపోగానే స్మిత రమ్యకి చెప్పకుండానే వెళ్ళిపోయింది.

స్మిత వెళ్ళడం రమ్య చూళ్లేదు. అంత కోపంలోనూ ఆమె కళ్ళు స్మితకోసం వెతికాయి. కన్పించకపోయేసరికి ఇద్దరు ముగ్గురినడిగింది. వాళ్ళు తమకి తెలియదన్నారు.

'స్మిత ఇంటికెళ్ళిందా? ఎందుకు? నాకోపం వల్లేనా? చెప్పకుండా వెళ్ళిపోయింది? ప్చ్. తనని బాధపెట్టాను, అలా చేయకుండా వుండాల్సింది. కానీ తనమీదుండే అతిప్రేమవల్లే ఇలా జరిగింది. స్మిత బాధపడుతోందేమో! నేనెళ్ళి క్షమించమని అడగాలి. నాతో మాట్లాడదేమో... పోనీ బ్రతిమాలితే సరి. తప్పు చేసినప్పుడు తప్పదుగా...' ఇలా ఆలోచించుకుని రమ్య స్మిత ఇంటికి బయల్దేరింది.

రమ్య తలుపు తట్టినప్పుడు స్మిత తల్లి తలుపు తీసి సాదరంగా ఆహ్వానించింది.

"మీ ఆరోగ్యం బాగుందా ఆంటీ?" అంది రమ్య. ఆమె కళ్ళు స్మితకోసం చూస్తున్నాయి. కూర్చుంటూ "స్మిత లేదా ఆంటీ?" అంది.

"కాలేజ్‌కెళ్ళింది కదా, నువ్వెళ్ళలేదా?" సంధ్య చిత్రంగా అడిగింది.

"కాలేజ్‌నుండే ఒస్తున్నాను. క్లాసులో కని

పించక ఇంటికి వచ్చేసిందనుకున్నాను. అయితే లైబ్రరీలో వుందేమో... సారీ ఆంటీ! నే వెళ్తాను'' అని లేచింది రమ్య.

''అదేంటి? ఈరోజసలు కనిపించలేదా?''

''పొద్దున కనిపించింది. ఒకేచోట సీట్ దొరక్క వేరేగా కూర్చున్నాం. ఫస్టు పీరియడ్ అయ్యాక స్మిత కనిపించక ఇటొచ్చాను'' అంది రమ్య.

రమ్య దార్లో తనని తానే తిట్టుకుంది. 'తను త్వరపడి రాకుండా వుండాల్సింది అనుకుంది. స్మిత ఎక్కడికెళ్ళుంటుంది' అని ఆ రోజంతా ఆలోచిస్తూనే వుంది.

రెండోరోజు కాలేజ్ గ్రౌండులో ఎదురుచూస్తూ కూర్చుంది రమ్య. మరో పావుగంటకి స్మిత వచ్చి ఆమెకి కాస్త ఎడంగా కూర్చుంది.

''ఫోజులు కొట్టకపోతే, మాట్లాడచ్చుగా'' అంది రమ్య నవ్వుతూ.

స్మిత నవ్వలేదు.

''కోపమా నామీద? అంత శిక్షేయకోయ్'' మళ్ళీ నవ్వింది రమ్య.

''అందరూ నన్ను శిక్షించేవాళ్ళే. నేనెవర్నీ శిక్షించను''

''నన్నూ చేర్చావా లిస్టులో?! ఇంతకీ ఎక్కడికెళ్ళావు నిన్న?''

స్మిత సమాధానం చెప్పకుండా కన్నీరు పెట్టుకుంది. రమ్య కళ్ళు తుడుస్తూ ''ఏమైందిప్పుడు? ఎందుకే కన్నీళ్ళు? ప్లీజ్, నాతో చెప్పవా?''

''ప్చ్... ఏం లేదు''

''నీ బాధని నేను పంచుకోకూడదా? స్మితా! నా సంగతి నీకు బాగా తెల్సు. నీకు చాలా మంది స్నేహితులున్నారు. నేనే నీకు ప్రధానం కాకపోవచ్చు. కానీ నాకున్న స్నేహితులే తక్కువ. అందులో నువ్వు... ఊహూ మాటల్లో చెప్పలేను. నువ్వు నాతో విషయం చెప్పకుండా నీలో నువ్వు బాధపడ్తున్నావనే నిన్న అలా కోపగించుకున్నాను. నీకేమన్నా అయితే నే తట్టుకోలేను. నిన్నటి నా ప్రవర్తనకి నేనెంత బాధపడ్డానో నీకు తెలీదు. రాత్రంతా నిద్రలేదు, తెల్సా? ఇంత చెప్పినా నువ్వింకా నన్ను దూరంగా చూస్తే నీ ఇష్టం...'' అంది రమ్య.

''రమ్యా! నాకెన్ని బాధలున్నా మంచి స్నేహితులున్నారనే సంతృప్తి వుంది''

''ముందు విషయం చెప్పు''

''ఈమధ్య ఏ చిన్న టెన్షనూ భరించలేకపోతున్నా. ముందే మనసు గందరగోళంగా వుంటే, నువ్వూ కోపం ప్రదర్శించావు. అక్కడికీ కంట్రోల్ చేసుకుని ఫస్టు పీరియడ్ వున్నాను. తల్నొప్పి ఎక్కువైంది. టాబ్లెట్లు అయిపోవటంవలన మందులషాపుకెళ్ళాను. మళ్ళీ కాలేజ్‌కి రావాలన్పించలేదు, ఇంటికి పోవాలన్పించలేదు. హారతి దగ్గరి కెళ్ళాను... సాయంత్రం వరకూ తనతో గడిపి, ఇంటికెళ్ళాను...''

రమ్య శ్రద్ధగా వింటోంది.

''చెప్పులు విడిచానో లేదో' ఎక్కణ్ణించి వస్తున్నావు? అంది అమ్మ.

ఒక్కక్షణం నిశ్చేష్టురాల్నయ్యాను. కాలేజ్ నుండి వెళ్ళిపోయినట్లు ఇంట్లో ఎలా తెలిసిందా అని. నిజమే చెప్పినా, నా తడబాటుని తప్పుగా అర్థంచేసుకుంది అమ్మ.

''ఎందులోనూ లేకపోయినా అబద్ధాలాట్టంలో ప్రావీణ్యం సంపాదించు. కాలేజ్‌వంక పెట్టుకుని ఎక్కడెక్కడో తిరిగితే, ఇంట్లో తెలియదనిమాత్రం అనుకోకు'' అంది.

''మరి నువ్వేమన్నావు?'' అడిగింది రమ్య.

''ఏమీ అనలేదు. సంజాయిషీలు చెప్పడం నాకిష్టం లేదు''

''అవసరమైనప్పుడు చెప్పాలి. మౌనంగా వూరుకుంటే వాళ్ళ అనుమానం నిజమే అనిపిస్తుంది''

''నా జాతకం అలాంటిది''

''జాతకానికేమైంది? అది మన చేతిలోనే వుంటుంది. నువ్వే లేనిపోనివి కొనితెచ్చుకుంటున్నావు''

''నిజమే. ఒకప్పుడు ఇంట్లో అందరికంటే నన్నెంతో ప్రేమగా చూసేది అమ్మ. ఇప్పుడు నా ప్రతి కదలికా అనుమానంగా గమనిస్తుంటుంది''

''సగం సగం చెప్పకు. అసలీ పరిస్థితి ఎందుకొచ్చింది''

''ప్రేమలో పట్టంవల్ల''

''నిన్ను చూస్తుంటే చాలారోజులుగా అనుమానంగానే వుంది. నువ్వే చెప్తావని చూశాను''






"చెప్పాలనే అనుకున్నాను, కానీ భయమేసింది"

"ఏం? నేనేం రాక్షసినా, లేక నువ్వు ప్రేమించి, పెళ్లి చేసుకుంటే ఓర్వలేని చుప్పనాతినా?"

"ఛఛ... ఇలా మాట్లాడకు రమ్యా. కానీ నా ప్రేమ కథ విచిత్రమయింది. వింటే నాతో స్నేహం మానేస్తావేమోనని..."

"ప్రేమకథలన్నీ విచిత్రంగానే వుంటాయిలే. అయినా నేనేం మరీ తుమ్మితే వూడిపోయే ముక్కును కాను"

"నాకూ బరువుగానే వుంది. నీకు చెప్తే కాస్త రిలీఫ్‌గా వుంటుంది. కానీ ఇప్పుడేనా?" సందేహంగా అడిగింది స్మిత.

"ఒక్కరోజు క్లాసెస్ అటెండ్ కాకపోతే నష్టమేమీలేదు. ఇక్కడే కూర్చుంటే చూసేవాళ్లకి బాగోదు. పద మా ఇంటికెళ్లి మాట్లాడుకుందాం"

క్లాసులెగ్గొట్టి మీ ఇంటికా? ఇంట్లో ఏమనరా?"

"ఏమంటారు? మహా అయితే త్వరగా వచ్చారే అంటారు. రేపు సబ్‌మిట్ చేయాల్సిన నోట్సు రాసుకోవాలని చెప్పచ్చు" అంది రమ్య.

''రమ్యా! నీకు అబద్ధం చెప్పడం కూడా వచ్చా?''

''సామాన్యంగా చెప్పను. అవసరానికి తప్పదు. పోనీ నిజం చెప్పనా స్మిత తన ప్రేమకథ చెప్తుందట అని. బోల్డంతమంది శ్రోతలు నీకు''

''ఇంకా నయం. పబ్లిక్ రోడ్డుమీద చెప్తే నాలుగు చిల్లరడబ్బులు కూడా దొరుకుతాయి'' అంది స్మిత.

''అందుకే మనమేం సత్యహరిశ్చంద్రులం కాము. అబద్ధం చెప్పకపోవడం మంచి లక్షణమయినా, దానివల్ల ఇతరులకి నష్టం లేక మనకి లాభం వుందనుకున్నప్పుడు చెప్పచ్చు'' అంది రమ్య.

ఇద్దరూ రమ్య ఇల్లు చేరారు. రమ్య తల్లి, అమ్మమ్మ, ఒదిన అందరూ నిద్రపోతున్నారు. ఇద్దరు అన్నలూ పేకాట ఆడుతున్నారు. అసలు వీళ్ళ రాకను ఎవరూ పట్టించుకోలేదు. రమ్య స్మితని మేడమీదికి తీసికెళ్ళింది. మేడమీద ఒకేఒక్క విశాలమయిన గది, మిగిలిందంతా ఓపెన్ ప్లేసు. అక్కడన్నీ పూలకుండీలు. స్మితకి రమ్య ఇంటికంటే, ఎవ్వరితో ప్రమేయం లేని ఈ గదంటే మహా ఇష్టం. గన్నేరుచెట్టు శాఖలు పైవరకూ వచ్చి గుత్తులుగా పూశాయి. రెండుపూలు కోసి తల్లో పెట్టుకుంది.

''నేనీ గదిలో కొచ్చేస్తా రమ్యా''

''నువ్విలా అంటూవుండు ముసలిదాన్నయిపోతాను''

''నువ్వెప్పుడో ముసలిదానివి. కొత్తగా అయ్యేదేముంది''

''సర్లే, కథ మొదలెట్టు మైడియర్ యంగ్ లేడీ''

''అతను మనింటికి ఎదుట వున్న బిల్డింగులో వుంటాడు''

''ఓహో ఎదురింటి హీరో అన్నమాట''

''చాలా అందంగా వుంటాడు. అలాని కేవలం శారీరక అందం గొప్పదని నేను చెప్పను. మొదటిసారి చూపులెలా కలిశాయో నాకు గుర్తులేదు. కానీ కళ్ళతోనే పలకరింపులు జరిగేవి. ఒకరోజు ''ఏం చదువుతున్నావు?'' అని సైగ చేశాడు. అతని ఆ అభినయం జన్మలో మర్చిపోలేను. ఉహూ, అదొక్కటే కాదు అతని ప్రతి కదలిక నా మనసులో నిలిచిపోతాయి. అవకాశమొస్తే అతనో పెద్ద నటుడౌతాడు''

''నీతో ప్రేమ కూడా నటిస్తున్నాడేమో అయితే''

''ప్లీజ్ రమ్యా! తమాషాక్కూడా అలా మాట్లాడకు. అది నటన అనే ఆలోచన కూడా నేభరించలేను.

''ఇంతకీ అతని పేరేంటి, ఎవరు? ఏం చేస్తాడు?''

''పేరు ఇబ్రహీం హుస్సేన్, వి.ఐ.పి.లో సేల్స్ ఇన్‌ఛార్జ్‌గా పనిచేస్తున్నాడు''

''ముస్లీమా?'' చాలా ఆశ్చర్యంగానూ, ఇష్టం లేనట్లు ముఖంపెట్టి అడిగింది రమ్య.

''ఏం, ముస్లిములు మనుషులు కారా?''

''అదికాదే స్మితా! వాళ్లకీ, మనకీ అన్నిట్లో వ్యతిరేకమే. ఒక ముస్లిముని చేసుకుని సుఖపడ్తావని నేననుకోను. ప్లీజ్! నువ్వేది చేసినా నాకిష్టమే గానీ ముస్లీమ్‌తో ప్రేమ మాత్రం నాకు నచ్చలేదు'' అంది రమ్య.

''మీ మనసులు మరీ ఇరుకువి. అమ్మ ఇదే అంటుంది. నువ్వు ఎవర్ని చేసుకుంటానన్నా నాకేం అభ్యంతరం లేదుగానీ ముస్లిమ్‌లని, సిక్కులని మాత్రం చేసుకుంటాననకు అని''

''మంచిమాటంది ఆంటీ, ఐ అగ్రీ విత్ హర్''

''రమ్యా! నువ్వేదో నన్నర్థం చేసుకుంటావనుకున్నాను''

''అర్థం చేసుకోవడమంటే ఏమిటి? ఎందులోనన్నా దూకుతానంటే దూకనివ్వడమా?''

''నేనెందులోనూ దూకడంలేదు. కేవలం ఒక వ్యక్తిని ఇష్టపడ్డాను. అంతే, అదేదో నేరమైనట్లు నన్నంతా చులకనగా చూస్తున్నారు''

''నేనేం చులకనగా మాట్లాడలేదే?''

''ఇంట్లో సంగతి. ఈ విషయం తెలిశాక ఇంట్లో అందరికీ నామీద విరక్తి కలిగింది. అభిమానం స్థానంలో అనుమానం చోటుచేసుకుంది''

''నాన్నక్కూడా తెలుసా ఈ విషయం?''

''ఉహూ! నాన్నకీ, తమ్ముడికీ తప్ప మిగిలిన అందరికీ తెల్సు. నాన్నకి తెలిస్తే నేను ఇంట్లో




# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున, మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలో పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడు జాగ్రత్తపడటం మంచిది.

కూపన్

నవంబర్ చతురనవల స్పర్ధ

సమీక్షకుని పేరు : ..........................................

చిరునామా : ..........................................

..........................................

..........................................

..........................................

వుండలేనని నిన్న శిరీషక్క అంటోంది''

''స్మితా! అవన్నీ సరేగానీ. ప్లీజ్... నీ మంచి కోసం చెప్తున్నా విను. ముస్లీములకి చట్టబద్ధంగానే నాలుగు పెళ్ళిళ్ళు చేసుకునే హక్కుంది తెల్సా? అలాంటప్పుడు అతను జీవితాంతం నీతోనే వుంటాడని గ్యారంటీ ఎక్కడిది?''

''పిచ్చి రమ్యా! చట్టాలు మనుమల్ని దగ్గర చేస్తాయేమోగానీ మనసుల్ని మాత్రం కలపలేవు. హిందువులయితే పెళ్లి చేసుకుంటే భార్యాభర్తల్లో ఒకరికి ఇష్టం లేకపోయినా, రెండో వాళ్లకి ఇష్టమయితే కలిసేవుండాలని చట్టం చెప్తుంది. ఒకవేళ అంత అయిష్టంతో ఏవో సాకులు చూపి భర్త విడిపోతే మనోవర్తి అంటూ నెలనెలా కొంత డబ్బు భార్యకి పంపాలి, ఇంతేగా. అదే ముస్లిమయితే ఎవరి అభ్యంతరం లేకుండా చట్టప్రకారం నాలుగు పెళ్లిళ్లు చేసుకోవచ్చు గనుక ఒక భార్యతోనే ఎందుకుంటాడన్నది నీ వాదన. కానీ చట్టంకోసం కలిసివుండే పరిస్థితి ఎప్పటికీ వద్దు. ఇష్టమున్నంత కాలం కలిసుండి, తర్వాత విడిపోతేనే మంచిది'' అంది స్మిత.

''పెళ్లంటే చీర కొనుక్కోవడం కాదు? నచ్చినన్నాళ్ళు కట్టి తర్వాత పక్కన పడేయొచ్చు అనుకుంటున్నావా? పెద్దవాళ్ళు పెళ్లి చేస్తే ఏదైనా చిన్న గొడవొచ్చినా వాళ్ళొచ్చి సర్దిచెప్పడానికి వీలుంటుంది. అదే అందరికీ వ్యతిరేకంగా వెళ్ళి, పెళ్లి చేసుకుంటే నీకే కష్టమొచ్చినా నిన్నెవరూ పట్టించుకోరు'' అంది రమ్య.

''పెద్దవాళ్ళు కాకపోయినా నా ఫ్రెండ్సయినా నన్ను పట్టించుకోరా? రమ్యా! నువ్వేది చెప్పినా వింటాను కానీ అతన్ని చూడకుండా నేనుండలేను. అది నా చేతిలో లేదు''

''ఇంతకీ మీరెక్కడ కల్సుకుని మాట్లాడుకుంటారు?''

''ఎక్కడా కలుసుకోకుండానే అమ్మ అనుమానిస్తోంది. ఇక కలుసుకుంటే పరిస్థితి ఎలా వుంటుందో ఏమో''

''స్మితా! నా దగ్గర కూడా విషయాలెందుకు దాస్తావు? నిజంగా మీరిద్దరూ కలుసుకోవడం లేదా?''

''అందుకే మొదటే చెప్పాను. మాది విచిత్ర ప్రేమకథని. కొన్నిరోజులు సైగలయ్యాక ఒక రోజు నేను కాలేజీకి వస్తుంటే అతను నావెంటే బస్టాపువరకూ వచ్చాడు. అప్పటికి అతనికి వెహికిల్ లేదు. పరిచయస్థులు ఎవరూ లేరని తీర్మానించుకుని నా పేరు, నేను చదివే కాలేజీ, కోర్సు అడిగితే చెప్పాను. నాకు చాలా టెన్షన్‌గా వుంది. అతన్తో మాట్లాడ్తుంటే ఏదో తెలియని తడబాటు. నాకెన్నో ప్రశ్నలు అడగాలని వున్నా ఏమీ అడగలేకపోయాను. అంతలో అతనే 'నేనొక ముస్లీమ్‌నని తెల్సా?'' అన్నాడు. తల అడ్డంగా ఊపాను. రమ్యా! నాకు కులమతాల పట్టింపులేదు. అతన్ని నెలరోజులుగా పరిశీలిస్తున్నా ఎన్నడూ అతనేకులానికి చెందినవాడయ్యుంటాడని కూడా నేను ఆలోచించలేదు. మొదటిసారి పలకరించిన సంతోషం ఒక్కసారిగా అదృశ్యమైనట్లనిపించింది. కులమతాల ప్రసక్తి లేకుండా ఇష్టాఇష్టాలు కలగవా? అనుకున్నాను. అతనలా అడగడం నాకేదో వెలితిగా అనిపించింది. ఆ కల్లోలంలోనే పేరడిగితే చెప్పాడు, నేనెక్కాల్సిన బస్సు ఇంకా రాలేదు. 'ఈరోజు కాలేజీ మానేస్తే... కాస్త మాట్లాడాలి' అన్నాడతను. 'ఉహూ, నేనెక్కడికీ రాను' అన్నాను ఖండితంగా. మొదటి సంభాషణ అలా మొదలైంది. ఆ తర్వాత మరో రెండుసార్లు అనుకోకుండా కింద ఎదురయినప్పుడు మాట్లాడాడు. అంతే. ఇంతకుమించి మేమిద్దరం ఏ సినిమాలకూ, షికార్లకూ వెళ్లలేదు'' సుదీర్ఘంగా మాట్లాడి ఆయాసపడింది స్మిత.

రమ్య కిందికెళ్లి మంచినీళ్లు, టీ పట్టుకొచ్చింది.

''స్మితా! నీక్కోపం వస్తే రానీగానీ ఆ మాత్రానికే ప్రేమెలా కలిగింది. అతన్లో నీకేం నచ్చింది? ఏదయినా ఒక్క ప్లస్‌పాయింట్ చూపు'' అంది రమ్య.

''రమ్యా! స్నేహం గురించి, ప్రేమ గురించి నాకంటే గొప్పగా మాట్లాడ్తావు, నువ్వేనా ఇలా అడుగుతోంది. అతను చాలా అందంగా వుంటాడు, కానీ లోకంలో ఇతనికంటే వందరెట్లు అందంగా వున్నా వేరేవాళ్లని చూస్తే నాకు ప్రేమ కలుగుతుందా? అతని గొంతు చక్కగా వుంటుంది. జేసుదాసు గొంతుకూడా మధురంగా వుంటుంది. కానీ జేసుదాసుని ప్రేమించగలనా? ఎవరికి ఎవరిమీద ప్రేమ కలిగినా దానికి కారణం చెప్పడం కష్టం. చెప్పడాని

కి ప్రయత్నించినా అదే పూర్తి నిజం కాకపోవచ్చు''

రమ్య రకరకాలుగా స్మితని మార్చాలని ప్రయత్నిస్తోంది. తపస్సు చేసిన పార్వతికి శివుడు, బ్రహ్మచారి రూపంలో ప్రత్యక్షమై శివుడిలో వున్న లోపాలు ఎత్తి చూపినట్లు. కానీ అప్పుడు పార్వతి నిజానికి అవి లోపాలు కావనీ వైశిష్ట్యాలని పేర్కొంది. బహుశా ప్రేమ లక్షణమే అంతేమో. స్మిత కూడా అదే చేస్తోంది. హుస్సేన్ విషయంలో ఎవరు ఎలాంటి వ్యతిరేకతను తెలియజేసినా దానిని ఎదుటివాళ్ళు కూడా ఆమోదించగలిగేంతగా సమర్థిస్తోంది.

రమ్య రెండు నిమిషాలు మౌనంగా ఊరుకుంది.

"అవునూ స్మితా! ఈ కోర్సు పూర్తయిందంటే నువ్వొక ఆర్టిస్టువవుతావు. అతను చూస్తే ఉద్యోగం మంచిదయినా కామన్‌మాన్‌లా వున్నాడు... అంటే నా ఉద్దేశం అతనేం ఆర్టిస్టు కాదుగదా..." మళ్ళీ అడిగింది రమ్య.

స్మిత చిన్నగా నవ్వింది. "మా అత్తయ్య కూడా ఇదే ప్రశ్న వేసింది. ఒక ఆర్టిస్టు ఆర్టిస్టునే చేసుకోవాలనే వాదాన్ని నేనొప్పుకోను. గొప్ప కళాకారుల భార్యలంతా కళాకారులా! అంతెందుకు సరోజినీదేవి భర్త కవికాదుకదా?''

"భర్త గొప్పవాడైతే భార్య సంతోషిస్తుంది గానీ, భార్య గొప్పతనాన్ని సహించే భర్తలు చాలా రేర్. అదే నువ్వు చెప్పినట్లు గోవిందరాజులనాయుడులాంటివాళ్లు అరుదు. నీ హుస్సేన్ నాయుడంత గొప్పవాడా?''

"నేను సరోజినీ అంతటిదాన్ని కానుగా?''

"నువ్వు చాలా మొండిదానివి''

ఈ మాట చాలామంది అన్నారు. నీక్కూడా వినుగొచ్చేట్లుంది, నేవెళ్ళనా మరి?'' అంటూ లేచింది స్మిత.

"ఇంతకీ నీ పెళ్ళికి నన్ను పిలుస్తావా?''

"చూద్దాంలే'' అంది సాలోచనగా ముఖంపెట్టి.

రమ్య నవ్వింది. "స్మితా! నాకున్న స్నేహితులే తక్కువ. అందులో నీ అంత దగ్గరైన వాళ్లు ఇంకెవరూ లేరు. నీకు ఆవేశమెక్కువ. త్వరపడి నిర్ణయాలు తీసుకుంటావు, అందర్నీ నమ్మేస్తావు. చాలామంది పైకి కనిపించినంత మంచిగా లోపలుండరు అని చెప్తే నీకర్థంకాదు. అందుకే నీ గురించి దిగులు'' అంది.

స్మిత కృతజ్ఞతతో చూసింది. రమ్యకి నిజంగా తనంటే ప్రాణం. రమ్య తన గురించి తను ఆలోచించుకోదు. ఎప్పుడూ స్మిత గురించే ఆమె ఆలోచనలు. ఏదయినా కాస్త ఒంట్లో నలతగావుందని తెలిస్తే డాక్టరు దగ్గరికి వెళ్ళేవరకూ వూరుకోదు.

"రమ్యా! ఈ పిచ్చిపిల్లంటే నీకెందుకంత ఇష్టం?''

రమ్య మౌనంగా వుండిపోయింది.

స్మిత ఇక వెళ్తానని లేచింది.

"నిన్నంతగా ఆకర్షించిన హుస్సేన్‌ని నాకు త్వరగా చూడాలని వుంది'' అంది రమ్య తనూ లేచి.

"అటులనే బాలా! తమరి కోరిక త్వరలో ఫలించుగాక'' అంది అభయమిస్తున్నట్లు చేయిపెట్టి నవ్వుతూ.

రమ్య బస్టాపు వరకూ వచ్చి బస్సెక్కించింది.

ఇల్లు చేరేసరికి సమయం నాలుగయ్యింది. రమ్యతో విషయం చెప్పేసరికి మనసు కుదుపడినట్లుంది. హుస్సేన్ బిల్డింగు ఎదురుగా హీరోహోండా కన్పించేసరికి ఆ ఆనందం రెట్టింపయింది. చకచకా మెట్లెక్కి కాలింగ్‌బెల్ నొక్కింది. సంధ్య తలుపు తీసింది. స్మిత ముఖంలో కనిపిస్తున్న పిచ్చి సంతోషాన్ని విచిత్రంగా, తీక్షణంగా చూసింది. అంతే స్మిత ఆనందమంతా ఆవిరైపోయింది. నీరసం ఆవరించింది. చెప్పులు విడిచి లోనికెళ్లింది. తిన్నగా బాల్కనీలోకి వెళ్లి హుస్సేన్ని చూడాలనుంది. అతను తన రాకకోసం చూస్తుంటాడు. కానీ ఎలా? వెళ్తే తల్లి పురాణం మొదలెడుతుంది. ఒక మనిషిని చూస్తే అది అంత నేరమా? హుస్సేన్ని చూస్తూ పట్టుబడితే తననో వేశ్యనో, హంతకురాలినో చూసినట్లు చూస్తారు. పోనీ వాళ్లు చెప్పినట్లు అతని సంగతి మర్చిపోదామంటే అది తనవల్ల కావడంలేదు.

"కాళ్లు కాలిన పిల్లిలా తచ్చాడకపోతే కాళ్లూ చేతులు కడుక్కుని బట్టలు మార్చుకోరాదు?'' కోపంగా అరిచినట్లే చెప్పింది సంధ్య.

స్మిత మనసు చివుక్కుమంది. 'చాలా రోజు




లుగా తల్లి తనతో అలాగే మాట్లాడుతోంది. సౌమ్యంగా, ప్రేమగా మాట్లాడి ఎన్నాళ్లయిందో. మా అమ్మ ఆదర్శతల్లి కాబోలు. పిల్లలు చెడ్డ మార్గాలు తొక్కకుండా వాళ్ల ముక్కుకో కళ్ళె మేసి సవ్యంగా నడిపించడం తన బాధ్యతగా భావిస్తోంది. కానీ ఒక్క విషయం ఎందుకు గమనించదు? నాకు ఇరవైరెండేళ్ళ వయసు. నేనింకా పసిపాపనా? కాస్తో కూస్తో చదువుకున్నాను. ఇంకా ఏది మంచో ఏది చెడో నాకు తెలియదా? నన్నెందుకింతగా వెంటాడుతుంది?...' ఆమె ఆలోచనలు ఇంకా సాగుతూనే వున్నాయి.

సంధ్య ''నీక్కాదూ చెపుంది?'' అంది.

''తలనొప్పిగా వుంది, తర్వాత మార్చుకుంటా'' అందామె. నిజానికి బట్టలు మార్చుకోడానికి తలనొప్పి అడ్డం కాదు. కానీ తాను వేసుకున్న డ్రస్సుకి ఆవేళ చాలా కాంప్లిమెంట్లొచ్చాయి. అందులో హుస్సేన్ తనని చూడాలని కోరుకుంటోంది. స్మిత అలాగే వెళ్లి మంచంమీద పడుకుంది. తల్లి స్నానానికి వెళ్లడం గమనించి ఆమె ఒక్కపరుగున బాల్కనీలోకెళ్లింది. హుస్సేన్ మరో మిత్రుడితో కలిసి కూర్చుని ఇటే చూస్తున్నాడు. ఈమెని చూసి అర్థవంతంగా అతనితో మాట్లాడుతూనే ఎవరి గురించో చెప్పడానికి చెయ్యి ఎత్తినట్లు ఎత్తాడు. అది తన కోసమా, అతడి కోసమా అని నవ్వుకుంది స్మిత. 'ఎప్పుడూ ఎవర్నో వెంటేసుకు తిరుగుతాడు. బాడీగార్డుల్లాగా' విసుక్కుంది మనసులోనే. అతను లేకపోతే బాగున్నావని చెప్పేవాడు, అదీ ఆమె దిగులు. అతన్నలా చూస్తుంటే మనసంతా నిండిపోయినట్లుంది. కానీ తనక్కడే నిలబడలేదు. తల్లి లోపలికొచ్చిందంటే మహాభారత సంగ్రామం మొదలవుతుంది. అనుకుని లోపలికొచ్చేసింది. రెండు బిల్డింగులకీ మధ్యరోడ్డు మాత్రమే అడ్డం. మనుషులు పరస్పరం స్పష్టంగా కనిపిస్తారు.

లోపలికొచ్చి బట్టలు మార్చుకుంది. మనసంతా దిగులుగా వుంది. ప్రపంచంలో కొన్ని కోట్ల కష్టాలుండచ్చు. కానీ స్మిత దిగులంతా అతని గురించే. అతన్నెప్పుడూ చూస్తూ కూర్చునే అవకాశం కలిగితే అంతకంటే ఇంకేం అవసరం లేదనుకుంటుంది. రమ్యతో తాను చెప్పినవన్నీ గుర్తొచ్చాయి. రమ్యకి తన మీద ఎలాంటి అభిప్రాయం కలిగిందో? రమ్య రేపట్నుండీ తనతో మామూలుగా మాట్లాడుతుందా లేక ఇంట్లోవాళ్లలా తనూ దూరమవుతుందా' అంటూ ఏమేమో ఆలోచిస్తూ పడుకుంది.

కొంతసేపలా అస్థిమితంగా వుండి ఇక లేచి పుస్తకాలు తీసింది. రాయాల్సిన నోట్సులు పూర్తిచేసి, స్కెచ్ పుస్తకం తెరిచి డ్రాయింగ్ మొదలెట్టింది.

అకస్మాత్తుగా ఆమెకి సెమినార్ విషయం గుర్తొచ్చింది. లేచి అల్మరంతా వెతికింది. తను వ్రాసి పెట్టిన పోర్ట్రెయిట్స్, ఎస్సే ఎక్కడా కనిపించలేదు. చాలా చికాగ్గా వెతికింది. పేరిచ్చి, చదవకపోతే అంతా నవ్వుతారు. ముఖ్యంగా హరనాథ్‌గారికి చాలా కోపం వస్తుంది. ఆ లెక్చరర్ విద్యార్థుల అశ్రద్ధని భరించలేరు. నవ్వుతూనే తిట్టేస్తారాయన. ముఖ్యంగా రమ్య కూడా హుస్సేన్ గురించే తనకింత మతిమరపు వచ్చిందని తిడ్తుంది. ఏ కారణంవల్లో వ్రాయలేకపోతే ఇవన్నీ భరించవచ్చుగానీ వ్రాసి కూడా చదవకపోతే తనకి శాంతంగా వుండదు. స్మిత అలా గంటసేపు వూపిరాడకుండా వెతికినా ఆ కాగితాలు కన్పించలేదు.

లోపల్నుండి సంధ్య కేకలు పెడ్తుంటే వెళ్లి భోజనం చేసింది. మళ్ళీ కొంతసేపు డ్రాయింగు వేసింది. అంతా పడుకున్నారు. బాల్కనీలోకి వెళ్లింది. కిటికీకున్న పైరెక్కలు రెండూ తెరిచివున్నాయి. లోపల లైటేసివుంది. భోజనం చేసిరావడానికి వెళ్ళివుంటాడు. 'ఈ పాటికి వచ్చేయకూడదూ?' అనుకుంది. ఇక లాభంలేదు వీలైతే రేప్పొద్దున మళ్ళీ వ్రాయాలి అనుకుని తన మంచం మీద దుప్పటి దులిపి వేసుకుందామని తీసేసరికి దిండు దగ్గర ఆ ఎస్సే దొరికింది. 'నన్నెంత కష్టపెట్టావే?' అంటూ ఆనందంగా దాన్ని తీసి బాగులో పెట్టుకుంది. హుస్సేన్‌కోసం ఎదురు చూద్దామని వున్నా మళ్ళీ ఎవరయినా లేచి వస్తే ఏమవుతుందోననే భయంతో పడుకుని కళ్లు మూసుకుంది. మనసు మారాం చేసింది. నిద్ర రాలేదు. రాయప్రోలు 'స్వప్నకుమారం'

తీసి చదువుతుంటే ఆమె ఒకచోట ఆగిపో యింది.

''వలచిన ప్రాణవల్లభుడెవండయినన్ ప్ర తిమాలవచ్చితో? నిలుపగరాని కాంక్ష నవనీత దయాగుణశాలి నొక్కనిన్ పిలిచితొ ఈ వన మ్మునకు? బింబఫలాధర! యర్ధరాత్రివేళల నిదురించు వీణలిటులం గదలించిదివేల గో లవై?''

ఆ పద్యాన్ని తనకు అన్వయించుకుంది. హుస్సేన్ నవనీత దయాగుణశాలి. తన బాల్కనీ ఒక వనము- అనుకుని నవ్వుకుంది. మనసు నిలుపుకోలేక తలుపుతీసి, మళ్ళీ బాల్కనీలోకి చూసింది. గదితాళం పెట్టే వుంది. ఇంకా రాలేదు. విసుక్కుని మళ్ళీ తలుపేసి పడుకుంది.

ఉదయం ఆరున్నరకి లేచింది. ఇంట్లో అందరూ అప్పటికే లేచారు, తండ్రి తప్ప. లేస్తూనే బాల్కనీ తలుపు తెరిచింది. దుప్పటి మడిచి స్టాండులో పెట్టింది. బ్రష్షుమీద పేస్టు వేసుకుని బాల్కనీలోకి వచ్చింది. హుస్సేన్ అప్పుడే తలుపు తెరిచి కుడిచేయి నుదుటి మీద పెట్టి నవ్వుతూ ''గుడ్ మార్నింగ్'' అన్నా డు. స్మిత నవ్వింది. ఏమిటీ చిత్రం? అతన్నలా చూస్తూకూర్చుంటే తనకెందుకింత పరమా నందం? -ప్రతిరోజూ, రోజులో అనేకసార్లు అలా ప్రశ్నించుకుంటూనే వుంటుంది. కానీ జవాబు మాత్రం దొరకదు. గమ్యం లేని ప్రయాణంలా సాగుతోంది తన ప్రేమ.

వంటింట్లో సంధ్య అరుపులు వినిపిస్తు న్నాయి. అంతే... కళ్లతోనే సైగచేసి, లోపలికొచ్చే సింది. ముఖం కడుక్కుని, ఇల్లు ఊడ్చింది. డబ్బాలోంచి బియ్యం తీసి రాళ్ళేరింది. నీళ్లొ స్తుంటే డ్రమ్ముల్లో పట్టిపోసింది.

స్నానానికి వెళ్ళబోతుంటే శరత్ ఆమె స్కె చ్‌బుక్ తెచ్చి ''పర్లేదు బాగానే వేశావే?'' అన్నా డు.

స్మితకి అందులో జవాబు చెప్పాల్సిందేమీ కన్పించలేదు. కానీ శరత్ బుక్‌మీద ఏమో వ్రాయబోతుంటే మాత్రం ''ఏం చేతులూరు కోవా?'' అంటూ పుస్తకంతీసి సంచిలో పెట్టు కుంది.

జడల్లుకుంటూ బాల్కనీలో నిలబడింది. అతనేవో ఫైల్స్ చూసుకుంటూ స్మితని గమ నించలేదు. నిరాశగా వచ్చేసింది. భోజ నంచేసి, కాలేజీకి బయల్దేరింది. ఆమె క్రిందకి దిగేసరికి హుస్సేన్ పైనుండి నవ్వుతూ చూస్తు న్నాడు. 'హుస్సేన్ నువ్వు నా క్లాస్‌మేట్ అయితే ఎంత బాగుండేది? ఉదయంనుండి సాయంత్రందాకా నిన్ను చూస్తూ గడిపినా ఎవ రూ అభ్యంతరం చెప్పరు' అనుకుంది. మళ్ళీ అంతలోనే అది మాత్రం నిజంగా సాధ్యమా? ఇక్కడ అమ్మ, అక్క ఒక సాకు మాత్రమే. ఒకవేళ హుస్సేన్ తన కాలేజ్‌లో వున్నా చూస్తే ఉపాధ్యాయులు, విద్యార్థులూ అంతా చూస్తా రనే భయంముండదూ? ఎందుకు భయం? నిజంగా ఒక అబ్బాయిని ఒక అమ్మాయి చూస్తే నేరమా?' స్మిత ఆలోచనలకి అంతులే దు. ఇంతలో బస్సొచ్చింది. బస్సు బాగా ఒత్తి డిగా వుంది. రోజూ ఇదే వరస. ప్రభుత్వం చార్జెస్ పెంచడంలో చూపిన ఆసక్తి నాలుగు అదనపు బస్సులు వేయడంలో చూపదు. రోజు రోజుకీ జనాభాసంఖ్య పెరిగిపోతున్నా బస్సుల సంఖ్య మాత్రం పెంచరు అనుకుంది. కాలేజీ దగ్గర దిగేసరికి నరకంలోంచి బయటికి వచ్చి నట్లనిపించింది.

అప్పటికే రమ్య వచ్చి కూర్చుంది. స్మిత వెళ్ళి పక్కన కూర్చుంది. ''హీరో కన్పించాడా?'' అంది రమ్య.

''వస్తుంటే పైనుండి నవ్వుతున్నాడు''

ఇంతలో రమేష్ వచ్చాడు. ''హలో!'' అన్నా డు. రమ్య అతనివైపు చూడకుండా స్మిత బాగ్‌లోంచి స్కెచ్‌బుక్ తీసి చూస్తోంది. స్మిత, ''నిన్న అన్ని క్లాస్‌లూ జరిగాయా?'' అంది.

''మీ ఇద్దరూ అటెండ్ కాలేదేం?''

''ఊరికే రావాలన్పించలేదు''

''మీర్రావడం చూశాను. వెళ్లిపోయినట్లున్నా రు, సినిమాకా?''

''కాదు, రమ్య ఇంటికి''

''నాకు మీ హిస్టరీ నోట్సు కావాలి, ఇస్తారా?''

''నేనే రాయలేదు. ఇంటి దగ్గరుంది'' అని అబద్ధం చెప్పింది స్మిత. మగపిల్లలకి నోట్సులి స్తే, అవి యథారూపంలో రావని తనకి రెండు మూడుసార్లు అనుభవమయింది. ఏవో పిచ్చి రాతలు, గీతలు గీసి ఇస్తారు.

రమేష్ వెళ్లిపోయాడు. అతడు వెళ్లగానే






రమ్య "నీకేదో లైనేస్తున్నట్లున్నాడు. ఎప్పుడూ ఏదో కారణం కల్పించుకుని వస్తాడు" అంది.

"ప్స్... ఎంగేజ్డ్ అని తెలియదేమో" నవ్వింది స్మిత.

ఆరోజు స్మిత సెమినార్ పేపర్ చదివింది. రాగానే రమ్య ఆప్యాయంగా బుగ్గ గిల్లింది. "ఎప్పుడూ పిరికిదానిలా వుంటావు. నువ్వు ఇన్ని బుక్స్ రిఫర్‌చేసి, అంత పెద్ద గొంతుతో చదువుతావని నేననుకోలేదు" సంతోషంగా అంది. ఒకళ్లిద్దరు భాష బాగుందని చెప్తే, ఇంకొందరు మాటర్ బాగుంది అన్నారు. లెక్చరర్ హరనాథ్‌గారు "ఎనీ డిస్కషన్స్?" అన్నారు విద్యార్థుల నుద్దేశించి. ఇద్దరు ముగ్గురు లేచి ఏవో ప్రశ్నలు వేశారు. వాటికి స్మిత సమాధానం చెప్పింది. చివరికి జ్యోతి అనే విద్యార్థిని లేచి "అసలు ఏయే ఆర్టిస్టులు పోర్ట్రేట్స్ వేశారో చెప్పనేలేదు" అంది. వెనక నుండి రమేష్ "పోనీ తెలిస్తే మీరు చెప్పండి" అన్నాడు. హరనాథ్ అందుకుని "నిజమే... చెప్తే బాగుండేది, పోనీ ఆ టాపిక్ నువ్వు తీసుకో. వారంరోజుల్లో పేపర్ ప్రిపేర్ చెయ్యి" అన్నారు. స్మితని తక్కువ చేద్దామన్న ఆమె కోరిక నెరవేరలేదు.

ఇద్దరు లెక్చరర్లు రానందున మధ్యాహ్నం

క్లాసులు లేవనీ, అక్కడే వుండి వర్కు చేసుకోమనీ హరనాథ్ చెప్పి వెళ్లిపోయారు.

ఎవరికిష్టమయిన ప్రదేశంలో వాళ్లు కూర్చున్నారు. "ఏయ్ రమ్యా! కదలకు, నీ బొమ్మేస్తున్నా" అంది స్మిత. మధ్యలో నవ్వుతూ, ప్రతిగా నవ్వితే రమ్యమీద అరుస్తూ రమ్య ముఖకవళికలని దించే ప్రయత్నం చేస్తోంది.

అవతల ఎవరో రమేష్‌ని పాట పాడమని ఫోర్సు చేస్తున్నారు. రమేష్ మొదలుపెట్టాడు. "బహారో ఫూల్ బర్సావో మేరా మెహబూబ్ ఆయా హై..." అంటూ రఫీ పాట అందుకున్నాడు. స్మితకి ఆ పాట చాలా ఇష్టం. చెవులక్కడ పెట్టి, చేతులిక్కడ కేంద్రీకరించింది. రమేష్ గొంతు అంత కమనీయంగా వుండదు. మాట్లాడుతుంటే పర్లేదుగానీ, పాడుతుంటే స్మితకి నచ్చలేదు.

"ఎవరో ఈయనగారి మెహబూబ్" అంది గుసగుసగా.

రమ్య "కొంపతీసి నువ్వేనేమో" అంది.

"ప్చ్... ఈ పాట హుస్సేన్ పాడ్తే..."

"పాడతాడులే, తొందరెందుకు?"

బొమ్మ ముగించి "మ్యా మ్యా" అని రాసి రమ్య చేతిలో పెట్టింది. నిజంగా పోలికలొచ్చాయని రమ్య మెచ్చుకుంది.



ఉదయం ఆరవుతోంది. స్మిత ఇంకా లేవలేదు. శరత్ హడావిడిగా వచ్చి "అక్కా, అక్కా! సీ.యం.నెవరో కాల్చేశారట" అన్నాడు కంగారుగా, దుప్పటి తొలగిస్తూ.

"నీకు అంతవరకే తెలుసేమో, నాకు ఎవరు కాల్చారో కూడా తెలుసు" అంది స్మిత మళ్ళీ దుప్పటి లాక్కుంటూ.

"ప్రతిపక్షాలా?"

"అబ్బే, నా సోదరుడు శరత్తని ఒహడున్నాడులే. ఈరోజు ఏప్రిల్ ఫస్టని గుర్తుందిగానీ ఇంకెవరైనా అమాయకులు దొరుకుతారేమో చూసుకో" అంది స్మిత.

"ఛ, నిన్ను ఫూల్ని చేద్దామనుకున్నాను" నిట్టూర్చాడు శరత్.

"నేను ఇంగ్లీష్ ఫూల్ని కాను, హిందీఫూల్ని" అంటూ లేచి నవ్వింది.

మొహం కడుక్కుని, ఇల్లూడ్చి బాల్కనీలో నిలబడ్డది. హుస్సేన్ నీళ్ళకోసం బకెట్ పట్టుకుని గదిలోంచి వస్తున్నాడు. స్మిత అతని చేతిమీద ఏమిటి అన్నట్లు తన చేతిమీద వేలుపెట్టి చూపింది. మొదట అతనికి అర్థంకాలేదు. తర్వాత చేతివంక చూసుకున్నాడు. అంతే స్మిత 'ఫూల్' అంటూ నవ్వింది. అతనూ నిలబడిపోయి నవ్వాడు. అంతలోనే సీరియస్‌గా ముఖంపెట్టి వేగంగా కిందికెళ్లిపోయాడు. ఆమె ఆశ్చర్యపోతూ వెనక్కితిరిగింది. వెనక తల్లి ఆగ్రహరూపం.

స్మితకి కాళ్ళకింద భూమి కంపించిపోయినట్లు, తాను ఒక్కసారిగా వందమందిని చంపినట్లు అనిపించింది, ఆ క్షణంలో తల్లిని చూస్తే. దోషిలా పుస్తకాల అల్మర దగ్గరికెళ్లింది.

"ఇంటావంటా లేవే ఇలాంటి నీచపు బుద్ధులు. నువ్వసలు నా కడుపున ఎందుకు పుట్టావే శనిగ్రహంలా. ఛీ... మరీ ఇంతగా బరితెగించిపోయావా? ఇలా అవుతావని తెలిస్తే పుట్టిన్నాడే ఇంత విషమిచ్చి చంపేదాన్ని. మా పరువు గంగలో కలపకపోతే ఏ నుయ్యో, గొయ్యో చూసుకోరాదు. నీకంటే పెద్దది, ఎంత బుద్ధిగా బతుకుతోంది" ఇలా స్మిత కాలేజ్‌కి బయల్దేరే వరకూ శాపనార్థాలు పెడ్తూనేవుంది.

ఆమెకి ఆపూట భోజనం చేయాలన్పించలేదు. కానీ తినకపోతే తండ్రి మరీ తిట్టిన సందర్భాలున్నాయి. అందుకే మొక్కుబడిగా నాలుగు మెతుకులు నంజి ఇంట్లోంచి బయట పడ్డది. హుస్సేన్ తల్లి చూపుని అవమానంగా భావించి రాడని తెలిసినా కిందికిదిగి పిట్టగోడ వైపు ఆశగా చూసింది. అతను లేడు. ఆమెకి

మనసు మనసులో లేదు. గుండెని ఎవరో పిండి చేస్తున్నట్లుంది. తల్లి మాట్లాడిన అవమానకరాలయిన మాటలు ఇంకా వినిపిస్తున్నాయి. అవి ఈటెల్లా గుచ్చుకుంటున్నాయి.

ఆరోజు కాలేజీలో చాలామంది ఆమెని ఫూల్ని చేయబోయారు. కానీ దేనికీ ఆమె ప్రతిస్పందించలేదు. రమేష్ రెండు మూడు సార్లు వచ్చి పలకరించినా విననట్లు వుండిపోయింది. రమ్య ఏదో గొడవ జరిగివుంటుందని వూహించింది. చివరికి ఆ సాయంత్రం రమ్య బలవంతంమీద ఇద్దరూ బిర్లామందిరానికి వెళ్లారు. అక్కడ ఉదయం జరిగిందంతా చెప్పింది స్మిత.

"రమ్యా! నేను చేసింది నిజంగా అంత ఘోరమా?"

రమ్య ఏమీ అనలేదు. మౌనంగా ఆలోచిస్తోంది.

"చెప్పు రమ్యా! నువ్వు నాతో తమాషాలు చేయవా? నేను హుస్సేన్ని కూడా నీలాగే చూస్తున్నాను. ఆ మాత్రానికి నేనేదో పెద్ద కానిపని చేసినట్లు..."

"స్మితా! మనముంటోంది అమెరికాలో కాదు, భారతదేశంలో. మన సంప్రదాయాలు అలాంటివి. పెళ్ళయ్యాక భర్తతో తప్ప ఒక ఆడపిల్ల మగవాడితో అలా వుంటే ఏ తల్లయినా సహించదు. ఆంటీని కూడా అర్థం చేసుకోడానికి ప్రయత్నించు. ఆమె స్థానంలో వున్న ఏ తల్లయినా అలాగే ప్రవర్తిస్తుంది" అంది రమ్య.

"నేను అందర్నీ అర్థం చేసుకోడానికీ ప్రయత్నిస్తాను. కానీ నన్నర్థం చేసుకునేవాళ్ళే లేరు. ఈ ఒక్క విషయంలో తప్ప అమ్మ మనసుని నేనెప్పుడూ కష్టపెట్టలేదు. హుస్సేన్ విషయంలో మాత్రం నా మనసు నా స్వాధీనం తప్పింది. అతన్ని మర్చిపోవాలన్నా అది నా చేతిలో లేదు. పైగా నేనేమన్నా చాటుమాటుగా అతన్ని కలుస్తున్నానా? కేవలం అతన్ని చూట్టం, అడపాదడపా రెండు మాటలు మాట్లాడ్డం. నా మనస్థితిని అమ్మకి వివరించి చెప్పాను. అతన్ని తప్ప వేరేవాళ్ళని చేసుకోనని చెప్పాను. అమ్మ మాత్రం నన్నెందుకర్థం చేసుకోదు?" అంది స్మిత.

"అతన్ని చేసుకుంటే నువ్వు సుఖపడవని భావిస్తోందేమో. పిల్లలు ఏ ఐస్క్రీమో కావాలంటే కొనిపెడ్తారు గానీ, ఆరోగ్యం చెడగొట్టే బ్రౌన్‌మగర్ కావాలంటే కొనిస్తారా?" అంది రమ్య.

"హుస్సేన్ని బ్రౌన్‌మగర్తో పోల్చడం బాలేదు"

"నువ్వు అతన్నే చేసుకుంటానని మొండికేశావు. సరే, సమయం వచ్చినప్పుడు అతన్నే చేసుకుందుగానీ, అందాకా నిన్ను నువ్వు కంట్రోల్ చేసుకో. ఇంట్లో మాటికీ తిట్లుతినే పరిస్థితి తెచ్చుకోకు. మన చదువు కూడా ఇదే ఫైనలియర్, కాస్త మంచి రిజల్టు సంపాదించావంటే ఏదో ఒక ఉద్యోగమొస్తుంది. అప్పుడు పెళ్ళి సంగతి ఆలోచించచ్చు" అంది రమ్య.

స్మితకి ఆ మాటలు వినేసరికి మనసు కాస్త కుదుటపడ్డది. శాశ్వతంగా హుస్సేన్ని దక్కించుకోవాలంటే, ఆమాత్రం నిగ్రహంగా వుండకతప్పదు అనుకుంది.

స్మితని చూస్తూనే బోర్నవిటా కలిపిన మగ్గు ఆమె మంచం పక్కన టేబుల్‌మీద పెట్టింది సంధ్య. ఉదయం కోపంలో భోజనం సరిగా చేయకపోయినా కూతుర్ని బలవంతం చేయలేదు. ఆమె అలిగినప్పుడు బయట ఏమీ తినదని తెలిసిన మాతృ హృదయం పట్టించుకోకుండా వుండలేకపోయింది.

స్మితకి తల్లిమీద వచ్చిన కోపమంతా ఆవిరైపోయింది. 'నిజమే అమ్మేం రాక్షసికాదు, తన మంచికోసమే ఆమె తపిస్తోంది. ఎక్కడ హుస్సేన్ని చేసుకుంటానోనని వేయికళ్లతో కాపాడుతోంది. కానీ నా మనసు అర్థం చేసుకోదేం' అనుకుంది. పాలు తాగాక ఆమె నీరసం కాస్త తగ్గింది.

స్కెచ్ బుక్‌తీసి బొమ్మలేస్తూ కూర్చుంది. తొమ్మిదిన్నరకి లేచి భోజనం చేసి, చదువుతూ పడుకుంది. రేడియోలో ఛాయాగీత్ పాటలొస్తున్నాయి. అంతలో రాజారాం వచ్చి-

"ఇక పడుకో స్మితా! పెందలాడే పడుకుని, పెందలాడే లేవమని నీకెన్నిసార్లు చెప్పాను. ప్రొద్దున అన్నం సరిగా తినకుండా వెళ్ళావట. నీ ఆరోగ్యం పాడుచేసుకుంటే ఎవరికి నష్టం? అమ్మా నాన్నలమీద కోపమొస్తే మధ్య అన్నమేం చేసింది" అన్నాడు. స్మిత మౌనంగా

లైటార్పి పడుకుంది. హుస్సేన్ని చూడాల న్పించినా మనసు నిగ్రహించుకుంది.

స్మిత రమ్య కోసం చూస్తూ కూర్చునివుంది. అంతలో హరనాథ్ స్కూటర్ పార్క్‌చేస్తూ కన్పించాడు. ఆమె గబగబా లేచి వెళ్లి ''సార్! నాకు మీ పెయింటింగ్స్ చూడాలనుంది'' అంది.

హరనాథ్ పెద్దగా నవ్వి ''సరే, ఇంటికిరా చూద్దుగాని'' అన్నారు.

స్మిత ఆయనిచ్చిన విజిటింగ్‌కార్డు తీసుకుని కృతజ్ఞతలు తెలిపి, సంతోషంగా వెనక్కి వచ్చింది.

అప్పుడే రమ్య వస్తోంది.

''రమ్యా! రేపు ఆదివారం వేరే ప్రోగ్రామేం పెట్టుకోకు. హరనాథ్ సారింటికి వెళ్దాం'' అంటూ చెప్పింది స్మిత.

రెండు పిరియడ్‌లు అయ్యాక శైలజ రమ్యని అవతలికి తీసుకెళ్ళింది. తిరిగి వచ్చిన రమ్య ముఖం కళావిహీనంగా వుంది. అది విన్న స్మిత ముఖం కూడా పాలిపోయింది. స్మిత వెంటనే లేచి ప్రతి డెస్కూ చూసొచ్చింది. అయిదారు బెంచీలమీద ''స్మిత, రమేష్'', ''రమేష్, స్మిత'' అంటూ మందంగా పెన్నుతో రాసివున్నాయి.

''రానియ్యి చెప్తాను, ఒళ్ళు కొవ్వెక్కినట్లుంది'' అంది స్మిత.

రమ్యకి కూడా కంపరంగా వుంది. అతని పద్ధతిని ఆమె ముందే ఊహించింది. స్మిత మాత్రం అతనొచ్చి మాట్లాడుతుంటే తిరస్కరించలేకపోయింది. దాన్ని రమేష్ అలుసుగా తీసుకుని ఇలా పదిమంది దృష్టిలో పడేట్లు పేర్లు రాయడం సహించలేకపోయింది. చూసినవాళ్ళంతా ఏమనుకుంటారోననే భావం ఆమెని ఎవరి ముఖంలోకీ చూడకుండా చేసింది.

''స్మితా! నేను మొదట్నుండీ చెప్తూనే వున్నాను అతనికి నీపట్ల ఆకర్షణ వుందని. అతన్ని ఇంతవరకూ రాకుండా మొదటే కత్తిరించాల్సింది'' అంది రమ్య.

''రమ్యా! హుస్సేన్ విషయంలో నువ్వేమన్నా పర్లేదు. ఎందుకంటే అక్కడ నా చెయ్యి కూడా వుంది. కానీ ఈ రమేష్ విషయంలో మాత్రం నా తప్పేం లేదు. ఆ అబ్బాయి అడిగినవాటికి సమాధానాలు చెప్పడం తప్ప, ఎప్పుడూ నేను చనువివ్వలేదు. ఆఖరికి నా నోట్సులు కూడా.అతనెన్నిసార్లు అడిగినా ఇవ్వలేదు. అడిగిందానికి సమాధానం చెప్పకపోతే కూడా పొగరుబోతంటారుకదా'' అంది స్మిత.

''పిచ్చిదానా! నీకు ఆలోచనకంటే ఆవేశమెక్కువ. ఇప్పుడు నువ్వేదో తప్పు చేశావని నేనన్నానా? అలా మాట్లాడేపాటి చనువు కూడా ఇవ్వకుండా సీరియస్‌గా వుండాల్సింది అంటున్నా...''

''అలా వుంటుందనేగా నీమకి 'మహర్షి దుర్వాస' అని పేరెట్టారు. అయినా మాటలనవసరం, కనిపించనీ చెప్తా, మళ్ళీ రేపు కాలేజ్‌కెలా వస్తాడో చూస్తాను. అసలు ప్రిన్సిపాల్‌కి కంప్లెయింట్ చేస్తేసరి'' అంది స్మిత చాలా కోపంగా.

రోజూ ఏదో వంకతో ఆమె దగ్గరికొచ్చి మాట్లాడే రమేష్ ఆరోజు రాలేదు. అసలు కాలేజ్ కొచ్చాడో లేదో తెలియలేదు. మాటికీ మగపిల్లలవైపు చూడాలంటే ఆమెకి బెరుగ్గా వుంది. ఎవర్నీ అడగాలన్పించలేదు. పోనీ తర్వాతి పిరియడ్ అటెండెన్సు తీసుకుంటున్నప్పుడు వినాలనుకుంది. కానీ ఆ ఆలోచనకి ఆమెకే నవ్వొచ్చింది. ఆడపిల్లలు కాస్త భయపడ్తారు కానీ మగపిల్లలు రాని వాళ్ళక్కూడా మిత్ర బృందంలో ఎవరో ఒకరు అటెండెన్సు పలికేస్తుంటారు. సర్లే ఇవాళ కాకపోతే రేపైనా కనిపించక ఎక్కడపోతాడు అనుకుంది.

ఆరోజు కాలేజ్ అయిపోయాక రమ్య, స్మిత మెల్లగా నడుస్తున్నారు. వెనకనుండి రమేష్ వచ్చి ''హలో! ఈ రోజయినా నోట్సు తెచ్చారా?'' అన్నాడు.

అక్కడివాళ్ళంతా వెళ్లిపోవడం చూసి ''బెంచెస్‌మీద నా పేరెందుకు రాశారు? మీరు ఇలాంటివాళ్లని తెలిస్తే అసలు మీతో మాట్లాడేదాన్నే కాను. చూసినవాళ్ళేం అనుకుంటారు? దయచేసి ఇంకెప్పుడూ ఇలా చేయొద్దు. అసలు ప్రిన్సిపాల్‌కి చెబుదామనుకున్నాను, ఎందుకులే చదువు పాడుచేసినట్లవుతుందని వూరుకున్నాను'' స్మిత ఆవేశంగా, వేగంగా మాట్లాడుతుంటే రమ్య ఆశ్చర్యంగా చూసింది.




రమేష్ ముఖం పాలిపోయింది.

"సారీ... అయాం ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ..." అని జేబులోంచి ఒక మడిచిన కాగితంతీసి స్మితకి అందించి, వెనక్కి చూడకుండా వెళ్లిపోయాడు.

స్మిత అక్కడే నిలబడి ఆ కాగితం చదివింది. రమ్యకి అందించి చదవమంది. "ప్రేమలేఖా? నేచదవను" అంది.

"ఇందులో వున్న మలినమంతా నిన్నంటుకోదులే. తమాషాగా వుంది చదువు" అంది నవ్వుతూ.

"అలాకాదు, నీ ఉత్తరం నేచదవడమేంటి?" అంది.

"నువ్వూ నేనూ వేరనుకుంటున్నావా, నోర్మూసుకుని చదువు" అనేసరికి రమ్య అందుకుని గడ్డిలో కూర్చుంది.

"ప్రియమయిన స్మితకి,

నాకు మీరంటే చాలా ఇష్టం. ఒక్కరోజు మీరు రాకపోతే నాకు తోచదు. ఆరోజు కాలేజ్‌లోనే వుండాలన్పించదు. ఈ లోకంలో ఎవరు లేకపోయినా వుండగలనేమోగానీ, మీరు లేకుండా మాత్రం వుండలేను.

చాలాసార్లు మీకీ విషయం చెప్పాలని చూశాను. కానీ మీరెప్పుడూ రమ్యగారితో వుంటారు. ఆమెముందు ఎలా చెప్పాలో, మిమ్మల్ని అవతలికి రమ్మంటే వస్తారో లేదో, అందుకు రమ్యగారు నొచ్చుకుంటారోనని అలా చేయలేకపోయాను. మొన్న ఏప్రిల్ ఫస్టున మీరు నన్ను చాలా బాధపెట్టారు. మీకు నాతో మాట్లాడాలనే శ్రద్ధ వుండకపోవచ్చు. కానీ మీకోసం ఆరాటపడే రమేష్ ఒకడున్నాడని మాత్రం మర్చిపోవద్దు.

మనం కలిసి చదవడం ఇదే చివరి సంవత్సరం. ఇంకా రెండునెలలు మాత్రమే వుంది. ఈ రెండు నెలలూ నేను ఒక్కరోజు కూడా కాలేజీ మానను. మీరూ అలాగే చేయండి.

ధైర్యంచేసి అడుగుతున్నాను, నేనంటే మీకెలాంటి అభిప్రాయముంది? నాకు మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుంది.

రమేష్

"రమ్యా! నాకు నిజంగా జాలిగా వుందే. మరో ప్రేమ పీడితుడు పాపం. యౌవనంలో ఎనభైశాతం ఈ జబ్బుకి బలికాక తప్పదేమో" అంది స్మిత. ఆ ఉత్తరం అక్కడే చింపిపడేసింది. మళ్ళీ ఇంట్లో చూస్తే అదో జాతర, ఎందుకని.

ఆరోజు నిద్రపట్టేవరకూ రమేష్ గురించే ఆలోచిస్తూ పడుకుంది. హుస్సేన్‌కున్న తెలివితేటలు రమేష్‌కి లేవు. రమేష్ వుత్త అమాయకుడు- అనుకుంది.

★ ★ ★

బంద్ కారణంగా ఆరోజు కాలేజ్ లేదని అంతకుముందురోజే డిక్లేర్ చేశారు. బస్సులు కూడా లేవు. స్మితకి ఏ ఫ్రెండు దగ్గరికయినా వెళ్దామని వుంది. కానీ అందుకు కాళ్ళు పట్టుకు బ్రతిమాలినంత పనిచేయాలి. ఈమధ్య తను ఎక్కడికెళ్లినా హుస్సేన్ని కలవడానికేనని తల్లి అనుమానం. అందుకే అలాంటి ఆలోచనలు మానుకుని స్నానం, భోజనం ముగించి డ్రాయింగ్ వేసుకుంటూ కూర్చుంది.

పదకొండవుతుండగా హారతి వచ్చింది.

స్మితకున్న స్నేహితులందరిలో హారతి అంటే ఇంట్లో అందరికీ ప్రత్యేకమయిన అభిమానం. అందుక్కారణం ఆమె పెళ్లయిపోయి సంసారం చేసుకుంటూ పెద్దరికంగా వుండడమే. ఆమె భర్త కూడా స్మిత ఇంటికి వస్తుంటాడు.

"ఏం ఆర్టిస్టుగారూ బాగున్నారా?" అంది హారతి.

"అరే నువ్వా దారితప్పి వచ్చినట్లున్నావు?"

"అవునుగానీ ముందులేచి తయారవ్వు" అంది హారతి.

"ఎక్కడికి?"

"ఇంకెక్కడికి, ఇంటికే. అమ్మనడిగాలే, లే త్వరగా"

స్మిత స్కెచ్‌బుక్ అల్మర్లో పెట్టేసింది. లేచి అయిదునిమిషాల్లో డ్రెస్ మార్చుకుంది. ఇద్దరూ బయల్దేరారు.

దార్లో ఆటోలో చెప్పింది హారతి, తాను వచ్చి అరగంట అయ్యిందనీ, ముందు గదిలో అమ్మతో కూర్చున్నాననీ, అమ్మ హుస్సేన్ సంగతి చెప్పి కాస్త తన మనసు మార్చమని చెప్పిందని. ముందుగదిలో ఇంత జరిగితే తనకి ఒక్క విషయం కూడా వినబడనందుకు,



తను మరీ అంత బొమ్మల్లో లీనమైనందుకు స్మిత ఆశ్చర్యపోయింది. కాచిగూడ రానేవచ్చింది. ఇద్దరూ ఆటో దిగారు.

"అయితే ఇప్పుడు నాకు బ్రెయిన్ వాష్ చేయమని పంపిందా?"

"ఊఁ... సర్ఫ్ పాకెట్ తీసుకోనా మరి?" నవ్వింది హారతి.

"ఉత్తగా సర్ఫులో నానబెడ్తే చాలదు. రెండు మూడు రిన్‌సోపులు కూడా తీసుకో" అంది స్మిత.

ఇల్లు తాళం తీస్తుంటే ఆశ్చర్యంగా "పిల్లలు, అన్నయ్య లేరా?" అంది స్మిత.

"ఉహూ... ముగ్గురూ ఊరెళ్లారు. అందుకే నిన్ను తెచ్చాను. హాయిగా మాట్లాడుకోవచ్చని"

స్మిత మౌనంగా కాసెట్ల దగ్గరికెళ్ళి చూస్తోంది.

"స్మితా! నువ్వా అబ్బాయిని చేసుకుంటే నాకేం అభ్యంతరంలేదు. కానీ ఆలులేదు, చూలులేదు, కొడుకు పేరు సోమలింగం అన్నట్లు, అప్పుడే ఆ అబ్బాయి గురించి చెప్పాల్సిన అవసరమేమొచ్చింది?"

"నేనేం పబ్లిసిటీ ఇవ్వలేదు. ఓరోజు అత్తయ్య ఈమధ్య దిగులుగా వుంటున్నావు కారణం ఏంటి అని అడిగింది. మొదట నేను చెప్పలేదు. చివరికి చెప్పక తప్పలేదు. పైగా అక్కకి గ్రాస్పింగ్ పవర్ ఎక్కువకదా, దాంతో "ఆ అబ్బాయి ఎవరో కాదు ఎదురింటతనే అని ఇంట్లో చెప్పేసింది"

"అయినా మాంసం తిన్నంతలో ఎముకలు మెళ్ళో వేసుకోవాలా? నువ్వెప్పుడూ బాల్కనీలో నిలబడ్తున్నావంట"

"నువ్వు కొన్నాళ్ళు మా ఇంట్లో వుండిచూడు. పగలంతా ఇంట్లో వుండనే వుండను. ఉదయం, సాయంత్రం ఒకసారి ఆ అబ్బాయిని చూసినంతలో వీళ్ళ సొమ్మేం పోతుంది? రోడ్డుమీద అడ్డమయిన వెధవలూ చూస్తే లేదుగానీ, హుస్సేన్ నన్ను చూడకూడదా?"

"ప్చ్... స్మితా కోపం తెచ్చుకోకు, శాంతంగా ఆలోచించు. మన వయసువాళ్లకది దోషంలా కనిపించకపోవచ్చు. కానీ ఎన్నో అనుభవాలు చవిచూసిన పెద్దవాళ్లకి ఇలాంటివి ఆందోళన కలిగిస్తాయి. నువ్వు అతనితో వెళ్లిపోతే ఇంటి పరువు కాస్తా గంగంలో కలుస్తుందని వాళ్ళ బెంగ"

"అలాంటి వెధవపనులు చేసేవాళ్ళు ఇలా కనిపించరు

నిజం హారతీ! నేనలాంటిదాన్ని కాను. అతను రమ్మన్నంతలో అతనివెంట ఎక్కడికయినా వెళ్ళానా? నిజానికి నాకసలు హుస్సేన్ని పెళ్ళి చేసుకోవడం కూడా ముఖ్యం కాదు"

"ఇది మరీబావుంది, అంటే నీ వుద్దేశం..."

స్మిత ఒక్క నిమిషం తటపటాయించి "హారతీ! నేను అతని ఫిజికల్ టచ్ కోరుకోవడం లేదు. నువ్వు పుస్తకాలు చదవ్వు, నీకెలా చెప్పాలో అర్థంకావడం లేదు. దీన్నే 'అమలిన శృంగారం' అంటారు. నాది ఆ తరహా ప్రేమ. అతన్ని చూస్తూ కాలక్షేపం చేయాలి అంతే..."

"ఏడ్చినట్లుంది. ఎన్నాళ్ళలా చూస్తూ నిలబడ్తావు. లోకం వూరుకుంటుందా?"

"అవును... తెల్సు. ఆ లోకం కోసమే... ఒక అమ్మాయి, ఒక అబ్బాయిని ఎప్పుడూ చూస్తుంటే వూరుకోదు కాబట్టే నేనతన్ని పెళ్ళిచేసుకోవాలనుకున్నాను"

"ఇంతకీ అతనేమంటాడు?"

"రెండు మూడుసార్లు మాట్లాడాలి, కాలేజ్ మానేయమన్నాడు. కానీ నేను వెళ్ళలేదు. అసలు మీ వుద్దేశమేంటి? నా గురించి మీరేం అనుకుంటున్నారు అంటాడు.

అది తగిన సమయం కాదనిపించింది"

"ఏమో స్మితా! ఇన్నాళ్ళూ నువ్వో మంచి ఆర్టిస్టువౌతావని సంబరపడ్డాను. కానీ ఇప్పుడు భయంగా వుంది. నీ జీవితం ఏం కానుందో! నీకు ముందే తెలివి లేదు, త్వరపడి నిర్ణయాలు తీసుకుంటావు"

"హారతీ! నీకు చెప్పకుండా అయితే పెళ్ళి చేసుకోను, నిశ్చింతగా వుండు. ఇక ఆ గోల ఆపేసి మంచి కబుర్లేమయినా చెప్పు. ప్లీజ్ ఈ టెన్షన్ రోజూ వుండేదేగా" అంది.

"ముందు మిర్చి బజ్జీలు చేసుకుందాం, తర్వాత కబుర్లు. ఇంతకీ ఏ కాసెట్ పెట్టమంటావు, రఫీదేనా?" అని నవ్వుతూ లేచింది హారతి.

★ ★ ★

ఆదివారంనాడు రమ్య స్మిత ఇంటికొచ్చింది. తనని ఒక్కదాన్నీ పంపరని ముందురోజు రమ్యనే రమ్మని చెప్పింది. రమ్య భోజనం ఇంటిదగ్గరే చేసొచ్చానని చెప్పింది. స్మిత తాను అన్నం తిని రమ్యకి టీ తెచ్చి ఇచ్చింది.

''అమ్మా! మేమిద్దరం మా లెక్చరర్ ఇంటికెళ్తున్నాం'' అంది స్మిత.

''ఎందుకు? రోజూ కాలేజ్‌లో కలుస్తారుగా'' అంది సంధ్య.

''ఆయన పెయింటింగ్స్ గురించి అందరూ విశేషంగా చెప్పుకుంటారు, మేమూ చూడాలని...'' ''అదే చెప్తే ఆయన ఇంటికి రమ్మన్నారాంటీ'' అంది రమ్య తానే కల్పించుకుని.

''సరేనమ్మా. అలా అయితే వెళ్ళొద్దని ఎందుకంటాను? త్వరగా వచ్చేస్తారుగా?'' అంది సంధ్య.

''కాస్త లేటౌతుందాంటీ. ఆయన మౌలాలిలో వుంటారు. మేము బస్సులందీ వెళ్ళొచ్చేసరికి కనీసం మూడౌతుందేమో'' అంది రమ్య.

''సరే వెళ్ళండి'' అంది సంధ్య అనాసక్తంగా.

విజిటింగ్ కార్డులోవున్న అడ్రసుతో వెతుక్కుంటూ చాలా కష్టపడి ఇల్లు పట్టుకున్నారు. ఇల్లు దొరికేసరికి ఇద్దరికీ సంతోషమేసింది.

ఇద్దరూ గేటు సమీపించారు. రెండు కుక్కలు పెద్దపెట్టున మొరుగుతున్నాయి. స్మిత భయపడి, వెనకడుగు వేసింది. ''ఏయ్ పిచ్చీ! అవి కట్టేసే వున్నాయి చూడు'' అని చూపింది రమ్య.

''అమ్మో, లేకపోతే గేటుదూకిమరీ మన కండలు పీకేవి'' అంది స్మిత.

''కోన్ హై జీ'' అంది ఓ నలభయ్యేళ్ళ కంఠం.

''హమ్ కో హరనాథ్ సాబ్ చాహియే'' తప్పో ఒప్పో అనుకుంటూ చెప్పింది స్మిత.

''ఊపర్... ఊపర్ చలో'' అందామె మెట్ల వంక చూపిస్తూ.

''ఆవిడ వుందన్న ధైర్యంతో ఇద్దరూ గేటు తెరుచుకుని మెట్లెక్కారు. చివరి మెట్టు దగ్గర తలుపు బిగించి వుంది. అక్కడే కాలింగ్‌బెల్ వుంది. రమ్య బెల్ నొక్కింది. పదిహేను, పదహారేళ్ళ అమ్మాయి తలుపు తీసింది. ''సారున్నారా?'' అడిగింది రమ్య.

''వున్నారు, లోపలికి రండి'' అని హాల్లోకి తీసికెళ్ళింది.

ఇద్దరూ చెప్పులు విడిచి, పక్కనే వున్న సోఫాలో కూర్చున్నారు. ఆ అమ్మాయి ఫాన్ ఆన్ చేసి ''మంచినీళ్ళు కావాలా?'' అని అడిగింది.

''ఆ... కొన్ని...'' అంది స్మిత.

ఆమె చల్లటి నీళ్ళు రెండు గ్లాసుల్లో తెచ్చిచ్చింది. నీళ్ళు తాగేసరికి వాళ్ళ ప్రయాణపు బడలికంతా తీరి, హాయిగా అన్పించింది. ఇక ఇద్దరూ ఇంటిని పరికిస్తూ కూర్చున్నారు.

హాలు చాలా విశాలంగా వుంది. ఎదురూ బొదురుగా మొత్తం నాలుగు సోఫాలున్నాయి. ఆ సోఫాలు గొప్ప పనితనంతో మా విలువ ఎంతో తెలుసా అన్నట్టు దర్జాగా, దర్పంగా వున్నాయి. కార్పెట్ ముగ్ధమోహనమయిన రంగురంగుల పూలతో 'అయ్యో ఇంత చక్కటి కార్పెట్‌మీద కాలేసి నడవాలా?' అన్పించేంత బాగుంది. గోడలకున్న రంగులు కూడా సామాన్యుల ఇళ్ళలాగాక ఆర్టిస్టు టేస్టుని తెలిపేట్లున్నాయి. గోడలకి తగిలించివున్న పెయింటింగులు గొప్ప కళానైపుణ్యంతో హృదయాన్ని కదిలించేట్లున్నాయి. ఇద్దరూ వాటిని కన్నార్పకుండా చూస్తూ 'అబ్బ... ఎంత బాగున్నాయి' అనుకున్నారు.

''ఏమ్మా?! ఇల్లు తేలిగ్గా దొరికిందా?'' అన్నాడు హరనాథ్.

''కాస్త కష్టంమీదే దొరికిందండీ'' అంది స్మిత.

''అసలు నేను గుర్తులు చెప్తే బాగుండేది, పోన్లే వచ్చేశారుగా''

''సర్! ఆ పెయింటింగ్స్ మీవేనా?''

''ఏం, సందేహమా?'' అంటూ నవ్వాడు హరనాథ్.

''అద్భుతంగా వున్నాయండి'' ఇద్దరూ ఒకేసారి అన్నారు.

''చిన్నతనంకదా, మీకలానే కన్పిస్తాయి''

''మీ ఇల్లు బాగుంది సార్'' అంది రమ్య.

''అంతా చూడకుండానే? పదండి చూద్దురుగాని'' అంటూ ఇల్లంతా చూపించాడాయన. చివరికి ''ఇది నా వర్కింగ్ రూం'' అంటూ

తీసికెళ్ళాడు. ఆ గది చూస్తే రమ్య, స్మితలిద్దరికీ కళ్ళు తిరిగినట్లే అనిపించింది. అందులో వందలకొద్దీ పెయింటింగులున్నాయి. కుప్పలుకుప్పలుగా స్లాబ్ మీద పెట్టున్నాయి. కింద కూడా గోడలకానించి అసంఖ్యాకంగా వున్నాయి. స్టాండుమీద అసంపూర్ణంగా వున్న కాన్వాస్ అమర్చి వుంది. అదొక లాండ్‌స్కేప్.

"సర్! ఆ కిందున్న పెయింటింగ్సన్నీ మేం చూడచ్చా?" అడిగింది స్మిత.

"చూట్టానికేగా, ఇంతదూరం కష్టపడి వచ్చారు. కిందవే కాదు, అటకెక్కి అవి కూడా చూసినా నాకేం అభ్యంతరం లేదు. కాకపోతే ఎలుకలు, బల్లులు ఏమైనా వుండచ్చు పైన" అన్నాడాయన.

ఆయన మాటలకి నవ్వుతూ రమ్య, స్మిత ఇద్దరూ ఒక్కో పెయింటింగూ చూట్టం మొదలెట్టారు. స్మితకి దేన్ని పట్టుకున్నా దాన్ని తీసి పక్కన పెట్టాలన్పించడం లేదు. ఒక్కోటి ఒక్కో కళాఖండంలా వుంది. వాటి గొప్పతనాన్ని ఎవరూ వర్ణించలేరు, చూసి తరించాలే తప్ప. తీపి ఎలా వుంటుందో తెలిసినవారికి తీయగా వుందని చెప్తే అర్థంచేసుకుంటారు. కానీ తీపి రుచి ఎన్నడూ చూడనివారికి ఎన్నిరకాలుగా వర్ణించినా వారికి అర్థమవుతుందా? తాదాత్మ్యం చెందగలుగుతారా? హరనాథ్ పెయింటింగ్స్ కూడా భాషకి అందని భావచిత్రాలు.

"సర్! మీరు రోజూ వర్క్ చేస్తారా?"

"దాదాపు. ఎప్పుడైనా కుదరకపోవచ్చు"

"మీకు ఇన్‌స్పిరేషన్ ఎలా వస్తుందండీ?"

"ఇన్‌స్పిరేషన్ అనేది గాల్లో వుండదు, అమాంతంగా రావడానికి. మంచి బుక్స్ చదువుతుంటే, మంచి పెయింటింగ్స్ చూస్తుంటే, ప్రకృతిని చూస్తుంటే, మిత్రుల్తో మాట్లాడుతుంటే, విస్కీ తాగుతుంటే... ఎప్పుడైనా కలగచ్చు. చాలామంది అది అమావాస్యకీ, పౌర్ణానికీ వస్తుందన్నట్లు మాట్లాడుతుంటారు"

రమ్యకంటే స్మితే ఎక్కువ పులకించిపోతోంది. ఆమెకి హరనాథ్ మాటలు చెవుల్లో అమృతం పోస్తున్నట్లు మధురంగా వున్నాయి. రమ్య ఒకపక్కగా పుస్తకాల షెల్ఫులదగ్గరికెళ్ళింది. రెండు రాక్స్ నిండా ఆర్టుకి సంబంధించిన పుస్తకాలున్నాయి. సామాన్యంగా ఆర్టు పుస్తకాలు చాలా ఖరీదుంటాయి. ఎన్ని వందలు అంటూ ఎంచుకోవాలే తప్ప ఎన్ని రూపాయిలు అంటే నవ్వుతారు. అంటే హరనాథ్‌గారి పుస్తకాలే కొన్ని వేల ఖరీదు చేస్తాయన్నమాట. స్మితకూడా పుస్తకాల దగ్గరికెళ్ళింది. ఒక పుస్తకందగ్గర ఆమె కళ్ళు నిలిచిపోయాయి. దాన్ని బయటికి తీసింది.

హరనాథ్ నవ్వుతూ "ఎం.ఎఫ్.హుస్సేన్... పరోక్షంగా ఆయనే నా గురువు. ఎంత కష్టపడి పైకొచ్చాడో తెలుసా" అన్నాడు.

"నాక్కూడా హుస్సేనంటే చాలా ఇష్టం సార్. ఆయన కవిత్వం కూడా రాస్తారు కదండీ. ఓసారి ఇల్లస్ట్రేటెడ్ వీక్లీలో చదివాను" అంది స్మిత పరవశంగా.

"అవునవును... ఇది హుస్సేన్ బయోగ్రఫీ, కావాలంటే తీసికెళ్ళి చదివి, మళ్ళీ జాగ్రత్తగా తెచ్చియ్యండి" అన్నాడు హరనాథ్.

"థాంక్యూ సర్... థాంక్యూ సోమచ్" అంది స్మిత. నిజానికి తానే ఆ పుస్తకాన్ని అడగాలనుకుంది కానీ ఆయన గురువు, అందులో అవి ఖరీదయిన పుస్తకాలు అనే భయంతో మొహమాటపడింది.

"చిత్రా! కాఫీ తీసుకురా" అంటూ పిలిచాడు హరనాథ్.

వీళ్ళకి తలుపు తీసిన అమ్మాయే కాఫీలు తెచ్చింది. ముగ్గురూ తాగారు.

"సర్! మీ ఇల్లు నిజంగా భూతలస్వర్గంలా వుంది" అంది స్మిత.

భూతలస్వర్గమా, భూతాలస్వర్గమా?" నవ్వాడు హరనాథ్.

రమ్య, స్మిత కూడా నవ్వుతూ వెళ్తామంటూ లేచారు.

"మళ్ళీ రావచ్చా సర్ మీ ఇంటికి?" అంది స్మిత చెప్పులేసుకుంటూ.

"అదేం పిచ్చిప్రశ్న? యూ ఆర్ ఆల్వేస్ వెల్కం" అన్నాడాయన.

"రమ్యా! నిజానికి ఆ ఇల్లు విడిచి రావాలన్పించలేదు" అంది స్మిత బస్‌స్టాపులో.

"వుండకపోయావా, పెంచుకునేవాళ్ళు"

"రమ్యా! హరనాథ్‌గారు ఎవర్నీ ప్రేమించి వుండరు" అంది స్మిత.






రమ్య చిత్రంగా చూసి "నీ బుర్ర సరిగా పనిచేస్తున్నట్లు లేదు, హరనాథ్‌గారి ప్రేమగోల నీకెందుకు?" అంది.

"ఏం లేదు, ప్రేమలోపడితే ఇంత సాధించే వాళ్ళు కాదు"

"ప్రేమలో పడ్డా, నీలా ముస్లింని ప్రేమించి వుండరు".

"ఏయ్" అని వీపుమీద కొట్టి "ఈ రమ్ము సీసా ఎవరికి నచ్చుతుందో చూద్దాంలే" అంది స్మిత.

"ఛఛ... నా పేరుని ఖూనీ చేయకు" అంది రమ్య.

"రమ్యా! మన కోర్సు అయిపోతోందంటే నాకు చాలా దిగులుగా వుంది"

కోర్సు అయిపోయినంతలో మనం కలుసు కోమా, నువ్వే దుబాయో వెళ్తే తప్ప" అంది రమ్య.

నీకన్నీ వ్యంగ్యాలే. వెళ్తే నీకో చీర తెస్తాలే బాధపడకు"

"నీ బోడి చీరలెవరిక్కావాలి? నువ్వు కావాలి కానీ"

"రమ్యా! తర్వాత మనం కల్సుకోడం ఎలా?"

"అదేం పెద్ద సమస్యకాదు, నిన్ను పంపక

పోతే, నేనే ఒస్తానుగానీ వూరికే ఆలోచించి బుర్ర పాడుచేసుకోకు''

బస్సు అంది, ఇంటికొచ్చేసరికి రెండున్నర యింది. సంధ్య అప్పటికే పూరీలు చేస్తోంది. శిరీష రమ్య, స్మితలకి ప్లేట్లలో పూరీలు పెట్టు కుని తెచ్చింది. ముగ్గురూ కొంతసేపు కబుర్లు చెప్పుకున్నారు. తర్వాత శిరీష నిద్రొస్తోందని చెప్పి వెళ్ళి పడుకుంది.

స్మిత తన డ్రాయింగ్సన్నీ తెచ్చి రమ్యకి చూపింది. అందులో చెట్లు, పుట్టలు, కొండలు, కోనలు, పక్షులు, జంతువులు, రకరకాల భవ నాలు, వివిధ నృత్యభంగిమలు ఎన్నో ఉన్నా యి. రమ్య ఒక కాగితాన్ని వేలితో చూపి ''ఎవరో తెల్సు, అవునా?'' అంది బాల్కనీ బయటకి చూపుతూ. స్మిత అర్థవంతంగా నవ్వింది. ఆ డ్రాయింగ్ పేపర్‌మీద మూడు బొమ్మలు న్నాయి, అన్నీ అవుట్‌లైన్సు మాత్రమే. ఒకటి చేతులు కట్టుకు నిలబడి, రెండోది పిట్టగోడ మీద చేతులు ఆనించి వంగబడినట్లు, మూ డోది కుర్చీలో కూర్చుని చెంపమీద చేతులు పెట్టుకుని చూస్తున్నట్టు.

''స్మితా! నిన్నేదో పొగుడ్తున్నాననుకోకు, నిజంగా బ్రహ్మాండంగా వున్నాయి నీ బొమ్మలు. ఏంటి? రిషీకపూర్ హెయిర్ స్టయిలా అత నిది''

''నా పిచ్చి బొమ్మల్లో కూడా బాగానే పసిక ట్టావే, రిషీ పోలికలు చాలా వుంటాయి, ఫేస్ కట్, పర్సనాలిటీ అయితే డిటో'' అంది.

''స్మితా! ఏదేమైనా నువ్వైతే ముందు చదు వుమీద లగ్నంచేయి. మళ్ళీ ఈరోజులు రమ్మ న్నా రావు. నీ ప్రతిభమీద నాకు నమ్మకం వుంది. కొన్నాళ్ళయినా అతని ఆలోచనలు మానేస్తే బాగుంటుంది'' అంది రమ్య.

''రమ్యా! నేను నిజం చెప్పినా, మీ అందరికీ నిరాగ్గా వుంటుందిగానీ ఆ ఆలోచనలు మానడం నా చేతిలో లేదు. వూపిరి పీల్చు కోడం మనం ఆలోచించి చేస్తున్నామా? అతని ఆలోచనలు రాకుండా వుండాలని పుస్తకాలు చదవడం, బొమ్మలేయడం, ఒంటరిగా వుండ కుండా ఎవరితోనో మాట్లాడ్తూ కాలక్షేపం చే యడం చేస్తున్నా. కానీ నేను పనిచేస్తున్నా అతని ధ్యాస మాత్రం నీడలా నా వెంటే పరిగెడుతోంది''

''స్మితా! నీ అనుమానమే తప్పు నీ మీద ఎవరికీ చిరాగ్గాలేదు. అందరూ నడిచే మార్గాని కి భిన్నమయిన మార్గం ఎన్నుకుంటున్నావన్న బెంగ, నీ జీవితం ఎలా వుంటుందోనన్న భయం మా అందరికీ. కీడెంచి, మేలెంచమ న్నట్లు బాగుంటే సంతోషమే, లేకుంటే అనే ప్రశ్నే ఆంటీ నీ మనసుని కష్టపెట్టడానికి కారణం'' అంది రమ్య.

ఎవరో వస్తున్న అలికిడికి ఇద్దరూ సంభా షణ మార్చేశారు.

మరికొంతసేపు కూర్చుని రమ్య వెళ్ళిపో యింది. స్మిత హరనాథ్ ఇంటిని గుర్తుచేసు కుంటూ పడుకుంటే నిద్రపట్టేసింది.

''అక్కా! టీవీలో సినిమా మొదలైంది'' అంటూ లేపాడు శరత్.

''ఎవరి సినిమా?'' బద్ధకంగా అడిగింది స్మిత.

''రిషీదయితేనే చూస్తావు కాబోలు'' అనేసి వెళ్ళిపోయాడు.

అంతా సినిమా చూట్టంలో లీనమయిపో యారని గమనించి ఆమె బాల్కనీలోకెళ్ళింది. హుస్సేన్ అప్పటికే అక్కడ నిలబడి వున్నాడు. నవ్వి ''సినిమా చూట్టంలేదా?'' అని సైగచేశా డు. ఇరవై నిమిషాలనుండీ తానక్కడే వున్నట్లు చెప్పాడు. స్మిత నవ్వింది. మళ్ళీ అతనే ఒక సారి కిందికెళ్ళొస్తానని చెయ్యిచూపి, వెళ్ళాడు. అతన్ని, అతని సైగల్ని ఎంత చూసినా ఆమెకి తనివితీరదు. అతను వున్నంతసేపూ పిచ్చి సంతోషంతో గాల్లో తేలిపోతూ వుంటుంది, అత ను లేకపోతే ఆ సంతోషమంతా విషాదమై నేలకూలినట్లుంటుంది ఆమె మనస్థితి.

స్మిత లోపలికి నడిచింది. ''ఫ్లాస్కులో టీ వుంది తాగు'' చెప్పింది సంధ్య సినిమా చూస్తూనే.

కప్పు కడిగి టీ వంపుకుని బాల్కనీలో నిలబడి టీ తాగుతోంది. హుస్సేన్ దిక్కులు చూస్తున్నాడు. ఆమెవంక తిరిగి ''నాకు?'' అన్నాడు. స్మిత నవ్వింది. తీసుకో అన్నట్లు కప్పు చూపింది. స్మితకి ఒక పక్కన పట్టరాని సంతోషంగానూ వుంది మరోపక్కన నరాలు చిట్లిపోయేంత టెన్షన్‌గానూ వుంది ''అమ్మ బాల్కనీలో కొస్తే'' అనే వూహ ఆమె గుండె




ఆగిపోతుందేమో అన్నంత భయపెట్తోంది.

స్మితకి తల్లి తత్వమంతా తెలుసు. ఆమె చెడ్డదో, గయ్యాళిదో కాదు. కాకపోతే తన కళా హృదయాన్ని అర్థంచేసుకోలేని అతి సామాన్య మాతృమూర్తి. తన పెంపకాన్నే అనుమానించే పిరికితనమామెది. ఇరవయ్యేళ్ళు దగ్గరుండి చూసినా కూతురు కానిపని చేయదనే నమ్మకం లేదామెకు. తల్లిలో వున్న ఈ లోపాలు సహించ లేకపోతోంది తప్ప ఆమెనో రాక్షసిగా చిత్రించు కోలేదు స్మిత.

'ఈ హుస్సేన్ వున్నంతసేపూ అతన్ని చూ ట్టానికి అభ్యంతరం చెప్పేవాళ్ళు ఎవరూ ఈ చుట్టుపక్కల లేకపోతే' అనుకుంది.

ఆమె వూహకి ఆమెకే నవ్వొచ్చింది. ఎందుకు నవ్వుతున్నావన్నట్లు కళ్ళు ఎగరేసి అడుగుతున్నాడు హుస్సేన్. ఏమీలేదని తల అడ్డంగా వూపింది. ఆమె చూపులు అటు వున్నాయి కానీ తక్కిన ఇంద్రియాలన్నీ ఏ నిమిషంలో ఎవరొస్తారోనని భయంగా కేంద్రీక రించివున్నాయి. అలా అరచేతిలో ప్రాణాలు పెట్టుకుని నిలబడేకంటే లోపలికి వెళ్ళిపోతే మేలనుకుంది. మళ్ళీ 'అయ్యో నాకోసం ఎక్క డికీ పోకుండా వున్నాడే, నేనెళ్ళిపోతే కోపం తెచ్చుకుంటాడేమో. అయినా తనకేం టెన్ష నుందని? ఒక్కడే గదిలో వుంటున్నాడు. ఇదే మని అడిగేవాళ్ళు లేరు. పైగా మగమహా రాజు... ఎవరైనా చూసినా అంతగా భయపడా ల్సిన, సిగ్గు పడాల్సిన అవసరం లేదు' అను కుంది. "నే వెళ్తున్నా" అంటూ సైగ చేసింది. సరేనన్నాడు. వెనక్కి వెనక్కి తిరిగి చూస్తూ వచ్చేసింది. మరోసారి హరనాథ్, రమ్య మాట లు గుర్తొచ్చి 'నేనిలా ఇతని పిచ్చిలో మగ్గిపోడా నికి వీల్లేదు. మంచి రిజల్టు సాధించాలి" అనుకుంటూ డ్రాయింగ్స్ వేస్తూ కూర్చుంది. ఎప్పుడో ఎవరో లెక్చరర్ "పెయింటిగ్ అనేది ట్వంటీఫోర్ అవర్స్ జాబ్" అని చెప్పిన విషయం గుర్తొచ్చింది. నిజమే కష్టపడాలి అనుకుంది.

తొమ్మిదిన్నరవరకూ బొమ్మలు వేస్తూనే వుంది. అప్పుడు లేచి భోజనంచేసి, నీళ్ళు తాగుతుంటే "స్మితా! అగ్గిపెట్టె తెచ్చిపెట్టూ" అంటూ తండ్రి పిలుపు వినిపించింది. రాజారాం బాల్కనీలో కుర్చీవేసుకుని కూర్చు న్నాడు. స్మిత చేతిలోంచి అగ్గిపెట్టె తీసుకుని సిగరెట్ వెలిగించుకున్నాడు. ఆమె చూపులు అప్రయత్నంగా అటు మళ్ళాయి. అతనితోపా టు ఇంకా ఇద్దరు ముగ్గురున్నారు. ఆమె లోపలికొచ్చేసింది.

స్మిత మళ్ళీ బాల్కనీలోకొచ్చి "నాన్నా! పరీక్ష లొస్తున్నాయి" అంది.

"ఊఁ బాగా చదువుతున్నావా?"

"ఆఁ కానీ... ఇంట్లో రెండు మూడు కాన్వాస్‌లే వున్నాయి. ఇన్నాళ్ళు వేసిందాన్నే చెడగొట్టి మళ్ళీ వేశాను. కొన్ని కాన్వాసులు కావాలి, బాగా ప్రాక్టీస్ చేయాల్సి వుంది" అంది. స్మితకి ఆ విషయం చెప్పడం చాలా ఇబ్బందిగా అన్పించింది. సామాన్యంగా ఒక రిని నొప్పించే మనస్తత్వం కాదామెది. తండ్రి ఆర్థికంగా ఇబ్బందుల్లోనే వున్నాడు. ఈ భారత దేశంలో ఎనభైశాతం ఇంట్లో యజమాని ఒక్క డు సంపాదిస్తే, మిగిలిన వాళ్ళంతా కూర్చుని తినేవాళ్ళు. చాలీ చాలని జీతంతో జీవితాలు దుర్భరంగా గడపాల్సివస్తోంది. ఈమధ్యే శిరీష వుద్యోగంలో చేరడాన కాస్త మెరుగయింది. తానూ చదువు కాగానే వుద్యోగంలో చేరాలి. అప్పుడు తండ్రికి కాస్త రిలీఫ్‌గా వుంటుంది అనుకుంది.

ఆమె పరధ్యానానికి విసుగ్గా "నిన్నే అడుగు తోంది, ఎంత ఖర్చవుతుంది, మూడొందల్లో వస్తాయా? రేపు తెచ్చిస్తాన్లే" అన్నాడు.

"థాంక్స్ నాన్నా, మర్చిపోకండి" అని హు స్సేన్నోసారి చూసి వెనుతిరిగింది.

★ ★ ★

పరిక్షల హడావిడివల్ల స్మిత, రమ్య కలసి కూర్చున్నా రాసుకోవడమో, చదువుకోవడమో, బొమ్మలేసుకోవడమో తప్ప మాటలతో కాల క్షేపం చేయడం మానేశారు.

రమేష్ పదేపదే వెంటపడుతూ "నాకు సమాధానం చెప్పలేదు" అన్నాడు. తాను మరో వ్యక్తిని చేసుకోవాలని ముందే నిర్ణయించుకు న్నానని చెప్తే ఆ విషయం పదిమందికీ చెప్పి పరువు తీస్తాడేమోనని "మీరో ఫ్రెండుగా మాట్లాడ్తే సరే. అంతే తప్ప పెళ్ళి గిళ్ళీ అని మాత్రం ఇంకోసారి అనకండి, అది జరిగే పని కాదు" అంది స్మిత. రమేష్ అప్పటికి

మౌనంగా వెళ్ళిపోయినా తర్వాత చాలాసార్లు స్మిత ఫొటో కావాలని ఎంతగానో అడిగాడు. "నా ఫొటో మీకెందుకు?" అందే తప్ప ఇవ్వలేదు. కాలేజ్‌డే రోజు విద్యార్థులంతా గ్రూప్ ఫొటో దిగుతుంటే స్మిత, రమ్య ఎవరు పిలుస్తున్నా ఆగకుండా వెళ్ళిపోయారు. ఆ విషయం రెండు మూడుసార్లు చెప్పి రమేష్ "మీరు కనీసం గ్రూప్ ఫోటోలో కూడా లేరు" అన్నాడు. స్మిత విని మౌనంగా వూరుకుంది.

అదే హుస్సేనొచ్చి తన ఫొటో కావాలంటే ఇవ్వనా? రమేష్‌పట్ల నాకు ప్రేమ లేకపోయినా అతనెందుకు నన్ను చూసి ఆకర్షితుడయ్యాడు? 'ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును' అంటారు. అది అన్నిసార్లూ నిజంకాదని స్వయంగా తన అనుభవమే చెప్తోంది. రమేష్ ప్రేమకి కృతజ్ఞత చూపగలదేమో, అతని విరహవేదనకి జాలి పడగలదేమో కానీ అతనిలా తిరిగి ప్రేమించగలదా? అది మాత్రం అసంభవం. భవిష్యత్తు సంగతి తెలీదుగానీ ప్రస్తుతానికి మాత్రం తనకు హుస్సేన్ తప్ప ఈ ప్రపంచంలో ఇంకెవ్వరిమీదా ప్రేమ కలగదు. తన మనసెప్పుడో అతనికి అంకితమైపోయింది. ఇలా స్మిత ఆలోచనలకి అంతులేకుండా పోతుందొక్కోసారి.

స్మిత ప్రతిరోజూ అర్ధరాత్రి పన్నెండూ ఒంటిగంటవరకూ చదువుతోంది. ఎప్పుడూ పెందలాడే పడుకోమని వత్తిడి చేసే తండ్రి కూడా పరీక్షల సమయం కదాని ఆమె ఇష్టానికి వదిలేశాడు. కూతురు బాగా కష్టపడుతుండడంవల్ల హుస్సేన్ సంగతి మరిచిపోయినట్లే ప్రవర్తించింది సంధ్య. కొన్నిసార్లు ఆవిడే ఫ్లాస్కులో టీ పోసి పక్కనపెట్టి వెళ్ళేది. కొన్నిసార్లు స్మితనే పెట్టుకోమనేది.

ఉదయం కాకపోయినా రాత్రులు ఇదివరకటిలాగాక కాస్త నిబ్బరంగా చూడగలుగుతోంది. హుస్సేన్ని ఒక అయిదు నిమిషాలు చూస్తే అయిదు ఏనుగుల బలం వచ్చినట్లుంటుందామెకి. అతన్ని చూడకపోతే ఒంట్లో వున్న శక్తినంతా ఎవరో ఇంజెక్ట్ చేసి లాగేసినట్లు నిస్సత్తువుగా వుంటుంది. తనకి కలిగే ఈ భావాలు ఇంకెవరికయినా కలుగుతాయా? ప్రేమకి ఇంత బలముందా? మరి అమ్మ, తన ప్రేమని ఎందుకర్థంచేసుకోదు. రమ్యకి పురుషుడిమీద కలిగే ప్రేమపట్ల ఎందుకు నమ్మకమూ, అవగాహనా లేవు. అసలు తన స్నేహితుల్లో ఎవరికీ కలగని ఈ ప్రేమజబ్బు తనకే ఎందుకొచ్చినట్లు? ఇలాంటి ఆలోచనలు ఆమె చదువుని చాలాసార్లు ఆటంకపరిచేవి. అంతలోనే ఎవరో తట్టిలేపినట్లు ఆ ఆలోచనల్ని అల్లంతదూరానికి విసిరిపారేసేది. కొన్నిసార్లు అది సాధ్యంకాక తలనొప్పి కొనితెచ్చుకునేది.

మధ్యమధ్యలో హుస్సేన్ లేచి వచ్చి "ఇంకా పడుకోవేం?" అన్నట్లు గడియారం చూపుతుంటాడు.

స్మిత నవ్వి చేత్తో రాస్తున్నట్లు చూపి "పరీక్షలు" అంది.

పరీక్షలు ఇంకా పదిహేను రోజుల్లో వున్నాయి అనగా ప్రిపరేషన్ హాలిడేస్ ఇచ్చారు. రాత్రి సమయంలో ప్రశాంతంగా వుంటుందని ఆమె రాత్రిపూటే ఎక్కువగా చదవడానికి ఇష్టపడుతోంది. ఆ బదులు పగలు కొంతసేపు నిద్రపోతోంది. నాలుగురోజులు స్మిత మరీ ఆలస్యంగా పడుకోవడం గమనించిన హుస్సేన్ తనూ చాలా ఆలశ్యంగా ఇంటికి రావడం మొదలెట్టాడు. ఒక్కోసారి సెకెండ్‌షో అయ్యే సమయానికో మరింత ఆలస్యంగానో వస్తున్నాడు.

స్మిత చదువుకుంటున్నా, బొమ్మలు ప్రాక్టీస్ చేస్తున్నా ఆమె దృష్టి మాత్రం అటు మళ్ళుతూనే వుంటుంది. 'ఇప్పటిదాకా ఏం చేస్తున్నట్లు ఈ ఇడియట్?' అనుకుంది స్మిత అతని ఆలస్యానికి కోపగించుకుంటూ. ఒకటి రెండుసార్లంటే సినిమాకెళ్ళాడేమో అనుకోవచ్చు, కానీ రోజూ ఏం సినిమాలు చూస్తాడు? బహుశా తనని అంతసేపు మెలకువగా వుండద్దని తన పద్ధతి ద్వారా పరోక్షంగా చెప్తున్నాడా? కానీ తనేం బలాదూర్లు తిరిగొస్తోందా లేక వృధాగా కాలక్షేపం చేస్తోందా? కష్టపడి చదవడమూ, అదీ ఒకటేనా?

ఇవన్నీ స్మిత మనసులో చెలరేగే సంఘర్షణలే తప్ప హుస్సేన్‌తో ముఖాముఖీ తేల్చుకునే ప్రయత్నం చేయలేదు.

హుస్సేన్ ఆలస్యంగా ఇంటికొస్తున్నందుకు నిరసనగా అతని రాకని గమనించినా గమనించనట్లు వుండడం, చూడాలన్పించినా చూడకుండా నిగ్రహించుకోవడం మొదలుపె




ట్టింది. కానీ హుస్సేన్ తన రాకను తెలియజే స్తూ దగ్గడం, వేసవికాలం కాబట్టి పైన పడుకో డానికి వచ్చిన కిందింటివాళ్లతో హెచ్చుస్వ రంతో మాట్లాడ్డం చేస్తున్నాడు. ఆ మాత్రానికే ఐసైపోయేదామె. ఇక అప్పుడు తల ఎత్త కుండా, అటు చూడకుండా వుండడం ఆమెకి అసాధ్యం. ఆ చీకట్లో అంత దూరానికి తన చూపుల్లో వున్న కోపం, బాధ అతనికి కనిపిస్తా యా? కానీ ఆ కోపం ఎంతోసేపు నిలవడంలే దు. అయిసుగడ్డ సూర్యరశ్మికి కరిగి ప్రవ హించినట్లు ఆమె హృదయం అతన్ని చూస్తే కరిగిపోతుంది.

మొత్తానికి పరీక్షల యజ్ఞం ముగిసింది. చివరి పరీక్షరోజు రమ్యతో సినిమా ప్రోగ్రాం పెట్టుకుంది. ఆరోజు ఆలస్యంగా వస్తానని ముందే చెప్పి బయల్దేరింది. స్మిత పరీక్ష రాసి హాలు బయటకి వచ్చేసరికి అప్పటికే రమేష్ ఆమె కోసం ఎదురుచూస్తూ నిలబడ్డాడు.

"స్మితగారూ! నాదో చిన్న కోరిక..."

"చెప్పండి".

"ఈరోజు లాస్ట్‌డే. రేపట్నుండీ మిమ్మల్ని చూడకుండా ఎలా వుండగలనో నాకర్థం కావ డంలేదు. ఈరోజు మీతో సినిమా చూడాలని..."

అతనెంత జాలిగా అడిగాడంటే ఆమె కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. తాను హుస్సేన్ విషయంలో ఎలా ఫీలవుతోందో తనకోసం ఇత నలా తపిస్తున్నాడు. ఒక పేదవాడు పదిరూపా యలివ్వమని ప్రాధేయపడితే ఇవ్వచ్చు కానీ ఇతని పరిస్థితి అలా కాదు. తనకి ఒకటే మనసుంది, అది కాస్తా హుస్సేన్ కిచ్చేసింది.

తన ఆలోచనల్ని అలా నిలిపి "సారీ... రమ్యతో సినిమాకెళ్ళాలని ముందే ప్లాన్ చేసు కున్నాం" అంది వీలయినంత సౌమ్యంగా.

"రమ్యగారూ, మీరూ ఇంకెప్పుడైనా కలిసివె ళ్ళచ్చు. నేనలా కలవడానికి వీలవ్వదుకదా. పోనీ రమ్యగారితోపాటు నేనూ రావచ్చా?"

"ఉహూ, మేం డైరెక్టుగా సినిమాకెళ్లడంలే దు. ముందు వాళ్ళింటికెళ్ళి..."

"ఏ హాలో చెప్పండి, నేనక్కడ వెయిట్ చేస్తాను"

స్మితకి భయం ప్రారంభమైంది. ఇతన్ని వదుల్చుకోవడం కుదరదేమో. అసలీ డొంకతి రుగుడంతా ఎందుకు? నేను నిన్ను ప్రేమించ లేదు, నీతో కలిసి సినిమా చూడాలని నాకు లేదు. అని తిన్నగా చెప్పేస్తే? ఛఛ... ఈ సభ్యసమాజంలో మనసులో వున్న మాటలు అన్నిసార్లూ అంత తేలిగ్గా చెప్పగలమా?" అనుకుంది. అంతలో ఆమెకో ఆలోచన కలి గింది. రమ్యకి చెప్తే ఆ సమస్యని తేలిగ్గా పరిష్కరిస్తుందని.

"మీరిక్కడే వుండండి, రమ్యని అడిగొస్తా ను" అంది.

అంతా విన్న రమ్య సరేనని రమేష్‌ని సమీపించిన తర్వాత స్మితతో "స్మితా! ఈరోజు సినిమా కాన్సిల్. అనుకోకుండా అక్కకి పెళ్లి చూపులు నిర్ణయించారు. అమ్మ నిన్ను తీసు కుని త్వరగా రమ్మంది" అంది. స్మిత కళ్లు ఆశ్చర్యంతో ఆల్చిప్పలయ్యాయి. రమేష్ ముఖం వాడిపోయింది.

"కనీసం మీ అడ్రస్ ఇస్తారా?" అన్నాడు నీరసంగా.

స్మిత అతన్ని అంతకంటే నిరుత్సాహపరచ లేక అడ్రస్ రాసిచ్చింది.

అది తీసుకుంటూ రమేష్ చూసిన చూపు ఆమె గుండెల్లో గుచ్చుకుంది.

రమేష్ వెళ్లిపోయాక "రమ్యా! నీకింత తెలి వితేటలు ఎక్కణ్ణుంచి వచ్చాయే? మొత్తానికి లేని అక్కకి పెళ్లిచూపులు ఖాయం చేశావు" అంది.

"నా తెలివిమీద నమ్మకం కుదిరిందా? ఇక మీదట ఎప్పుడు ఏ సలహా కావాల్సినా నన్నే అడుగు. పాపం రమేష్ పాలిట నేనో వాంప్‌నై పోయాను. నీవెంట నేనో శనిగ్రహం అను కుంటాడేమో"

స్మిత అతని పరిస్థితికి జాలిపడింది. నన్ను కాకుండా వేరొకరిని ఇష్టపడితే బాగుండేది అనుకుంది.

ఇద్దరూ రమ్య ఇంటికెళ్లి భోజనం చేసి మాట్నీకి వెళ్లారు. ఏం సినిమా అన్నది ము ఖ్యంకాదు వాళ్ళకి, అందులో రిషీకపూర్ వున్నా డంతే.

★ ★ ★

పరీక్షలయిపోయిన తెల్లారి స్మిత ఉదయం

పన్నెండింటివరకూ పడుకునే వుంది. ఎవరూ ఆమెని లేపలేదు. ఇన్నిరోజులు రాత్రింపగళ్లు కష్టపడిందికదా అనుకున్నారు. అప్పుడు లేచి బాల్కనీ తలుపు తెరిచేసరికి హుస్సేనింకా వర్కుకి వెళ్లకుండా కూర్చునేవున్నాడు. పర్లేదే తనకోసం పెద్ద త్యాగమే చేశాడు అనుకుంది. అందుక్కారణం అతను అటు సూర్యుడు ఇటు ఉదయించినా వర్కు మానడు. అతనితో పరిచయమయిన ఈ రెండేళ్ళలో ఒకేఒకసారి మానేశాడు. ఆరోజు కారణం అడిగితే జ్వరమని మెడమీద చెయ్యిపెట్టి చూపాడు. ఈవేళ రెండోసారి.

స్మితని చూసి కోపం అభినయించాడు. చేయి చూపి 'ఇప్పుడు టైమెంత? అన్నట్లు ముఖం పెట్టాడు. ఆమెకి విపరీతంగా నవ్వొచ్చింది. అతనూ నవ్వేసి "సినిమాకెళ్దామా?" అన్నాడు. ఆమె రానని చెప్పింది. అంతే అప్పటికే తయారైవుండటంతో బ్రీఫ్‌కేస్ తీసుకుని వెళ్ళిపోయాడు.

కార్యక్రమాలన్నీ ముగించి, భోజనం చేసేసరికి రెండయ్యింది. మళ్ళీ మంచంమీద పడుకుంది. పుస్తకాలు చదివీ చదివీ విసుగుపుట్టింది. ఇక కొన్నాళ్ళు వాటి జోలికి పోకూడదనుకుంది. తను వేసిన బొమ్మలు చూద్దామని తీసింది. కానీ మొత్తం చూడాలన్పించలేదు. ఆమె మనసులో చిత్రమయిన ఊహలు- "హుస్సేన్ నాలుగురోజులు ఉద్యోగం మానేసి, ఎక్కడికీ వెళ్ళకుండా తననే చూస్తూ నిలబడాలి. ఇంట్లో వాళ్ళందరూ, ఈ చుట్టుపక్కల బిల్డింగుల వాళ్లందరూ ఆ నాలుగురోజులూ ఇళ్లు విడిచి ఎక్కడికయినా వెళ్ళిపోవాలి. అప్పుడు తనూ కన్నార్పకుండా అతన్నే చూస్తూ నిలబడ్తుంది. ఆమె ఆలోచనకి ఆమెకే నవ్వొచ్చింది. తమకోసం అందరూ ఎక్కడికెళ్తారు? విన్నారంటే కఱ్ఱ తీసుకు వెంటపడగలరు. అయినా నాలుగురోజులు నిజంగా అన్నం, నిద్ర లేకుండా వుండగలరా?

చదవాలని ఓ కవితాసంకలనం తీసింది. కొంత చదివేసరికి ఆమె చపలచిత్తం కవిత్వం మీద ధ్యాస పెట్టలేకపోయింది. పుస్తకం అల్మర్లో పెట్టింది. ఆలోచనలు జోరీగల్లా ఆమె బుఱ్ఱచుట్టూ తిరుగుతున్నాయి. దేనికీ మొదలూ, చివరాలేదు. చాలా అస్థిమితంగా, గందరగోళంగా వుంది. తొలిసారిగా ఆ ఆలోచనలకి అక్షరరూపం ఇస్తే, మనసు కొస్త కుదుటపడుతుందేమో అన్పించింది. తను బొమ్మలేయగలదుగాని రాయగలనా అనుకుంది. మళ్ళీ ప్రయత్నం చేసి చూద్దాం, టాగోర్‌ముందు మహాకవి మాత్రమే. అరవయ్యేళ్ళ వయసులో బొమ్మలేయడం మొదలెట్టలేదా? అని తనకు తనే సమాధానం చెప్పుకొంది. ఒక పెన్నూ నోట్ పుస్తకం తీసుకుని రాద్దామంటే అంతా అస్తవ్యస్తంగా అనిపించింది. లోపల కలుగుతున్న ఆలోచనల్లో ఒక్కదానికి కూడా సరైన రూపం లేనట్లనిపించింది. కవిత్వం రాయడం ఇంత కష్టమా? ఏమో అలవాటు లేక అలా వుందేమో. ఈ లోకంలో ఏదీ బ్రహ్మవిద్యకాదు. ఏమో కష్టపడితే ఏదయినా సాధించచ్చు. బొమ్మలేయడం అలవాటు లేనివాళ్లు మొదట వేయబోతే బహుశా ఇలాగే వుంటుందేమో. ముందు ఏ గీతతో మొదలెట్టాలి, ఏ కొలతల్లో వేయాలి, ఎలా వేయాలి అని గాబరాపడ్తారేమో. ఈవేళ కవిత్వం మొదలెట్టాలి ఏమైనా అనుకుంది.

రెండు మూడు కవితలు రాసింది. మళ్ళీ చదివితే ,ఆమెకే నచ్చలేదు, చింపేసింది. పట్టువదలని విక్రమార్కుడిలా మళ్ళీ రాసింది.

"నా పరోక్షములో అరక్షణము
ఆక్షేపణలేని నా స్మృతి ఏదో
నీ హృదయ గగనాన మెదిలిన
ధన్యమవదా నా జీవితం?"

ఇలా రాసి చదువుకుంది. పర్లేదు, నేకవిత్వం రాయగలను అనుకుంది ఆనందంగా. ఆ సమయంలో తన వెంట రమ్య లేనందుకు బాధ కలిగింది. రమ్య తననెంతో ప్రోత్సహిస్తుంది. నాన్సీ నెల్సన్‌కి తను కవిత్వం మొదలెట్టానని ఉత్తరం రాయాలి. నాతో పోటీ పడ్తున్నావా అని నవ్వుకుంటుందేమో.

"నిన్ను చూసినపుడు
ప్రకృతిని దర్శించినపుడు
మధుర గానము విన్నపుడు
నాక్కలిగే సంతోషాన్ని
సమస్త భాషలందలి
సర్వ విశేషణాలతోనూ
వర్ణించి వ్యక్తపరచ వీలవదు




ఈ మూడింట్లో ప్రతిదీ నాచే
ఆనందబాష్పాల్ని కురిపిస్తుంది
అవధి లేని ఆనందంతో
హృదయం లయ తప్పుతుంది''
''నీపై నాకున్న ప్రేమ అనంతం
దానికి మొదలేగాని తుదిలేదు
అనుక్షణం నువ్వే గుర్తొస్తావు
అణువణువూ నిన్నే జపిస్తుంది
ఇది తప్పని తోచదు నాకు
నాది అవ్యాజ నిస్వార్ధ ప్రేమ
నీ నుండేమో ఆశించి ప్రేమించలేదు
నే సదాకోరేది నీ దర్శనహాసాలాపాలు
ఇంతకుమించి ఇంకేమీ వద్దు
నిన్ను చూడనినాడు శాంతి వుండదు
నీ పలుకులు కరువైనపుడు
నాపై నాకు విరక్తి కలుగుతుంది
నీవు నవ్వని రోజు
సర్వం స్థంభించినట్లుంటుంది''

ఈవిధంగా రాసింది స్మిత. మనసు కాస్త స్థిమితంగా అన్పించింది. ఆమెకి ఎప్పుడో చదివిన మాటలు గుర్తొచ్చాయి. రచయితకి మనసులో కలిగిన ఆలోచనలు కాగితం మీదికి దించితే ప్రసవించిన తల్లికి కలిగే తేలికతనం, రిలీఫ్ కలుగుతుంది. అప్పుడర్ధం కాలేదుగానీ ఆ మాటలు ఇప్పుడు నిజమన్పిస్తున్నాయి.

స్మితకి సెలవలు భారంగా నడుస్తున్నట్లు అన్పించింది. ఉదయం లేవడం, తను చేసే రోజూవారీ పనులు చేయడం, ఎవరూ తనని గమనించడం లేదనిపిస్తే హుస్సేన్ని చూడడం, ఇక పగలంతా ఈసురోమని గడిపి, సాయంత్రం అతని రాకకోసం ఎదురుచూస్తూ కూర్చోవడం, ఈలోపు తల్లి పసిగడ్తే తిట్లు తినడం, వీలయితే రాత్రి మళ్ళీ అతని సైగాయణానికి కాసేపు మైమరచిపోవడం, మధ్యలో టెన్షను- ఇదీ వరుస.

ఏ హారతి దగ్గరికో వెళ్ళాలని అడిగితే అనుమానపుచూపులు, గొణుగుడు. చాలావరకూ అందరిళ్ళకీ వెళ్లడమే మానేసింది. కలిసి చాలా కాలమయ్యిందని ఓరోజు నాన్సీ నెల్సన్ ఇంటికి వెళ్లింది.

''హల్లో స్మితా! ఎన్నాళ్లయిందే నిన్ను చూసి'' అంది నాన్సీ.

''ఏం నేను రాకపోతే, నువ్వు రాకూడదా?'' అడిగింది స్మిత.

''నాకంటే పెళ్లయ్యింది, నీకేం ఫ్రీ బర్డ్వి, నువ్వే రావాలి''

''అంటే నాకూ పెళ్ళయితే ఇక ఇద్దరిమధ్యా రాకపోకలే వుండవన్నమాట. మనది నిజమయిన స్నేహం కాదన్నమాట?''

''అప్పుడు మనిద్దరం ఇళ్లు పక్కపక్కనే తీసుకుందాంలేగానీ ఎప్పుడూ పెళ్ళి వూసే ఎత్తేదానివికాదు. కాస్త దారిలోకొచ్చినట్లున్నావు...''

''ఆఁ... ఆఁ... రేపే నా పెళ్లి, పిలుద్దామని వచ్చా''

''నీ జోకులు సరేగానీ గుర్తుంచుకో. చివరిక్షణంలో అందరితో బాటు పిల్చావంటే నీ పెళ్ళికే రాను. నీ పెళ్ళి పెత్తనమంతా నాదే. ఆఖరికి చీరల సెలక్షన్ కూడా''

''అంతేనా? కట్నం కూడా నువ్వే ఇచ్చేయి. ఎవరొద్దంటారు?''

''నిన్ను చేసుకోవడమే తన అదృష్టమనుకోవాలి. దురాశకిపోయి మళ్ళీ కట్నం అడిగితే నెత్తిన నాలుగు ఒడ్డిస్తాను''

నాన్సీ మాటలతీరుకి స్మితకి నవ్వొచ్చింది. ఆమె హుస్సేన్ని మొట్టుతున్నట్లు, అతను గట్టిగా కళ్ళు మూసుకొని తప్పించుకుంటున్నట్లు కళ్ళముందు కనిపిస్తోంది. స్మిత ఆపకుండా రెండు మూడు నిమిషాలు నవ్వింది.

''ఏంటి? అమ్మాయిగారి మొహంలో నిజంగా ఏదో పెళ్ళికళ వచ్చినట్లుంది?! ఎవరా అదృష్టవంతుడు'' కళ్ళెగరేస్తూ అడిగింది నాన్సీ.

''ఇంకా అంతవరకూ రాలేదుగానీ. అసలు నీమీద నాకు చాలా కోపంగా వుంది, నువ్వు రానందుకు. నేనూ రావద్దనే అనుకున్నాను. కానీ ఎందుకొచ్చానో తెలుసా? నీ పాటలు వినాలని మనసులాగింది. ఆ కోరికే నన్నిక్కడికి తీసుకొచ్చింది''

''పెద్దఫోజులు. ఏదో కారణంగా వచ్చావు, అంతే చాలు''

వాళ్ళ ముచ్చట్లకి అంతే లేదు. చాలాకాలపు మాటలు మనసుతీరా మాట్లాడుకున్నారు. నాన్సీ పాటలు శ్రావ్యంగా పాడుతుంది. తనకి

ఇష్టమయిన పాటలు కొన్ని పాడించుకుని, కులాసాగా గడిపి మూడింటికి ఇల్లు చేరింది స్మిత.

తల్లి ఆమెని నిలదీసి, "నిజంగా నాన్న దగ్గరికే వెళ్ళావా?" అంది. స్మిత ముఖంలో కనిపించిన అతిసంతోషం చూసి కూతురు ఆ అబ్బాయిని కలిసొచ్చి వుంటుందని అనుమానించింది.

స్మిత ఆనందమంతా ఆవిరయిపోయింది. కళ్ళమ్మట నీళ్ళు తిరుగుతుండగా- "పోనీ నావెంట రాకపోయావా?" అని లోపలికెళ్ళి మంచంమీద బోర్లా పడుకుని ఏడ్చేసింది, గుండె తేలికయ్యేవరకూ.

★ ★ ★



**ప**రీక్షాఫలితాలు తెలిశాయి. స్మిత, రమ్య- ఇద్దరూ మంచిమార్కులతోనే ఉత్తీర్ణులయ్యారు. ఇద్దరూ హాయిగా ఊపిరి పీల్చుకున్నారు.

"అయితే ఇప్పుడేం చేయాలనుకుంటున్నావు?" అంది రమ్య.

"రమ్యా! నిజానికి ఈ పెయింటింగులోనే పి.జి. చేయాలనివుంది. కానీ నాన్నని మరింత అవస్థ పెట్టడం ఇష్టంలేదు. అందుకే దొరికితే అర్జంటుగా ఉద్యోగంలో చేరాలనుంది"

"ఏ ఉద్యోగమయితే చేస్తావు?"

"కొత్త మనిషిలా అలా అడుగుతావే? నా చదువుకి సరిపోయే ఏ ఉద్యోగమయినా పర్లేదు"

"ఒక డ్రాయింగ్‌టీచర్ పోస్టుందట వెళ్తావా?"

స్మిత ఎగిరి గంతేసినంత పనిచేసింది. "నిజమా?" అని ఆశ్చర్యపోయింది

"నీకెవరో చెప్తే, నువ్వు నాకోసం త్యాగం చేస్తున్నావా?" అనుమానంగా అడిగింది స్మిత.

"నేనేం త్యాగమూర్తిని కానులే. నాకు టీచింగ్ ఫీల్డ్ ఇంట్రస్ట్‌లేదు. పైగా వీలయితే పీజీ చేయాలని ఆలోచిస్తున్నాను"

"మంచి ఆలోచనే. నీకు ఎకనామిక్ ప్రాబ్లం లేదు కాబట్టి పీజీ చేయడం బాగుంటుంది. ఇంతకీ నా ఉద్యోగం ఎక్కడ, ఏ స్కూలు?"

"చాలా దూరమే. సికింద్రాబాద్‌వేపు. తిరుమలగిరి అవతలట. జ్యోతి చెప్పింది, సరిగ్గా వివరాలు కనుక్కుని చెప్తాలే" అంది రమ్య.

"సెలవల్లో మనం రోజూ కలుసుకున్నాంకదూ!" వ్యంగ్యంగా అంది స్మిత. "వ్యంగ్యమా? కానీ నిజంగా రోజూ నిన్ను కలిశా. నా కలల్లో నువ్వే తెలుసా? ఏం చేయమంటావు చెప్పు, వచ్చీపోయే చుట్టాలతోనే సరిపోయింది. అయినా ఉత్తరాలు రాసుకున్నాంకదా. ఇంతకీ సెలవలెలా గడిచాయి?"

"ఆ ప్రశ్న మాత్రం అడక్కు. ఎలాగో భయంకరంగా గడిచిగట్టెక్కాయి"

"ఇంతకీ హీరో ఏమంటున్నాడు?"

"నాకు పిచ్చెక్కుతోంది, ఇంకెన్నాళ్ళిలా అంటున్నాడు"

"ఎర్రగడ్డ బస్‌నంబర్ చెప్పకపోయావా?"

"నా రూటూ అదేకదా, చెప్పడమెందుకు, కలిసే వెళ్ళచ్చు"

"నేనేదో తమాషాకి అంటే, నీకంత ఉక్రోషమెందుకు? ఇంతకీ స్కూలు సంగతి ఏమంటావు? రోజూ అంతదూరం వెళ్ళిరాగలవా?"

"ఇష్టమే. నడిచేంకాదుగా, బస్‌లోనేగా. ముందు ఏదో ఒకదానిలో చేరితే మెల్లగా మంచిది చూసుకోవచ్చు"

"అమ్మా వాళ్ళేమంటారో?"

"అంత దూరమేమెళ్తావు? దగ్గర్లో దొరికితే చేద్దువుగానిలే అంటారు. ఊహూ... ముందు జాబ్‌వస్తే, నేను సర్దిచెప్తాలే. డబ్బుపరంగా, మనసుపరంగా రెండువిధాలా నాకు వెంటనే ఉద్యోగం కావాలి" స్థిరంగా అంది స్మిత.

"సరే. రేపు తొమ్మిదింటికల్లా సర్టిఫికెట్లతో రెడీగా వుండు, నేనొస్తా. ఇద్దరం కలిసి వెళ్దాం" అంది రమ్య.

మరునాటిరోజు రమ్య వివరాలన్నీ కనుక్కొని వచ్చింది. ఇద్దరూ కలిసి సికింద్రాబాదు వరకూ బస్సులో వెళ్ళారు. అక్కణ్ణుంచి తెలియని రూటులో మొదటిరోజు అంతగా రిస్కు తీసుకోవడం ఎందుకని ఆటో ఎక్కారు. ఆటో విద్యావిహార్ ముందు ఆగింది.

స్కూల్లో ప్రవేశించి, ఆఫీసురూం ముందున్న బెంచిమీద కూర్చున్నారు. తరగతులు జరుగుతున్నాయి. వారెళ్ళాక ఒక పిరియడ్ ముగిసి ఉపాధ్యాయులు తరగతులు మారారు. ప్యూన్ వాళ్ళముందునుండి అనేకసార్లు తిరుగుతూ కూడా ఇది మామూలే అన్నట్లు వాళ్ళ ఉనికినే పట్టించుకోలేదు. ఉపాధ్యాయులు కూడా ఎవరీ కొత్తశాల్తీలు అన్నట్లు చూశారే తప్ప దగ్గరికొచ్చి ఏమీ ప్రశ్నించలేదు. రమ్య, స్మిత లిద్దరూ విసిగిపోయారు. ఇక లాభంలేదు, తామే చొరవచేయాలనుకున్నారు. కురచగా, బొద్దుగా వుండి ఎవరితోనో మాట్లాడ్తూ ఓరగా తమనే పరికిస్తున్న వ్యక్తి దగ్గరికెళ్ళి సంగతి చెప్పారు. అతను తనని అడగడమే భాగ్యమన్నట్లు ముఖంపెట్టి, ప్రిన్సిపాల్ని కలిసే ఏర్పాటు వెంటనే చేశాడు.

ప్రిన్సిపాల్ ఆమె సర్టిఫికెట్లు చూసి, కొన్ని ప్రశ్నలువేసి "డిమాన్స్ట్రేషన్ క్లాసుంటుంది, వెయిట్ చేయండి" అన్నాడు. ఇద్దరూ బయటికొచ్చి కూర్చున్నారు. ఇందాకటి వ్యక్తి మళ్ళీ వచ్చి "ఏమన్నారు? నా పేరు నందగోపాల్, సబ్జెక్ట్ సోషల్ స్టడీస్" అన్నాడు.

"ఇప్పుడు క్లాస్ తీసుకోవాలట, నాకు భయంగా వుంది"

"మొదట్లో ఎవరికయినా అలాగే వుంటుంది. డ్రాయింగ్ అంటున్నారు. అందులో ఎక్స్ప్లనేషన్ పెద్దగా ఏముంటుందని? బోర్డుమీద ఏదో ఒక బొమ్మేయండి. అయితే గబగబా వేసేయక, మధ్యలో ఆగుతూ మీరు ఎలా వేయబోతున్నారో... ఐ మీన్ ఏ గీత ఎటు గీయాలనుకుంటున్నారో ఆ విషయం ముందు పిల్లలకి చెప్పండి, అంతే" చిదంబర రహస్యం చెప్పినట్లు చెప్పి తేలిగ్గా నవ్వేశాడు.

"నిజమే, నువ్వేం నెర్వస్గా ఫీలవకు, జాబ్ వస్తేవస్తుంది, లేకుంటేలేదు అయినా నీకాపాటి టాలెంట్ లేదా?" అంది రమ్య.

వాళ్ళిద్దరి మాటలూ స్మితకి ధైర్యాన్నిచ్చాయి. ఆమెని ఏడవతరగతికి పంపారు. ప్రిన్సిపాల్, నందగోపాల్, మరో టీచరు, రమ్య వెనక బెంచీల్లో కూర్చున్నారు. కేవలం పిల్లలుంటే పర్లేదుగానీ, ఇంతమంది పెద్దలు కూర్చుని వుంటే ఎలా అని సందేహించింది. తప్పదు, నదిలో దూకాక ఈత రాదనుకుంటే ఎలా, తనకీ ఉద్యోగం కావాలి గనక ముందు తనలో వున్న భయాన్ని సాగనంపాలి అనుకుంది. క్లాసురూంలోకి నడుస్తుంటే తన నడక తనకే వింతగా అన్పించింది.

చేతిలో వున్న చాక్పీసులు, డస్టరు టేబుల్ మీద పెట్టింది. ప్రిన్సిపాలాదులు పిల్లలకంటే ఎత్తుగా వుండి ఎదురుగా తలెత్తితే చాలు వాళ్ళే కనిపిస్తున్నారు. అయినా వీలయినంత వరకూ వాళ్ళ మొహాల్లోకి చూడకుండా ముందు బెంచీల్లోని పిల్లల్నే చూస్తూ, "మీరంతా రోజూ సైన్సూ, సోషలూ, ఇంగ్లీష్, తెలుగూ ఇలా అన్ని సబ్జెక్టులూ చదువుకుంటున్నారు. ఇవన్నీ మనకి జ్ఞానాన్ని బోధిస్తాయి, తెలివినిస్తాయి. అయితే మనిషికి కేవలం తెలివితేటలుంటే సరిపోవు. కొంత ఆనందం కూడా కావాలి. ఆ ఆనందం కోసం మన పూర్వీకులు కళలు సృష్టించారు. అందులో లలితకళలు ముఖ్యమైనవి. ఏవేవి లలితకళలో మీ అందరికీ తెలుసు. అయితే అందులో చిత్రలేఖనం గురించి నేను కొంత చదివాను. ఈరోజునుండీ మీకు బొమ్మలేయడం నేర్పిస్తాను" అంది ప్రారంభసూచకంగా. మొదట రెండు వాక్యాలవరకూ గొంతు ఒణికినా తర్వాత మామూలుగా అయిపోయింది.

"మీరంతా వుంటే డ్రాయింగ్బుక్స్, లేకపోతే రఫ్నోట్సులు తెరిచి నేనెలా వేస్తున్నానో చూసి మీరూ వేయండి" అని చాక్పీసులు తీసుకుని బ్లాక్బోర్డు దగ్గరికి వెళ్ళింది. ఆమెకి ఏం బొమ్మవేయాలో అర్థంకాలేదు. ఫస్టు బెంచీలో కూర్చున్న ఒక విద్యార్థిని లేపి "నీకే జంతువిష్టమో చెప్పు" అంది. వాడు "మా ఇంట్లో ఓ కుక్కపిల్లుంది, అదంటే నాకు చాలా ఇష్టం" అన్నాడు.

స్మిత వెంటనే ఓ కుక్కబొమ్మని చకచకా వేసింది. ఆమెకి నందగోపాల్ మాటలు గుర్తొచ్చి, నాలుక కొరుక్కుంది. ఆమె బుర్ర ఆ క్షణంలో చురుగ్గా పనిచేసింది. వెంటనే పిల్లల వైపు తిరిగి-

"చూశారా కుక్కబొమ్మ? మీరిలా వేయలేరు కదూ! అందుకనే మీకు నేర్పడం కోసం ఈసారి దీని పక్కనే మరో కుక్కని మెల్లగా వేస్తాను. జాగ్రత్తగా నేనెలా గీస్తే మీరూ అలాగే గీయండి. బొమ్మ బాగుంటే ఫుల్‌మార్క్స్ ఇస్తాను" అని ఈసారి ఆగుతూ వేసింది.

ప్రిన్సిపాల్ నవ్వుతూ లేచి వెళ్లాడు. ఆయన వెంటే అందరూ వెళ్లారు. రమ్య మాత్రం స్మిత దగ్గరికొచ్చి "కీపిటప్" అంది. ఇద్దరూ ఆఫీసు రూంలోకి వెళ్లారు. ప్రిన్సిపాల్ ఇద్దరికీ కూల్‌డ్రింక్స్ తెప్పించి, సెలక్టయినట్లూ, మరునటిరోజే జాయినవ్వమని చెప్పాడు.

స్మితకి చాలా ఆనందంగా అనిపించింది. వెంటనే ఆ విషయం హుస్సేన్‌కి చెప్పాలనిపించింది. రమ్య మళ్ళీ వ్యంగ్యంగా మాట్లాడి హుస్సేన్ని పరిహాసమాడ్తుందని ఆ మాట పైకి అనలేదు. "రమ్యా! నాకు మళ్ళీ ఫ్రీడం దొరికినట్లుంది. నేను మీ అందర్నీ కలవచ్చు" అంది.

"ఇప్పుడు నీ స్వేచ్ఛకేం ఆటంకమొచ్చిందే?" అంది రమ్య.

"రమ్యా, నీకు మరీ అరటిపండు వలిచినట్టు విడమరచి చెప్తేగానీ అర్థంగాదు. హుస్సేన్ విషయం ఇంట్లో తెలిసినప్పటినుంచీ నేనెక్కడికి వెళ్లినా వాళ్లకి అనుమానంగానే వుంది. మొన్న నాన్సీదగ్గరికి వెళ్లొస్తే అమ్మ నిజంగా నాన్సీ దగ్గరికే వెళ్లావా అంటూ దొంగని చూసినట్లు చూసింది"

"అరిచే కుక్క కరవదన్న సంగతి అమ్మ మరిచిపోయి వుంటుంది"అని నవ్వి, "స్మితా, ఆ అనుమానపు మాటలన్నీ నిన్ను బెదిరించడానికేతప్ప నిజంగా నీమీద ఆమాత్రం నమ్మకం లేకపోతే ఆరోజునాన్సీ దగ్గరికేకాదు, అసలు అన్నాళ్లు కాలేజీకి ఎలా పంపి వుంటుంది ఆంటీ. అయినా ఏ తప్పు చేయనప్పుడు ఎవరేమన్నా నువ్వు బాధ పడాల్సిన అవసరం లేదు. అవి నీకు వర్తించవు. నువ్వు మరీ ఇంత మెత్తగా వుంటే రేపు స్కూల్లో కూడా ఆటపట్టిస్తారు" అంది రమ్య.

రమ్య మాటలు నిజమే అన్పించాయి. స్మిత ఏమీ మాట్లాడలేదు.

"ఇక నేవెళ్తాను. రేపు జాయినవుతున్నావుగా, విష్యూగుడ్‌లక్.వీలైతే ఆదివారం వస్తాను. జాగ్రత్తగా వెళ్లు" అంది రమ్య తన రూట్ బస్సెక్కుతూ.

రేపట్నుండీ పాఠశాల వాతావరణం ఎలా వుంటుందో అని ఆలోచిస్తుంటే ఎక్కాల్సిన బస్ వచ్చేసింది. కొంతసేపట్లో ఇల్లు చేరుకుంది.

ఉద్యోగం వార్త విని తల్లి సంతోషం వెలిబుచ్చింది.

"ఏదో ఒకటిలే, వూరికే కూర్చుంటే వెధవాలోచనలు వస్తాయి. కానీ ఈ దగ్గర్లో అయితే బాగుండేది, అంతదూరం వెళ్లిరాగలవా?"అంది.

'వెధవ ఆలోచనలు' అనే మాట హుస్సేన్ గురించి అని స్పష్టంగా అర్థమవుతోంది. ఆ మాట విన్నాక ఆమె సానుభూతికి కూడా జవాబు చెప్పలేదు స్మిత.

"నువ్వే పిల్లలా వున్నావు, నువ్వు టీచర్‌వా?"అన్నాడు శరత్.

"అంతే దేవతలకెప్పటికీ ముప్ఫయ్యేళ్లుంటాయట. నాకు అరవయ్యేళ్ళువచ్చినా ఇరవయ్యేళ్ల అమ్మాయిలాగే వుంటాను" అంది స్మిత.

"సర్లే చూద్దాంగానీ, నీ ఫస్టు శాలరీతో నాకేం కొంటావు?" అన్నాడు.

"ఓ కత్తెర కొంటాను, ముందా జుట్టు తగ్గించు" అంది.

శిరీష ఆఫీసునుండి వచ్చి శరత్‌లాగే "నాకేం చీరకొంటావు?" అంది.

"నేను కొనేదేంటి? జీతంతెచ్చి ఇస్తాను. నువ్వే కొనుక్కో" అంది స్మిత.

"ఎంతైనా ఒక జాతికదా... నాకూ ఓ అన్నో తమ్ముడో వుంటే బాగుండేది" అన్నాడు శరత్ నవ్వుతూ.

తండ్రి మాత్రం "ఎక్కడో ఆ వూరి చివర స్కూలు తప్ప ఇంత పెద్ద సిటీలో స్కూళ్లే కరువయ్యాయా? చాలా స్ట్రెయినౌతావు" అన్నాడు అయిష్టంగా.




''ఏంకాదులే నాన్నా, ఇలాంటి ఎక్స్‌పీరియన్సులు కూడా వుండాలి. బస్‌లో పోయిరావడం ఏమంతకష్టం, పైగా ఈ సిటీబసెస్‌కంటే ఆ సబర్బన్ బసెస్ రద్దీ తక్కువ, హాయిగా సీట్ దొరుకుతుంది. అంతగా చేయలేననుకుంటే అప్పుడే మానేస్తాను, వాళ్లేం బాండ్ రాయించుకోలేదు''అంది స్మిత తండ్రికి నచ్చచెపుతూ. ఆయన అంతకంటే వాదించలేదు.

★ ★ ★

స్మిత వెళ్లి ఆఫీసు రూంలో కూర్చుంది. నందగోపాల్ వచ్చి ,''గుడ్‌మార్నింగ్ టీచర్'' అన్నాడు. స్మిత నవ్వి తనూ విష్ చేసింది. నిన్న మొన్నటి వరకూ ఆమె ఒక విద్యార్థి. ఈరోజునుండే గురువు. ఆ టీచర్ అనే పదం తనకో పెద్ద బిరుదులా అనిపిస్తోంది. తను అతి చిన్న విషయాలక్కూడా ప్రతిస్పందిస్తుందేమో. ఎన్ని లక్షలమంది ఉపాధ్యాయులు లేరు. తానూ అంతే, సముద్రంలో నీటి చుక్కలాంటిది. ఈ లోకంలో ఎన్నో వుద్యోగాలున్నాయి. వాటిలో ఈ ఉపాధ్యాయవృత్తికూడా ఒకటి. ఆ మాత్రానికి తానింత సంబరపడిపోనవసరంలేదు అనుకుంది.

మళ్లీ అంతలోనే అన్ని వుద్యోగాలూ, ఇదీ ఒకటెలా అవుతుంది. ఇది ఎంతైనా వేరేవాటికంటే గొప్పదే. నిజంగా తల్చుకుంటే అనేకమంది పిల్లల్ని ఆదర్శవంతులుగా తయారు చేయచ్చు అనుకుంది.

ప్యూన్ వచ్చి ''సార్ రమ్మంటుండు'' అన్నాడు. స్మిత ప్రిన్సిపాల్ దగ్గరికి వెళ్లింది. ఆయన టైంటేబులిచ్చి ''సీమ నడిగి ఓసారి డ్రాయింగ్ స్టాండర్డ్స్ చూడండి. అవసరమయితే తర్వాత డిస్కస్ చేద్దాం. ముందు ఏయే క్లాస్ రూమ్స్ ఎక్కడున్నాయో ఓసారి చూడండి. అన్నట్లు డ్రాయింగ్‌గాక ఇంకేమయినా చెప్పగలరా?'' అన్నాడు ప్రిన్సిపాల్

''సైన్స్ అయితే చెప్పగలను''అంది స్మిత.

''ఓకే మీరెళ్లండి, ఎల్లయ్యా, టీచర్‌కి క్లాసులు చూపించు'' అన్నాడాయన.

స్మితకి హాండ్‌బాగ్ ఎక్కడ పెట్టాలో అర్థంకాలేదు. పరిచయం లేకుండా ఎవర్నీ అడగాలనిపించలేదు. ఇష్టం లేకపోయినా ఆరోజంతా ప్రతి క్లాసుకీ హాండ్‌బాగ్‌తోనే తిరిగింది. దాదాపు అన్ని క్లాసుల్లోనూ పరిచయమే సరిపోయింది.

ఆ వాతావరణానికి అలవాటు పడడానికి తేలిగ్గా ఓ వారం పట్టింది. సహోపాధ్యాయులందరి పేర్లూ తెలిశాయి. దాదాపు అందరూ మాట కలుపుతున్నారు. విద్యార్థులు మాత్రం ఇంకా అందరూ ఒకేలా కన్పిస్తున్నారు. ఎవరు ఏ తరగతికి చెందినవాళ్ళో, వాళ్ళ పేర్లేమిటో ఆమెకేమాత్రం గుర్తుండడం లేదు. ఆ మాటే నందగోపాల్‌తో అంటే ''దాందేముంది? కొన్నాళ్ళుంటే పేర్లు గుర్తుంటాయి. పిల్లలు వందల్లో వుంటారు కాబట్టి మొదట కన్‌ఫ్యూజింగ్‌గా వుంటుంది'' అన్నాడు.

శనివారం పన్నెండున్నరకే స్కూలయిపోతుంది. ఆ రోజు స్కూలు నుండి తిన్నగా హరనాథ్ ఇంటికివెళ్ళింది.

''నన్నడిగితే స్కూల్లో ఆ బేసిక్ డ్రాయింగ్ నేర్పడానికి ఇంత టాలెంట్ కూడా అనవసరం. నువ్వు పీ.జీ. చేస్తావనుకున్నాను'' అన్నాడాయన.

''ఎకనామికల్ ప్రాబ్లం. అయినా పెయింటింగ్ రోజూ ప్రాక్టీస్ చేస్తూ స్టాండర్డ్ పెంచుకోడానికి చూస్తున్నా సర్'' అంది స్మిత.

''కేవలం ప్రాక్టీస్ చేయడం కాదు. ఆర్టు మీద అసంఖ్యాకమయిన పుస్తకాలున్నాయి. అవి చదవడం అలవాటు చేసుకో. అలాగే సిటీలో ఆర్ట్ ఎగ్జిబిషన్స్ పెడుతుంటారు. అవి తెలుసుకోవడం, వాటికి అటెండవ్వడం వలన నీకెన్నో విషయాలు తెలుస్తాయి. అవన్నీ చూట్టం వలన పెయింటింగ్ చేయడంలో రకరకాల మెలకువలు తెలుస్తాయి. ఇన్స్పిరేషన్ కూడా వస్తుంది. ఇంకో సంగతి ఆర్టిస్టులతో పరిచయాలు పెంచుకో, నీకెంతో వుపయోగపడ్తుంది'' అన్నాడు హరనాథ్.

ఆయన అనేక విషయాలు మాట్లాడాడు. తను ఈమధ్య వేసిన పెయింటింగ్స్ చూపాడు.

''సర్! ఒక ఆర్టిస్టు ఇంకో ఆర్టిస్ట్‌నే చేసుకోవాలా?'' అంది స్మిత.

''అలాని రూలేం లేదు. నా భార్య ఆర్టిస్టేంకాదు. షీ ఈజ్‌వర్కింగ్ ఏజ్ ఎ బాంక్ ఆఫీసర్. ఆర్టిస్టంటేనే కలలు కంటాడు. భార్యాభర్తల్లో ఇద్దరూ కలలు కనేవాళ్ళయితే ఇంట్లోకి దొంగ దూరినా తెలీదు. రెండోవాళ్ళు ఆర్టిస్ట్ కాకపోవ

డమే మంచిది. అయినా నీకెందుకొచ్చింది సందేహం. పెళ్ళి చేసుకోబోతున్నావా ఏం'' అంటూ నవ్వాడు హరనాథ్.

''వూరికే అడిగానండీ'' అని నవ్వి, ఇంటికి బయల్దేరింది. అనుమానాలకి చోటివ్వకుండా ఇంటికి వస్తూనే తల్లినుద్దేశించి, ''ఉద్యోగం విషయం చెబుదామని మా లెక్చరర్ ఇంటికి వెళ్ళాను'' అంది. సంధ్య ఏమీ అనక విని, వూరుకుంది. స్మిత అసంతృప్తిగా నిట్టూర్చింది.

''అక్కా! నీకు రెండు లెటర్లొచ్చాయి'' అన్నాడు శరత్.

స్మిత బట్టలు మార్చుకుని, టీ తాగి ఉత్తరాలు చేతిలోకి తీసుకుంది. ఒకటి కవిత, రెండోది రమేష్ రాశారు. ముందు రమేష్ ఉత్తరం తీసింది, త్వరగా చింపి పడేయొచ్చని.

''స్మితగారికి,

నేనింకా గుర్తున్నానా, అప్పుడే మర్చిపోయారా? నిజానికి మీకు ఎన్నో ఉత్తరాలు రాసి, చింపేశాను. ప్రతి నిమిషం మీ ఆలోచనలే. అవన్నీ రాసుంటే పెద్ద పుస్తకమయ్యేది. నన్ను నేను ఎంత కంట్రోల్ చేసుకున్నా, ఈ లెటర్ రాయకుండా వుండలేకపోతున్నాను. స్మితా! ప్లీజ్... మిమ్మల్నోసారి కలవాలి. మీ ఇంటికి రావచ్చా? లేకుంటే ఎక్కడికి రాగలరో చెప్పండి, నేనే అక్కడికొస్తాను. నా అడ్రస్ ఇస్తున్నాను. మీ జవాబు కోసం ఎదురు చూస్తుంటాను, రమేష్''

వుత్తరం చదివి, ఒక్క నిమిషం రావడానికి కుదరదు అని రాస్తే? అనుకుంది. కానీ మళ్ళీ చింపేసింది.

కవిత ఉత్తరం చింపింది.

''ప్రాణసఖీ!

ఈమధ్య నీ ఉత్తరాలు మరీ పోయెటిగ్గా ఉంటున్నాయి. నీ ధోరణి చూస్తే నాకేదో అనుమానంగా వుంది. నా వూహ నిజమయితే వివరాలు రాయి. మాకు వచ్చే నెల్లో పరీక్షలున్నాయి. ఆ టెన్షన్లో ఈ రెండు ముక్కలే రాస్తున్నా. కానీ నీ నుండి బృహల్లేఖ కావాలి, ప్లీజ్, నీ కవిత''

ఆ ఉత్తరం చదివి విసుక్కుంది. కవిత ఇంత పేలవంగా రాయడం ఇదే మొదటిసారి. ఎప్పుడూ చమత్కారాలతో, ఒకటికి పదిసార్లు చదువుకునేంత నేర్పరితనంతో రాస్తుంది.

స్మితకి వెంటనే జవాబు రాయాలన్పించలేదు. ఆమెకి గత వారం రోజులుగా పూర్తి నిరుత్సాహంగావుంది. దేనిమీదా ధ్యానలేదు.

ఆమె తను స్కూల్లో చేరిన విషయం హుస్సేన్‌తో చెప్పాలని ఎంతో కుతూహలపడింది. కానీ ఈ వారం రోజులుగా అతని జాడేలేదు. ఉద్యోగరీత్యా క్యాంపుకెళ్ళినా, అమ్మానాన్నల దగ్గరికెళ్ళినా మునుపెన్నడూ ఇన్నిరోజులు వెళ్ళలేదు. మొక్కుబడిగా తినడమే తప్ప మనస్ఫూర్తిగా భోజనం కూడా చేయాలన్పించలేదు.

ఎక్కడికెళ్ళుంటాడు? తల్లితండ్రులకెవరికయినా అనారోగ్యమేమో? ఏ ఫ్రెండుతోనో కలిసి ఏ మైసూరో వెళ్ళుంటాడా? తనతో చెప్పి వెళ్ళాల్సిన బాధ్యత లేదా? అయినా తన పిచ్చిగానీ అసలు తనేమౌతుంది అతనికి? తనేమయినా బాండ్ రాయించుకుందా ఎక్కడికెళ్ళినా చెప్పాలని? అసలు ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోలేదు కదా?'' ఆమెకి ఏడుపొచ్చింది. బాల్కనీ ఛాయలకే వెళ్ళాలన్పించలేదు. అటు చూస్తేనే తనకి చెప్పలేనంత బాధగావుంది. నిరాశగా, నిస్సత్తువగావుంది. మరో మూడ్రోజులు అలాగే అంత భారంగా గడిచాయి. అతను ఇంట్లో వుంటే అస్తమానం చూడకపోయినా ఆమెకి అదో తృప్తిగావుంటుంది. కానీ అసలు వూళ్ళోనే లేడు అనే విషయం తట్టుకోలేకపోతోంది. ఆమెకా పది రోజులూ ప్రపంచంలో సంతోషం అనేది వుందా అన్పించింది.

పదకొండోరోజు ఉదయం అపనమ్మకంగానే బాల్కనీ తలుపు తెరిచేసరికి అతను కనిపించలేదుగానీ తాళం తీసివుంది. స్మితకి అప్పటివరకూ వున్న ఆవేదనంతా ఆగ్రహంగా మారింది. తాను కూడా అతన్ని చూడకుండా, నిర్లక్ష్యం చేస్తే నేపడ్డ బాధ అర్థమవుతుంది ఇడియట్‌కి'' అనుకుంది. హుస్సేన్ మీద కోపం వచ్చినా, అతి ప్రేమ కలిగినా అతన్ని 'ఇడియట్' అనుకుంటుంది. క్రమేపీ అతన్ని హుస్సేన్ అనుకునేకంటే ఇడియట్ అంటేనే ఆమెకి బాగుంటోంది. స్నేహితులందరికీ కూడా 'ఇడియట్' అనే చెప్పసాగింది. రమ్య ఒకరోజు నవ్వుతూ

''నీక్కూడా అతను ఏ స్టుపిడ్ అనో పేరు




పెట్టుంటాడు'' అంది.

''ఆఁ ఆ ఇడియట్‌కి అంత తెలివి కూడానా?'' అంది స్మిత నవ్వేస్తూ.

రెండు రోజులు అభోజనంగావుంటే మూడో రోజు ఆహారం ఎప్పుడెప్పుడు తిందామా అని తహతహగా వుంటుంది. అతన్ని పది రోజులు చూడకపోయేసరికి స్మితకి పదేళ్ళయినట్లుంది. స్కూలు మానేసయినా అతన్ని చూస్తూ కూర్చోవాలనివుంది. కానీ కోపం, పట్టుదల అడ్డొచ్చాయి. అతనికి కన్పించకుండా చాటుమాటుగా చూసింది. ఈసారి అతనొక్కడే రాలేదు. తల్లిదండ్రులు, ఇంకెవరెవరో వున్నారు. అతని తల్లిదండ్రులు, తమ్ముడు తెలుసామెకు.

స్మితకి దూరం ఎక్కువ కావడాన పావుతక్కువ ఎనిమిదికి బయల్దేరితేగానీ ప్రార్ధన సమయానికి స్కూల్లో వుండలేదు. ఆ రోజుకి వెళ్ళాలని లేకపోయినా దిగులుగా వెళ్ళిపోయింది.

బస్సులో కూర్చుంటే అవే ఆలోచనలు 'ఇతను తనకు చెప్పకుండా ఎందుకు వెళ్ళినట్లు? తాను శ్రీశైలం వెళ్ళేప్పుడు చెప్పాలని ఎంతో ప్రయత్నించింది, కానీ సమయానికి అతను లేకపోయాడు. కానీ తను ఎక్కడికీ వెళ్ళలేదు కదా, చెప్పడం కుదరలేదనుకోడానికి. తనని ఇంటాబయటా అంతా వ్యతిరేకిస్తున్నా అతన్ని పిచ్చిగా ప్రేమిస్తోంది. పెళ్ళి చేసుకోవాలని స్థిరంగా నిర్ణయించుకుంది. అతను కూడా తనని అంతగా కావాలనుకుంటున్నాడా? అతని చేష్టలు చూస్తే అలాగే అనిపిస్తుంది మరి. నిజంగా మనసులో ఏముందో తనకెలా తెలుస్తుంది? ఈ పది రోజులూ అతని గురించి నరకయాతన అనుభవించింది. కానీ తనని చూడనందుకు అతనికలా అన్పించి వుంటుందా? రమేష్ తనంటే మక్కువ చూపుతున్నాడు కానీ రమేష్ తనకి గుర్తు కూడా రాడు. ఎదురుగా వున్నంత సేపే తప్ప అవతలికెళ్తే హుస్సేన్‌కి తను గుర్తుండదా?'' అనుకుంది.

కాదు, అతను అలాంటివాడు కాదు. బహుశా ఏదో తప్పనిసరిగా వెళ్ళాల్సిన పనయ్యుంటుంది. ఎలాగూ వెళ్ళక తప్పదు, ముందుగానే చెప్పి తనను బాధపెట్టడం ఎందుకనుకుని చెప్పి వుండడు. ఉదయం కూడా తనకోసం అతడు ఎదురుచూడడం తాను చాటుగా గమనించింది. తను ఉద్యోగంలో చేరినట్లు అతనికి తెలియదు. బహుశా తను కన్పించనందుకు ఈ రోజు కూడా అతను వర్క్ మాని చూస్తుంటాడు, ఇలా పరస్పర విరుద్ధమయిన ఆలోచనలు ఆమె మనసుని అల్లకల్లోలం చేయసాగాయి. తన కోసం అతను ఎదురు చూస్తాడనే భావన ఆమెకి ఎంతో హాయిగా అనిపించింది.

కొత్తదనం పోయి స్కూలు వాతావరణం స్మితకి ఎంతో ఆహ్లాదంగా వుంటోంది. ఆమె ఉపాధ్యాయులతో కంటే విద్యార్థులతోనే సన్నిహితంగా మెలగుతోంది. విద్యార్థుల్లో బొమ్మలు బాగా వేసేవాళ్ళు, మరీ అధ్వాన్నంగా వేసేవాళ్ళు మాత్రం గుర్తుంటున్నారు. ఆ రోజు ఆరవ తరగతిలో ఒక విద్యార్థి డ్రాయింగ్ బుక్ తెచ్చి ''టీచర్ నేనే వేశాను, బాగుందా, సైన్ చేయండి'' అన్నాడు స్మితకి పుస్తకాన్ని అందిస్తూ.

''ఏమిటి రవీ! ఇది మండ్రగబ్బా?'' అన్నది స్మిత.

''మండ్రగబ్బా? అదేంటి టీచర్, ఇది మస్కిటో'' అన్నాడు.

స్మిత పొట్టచెక్కలయ్యేట్లు నవ్వింది. ఆమెని చూసి పిల్లలు కూడా నవ్వారు. రవి బిక్కమొహం పెట్టుకుని చూస్తూంటే స్మిత వాడి మనసుని నొప్పించలేక ''చాలా బాగుంది, మీ ఇంట్లో ఇంత పెద్ద దోమలున్నాయా, అవి మీ మాంసాన్ని కూడా తింటున్నాయా ఏం?'' అంది.

రోజులో అనేకసార్లు అలాంటి అమాయకపు చేష్టలతో పిల్లలు ఆమెకి ఆహ్లాదం కలిగిస్తున్నారు.

ఆ సాయంత్రం కూడా స్మిత అలక తీరలేదు. బాల్కనీ తలుపు తెరిచిపెట్టి, పక్కమీదే పడుకునివుంది. రేడియోలో ''రానంతవరకూ విరహమా, నేను రాగానే కలహమా?'' అంటూ కృష్ణ, సత్యభామలపై సంధించిన పాట వస్తుంటే ఆమెకి నవ్వొచ్చింది. 'కానీ తను బెట్టుచూపాలి. తన కోపం అతనికి తెలియాలి. తను మరీ బేలలా కనిపించగానే అయిసయిపోతుంది అనుకోకూడదు. ఇన్నాళ్ళూ అతని కోసం తనేం బాధ పడలేదనీ, చాలా ధీమాగా

వున్నానని అతను అనుకోవాలి'' ఈ ఆలోచనలే ఆమెని బాల్కనీలోకి వెళ్ళనివ్వలేదు.

మరునటి రోజు ఉదయం క్రిందనుండి కూరగాయల బండివాడు పోతుంటే కరివేపాకు వుందేమో కనుక్కోమంది సంధ్య. బాల్కనీలోకి రోడ్డు కనిపిస్తుంటుంది. రోడ్డుకి అవతలి వైపు హుస్సేన్ వుండే ఇల్లు. స్మిత తలుపు తెరిచేసరికి హుస్సేన్ చేతులు కట్టుకు నిలబడి ఇటేచూస్తున్నాడు. ఒక్క క్షణం చూపులు కలిశాయి. ఆమె చూపుని మరల్చేసి కిందికి చూసింది. బండి కిందేవుంది. కాస్త పెద్దగా పిలిస్తేగానీ వినపడదు. కానీ హుస్సేన్‌కి స్పష్టంగా వినిపిస్తుంది. అతనుండగా అలా పెద్దగా మాట్లాడ్డం సంకోచంగా అన్పించింది. చప్పట్లు కొట్టింది. కూరలతను పైకి చూశాడు. ''కరివేపాకుందా?'' నాజూగ్గా అడిగింది.

లేదని చెప్పాడువాడు. తలెత్తుతూ అతన్ని చూసింది. నవ్వి, అటూ ఇటూ చూసి ''వ్వెవ్వెవ్వె'' అన్నాడు. అతనలా అనడం అదే మొదటిసారి, అతని సైగలకి మురిసిపోయినప్పుడూ తన పిచ్చి ప్రేమని వెల్లడించేప్పుడూ స్మిత అతన్నలా నాలుక బయటపెట్టి వెక్కిరిస్తుంది. స్మిత కోపం మాయమైపోయింది. తల పంకించాడు. తర్వాత చెప్తానన్నట్లు సైగ చేశాడు. **ఇద్దరూ నవ్వుకున్నారు.**

స్మితకి అతని ముఖం కొత్తగా అన్పించింది. ఎందుకా అనుకుంటే అర్థమైపోయింది. గడ్డం పెంచాడు. అతను వెళ్ళేటప్పుడు సరిగ్గా పెరగక స్పష్టంగా తెలియలేదేమో. మామూలుగా స్మితకి గడ్డం పెంచితే ఇష్టం. గడ్డముంటే మేధావుల్లా, కళాకారుల్లా వుంటారనుకుంటుంది. కానీ అతను మామూలు గడ్డం కాదు, పిల్లి గడ్డమో ఏదో అంటారు అలా వుంది. ఏకబిగిని వుండక మొరికలుగావుంది. అది అతని అందాన్నే అపహరించింది. ఆ రకపు గడ్డం అతనికే మాత్రం నప్పలేదు. గడ్డం మీద చేయిపెట్టి 'అస్సలు బాలేదు' అని సైగ చేసింది.

''నిజమా?'' అని అడిగాడు. అవునని తలూపి అమ్మ పిలుస్తోందంటూ చేయి చూపి, లోనికొచ్చేసింది. అప్పటికే ఏడవుతోంది. ఆమెకి మళ్ళీ బాల్కనీలోకి చూట్టానికి టైము లేదు. అన్నం తింటూ తన ఉద్యోగం సంగతి చెప్పాల్సింది అనుకుంది. టైమైపోతుంటే స్కూలుకి బయల్దేరింది. కిందికి దిగాక అతని కోసం పైకి చూసింది. కానీ లేడు. తాను వెళ్ళే సంగతి తెలీదుగా అనుకుంది.

రెండోరోజు స్మిత వెళ్తుంటే పైనుండి చూశాడు. అలా కొన్ని రోజులు గడిచాక ఒకరోజు స్మిత బయల్దేరే సమయానికి హుస్సేన్ ఆ సందు మలుపు దగ్గర నిలబడ్డాడు. అది చూసిన స్మిత కాళ్ళు ఒణికాయి. గుండె బరువుగా అనిపించింది. తప్పనిసరిగా ముందుకి నడిచింది. అతను కొంత దూరం వరకూ ఆమె వెనకగా నడిచి తర్వాత

''ఎక్కడికి వెళ్తున్నారు?''అని అడిగాడు.

''ఒక స్కూల్లో డ్రాయింగ్ టీచర్‌గా ఉద్యోగమొచ్చింది''

''ఓహ్! టీచర్ జాబంటే బాగుంటుంది. నా చెల్లెళ్ళలో ఒకామె టీచర్‌గానే చేస్తోంది'' అన్నాడు.

చెల్లెళ్ళు అంటున్నాడు, ఎంతమందో? ఈ మహమ్మదీయుల్లో తనకు నచ్చని విషయం ఫామిలీ ప్లానింగ్ పాటించకపోవడం. ఒక్కొక్కరూ డజన్లకొద్దీ పిల్లల్ని కని దేశ జనాభాని మరింత పెంచుతున్నారు. కానీ అతని ఇంటి వివరాలు ఏమీ అడగాలన్పించలేదు. అవన్నీ తెలుసుకోవడం ఆమెకి అనవసరమన్పించింది.

''ఎక్కడికెళ్ళాలి, ఏ స్కూలు?'' అన్నాడు.

''చాలా దూరంలే, సిటీ అవుట్ స్కర్ట్స్''

అతనేదో ఆలోచనలో పట్టం చూసి 'బహుశా, ఇంకెక్కడా వుద్యోగం దొరక్క అంత దూరం పోయిందనుకుంటాడేమో'నని.

''అక్కడంతా గ్రామ వాతావరణం. సిటీ కంటే అక్కడబాగుంటుందని'' అంది స్మిత. లోపల తానేదో భుజాలు తడుముకున్నట్లే భావించింది. కానీ అందులో తప్పేముంది. తనని అతను దగ్గరగా చూసింది లేదు. తనకేపాటి ప్రతిభా లేదనుకోవచ్చు. స్కూల్లో చేరేముందు ఎలాంటి వాతావరణం అని ఆలోచించకపోయినా ప్రస్తుతం మాత్రం తెలివిమీరిన సిటీ పిల్లలకంటే అమాయకులైన ఆ పిల్లలు ఆమె మనసుని ఎంతగానో ఆకట్టుకుంటున్నారు.





అతనేదో అడగాలని తటపటాయిస్తుండగా స్మిత ఎక్కాల్సిన బస్ రావడం, ఆమె ఎక్కడం జరిగింది. బస్సులో కూర్చున్నాకగానీ ఆమె గుండెదడ తగ్గలేదు. అప్పటివరకూ వున్న భయం ఆనందానుభూతిగా మారింది. తను బాగాలేదని చెప్పినందుకు అతను గడ్డం తీసేశాడు. ఆ రోజంతా ఆమె హుషారుగా గడిపింది.

★ ★ ★

ఆరోజు ఆదివారం, స్మిత పికాసో బయోగ్రఫీ చదువుతూ కూర్చుంది. శరత్, శిరీష మేనత్త ఇంటికి వెళ్ళారు. తండ్రి క్రాఫ్ చేయించుకోడానికి వెళ్ళాడు. తల్లి పూజ చేసుకుంటోంది.

కాలింగ్ బెల్ మోగితే స్మిత వెళ్ళి తలుపు తీసింది. అంతే ఆమె ఆశ్చర్యానందాలకి అంతులేదు. స్మిత పెద్దత్త కొడుకు చరణ్, హుస్సేన్ ఇద్దరూ నిలబడివున్నారు. ఆమెకి కొంతసేపు మాటలు రాలేదు.

వీళ్ళిద్దరికీ ఎలా పరిచయం? బావ వారాసిగూడలో వుంటున్నాడు. తను ఇన్‌కం టాక్స్ ఆఫీసరుగా పనిచేస్తున్నాడు. బయట ఎక్కడో పరిచయమై, అప్పుడప్పుడూ రావడం చూసి, బంధుత్వం తెలుసుకుని వచ్చాడా? తమ విషయం చెప్పేశాడా ఏం. స్విచ్ నొక్కగానే ఫాన్ తిరిగినట్లు, వాళ్లని చూడగానే ఆమె బుర్ర ఆలోచిస్తోంది.

"ఏం స్మితా! లోపలికి రానివ్వవా?" అన్నాడు చరణ్.

"రండి, రండి" అని ముందున్న ఖాళీ స్థలం దగ్గరే కొన్ని కుర్చీలుంటే అవి వాల్చింది.

తల్లి చూస్తుందనే భయంతో లోపలికి రమ్మనలేకపోయింది. చరణ్ ఫ్రెండుగా ఎవరికీ ఏ అభ్యంతరం వుండదుగానీ తనకి నచ్చిన ముస్లిం యువకుడుగా మాత్రం అతని రాకని బహుశా ఎవరూ సహించకపోవచ్చు.

ఎప్పుడూ తల్లి గంటలు గంటలు పూజలు చేస్తుందని విసుగుచెందే స్మిత ఆవేళ అప్పుడే పూజలోంచి లేవకపోతే బాగుండనుకుంది. పరుగులాంటి నడకతో వంటింట్లోకెళ్లి టీ పెట్టి, ఒక ప్లేట్లో బిస్కెట్లు పెట్టుకుని, అవి, టీ కప్పులూ కలిపి ట్రేలో పెట్టి తెచ్చింది. అక్కడ టీపాయ్ లేనందున కుర్చీ మీద పెట్టి వారిద్దరికీ మధ్యగా జరిపింది.

ఇద్దరూ బిజినెస్ గురించి ఏమో మాట్లాడుకుంటున్నారు. తమ విషయం చెప్పలేదని ఆమెకి అర్థమయ్యింది.

"టీ ఆరిపోతోంది, ముందు టీ తాగండి" అంది స్మిత.

"స్మితా! ఇతను వి.ఐ.పీ.లో సేల్స్ ఇన్‌ఛార్జ్. ఆంధ్రా ముస్లిం. తెలుగు మనకంటే బాగా మాట్లాడ్తారు" అని స్మితతో చెప్పి ఆమెని ఆర్టిస్టుగా పరిచయం చేశాడు.

స్మిత సిగ్గుపడుతూ "ఏం బావా! నాకు చాలా పబ్లిసిటీ ఇస్తున్నావే" అంటూ నవ్వింది.

హుస్సేన్ బ్రీఫ్ కేస్ తెరిచి వి.ఐ.పీ. పర్సులు రెండు చరణ్‌కి, రెండు స్మితకీ ఇచ్చాడు. ఇద్దరూ కృతజ్ఞతలు చెప్పారు.

"ఇంట్లో ఎవరూ లేరా?" అడిగాడు చరణ్.

"అమ్మ మాత్రమే వుంది, పూజ చేస్తోంది"

"నేను మళ్ళీ వస్తాను" అన్నాడు చరణ్. ఇద్దరూ లేచారు. హుస్సేన్ "ఫైన్ కాఫీ, థాంక్యూ సోమచ్" అన్నాడు చరణ్ అటు తిరిగాక ఆమెని చూస్తూ. వేయి వసంతాల కలయికలావుంది ఆ నవ్వు.

ఇద్దరూ వెళ్ళిపోయాక ఆ పర్సులు తీసుకుని ముద్దు పెట్టుకుంది. వాటిని తీసికెళ్ళి పుస్తకాల రాక్‌లో భద్రపరిచింది. టీ ఇస్తే కాఫీ బాగుందంటాడే అనుకుంది.

"ఎవరొచ్చారు?" అడిగింది సంధ్య.

"బావ, తన ఫ్రెండుతో వచ్చాడు, మళ్ళీ వస్తానన్నాడు" అంది.

అప్పుడు సమయం పదకొండయ్యింది. "అమ్మా! హారతిని కలిసి చాలాకాలమైంది, తన దగ్గరికి వెళ్ళొస్తాను" అంది సంధ్యతో.

"వెళ్ళు... నేను అడిగానని చెప్పు అలాగే రమ్మని కూడా చెప్పు" అందామె.

స్మిత డ్రెస్ చేసుకుని పర్సు తీసుకుని నడుస్తుంటే ఆమె ఆలోచన మారింది. ముందు హరనాథ్‌గారింటికి వెళ్ళి, అట్నుండి హారతి దగ్గరికి వెళ్ళింది. "ఏమార్టిస్టూ! ఈరోజు తుఫాన్ రాదు కదా?" అంది హారతి.

"నీకూ, మా బావకీ వ్యంగ్యంగా వుంది. ఆర్టిస్టార్టిస్ట్ అంటారు. నా పేరు ఆర్టిస్టు కాదు"



అంది స్మిత.

"అదేదో తిట్టినట్లు బాధపడ్తావే? నన్నన మంటే అంటారా?"

"నువ్వు వంట బ్రహ్మాండంగా చేస్తావు. నిన్నూ నలభీమ్ అని పిలవనా?

"ఆర్టూ, వంటా ఒకటా? నాది బిలో డిగ్నిటీ.:."

"నీ మొహంలే. దేని విలువ దానిదే. నాకు వంట రాదు, నాకు అది గొప్ప, నువ్వు బొమ్మలేయవు, నీకు ఇది గొప్ప"

"సర్లే, నీ కథ ఎంతవరకొచ్చింది?"

"ష్... అన్నయ్య వింటారు"

"లేరు, పని చాలా వుందని ఆఫీసుకెళ్ళారు, చెప్పు..."

"చెప్పాలనే వచ్చాను. నా మనసేం బాగోడం లేదు. ఉద్యోగం సంగతి మొన్న ఫోన్ చేసి చెప్పాగా అదొక్కటే కాస్త హాయిగా వుంది. పిల్లలమధ్యలో అన్నీ మర్చిపోగలుతున్నాను. కానీ..."

"ఏమైందే స్మితా! వివరంగా చెప్పు"

"హారతీ! నేను చెప్పేది లాజికల్‌గా వుండదు. వింటే నువ్వే కాదు, ఎవరైనా నవ్వుతారు,

కానీ నా ఫ్రెండుగా నా ఏంగిల్లో ఆలోచిస్తూ అర్థంచేసుకోడానికి ప్రయత్నించు... హుస్సేన్ విషయంలో నేను తెగువ చేయలేకపోతున్నా. అమ్మ చిన్నప్పట్నుండీ ఓ జ్యోతిష్యుడి గురించి చెప్తోంది. అతను చాలా పేరుమోసినవాడట. ఒకసారి తన చెయ్యి చూపించుకుందామని వెళ్తే, చిన్న పిల్లగా పక్కనున్న నన్ను చూసి ''ఈ అమ్మాయికి ఒక పెళ్ళి పీటల వరకూ వచ్చి ఆగిపోతుంది. ఒకవేళ ఆ పెళ్ళి జరిగినా వెంటనే విడిపోతారు. తర్వాత మళ్ళీ పెళ్ళి చేసుకుని హాయిగా వుంటుంది'' అని చెప్పాడట. ఈ ఇడియట్ కనిపించేవరకూ నాకు పెళ్ళి ఆలోచనే లేదు కాబట్టి ఆ మాటలు నేనెప్పుడూ పట్టించుకోలేదు. కానీ ఇప్పుడుమాత్రం ఆ మాటలు నన్నెంతగానో భయపెడుతున్నాయి. ఇంట్లో, బయటా కూడా ఈ పెళ్ళికి అంతా వ్యతిరేకతే చూపిస్తున్నారు. అతని ఇంట్లో పరిస్థితి ఎలా వుందో తెలీదు. బహుశా హిందువులకంటే ముస్లిములకి మరింత పట్టుదల వుండచ్చు. ఒకవేళ అతను తనవాళ్ళని ఎదిరించి నన్ను పెళ్ళి చేసుకున్నా నా జాతక ప్రభావంవల్ల అంత త్వరగానూ విడిపోతామేమో. ఆ విడిపోవడం అనేది తల్చుకుంటే అసలు పెళ్ళే వద్దనిపిస్తోంది'' అంది స్మిత.

''విడిపోతే నీకు నాన్‌వెజ్ వండడం రాకో, హిందీ మాట్లాడ్డం రాకో విడిపోవచ్చు. నీకు తాగుడు నచ్చదు కాబట్టి అతను తాగితే విడిపోవచ్చు. దానికి జాతక ప్రభావమేముంది?''

''అదే నాకు విచిత్రంగా అనిపిస్తోంది. అంత పిల్లగా వున్నప్పుడే ఆయన ఎలా చెప్పగలిగాడో? విడిపోవడానికి అవకాశాలు ఎక్కువ వున్నట్లూ అనిపిస్తుంది. పరస్పరం ఇంత ప్రేమ, ఆకర్షణతో వున్నప్పుడు ఎలా విడిపోతాం అనీ అనిపిస్తుంది. నాకేం అర్థంకావడంలేదు. ఇప్పుడే హరనాథ్‌గారింటికి వెళ్ళొస్తున్నా. ఆర్టిస్టుగా నన్ను అర్థంచేసుకుంటారనీ, గురువుగా సలహా ఇస్తారనీ విషయమంతా ఆయనకి చెప్పాను. సార్ ఏమన్నారో తెలుసా... 'ఇంకెవరయినా పర్లేదు, ముస్లిం అంటున్నావు. పెద్ద చిక్కే వచ్చింది. పూర్తి భిన్నమైన సంప్రదాయాలు. అసలతను మీ నాన్నతో ఎందుకు మాట్లాడడు? - 'మీ అమ్మాయిని చేసుకుంటా'నని చెప్పొచ్చుగా? ఒకపని చెయ్యి. ఇప్పటికి రెండేళ్ళు దాటిందంటున్నావు. ఇంకొక సంవత్సరం ఆగు. అతను అడిగితే సంవత్సరం వరకూ పెళ్ళి ప్రసక్తి తేవద్దని చెప్పు. పైపై ఆకర్షణగాక నిజమైన ప్రేముంటే అతను నీకోసం వెయిట్ చేస్తాడు' అన్నారు''

''ఇదీ బాగానే వుంది'' అంది హారతి.

''ఈమధ్య ఇంకోవిషయం జరిగింది. మా అత్తయ్య కొలీగ్ ఒకావిడ పెళ్ళికానివాళ్ళకి రాబోయేవాళ్ళ పేరులోని మొదటి అక్షరం చెప్తుంది. ఇంకా చాలా విషయాలు చెప్తుంది గానీ ఇది మాత్రం ఆవిడ ప్రత్యేకత. ఆమె చెప్పినవాళ్ళకి ఇంతవరకూ కరెక్టుగా జరిగిందట. ఇది తెలిసి సుచరితని ఒకరోజు ఆఫీసుకి వెళ్దామా అమ్మ పర్మిషన్తో అని అడిగాను. అది విన్న అత్తయ్య తనకి కూడా కొన్ని వివరాలు తెలుసుకునేదుందనీ, ఒకరోజు ఇంటికే తీసుకొస్తాననీ చెప్పింది. ఆ ఎదురు చూసినరోజు రానే వచ్చింది. కానీ జరిగిన తంతుమాత్రం వూహించలేకపోయాను. ఏమయ్యిందో తెలుసా? వూరోళ్ళదీ, పేరోళ్ళదీ అన్నట్లు మా కుటుంబాల్లోని పెద్ద, చిన్న ఆడ, మగ, ముసలి, ముతక- అందరూ, ఆఖరికి పక్కింటివాళ్ళతోసహా వచ్చారు. అందరికీ చేయి చూపించుకోవాలనే తహతహ. కానీ తనకున్న దుర్భరపరిస్థితి కాదు కదా వీళ్ళది అని నాకు చిరాకేసింది. నావంతు దాదాపు చివర్లో వచ్చింది. ఆవిడ ఏవేవో చెప్పింది. నా మనసుకి సరిగా ఎక్కలేదు. కానీ ఆశగా, వెర్రిగా ఎదురుచూసిన అక్షరం మాత్రం అస్పష్టంగా 'ఎన్' అనో 'ఎమ్' అనో నూతిలోంచి చెప్పినట్లు చెప్పి ఇంకోళ్ళ చెయ్యి అందుకుంది. ఆ అక్షరం ఏమిటని మరోసారి సిగ్గు విడిచి 'అడగలేకపోయాను'' అంది స్మిత.

''చల్లకొచ్చి ముంత దాచినట్లు అదేంపని. ఎలాగో నీ విషయం అందరికీ తెలిసిపోయిందంటున్నావు. పైగా నీ కోరిక ఆనరాగానే ఆవిడొచ్చింది, అలాంటప్పుడు...''

''అవన్నీ నిజాలే. కానీ హారతీ! నేనెంత మొహమాటస్థురాలినో, నా మనసెలాంటిదో నీకు తెలుసు. అంతమంది మధ్యలో ఆ వివరంకోసం రెట్టించలేకపోయాను. ఆమె అన్నది 'ఎమ్' అయితే అతని పేరులో మొహమ్మద్ వుంది కాబట్టి పెళ్ళి ఖాయమే. కానీ అదే 'ఎన్' అయితే? ... ప్చ్... నాకేం తోచడం లేదు''



అంది స్మిత.

"అతన్నోసారి ఇక్కడికి తీసుకురారాదూ. నే మాట్లాడ్తాను"

"కొంపతీసి ఇవన్నీ చెప్తావా ఏం? ఫూలిష్‌గా వుంటుంది"

"ఏమో తల్లీ! నీ ప్రేమకథ ఏమౌతుందో నాకర్థంకావడంలా" అంది హారతి పెద్దగా నవ్వుతూ?



స్మిత ఆరో తరగతి క్లాసు తీసుకుంటూండగా "ఎక్స్‌క్యూజ్‌మీ, టీచర్!" అన్నాడు నందగోపాల్ కాస్త రొప్పుతూ వచ్చి.

"ఎన్నిసార్లు చెప్పినా టీచరనే అంటారు. మీక్కూడా నేను టీచర్నా?" అంది స్మిత నవ్వుతూ తలుపు దగ్గరికి వచ్చి.

"మన వృత్తే అది కదా?" అన్నాడు అతడూ నవ్వుతూ.

"వృత్తేగానీ పేరు కాదుగా?"

"పేరుతో పిలిస్తే బాగోదు. సరేగానీ, బసెస్సన్నీ నిలిపేశారంటున్నారు. ఎలా వెళ్తారు?"

"ఏమైంది, అర్థాంతరంగా ... పొద్దుట వున్నాయిగా"

"ఓ కండక్టర్‌నీ ఓ పోలీస్ తన్నాడట"

"అందుకని బస్సులు నిలిపేస్తే మధ్యలో పబ్లిక్ సఫరవ్వాలా?"

"మేడం! ఇది భారదేశమని మర్చిపోకండి. లా అండ్ ఆర్డర్ గురించి మర్చిపోవాలంతే"

"మీరో టీచరయ్యుండి, పిల్లలక్కూడా ఇలాంటి పిరికితనమే నూరిపోయండి"

"పోన్లే, నావంతు కూడా మీరే పోరాటం నేర్పిద్దురుగాని, కానీ మీ సంగతేంటో ఆలోచించండి ముందు. మా ఇల్లు ఇక్కడేగదా, ఈరోజుకి మా ఇంట్లో వుండండి, రేపెళ్దురుగాని"

"ఇంకా నయంలే. సాయంత్రం టీవీలో కన్పట్టం లేదు, ఆచూకీ తెల్పండి అంటూ నా బొమ్మ వేయిస్తారు"

"మంచిదేగా, అలానయినా టీవీలో కన్పిస్తారు"

"నాకేమంత టీవీ పిచ్చి లేదులేండి"

"మీ ఇంట్లో ఫోనుందా? ఫోన్ చేసి చెప్పొచ్చు"

"మాకు లేదు, మా పక్కింట్లో వుందిగానీ వాళ్ళున్నారో లేదో"

"నంబరైతే ఇవ్వండి, ముందు ట్రైచేసి చూస్తాను"

"ఉహూఁ? వద్దండీ, ప్లీజ్ నేనెలాగో వెళ్తాన్లే"

"ఎలా వెళ్తారు? పాదయాత్ర చేస్తారా?"

ఇంతలో గిరిజ వచ్చి "పోనీ మీ స్కూటర్ మీద డ్రాప్‌చేయొచ్చుగా?" అంది.

"అయ్యయ్యో, ఏమక్కర్లేదు. ఎలాగో ఏ ఆటోలోనో సికింద్రాబాద్ వరకూ వెళ్ళగలిగితే అక్కణ్ణించి ఏమంత కష్టంగాదు"

నందగోపాల్ ఒక్క నిమిషం ఏమీ మాట్లాడలేదు.

కొంతసేపాగి ఫోన్ నంబరడిగి తీసుకుని వెళ్ళాడు. పది నిమిషాల్లో తిరిగిచ్చి నంబర్ ఎంగేజొస్తోందని చెప్పాడు.

అప్పటికే ప్రిన్స్‌పాల్ సిటీనుండి వచ్చే టీచర్లని వెళ్ళిపోమని చెప్పాడు- అంతా వేగంగా రోడ్డువైపు నడుస్తున్నారు.

స్మితకి నందగోపాల్ ప్రవర్తన నచ్చులేదు. ఇతర ఏ టీచర్లతోనూ ఆమె పెద్ద చొరవగా మాట్లాడదు కానీ నందగోపాల్ కావాలన్నట్లు, అభిమానంగా వుండడంవలన ఆమె కూడా అతడితో సన్నిహితంగా వుంటుంది. స్కూలు విషయాల్లో తనకేమయినా కష్టనష్టాలు కలిగితే అతడితో మాత్రమే చర్చిస్తుంది. అలాగే అతడు కూడా తన స్వవిషయాలు ఆమెతో పంచుకుంటాడు.

గిరిజ స్కూటర్‌మీద డ్రాప్‌చేయమని సల




హాఇచ్చినా, అతనా విషయం విననట్లు, ఇష్టంలేనట్లు పట్టించుకోకుండా వుండడం ఆమెకి అసంతృప్తిగా, ఆందోళనగావుంది. నిజానికి అలా వెళ్ళడం ఆమెకే ఇష్టంలేదు. అతను సరేనన్నా ఆమె ఒప్పుకునేది కాదు. అంటే అతడి వుద్దేశమేమిటి? ఒట్టి కబుర్లే తప్ప నిజంగా అవసరమయితే తనకాపాటి సహాయం చేయడా?

అయినా తనకెందుకింత అనుమానం? ఎవ్వరికీ పట్టకపోయినా అతనేకదా ముందొచ్చి చెప్పాడు? పైగా తన ఇంటికీ రమ్మన్నాడు. వేరే వాళ్ళెవరూ ఆపాటి ధైర్యం కూడా చేయలేదుగా? గిరిజ సలహా ఇచ్చినప్పుడు తనే ఒద్దంది. లేకుంటే అలాగే దింపుతాననేవాడేమో - ఇలా ఆలోచిస్తూ నడుస్తోంది. నందగోపాల్ స్కూటర్ స్కూల్లోనే వదిలేసి వాళ్ళతో బాటే నడుస్తున్నాడు. మెయిన్‌రోడ్డు చేరుకున్నారు. ముప్పావుగంట చూసినా ఒక్క బస్సు రాలేదు. సిటీనుండి వచ్చే మిగిలిన ఇద్దరు ఉపాధ్యాయులూ మగవారే. వాళ్ళిద్దర్లో ఒకరు లారీలో వెళ్ళిపోగా, రెండో వ్యక్తి స్కూటరతన్ని లిఫ్టడిగి వెళ్ళిపోయాడు.

ఈలోపు నందగోపాల్ ఫోన్ చేసే ప్రయత్నంలోనే వున్నాడు. చిట్టచివరికి కనెక్టయింది. విషయం చెప్తే, సరే అలాగే తెలియజేస్తామన్నారు అవతలనుండి.

''ఛఛ... ఒక్క ఆటో కూడా లేదు'' స్మిత వినుగ్గా మనసులో అనుకుంటున్నట్లుగా పైకే అంది.

''సిటీనుండి ఇక్కడికి ఆటోలో రావచ్చుగానీ, ఇక్కణ్ణుంచి ఆటో దొరకడం చాలా కష్టం. ఫోన్‌చేసి చెప్పాగా, ఇక వదలండి, మా ఇంటికెళ్దాం'' అన్నాడు నందగోపాల్.

స్మితకి అతనింటికి వెళ్ళడానికి మనసు అంగీకరించడం లేదు. ఈ పరిస్థితికి కారణమయిన పోలీసులని, కండక్టర్లని, డ్రైవర్లని తిట్టుకుంది. తీరూ తెన్నూలేని వెధవగవర్నమెంట్. పదవులు కాపాడుకోడానికి చూపించే శ్రద్ధలో వెయ్యోవంతుకూడా ప్రజల బాగోగులు పట్టించుకోడానికి చూపరు అనుకుంది. వెళ్ళాలని లేదు, వెళ్ళక తప్పేట్టు లేదు, ఏం చేయాలి అంటూ ఆలోచిస్తోంది.

''ఏమాలోచిస్తున్నారు? రండి, వెళ్దాం''

స్మిత అయిష్టంగానే అతన్ని అనుసరిస్తోంది.

''స్కూటర్‌మీద డ్రాప్ చేయమని సలహాఇచ్చిన గిరిజే రేపు పిచ్చిగా ప్రచారం చేసినా ఆశ్చర్యం లేదు'' అన్నాడు నందగోపాల్.

''మీకలాంటి భయాలున్నాయని చెప్పండి గానీ అనవసరంగా ఆవిణ్ణెందుకు అనుమానిస్తారు'' కోపం, వ్యంగ్యం కలగలసిన కంఠంతో అంది.

''మీలోవున్న ఈ అమాయకత్వమే నాకు మరీ నచ్చుతుంది. కానీ అంతా మీలానే వుంటారని ఎందుకనుకుంటారు?''

''నేనేం అమాయకురాల్ని కాను''

''అవునవును, చాలా తెలివైన వాళ్ళు'' అన్నాడు నవ్వుతూ.

కొద్దిసేపాగి ''ఇక్కడున్నవాళ్ళెవరూ గొప్ప కల్చరున్నవాళ్ళు కాదు. మేడిపండులా చూట్టానికి బాగానే కన్పిస్తారు. లోపలమాత్రం... నేను మీతో మాట్లాడ్డం కూడా మన వాళ్ళెవరికీ నచ్చదు''

స్మిత కాస్త ఆశ్చర్యంగానే వింటోంది. ఆమెకి ఇతర టీచర్లు ఎవ్వరూ ఆప్తులుగాకపోయినా శత్రువులు కూడా కాదు. వాళ్ళు నందగోపాల్ చెప్తున్నట్లు ఎప్పుడూ ప్రవర్తించలేదు. కేవలం ఒక పురుషుడితో మాట్లాడ్డమే తప్పని తను అనుకోదు. ఇంకొకరు అనుకుంటే సహించదు. తనకి అతడిమీద ఎలాంటి ఉద్దేశమూ లేదు. అందుకే తనకా సందేహం కూడా రాలేదు. బహుశా వాళ్ళని తనే గమనించడంలేదేమో.

''చదువుకున్నంతలో కల్చర్ వస్తుందంటే నేను నమ్మను. వాళ్ళని అనడం కూడా తప్పే. ఇంటి వాతావరణం, పరిసరాల ప్రభావం ఉన్నతంగా ఆలోచించే అవకాశం ఇవ్వదు'' అన్నాడు నందగోపాల్.

స్మిత జవాబేం చెప్పకుండా లోపలే ఆలోచిస్తోంది. 'చూశావా వాళ్ళ కల్చర్! బస్సులు ఆగిపోయి నీకు ఇబ్బంది కలిగితే కనీసం రమ్మని కూడా అన్లేదు వాళ్ళెవరూ నేను తప్ప - అంటాడేమో. ఆ మాటంటే తనకెంత తల కొట్టేసినట్లుంటుంది? అక్కడికి అతడే తనని ఉద్ధరిస్తున్నట్లు ఫోజు కొడితే తను భరించలేదు. ఆ ప్రస్తావన రాకముందే మాట మార్చాలి'



అనుకుంది.

"ఇంతకీ మీ ఇంట్లో ఎవరెవరుంటారు?" అంది.

"అమ్మా, నాన్నా, ఇద్దరు చెల్లెళ్ళు"

"మరి మీ భార్యా, పిల్లలు?"

"మర్చేపోయా, వాళ్ళు కూడా" అన్నాడు గలగలా నవ్వేస్తూ.

"ఆఁ ఆఁ మర్చిపోతారు... ఆవిడ్తో చెప్తాన్లే వదండి" అంది.

"ఇంతలో ఇల్లొచ్చేసింది. తల్లికి, చెల్లెళ్ళకి స్మితని పరిచయం చేశాడు. విషయం రెండు ముక్కల్లో చెప్పి తను స్కూలునుండి స్కూటర్ తెస్తానని వెళ్ళాడు.

నందగోపాల్ తల్లి చాలా ఆప్యాయంగా పలకరించింది స్మితని. అతడి చెల్లెళ్ళు విమల, మంజుల అయితే స్మిత తమకి పదేళ్ళుగా పరిచయమున్నట్లు కలసిపోయారు. కబుర్లతో ముంచేశారు.

అతని తల్లి పార్వతి ఒక పొడవాటి గ్లాసు నిండా పాలు తెచ్చి "తాగమ్మా" అంది.

"అమ్మో ఇన్ని పాలా? సగం తీసేయండి" అంది.

"అంత నాజూకయితే పాఠాలెలా చెప్తావమ్మా తాగు" అంది.

"పెద్దావిడతో అంతకంటే రెట్టించడం ఇష్టంలేక కాస్త కష్టమే అన్పించినా తాగేసింది.

"స్నానం చేస్తారా? వేణ్ణీళ్ళు పెట్టనా?" అంది మంజుల.

స్నానం చేయాలని వున్నా మళ్ళీ విడిచిన బట్టలే వేసుకోవాలిగనక చేయనని తల అడ్డంగా వూపింది.

"బట్టలకోసం సందేహిస్తున్నారా? నా చీర కట్టుకోండి" అంది విమల.

"అబ్బే, వద్దు. అసలు స్నానం చేయాలనిలేదు"

వాళ్ళు అంతకంటే రెట్టించలేదు.

ముఖం కడుక్కుని, కాస్త పొడరద్దుకునేసరికి హాయిగానే అన్పించింది. బొట్టు పెట్టుకుంటూ, మంజులనుద్దేశించి.





"ఇంతకీ మీ ఒదినా, పిల్లలు కన్పించరే" అంది స్మిత.

మంజుల పెద్దగా నవ్వి "మా అన్నయ్యకి పెళ్ళెక్కడయింది?" అంది.

స్మిత ఆశ్చర్యపోతూ "నిజమా? మరెప్పుడూ మా ఆవిడ, నా భార్య అంటూ చెప్తారు?" నమ్మశక్యంగాక అడిగింది స్మిత.

మంజుల ఒక్క నిమిషం అర్థంకానట్లు చూసి, అంతలోనే తేరుకుని

"మర్చేపోయా. లోపలుంది, తర్వాత చూపిస్తాలే" అంది.

నందగోపాల్ కూడా కొంతసేపటిక్రితం అలాగే అన్నాడు. అసలతనికి నిజంగా పెళ్ళయ్యిందా, కాలేదా అన్నది మాత్రం అర్థంకాలేదు. ఏదో కుతూహలం కలుగుతోంది. ఒకవేళ పెళ్ళి కాలేదేమో! అయినా తనలాగే ప్రేమాయణం నడుస్తోందేమో. ఎలాగో చేసుకోదలచానని ఇప్పట్నుండే భార్య అని చెప్తున్నాడేమో అనుకుని నవ్వుకుంది.

ఇంతలో నందగోపాల్ వచ్చాడు "ఎక్కడికెళ్ళావ్ ఇంతసేపు" అంది విమల టీ కప్పు అందిస్తూ.

"ప్రిన్స్‌పాల్ మాట్లాడ్తూ కూర్చోబెట్టేశారు. రోడ్డువరకూ డ్రాప్ చేయమంటే చేశాను"

"అక్కణ్ణుంచి ఎలా వెళ్తారు?" అంది స్మిత.

"బస్‌లో. ఇప్పుడే బసెస్ మళ్ళీ నడుస్తున్నాయి"

"అరే, ఇంతసేపూ చెప్పరే ఆ మాట. నేనెళ్తానైతే" అంటూ వేగంగా లేచి హాండ్‌బాగ్ తగిలించుకుంది స్మిత.

"సర్లే కూర్చోండి. ఇప్పుడేమెళ్తారు, ఎలాగో ఫోన్‌చేసి చెప్పాకదా. ఈ ఒక్కరోజు సర్దుకోండి" అన్నాడు నందగోపాల్.

"ఇదేం అర్ధరాత్రా? ఆరున్నర కూడా కాలేదు"

"సికింద్రాబాద్ వెళ్ళేసరికి ఏడున్నర, అక్కణ్ణించి మళ్ళీ హిమాయత్‌నగర్ వెళ్ళాలి, ఎందుకంత రిస్కు తీసుకోవడం?"

"ఏం పర్లేదు, నే వెళ్ళగల్నండీ, ప్లీజ్"

"ఏం... మా ఇల్లు బాలేదా?" అంది మంజుల.

"ఎంతైనా ఇది సిటీ కాదుగా" అంది

విమల.

"ప్లీజ్! మీరలా అనకండి. నాకు కొత్త ప్రదేశంలో భయం. నిద్ర సరిగా పట్టదు"

"ఇప్పుడు మళ్ళీ బసెస్ నడుస్తున్నాయని తెలియకపోతే వుండేవాళ్ళు కారా?" అంది మంజుల.

"నిద్రపట్టకపోతే కబుర్లు చెప్పుకుందాం. ఈవేళ శివరాత్రి అనుకుంటే సరి" అంది విమల.

"ఆడపిల్ల ఒంటరిగా రాత్రిపూట వెళ్ళడం మంచిది కాదమ్మా" అంది పార్వతి కూడా అక్కడికొచ్చి.

స్మితకి చికాగ్గా అన్పించింది. తను ఒక్కోసారి తొమ్మిది దాటాక్కూడా మేనత్త ఇంటి నుండి ఒంటరిగా వచ్చిన సందర్భాలున్నాయి. వీళ్లేంటి మరీ ఇంత చాదస్తంగా మాట్లాడ్తారు అనుకుంది. తప్పనిసరి అనుకుంటే ఎక్కడయినా తలదాచుకోవాలి. కానీ అవకాశం వుండీ ఇంటికి వెళ్ళకపోవడం ఆమెకి నచ్చలేదు. అక్కడున్న నలుగురు వ్యక్తులకి వ్యతిరేకంగా తను వుండక వెళ్ళిపోతే మూర్ఖత్వంగా భావించొచ్చు వారంతా. అందుకే మౌనంగా కూర్చుండిపోయింది.

కొంతసేపయ్యాక "మా ఒదిన్ని చూపించనా?" అంది మంజుల.

స్మిత అవునూ, కాదూ అనక నవ్వింది. బహుశా ఏ పక్కింటి పిల్ల దగ్గరికో తీసికెళ్తుందో లేక ఆమెనే తీసుకొస్తుందో అనుకుంది.

మంజుల లోపలికెళ్ళి, తిరిగొచ్చి చేతులు వెనకపెట్టుకుని "ఒకసారి కళ్ళు మూసుకోండి" అంది.

'ఏమిటీ చిన్నపిల్లల చేష్టలు' అనుకుంటూనే కళ్ళు మూసుకుంది. కళ్ళు తెరిచేసరికి ఆమె చేతిలో సిగరెట్ పెట్టె వుంది. "ఓస్ ఇదా ఆయన భార్య?" అంటూ నవ్వింది స్మిత.

ఈలోపు నందగోపాల్ స్నానం చేసి వచ్చాడు.

"రోజూ ఈపాటికి ఇంట్లో ఏం చేస్తుంటారు?" అన్నాడు.

ఏం చేస్తుంది? టీ తాగుతూ హుస్సేన్ ఇంట్లో వుండి, చూసే వీలుంటే చూస్తూ బాల్కనీలో నిలబడ్తుంది. కానీ ఆ విషయం చెప్పాలన్పించలేదు. మౌనంగా వుండిపోయింది.

"వెళ్ళనివ్వలేదని కోపమా?" అన్నాడు.

"ఏం లాభం, కోపమన్నంతలో పంపిస్తారా?" అంది.

"వేడి వేడి ఉలవచారుతో అన్నం తింటే మీ కోపమంతా పోతుందిలే" అన్నాడు.

"హాయ్... ఉలవచారా? మీకెక్కడిది?"

"మాకు ఆవులున్నాయిగా, వాటికోసం గుగ్గిళ్ళేస్తారు"

అయితే అప్పడప్పుడు మీఇంటికి భోజనానికి రావాల్సిందే" అంది.

"అంతకంటేనా, రోజూ రండి"

"సరేగానీ, మీమీద పోలీస్ కంప్లెయింట్ ఇస్తా రేపు" అంది స్మిత. నందగోపాల్ ఆశ్చర్యంగా చూసి, అంతలోనే నవ్వుతూ "ఎందుకు?" అన్నాడు.

"ఎందుకేంటి, మీ భార్యని కాల్చి చంపినందుకు" అంది.

"ఓ అదా, అయితే నా భార్యెవరో తెల్సిపోయిందా?" అన్నాడు.

"నాకు భలే నవ్వొస్తోంది. ఛఛ... నేనెంత పిచ్చిదాన్ని? నిజంగా మీ పెళ్ళయిందనే అనుకున్నాను. సిగరెట్ పెట్టె మీ భార్యని..." స్మిత చాలాసేపు గుర్తుచేసుకుంటూ నవ్వింది.

"పెట్టె కాదండీ... ఒక్కో సిగరెట్ ఒక్కో భార్య..."

"నే కాస్త తోటవరకూ వెళ్ళొస్తాను, నాన్న ఇంకా రాలేదెందుకో" అన్నాడు నందగోపాల్ కొంతసేపాగి.

"ఏం తోట?"

"సీజనల్. ప్రస్తుతానికి వంగనారేశారు" అంటూ వెళ్ళాడు.

మంజుల, విమల కూడా ఆమెని రకరకాల ప్రశ్నలడుగుతుంటే లోపల విసుగ్గా వున్నా శాంతంగానే సమాధానాలు చెప్పింది. కొద్దిసేపట్లోనే చక్కటి కుటుంబమనే అభిప్రాయం కలిగింది. పరస్పర ప్రేమాభిమానాలతో ఒకరిపై ఒకరు సానుభూతి చూపుకుంటూ ఎంతో హాయిగా, ఆనందంగా వున్నారనుకుంది.

విమల ఒద్దన్నా వినకుండా బెల్లంతో తయా

రుచేసిన గోరింటాకు తెచ్చి చేతులకి అందంగా పెట్టింది. అది కొద్దిసేపట్లోనే ఆరి పోయి చక్కటి ఎరుపురంగుతో శోభాయమా నంగా వుంది.

వార్తల సమయానికి నందగోపాల్, తండ్రితో కలసి వచ్చాడు. వంకాయలు తెచ్చిన సంచి కిందపెట్టి "మంజూ, పూలివిగో" అన్నాడు. ఆమె అందుకుని చకచకా మాల అల్లింది.

దానిని ముక్కలు చేసి ముందుగా స్మితకి ఇస్తూ "ఇవి మా తోటలోవి" అంది.

సిటీలో అమ్మే మల్లెలుమాత్రం మొక్కలకి పూసినవి కావా ఏం? కాకపోతే అవి మరింత ముందుకోసి వంపుతారు కాబట్టి కొంత తేడా వుండచ్చు. అదీగాక, వ్యాపారమనేసరికి ఎరు వులు ఎక్కువగా వాడచ్చు. ఏమైనా ఈ మల్లె లు మరింత గుబాళిస్తున్నాయి అనుకుంది.

తండ్రీకొడుకులు వార్తలు చూట్టంలో లీన మైపోయారు.

కొద్దిసేపట్లో పార్వతి భోజనాలకి పిలిచింది.

"ఏమ్మా మీరెంతమంది అక్కచెల్లెళ్ళు?" అన్నాడు అతని తండ్రి టవల్ భుజాన వేసు కుంటూ వచ్చి.

"ఒక అక్క, ఒక తమ్ముడు" చెప్పింది స్మిత.

"మీకు డైనింగ్ టేబుల్ అలవాటేమో? ఏంటో మాకు ఇలా కింద కూర్చుని తినడమే అలవాటైపోయింది" అన్నాడు నందగోపాల్.

"అ... అదేం లేదు. పుట్టిన దగ్గర్నుండీ డైనింగ్ టేబుల్‌మీదే తిన్నానా ఏమిటి? అసలు టేబుల్‌మీల్స్ వచ్చి కాళ్ళు వంగడంలేదు. కింద కూర్చుని తినడమే ఆరోగ్యానికి మంచిది" అంది స్మిత.

తండ్రీకొడుకులు ఒక వైపున, అతని చెల్లెళ్ళి ద్దరూ, స్మిత మరోవైపున కూర్చున్నారు. పార్వతి వడ్డిస్తోంది.

వంకాయ వేపుడు, గోంగూర పచ్చడి, ఉలవ చారు, గడ్డ పెరుగు- పార్వతి ప్రతీదీ కొసరి కొసరి వడ్డించడం, మిగిలిన వారంతా మొహ మాటపడొద్దని చెప్పడం.

"మీ వంట చాలా బాగుందండీ. రెండ్రోజు లు అన్నం తినక్కర్లేదు. అంతెక్కువ పెట్టారు" అంది స్మిత పార్వతితో.

"ప్రత్యేకతేముందమ్మా, అంతా మామూ లేగా" అందావిడ.

"కాదండీ, అన్నీ నా కిష్టమైనవే" అంది.

విమల, మంజుల పక్కలేసే ఏర్పాటులో పడ్డారు.

"అబ్బ, చాలా హెవీగా వుంది" అంది స్మిత పొట్టపట్టుకుని.

నందగోపాల్ నవ్వుతూ "మీరు కొన్నాళ్ళు మా అమ్మ దగ్గరుంటే టీక్‌టాకొత్తారు. ఈ నాజూకుతనమంతా పోతుంది" అన్నాడు.

స్మితతోబాటు అతని చెల్లెళ్ళు కూడా నవ్వా రు.

టీవీలో చిత్రహార్ వస్తోంది. అన్నా చెల్లెళ్ళు ఆసక్తిగా చూస్తున్నారు. స్మిత అక్కడే కూర్చుందిగానీ, చేతుల్ని శ్రద్ధగా చూసు కుంటోంది.

అది గమనించిన నందగోపాల్ "మీ గో రింటాకు బాగుందిలేగానీ ముందు పాటలు చూడండి" అన్నాడు.

"నాకేం ఇంట్రస్ట్‌లేదు, రిషీకపూర్ పాటొస్తే చూస్తా" అంది.

"ఇంకెవర్నీ చూడకూడదని శపథం చే శారా?"

"... ..."

చిత్రహార్ ముగిశాక "రిషిది ఏ సినిమా చూశాక అంత అభిమానం కలిగింది?" అన్నా డు.

నిజానికి రిషీ ప్రతిభని చూసి కాదు ఆమె అభిమానిస్తోంది. తన హుస్సేన్‌లా వుంటాడు గనక రిషీ అంటే ఇష్టం. రిషీని చూస్తుంటే తనకి పరోక్షంగా హుస్సేన్ని చూస్తున్నట్లే వుంటుంది. ఆ విషయం బయటికి చెప్పలేక "ఏమో, గుర్తులేదు" అనేసింది.

కొంతసేపు అందరూ మామూలు విషయా లు మాట్లాడుకున్నారు. తర్వాత పడుకున్నారు.

స్మిత నందగోపాల్ ఇంటికి రావడానికి చాలా సందేహించింది. తప్పనిసరిగా వచ్చింది. కానీ ఇక్కడి వాతావరణం చూసి ముగ్ధురాలయింది. అప్పుడప్పుడూ ఇలా స్థల మార్పిడి వుంటే కూడా ఉల్లాసంగానే వుంటుందేమో అనుకుంది. ఇంట్లో ఏమను




కుంటున్నారో... మెసేజ్ అయితే వెళ్లిందికదా, కంగారు పడరు. హుస్సేనేం చేస్తున్నాడో. తన కోసం పిట్టగోడదగ్గర పచార్లు చేస్తున్నాడేమో. నీకే మేఘసందేశం పంపగలను? లోకంలో ఎన్నో యంత్రాలున్నాయి గానీ నా గుండె చప్పుడు నీకు వినిపించగల యంత్రంమాత్రం లేదు. ప్చ్... ఈరోజు నిన్ను చూడకపోతే చాలా అసంతృప్తిగా వుంది. కనీసం కలలో కన్పించవూ ఇడియట్! అనుకుంది. అతడు తనకోసం నిరీక్షిస్తుంటాడు అనే భావన ఆమెకి మధురంగా అన్పించింది. ఆలోచించుకుంటూ ఎప్పటికో నిద్రపోయింది.

స్మిత ఉదయానే లేచి ఇంటికెళ్ళిపోతానని చెప్పింది.

ఇప్పుడు ఇంటికెళ్ళి, మళ్ళీ స్కూలుకెన్నింటికి వస్తారు?'' అన్నాడు నందగోపాల్.

''వస్తే హాఫ్‌డే వస్తా, లేకుంటే అసలే రాను'' అంది.

''అంత అవసరమేముంది?''

''స్నానం చేయాలి''

''చేయండి, మా ఇంట్లో బాత్రూం లేదా ఏం?''

విమల అందుకుని ''నా చీర కట్టుకోమని ఎంత చెప్పినా వినడం లేదు'' అంది.

''డోంట్ బీ ఫూలిష్. ఒక్కరోజు ఇతర్ల బట్టలేసుకుంటే వచ్చేనష్టమేం లేదు. మీకో ఎగ్జాంపుల్ చెప్పనా! మా వూర్లో ఒక చాదస్తపు బ్రాహ్మడున్నాడు. అతడు ఇప్పటికీ స్వయంగా వంటచేసుకుతింటాడు. ఎవరి ఇళ్ళలోనూ నీళ్ళు కూడా తాగడు. ఒక మండుటెండాకాలంలో కళ్ళు తిరిగి రోడ్డుమీద... అదే మీరు బస్సెక్కుతారు చూడండి అక్కడ పడిపోయాడట. మిట్టమధ్యాహ్నమేమో... ఆ చుట్టుపక్కల ఎవరూ లేరట. పక్కనే వున్న చెప్పులు కుట్టుకునేవాడు కొన్ని నీళ్ళు ముఖాన చల్లి నోట్లో పోస్తే మెల్లగా తేరుకున్నాడట. ఆ విషయం తెలిసి బావనాయన ప్రాయశ్చిత్తం చేసుకున్నాడట. ఏమైతేనేం, ఎలాగో ఆ అపరిశుభ్రపు నీళ్ళు తాగాడు''

అద్దంతా విని పార్వతితోసహా అంతా నవ్వారు.

స్మితా ముఖం దాచుకుని నవ్వింది.

ఆమె స్నానంచేసి విమల బట్టలు ధరించింది.

''గోపాల్ మాస్టారింట్లో వున్నారటగా'' అన్నారు ఇద్దరు టీచర్లు.

స్మిత దాన్నేం సీరియస్‌గా తీసుకోక పరిస్థితి వివరించింది.

ఆసాయంత్రం మామూలుగా ఇంటికెళ్ళిపోయింది.

ఇంటికెళ్ళగానే బట్టలు మార్చుకుని, వాటిని తనే ఉతికి ఇస్త్రీ చేసి ఒక ప్లాస్టిక్ కవర్లో పెట్టింది.

హుస్సేన్ కోపం నటించాడు, అంతకు ముందురోజు ఆమె కనిపించనందుకు. స్మిత నవ్వి, వెక్కిరించేసరికి అతడూ నవ్వేశాడు.

స్మిత బాల్కనీ తలుపు తెరిచి, అతడు కన్పించేట్టు కూర్చుని శిరీష కొనిచ్చిన చీరకి ఫాల్ కుడ్తోంది. అక్కకి తనంటే చాలా అభిమానం. తన మొదటి జీతంతో అందర్నీ వదిలేసి తనకో ఉంగరం తీసుకుంది. తను హుస్సేన్ ధ్యాసలో పడడంమాత్రం అక్కకి నచ్చడంలేదు. కానీ అందుకు తనేం చేయగలదు?!

చీర కుడుతూ అటు చూస్తుంటే చేతిలో సూదిపొడుచుకుంది. వేలు చూపిస్తూ 'నీ వల్లే' అని సైగచేస్తే అతడు నవ్వాడు. ఆమెకది పరిపాటే. అతణ్ణి చూస్తూ పెన్సిల్ చెక్కితే అనేకసార్లు వేళ్ళకి రక్తమొచ్చింది.

మరునటిరోజు స్కూలునుండి నందగోపాల్ ఇంటికెళ్ళి విమల బట్టలు ఇచ్చి కృతజ్ఞతలు చెప్పింది. వారంతా అప్పుడప్పుడు వస్తుండమని చెప్పారు.

కాలమిలా గడుస్తుండగా స్మిత ఒకరోజు లీజర్ పిరియడ్‌లో న్యూస్ పేపర్ తిరగేస్తూ కూర్చుంది స్టాఫ్‌రూంలో. నందగోపాల్ వచ్చి ఆమెకి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

''మా ఇంటి వాతావరణం మీకెలా అన్పించింది?'' అన్నాడు.

''మీఇంటికేం? స్వీట్ హోం'' నవ్వింది.

''నా గురించి మీరేమనుకుంటారు?''

''ఏమనుకోవాలి? మంచివాళ్ళు. ఎవరైనా ఏ

బస్సులేకో ఆపదలో వుంటే నేనున్నానని అభయహస్తమిస్తారు''

"మీ వ్యంగ్యం చాల్లెండి. అందరిగురించీ నేనేం పట్టించుకోను'' నందగోపాల్ గొంతు తగ్గించి మాట్లాడుతున్నాడు.

"పోనీ పరిచయస్తుల్నే అనుకోండి, అదైనా గొప్పగా''

"ఇంతకీ నా ప్రశ్నకి సరైన జవాబు చెప్పలేదు''

"చెప్పాగా, మంచి వాళ్ళని''

"నిజంగానేనా? అలా కాదు, మీకు... నేను...'' వాక్యం పూర్తిచేయక మునుపే, ఎవరో వస్తున్న అలికిడై అతడు అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

స్మిత విస్తుపోయి చూస్తుండిపోయింది. అతడి ఉద్దేశం పూర్తిగా అవగాహన కాకమునుపే బెల్లు మోగడం, క్లాసుకి వెళ్ళడం జరిగిపోయింది. ఆ క్లాసులోంచి బయటికొస్తుంటే నందగోపాల్ ఒక పుస్తకం ఆమె చేతిలోపెట్టి "ఒకసారి చూడండి, ఎవరికీ, ఇవ్వద్దు'' అని వెళ్ళిపోయాడు.

స్మిత పుస్తకం బాగ్‌లో పెట్టేసి, క్లాసుకెళ్ళిపోయింది. బస్సులో పుస్తకం తెరిస్తే అందులో ఒక మడిచిన కాగితం కన్పించింది. సారాంశం- ఆమెని ఇష్టపడుతున్నట్లు, పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నట్టు, తన నుండి పాజిటివ్ ఆన్సర్ వస్తుందని ఆశిస్తున్నట్లు రాశాడు.

అది చదివి చాలాసేపు ఆశ్చర్యం నుండి తేరుకోలేకపోయింది... ఏమిటిది? ఎందుకిలా జరుగుతోంది? అని మనసులో గొణుక్కుంది. కాగితం చింపి కిటికీలోంచి పడేసింది.

రెండోరోజు వీలు చూసుకుని నందగోపాల్‌తో

"ప్లీజ్! నాకలాంటి ఉద్దేశం లేదు'' అంది.

"ఎందుకు నేన్నచ్చలేదా?''

"ప్చ్... ఆ మాటనకండి. మీకు ఇద్దరు చెల్లెళ్ళున్నారు. నేను మూడో చెల్లెల్ననుకోండి''

"వీలైతే చెలి, కాకపోతే చెల్లి అంటారా?'' కోపం తొంగిచూసింది.

స్మిత ఒక నిమిషమాగి "ఆల్‌రెడీ నా పెళ్ళైపోయింది'' అంది.

"నన్ను ఫూల్ని చేస్తున్నారా?''

"కాదండీ. ప్లీజ్.... నన్నర్థంచేసుకోండి. నేనో అబ్బాయిని...''

... ...

"మెంటల్‌గా అతన్తో నా పెళ్ళయినట్లే''

ఎవరతను? పేరేంటి?''

"హుస్సేన్''

"ఎవరు, సద్దాం హుసేనా?''

స్మిత చిన్నగా నవ్వి వూరుకుంది.

"మీరు చెప్పింది నిజమేనా?'' అబద్ధమయితే బాగుండు అన్నట్లుంది అతని గొంతు.

"అవునండీ... నిజమే. ఎంతకాలమైనా అతన్నే చేసుకోవాలని...''

"నేనేమైనా తప్పుగా ప్రవర్తిస్తే క్షమించండి. నాకంత అదృష్టం లేదనుకుంటాను''

"ఒక రకంగా నన్ను చేసుకోకపోతేనే మీరు అదృష్టవంతులు''

నందగోపాల్ నవ్వాడు. ఏడవలేక నవ్వినట్లుంది ఆ నవ్వు.

"ఈరోజునుండీ మిమ్మల్నో ఫ్రెండుగా చూట్టానికి ట్రై చేస్తా''

"థాంక్సండీ... నామీద చాలా కోపమొస్తుందేమో అనుకున్నాను'' అంది స్మిత.

నందగోపాల్ బదులుచెప్పలేదు. ఎప్పుడూ ఆనందంగా వుండే అతని మొహం కళావిహీనంగా వుంది. కొంతసేపు వుండి వెళ్ళిపోయాడు. స్మిత సానుభూతిగా అతన్నే చూస్తూ కూర్చుండిపోయింది.

★ ★ ★

శిరీషకి పెళ్లి కుదిరింది. ముహూర్తాలు కూడా చాలా దగ్గర్లో పెట్టుకున్నారు. పదిహేను రోజుల్లో పెళ్లి. ఆరోజు ఆదివారం కావడాన ఇంట్లో అందరూ వుంటారని సున్నమేయించే పనిపెట్టుకున్నారు. ఇంట్లో చేస్తున్న పనికంటే కనిపిస్తున్న హడావిడి ఎక్కువగా వుంది. అటకమీద సామాన్లన్నీ దింపడం, బీర్వాలు, మంచాలు జరపడం, సున్నపు మరకలు పడితే పాడైపోతాయనే వస్తువులు అట్టపెట్టెల్లో, పాక్ చేయడం... ఈ హడావిడి గమనించిన హుస్సేన్ ఆశ్చర్యంగా-




"ఏమైంది? ఏమిటి సంగతి?" అన్నట్లడిగాడు.

స్మిత "ఇల్లు ఖాళీచేసి వెళ్లిపోతున్నాం" అన్నట్లు సైగ చేసింది.

"నిజమా?" అని నమ్మలేనట్లు అడిగాడు. అతని మొహం పాలిపోయినట్లయింది.

స్మిత చిలిపిగా నవ్వి తన తలకంటే ఎత్తుగా చెయ్యిపెట్టి, మళ్ళీ తన మెడలో గొలుసులా చూపి అక్క పెళ్లని చెప్పింది. అతను నవ్వి "తర్వాత మనదా?" అన్నాడు. ఆమె "వ్వెవ్వెవ్వె" అంటూ వెక్కిరించి మళ్ళీ పనిలో లీనమైపోయింది.

పెళ్లికి ఎలాగయినా హుస్సేన్‌కి వెడ్డింగ్‌కార్డ్ ఇవ్వాలనుకుంది. హారతికి, రమ్యకి చెప్తే ఇద్దరూ జోకులేశారు. రమ్య "పనిలోపని అక్కడే దండలు మార్చుకోండి. అంతమంది మధ్యలో మీ అమ్మా, నాన్నా ఏమీ అనరులే" అంది. హారతి కార్డిచ్చి, "రావద్దు, వస్తే మా అమ్మా నాన్నా చూస్తే కష్టం" అని చెప్పు అంది. కార్డు ఇవ్వడంకోసం అతన్ని కిందకి దిగమని చెబుదామని చూసింది. కాని సమయానికి ఈమె ఇంట్లోవాళ్లు బాల్కనీ గదిలో వుండడమో, లేక వీళ్ళు లేకపోతే అతని బిల్డింగులో ఎవరో ఒకరు వుండడమో జరుగుతోంది. ఇక ఇవ్వడం కుదరదేమో అనుకున్న తరుణంలో స్మిత, సుచరిత ఏదో పనిమీద కిందికి దిగారు. అదే సమయంలో హుస్సేన్ మెట్లుదిగి కిందికొస్తున్నాడు.

"సుచరితా! హుస్సేన్‌కి కార్డివ్వడమే కుదరలేదు, ఇప్పుడిస్తే?" అంది.

"సరే, అతన్ని నేను నిలబెడ్తాగానీ, నువ్వు పైకెళ్ళి కార్డు తీసుకురా, క్విక్" అంది.

స్మిత పరుగులాంటి నడకతో అప్పటికే అతని పేరు రాసిపెట్టిన కార్డు తెచ్చి పెళ్లికి తప్పక రావాలని చెప్పి కార్డిచ్చింది. "ఓ... ఐ విల్ మేకిటి ష్యూర్" అంటూ కార్డందుకున్నాడు.

స్మిత మునుపెన్నడూ లేనంత శ్రద్ధగా అలంకరించుకుంది. "ఏంటి? అసలు పెళ్ళికూతుర్నే డామినేట్ చేయాలనా?" అంటూ ఇద్దరు ముగ్గురు నవ్వుతూ అన్నారు.

పెళ్లి ముహూర్తం సాయంత్రం పావుతక్కువ ఏడింటికి. అందరూ పనిచేసినా, చేయకపోయినా హడావిడిగా తిరుగుతున్నారు. స్మిత ఏ పని చేయాల్సిన అవసరం లేకపోయింది.

"ఇదిగో స్మితా! కాస్త వచ్చేపోయేవాళ్ళని పలకరిస్తుండు. నీ పరధ్యానం ఇలాంటప్పుడయినా పక్కనపెట్టు" అంది సంధ్య.

"ఆహాహా... ఈ పని వదినకేనా చెప్పాల్సింది. తెల్సినవాళ్ళెవరయినా నవ్వితే పిచ్చివాళ్ళని చూసినట్లు చూసి, తెలియని పెళ్ళికొడుకు తరుపువాళ్ళని పిలిచి మాట్లాడ్తుంది" అంది సుచరిత.

"నన్ను మరీ పిచ్చిదానికంద జమేయకు" అంది స్మిత. సంధ్య వెళ్లిపోయాక "ఏయ్! సుచరితా! ఆ ఇడియట్ కనిపిస్తే చెప్పు" అంది స్మిత.

"చెప్తాగాని, ఇంకెవర్నో చూసి హుస్సేననుకుని మాట్లాడేవు జాగ్రత్త" అంటూ నవ్వింది సుచరిత.

పైకి ఎవరితో మాట్లాడినా ఆమె ధ్యానంతా హుస్సేన్‌మీదే వుంది. వస్తాడనే నమ్మకమూ, రాడనే భయమూ పోటీపడుతున్నాయి. స్మిత కొలీగ్స్‌లో నందగోపాల్ ఇంకా ఇద్దరు రమ్య, హారతి వచ్చారు. నాన్సీ ఏ ఫంక్షన్లకీ, పార్టీలకీ వెళ్లదు. ముందే రానని బతిమిలాడి చెప్పింది. హారతి, రమ్యలతో మాట్లాడుతూ వుండగా "హలో స్మితా!" అంటూ వచ్చాడు హుస్సేన్.

"మీ బావ ఏం చేస్తారు, వాళ్ళెక్కడుంటారు?"లాంటి రెండు మూడు ప్రశ్నలడిగాడు. "చరణ్ ఎక్కడా కన్పించడం లేదే?" అన్నాడు.

అతను మాటవరసకే చరణ్ గురించి అడిగినా స్మిత వెంటనే చరణ్ గురించి వాకబు చేసింది. కానీ అతడు పెళ్ళిపందిట్లో ఎక్కడా కనిపించలేదు, ఏమో ఏ పనిలో వున్నాడో అన్నారు. స్మిత చకచకా తిరిగి వచ్చేసరికి "పర్లేదులే నాకు కంపెనీ దొరికిందిలే" అంటూ ఎవరో వ్యక్తిని చూసి నవ్వాడు. ఎంత త్వరగా పరిచయం చేసుకున్నాడు అనుకుంది.

రమ్య, హారతిలని తీసుకుని రెండు మూడు వరసల ఇవతల అతను కనిపించేట్లు కూర్చుంది.

"ఏమో అనుకున్నాను, చాలా బాగున్నాడే, డిగ్నిఫైడ్‌గా వున్నాడు" అంది హారతి, ఇవతలి

కొచ్చి కూర్చున్నాక-

"ఫ్రెండ్స్‌ని పరిచయం చేయడానికి నామోషి వేసింది కాబోలు. వెర్రిమొహాలేసుకు పక్కన నిలబడ్డాం" అంది రమ్య.

"ఛ, పిచ్చిమాటలు మాట్లాడకే రమ్యా. మీకు నా ఫ్రెండ్స్‌ని చెప్పుకోడానికి నేగర్వపడ్డాను తెలుసా? ఆ పిచ్చిసంతోషంలో నాకు బుర్ర పనిచేయలేదు, ప్రేమలో పడితే ఇలాంటివన్నీ నీకూ అర్థమవుతాయి" అంటుంటే రమ్య చిన్నగా, హారతి పెద్దగా నవ్వారు.

"పదండి, ఇప్పుడు పరిచయం చేస్తాను" అంది స్మిత.

"దొంగలుపడ్డ ఆర్నెల్లకి కుక్కలు మొరిగినట్లుంటుంది. ఇందాక పక్కనే వుంటే ఏమీలేదు, ఇప్పుడు మళ్ళీ వెళ్ళి పరిచయం చేసుకుంటే అతడెంత నవ్వుకుంటాడో" అంది రమ్య.

హుస్సేన్ అంత సమీపంలో ఎదురుగా కూర్చుని వుంటే స్మితకి పట్టరాని సంతోషంగా వుంది. ఆ సమయం ముందుకి జరగకుండా అలా ఫ్రీజైపోతే ఎంత బాగుండనుకుంది. అతిమామూలు మాటలు కూడా ఆమె హాస్యపూరితంగా చెప్తోంది. వాళ్ళు చెప్తున్న మాటలకి కూడా నవ్వేస్తూ, ప్రపంచంలో వున్న సంతోషమంతా తన దగ్గరికి పరిగెత్తుకు వచ్చినట్లుందామెకి.

కొంతసేపయ్యాక చరణ్ అక్కడికొచ్చాడు. చరణ్ వాళ్ళిద్దరినీ భోజనానికి తీసికెళ్లాడు.

హారతి కూడా లేచి "అదిగో అన్నయ్య పిలుస్తున్నారు, ఇంట్లో పిల్లల్ని వదిలివచ్చాను. భోజనంచేసి వెళ్లిపోతాం" అంది.

రమ్య "నేనొక్కతినే వచ్చా, మరీ చీకటిపడితే కష్టం, నేనూ భోంచేసి వెళ్లిపోతాను" అంది. ఇంతలో పరిచయస్థులెవరో వచ్చి స్మితని మాట్లాడిస్తున్నారు. రమ్య, హారతి భోజనానికి వెళ్లిపోయారు. ఆవిడ తర్వాత మరొకరు, వేరొకరు "రాజారాం కూతురంటూ, సంధ్య కూతురంటూ, ఇక తర్వాత దీని పెళ్ళే" అంటూ సాగదీస్తూ మాట్లాడసాగారు. అంతలో సుచరిత వచ్చి "ఇడియట్‌గారెక్కడ?" అంటూ నవ్వింది. వాళ్ళిద్దరూ నాలుగుమాటలు చెప్పుకుంటున్నంతలోనే హారతి, ఆమె భర్త, రమ్య వచ్చేశారు. వాళ్లని చూసి సుచరిత ఒకసారి పలకరించి వెళ్ళిపోయింది.

"అప్పుడే వచ్చారా? అసలు మీరు భోజనం చేసొచ్చారా, చూసొచ్చారా?" అంది స్మిత నిష్ఠూరంగా.

"నువ్వొచ్చి వడ్డిస్తే కాస్త తినేవాళ్లం" అంది రమ్య.

"చెప్పావుగా, నా పెళ్లికి నేనే వడ్డిస్తానే, అంతేనా వంట కూడా నేనే చేయాలంటావా అన్ని వందలమందికి" నవ్వింది స్మిత.

"మమ్మల్నంటున్నావుగానీ, నీ ఫ్రెండు చూడు మాకంటే ముందే వచ్చేసి..." అంటూ కాస్త దూరంలో కూర్చున్న హుస్సేన్ని చూస్తూ అర్థవంతంగా నవ్వింది హారతి. తన భర్తకి అర్థం కాకుండా ఆమె అలా సగమే మాట్లాడింది. స్మిత అప్పటివరకూ అతన్ని చూడనేలేదు.

రమ్య, హారతి, ఆమె భర్త వెళ్లిపోయారు.

స్మిత ఒక్కటే మిగిలిపోయింది. కుర్చీలో కూర్చుని పట్టుచీర కుచ్చిళ్ళు సరిచేసుకుంటోంది. హుస్సేనొచ్చి ఆమెకి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"పెళ్లి బాగా జరిగింది" అన్నాడు.

అందులో జవాబు చెప్పడానికేమీ లేదు, ఆమె నవ్వింది.

"మీ చదువు కూడా అయిపోయినట్లేకదూ?"

"నిజానికి పీజీ చేయాలనుకున్నాను, వీల వ్వలేదు. ఇక ఆ ఆలోచన మానుకున్నాను కాబట్టి అయినట్లే..."

"మరి మన పెళ్ళెప్పుడు? పెళ్ళి విషయం మాట్లాడాలని ఎన్నిసార్లో ప్రయత్నించాను..."

ఇంకొక సంవత్సరం ఆగాలి. అప్పటివరకూ పెళ్లి గురించి మాత్రం మాట్లాడకండి, ప్లీజ్ నన్నర్థం చేసుకోండి" అంది స్మిత. నిజానికి అతనితో ఇంకెన్నో చెప్పాలనుకుంది. ఏమేమో మాట్లాడాలనుకుంది. కానీ ఆ రెండు వాక్యాల కంటే ఆమె ఇంకేం మాట్లాడలేకపోయింది. తన అంతులేని ప్రేమని మాటలుగా చెప్పి చిన్నబుచ్చకూడదనుకుంది.

"ఇంకా వనియర్ ఆగాలా?" హుస్సేన్ విచిత్రంగా చూశాడు. చరణ్ వచ్చాడు. స్మితకి ఒక్క నిమిషం భయంగా అనిపించినా తన





తెలివినంతా ఉపయోగించి, సమయోచితంగా-

''బావా! చూశావా మీ ఫ్రెండ్ పెళ్లికూతురికి విఐపీ శాంపిల్‌పర్స్ అప్పుడు నాకు ఇచ్చిన వాటిల్లో ఒకటి తన గిఫ్టుగా ఇవ్వమంటున్నారు'' అంది స్మిత.

''ఐడియా బాగుంది. అయితే రెండోపర్సు నీ పెళ్లికి గిఫ్టేమో'' అంటూ పెద్దగా నవ్వాడు చరణ్.

కొంతసేపలా చరణ్‌తో మాట్లాడి, స్మితకి చెయ్యూపి హుస్సేన్ వెళ్లిపోయాడు. అతను వెళ్ళిపోతుంటే దిగులుగా చూస్తుండిపోయింది.



పెళ్ళయిన రెండోరోజు సాయంత్రం పెళ్ళి ఫొటోలు, కాస్సెట్టూ వచ్చాయి. ఫొటోల్లో అతను వుంటాడని అనుకోకపోయినా కాస్సెట్లో ఎక్కడో ఒకచోట వుంటాడనీ, వుండాలనీ ఆశించిన స్మితకి పూర్తినిరాశే ఎదురైంది. కాసెట్ అంగుళమంగుళం దీక్షగా చూసినా గుంపులో గోవిందగా అయినా అతని జాడేలేదు.

పెళ్లిలో కలిసిన దగ్గర్నుంచీ హుస్సేన్ చాలా ముభావంగా వుంటున్నాడు. సైగలే కాదు, నవ్వడం కూడా మానేశాడు. అడపాదడపా దొంగచూపులు చూసి పట్టుబడిపోయాడు. తను ఇంకా సంవత్సరం ఆగమన్నందుకే అతనిలా చేస్తున్నాడని స్మిత గమనించింది. ఆమెకి కోపం రాలేదు. పైపెచ్చు మరింత నవ్వొచ్చింది.

అతను ఎదురుగావుండి అలక ప్రదర్శించినా ఆమెకి బాధనిపించలేదుగానీ చాలాసార్లు అసలు కనిపించడమే మానేశాడు. ఎప్పుడు చూసినా ఇల్లు తాళం పెట్టేవుంటోంది. అది మాత్రం ఆమె భరించలేకపోయింది. తాను ఒక్కొక్క మెట్టుదిగి 'ఈ మాత్రం చాల్లే' అనుకుంటే అదీ కరువవుతోంది. మొదట ఆమెకి హుస్సేన్ నవ్వుతూ, సైగలు చేస్తుంటే చూడాలని ముచ్చటపడింది. తర్వాత కేవలం తనను చూస్తున్నా పర్లేదనుకుంది. ఆ తర్వాత చూసినా చూడకపోయినా అతనక్కడ వుంటే చాలనుకుంది. ఇప్పుడు అతను వూళ్ళో వుంటే చాలు, ఏ రాత్రికో వస్తాడన్న భావన తనకు నిండుగా వుంటుంది అనుకుంటోంది.

రాత్రి పదిదాటింది. ఇంట్లో దాదాపు అందరూ నిద్రపోతున్నారు. స్మిత బాల్కనీలో నిలబడింది. హుస్సేన్ గదితలుపు బార్లా తెరిచి, అక్కడే కుర్చీ వేసుకుని దీక్షగా రాసుకుంటున్నాడు. ఎంతసేపటికీ అతను తలతిప్పి ఇటువేపు చూళ్ళేదు. లోపల్నుంచి స్కెచ్‌బుక్ పెన్సిల్ తెచ్చి జాగ్రత్తగా అతని బొమ్మ వేసింది. మొదలు పెట్టినప్పుడు ఏ ఏంగిల్లో కూర్చున్నాడో, బొమ్మ అయిపోయాక్కూడా అలాగే కూర్చున్నాడు. అదే తనయితే రెండు నిమిషాలు కూడా ఒక పద్ధతిలో స్థిరంగా కూర్చోలేదు. 'ఈ ఇడియట్ నిజంగా ఎంత బాలెన్స్‌డ్‌గా వుంటాడు? ఎంత హుందాగా, గంభీరంగా వుంటాడు?! కోపంలో కూడా ఇంత అందంగా వున్నాడేం?! అసలు ఇతను తన కోసమే సృష్టించబడినట్లు అన్నీ తనకు నచ్చే లక్షణాలతో పుట్టాడు. కానీ ఇద్దర్నీ వేరే వేరే మతాల్లో ఎందుకు పుట్టించినట్లు? తానూ ముస్లిమయినా లేక అతనూ హిందూ అయినా పెద్దలే ఆమోదించి పెళ్ళి చేసేవాళ్ళే' అనుకుంది.

అప్పటికి పదిన్నరయింది. ఇక లాభం లేదనుకుని అతని పాతటెక్నిక్ ఉపయోగించి తెచ్చిపెట్టుకున్నట్లు దగ్గింది. హుస్సేన్ తల ఎత్తిచూశాడు ఆ మొహంలో వెతికి చూసినా నవ్వులేదు. ఆమె ముఖకవళికలు చదువుతున్నట్లు పరిశీలనగా చూశాడు. లేచి పక్కనున్న రేడియో వాల్యూం పెంచాడు. ''హమ్ తుమ్‌సె మొహబ్బత్ కర్‌కే సనమ్ రోతేభి రహె, హస్‌తేభి రహె...'' అనే పాట. రెండు చరణాలు కాగానే వాల్యూం తగ్గించాడు.

స్మిత నవ్వి ''ప్చ్... ప్చ్... ప్చ్...'' అంటున్న

ట్లు అభినయించింది.

హుస్సేన్ నవ్వలేదు. తనకి పిచ్చెక్కుతోంద న్నట్లు సైగచేసి చూపి మళ్ళీ గడియా రంచూపి పడుకోమని చెప్పి, తనూ ఆఫీసు ఫైళ్ళు, పుస్తకాలు మూసేసి లైట్‌తీసి పడుకు న్నాడు.

పూర్వం కూడా చాలాసార్లు రేడియోలో మంచిపాట వస్తుంటేనో టేప్‌రికార్డర్‌లో మంచి కాస్సెట్ పెట్టో అతను తనకు విన్పించేట్లు పెద్ద సౌండ్ పెట్టడం జరిగినా ఈవేళ అతని చేష్ట స్మితకి కాస్త వింతగా అనిపించింది. ఇంతకు ముందు పిచ్చెక్కుతోందని చెప్తే ఆమె నవ్వు కుంది. కానీ ఇప్పుడామెకి నవ్వు రాలేదు. తనను ప్రేమించి నిజంగా ఏడుస్తున్నాడా హు స్సేన్? ఎందుకు తనేం చేసిందని? ఒక సంవ త్సరం ఆగమంది. ఆ మాత్రం ఆగలేడా? ప్రేమకోసం సంవత్సరాల తరబడి ఎదురుచూ సేవాళ్ళుంటారు. ఇద్దరూ ఎదురెదురుగానే వున్నారు. రోజూ కనిపిస్తూనే వుంటారు. అప్పు డప్పుడూ మాట్లాడుకోవచ్చు కూడా. స్మిత ఆలో చనలు అంతకంటే సాగకుండానే పగలంతా అరిచి, అలసిపోవడం వలన నిద్రపట్టేసింది.

మరీ కాళ్ళ బేరానికెళ్తే కొండెక్కుతాడని స్మిత కూడా అతని కోసం పడిగాపులు పడడం మానుకోవాలనుకుంది. కానీ అది ఆమెకి సాధ్యం కావడంలేదు. హుస్సేన్ రెండు మూ డురోజులు కనిపించకపోతే ఆమె మనసు మనసులో వుండదు. దిగులుగా, గుబులుగా వుంటుంది. ఎవరితోనూ మాట్లాడాలన్పించదు. ఏపనీ చేయాలనిపించదు. ఎంతో అనాస క్తంగా, నీరసంగా, నిస్సత్తువగా వుంటుంది.

స్కూల్లో వున్నంతవరకూ పిల్లల మధ్యలో అతడి ఆలోచనలు అణచుకోగలుగుతుంది. కానీ ఇంట్లో వున్నంతసేపూ అదే ధ్యాస.

కాలం ఇలా బరువుగా సాగుతోంది. ఇదివ రలో స్మిత బయల్దేరే సమయానికి హుస్సేన్ తన బిల్డింగుపైన పిట్టగోడ దగ్గరో లేక కింద ఏ బండి తుడుచుకుంటున్నట్లో, ఎవరితోనో మాట్లాడుతున్నట్లో కారణం కల్పించుకుని మరీ ఆమెకి వీడ్కోలు చెప్పేందుకు నిలబడేవాడు. ఎవరయినా దరిదాపుల్లో వుంటే కళ్ళతోనూ, ఎవరూ లేకుంటే చేయెత్తి నవ్వేవాడు. అతడు చేయి వూపేతీరు కూడా ఒక ప్రత్యేకత సంత రించుకుని స్మిత మనసుని ఉవ్విళ్ళూరిస్తుంది. ఈ ప్రపంచంలో ఇంకెవ్వరి నవ్వులోనూ లేనంత ఆహ్లాదం కేవలం హుస్సేన్ నవ్వులోనే ఎందుకుంది- అని అనేకసార్లు ప్రశ్నించు కుంది స్మిత. అది జవాబు దొరకని ప్రశ్న.

ఇప్పుడు హుస్సేన్ ధోరణి మారింది. ప్రతి రోజూ స్మితకోసం నిలబడడం తగ్గించాడు. కొన్నిసార్లు వుంటాడు, కొన్నిసార్లు వుండడు. నవ్వడమయితే పూర్తిగా మానేశాడు. అతడు నవ్వితే తానెంత మురిసిపోతుందో, నవ్వకపోతే అంత విలపిస్తుందని తెలుసుకోడే ఈ ఇడి యట్ అనుకుంది.

ఆరోజు స్కూలుకి వెళ్తూ పైకి చూసింది అతడికోసం. కానీ అతడు లేడు. నీరసంగా బస్టాపువైపు నడిచింది. దారిలో హుస్సేన్ కలిశా డు. "హలో" అంటూ పలకరించాడు. స్మిత మనసు కల్లోలంగా వుంది.

"నువ్వు కనిపించక నన్నెందుకిలా సతాయి స్తున్నావు?" అని అడగాలనుకుంది. కానీ అత ను తనకి రోజూ కనిపించాలని రూలేముంది? అతనికి ఇష్టమయితే కనిపిస్తాడు. లేకుంటే లేదు, ఇష్టం లేకపోయినా బలవంతంగా తనకు కనపడమని చెప్పడం తన నైజంకాదు.

"మీ అక్క ఇక్కడే వుందా?"

"లేదు, అక్కడే వుంది?"

"నేను వి.ఐ.పి. నుండి పర్ఫ్యూమ్స్ ప్రొడక్ట్ లోకి మారాను"

"అలాగా? ఇకమీదట మీరొస్తే పరిమళాలే నన్నమాట?"

హుస్సేన్ నవ్వి "ఎలా వుంటుందో చూ డండి" అని ఒక సెంటుసీసా చేతిలో పెట్టాడు.

"నీ కానుకలేమీ అక్కర్లేదు, నువ్వు నా కళ్ళెదుట వుంటే చాలు" అనాలన్పించింది. కానీ ఆ మాట గొంతులోనే ఆగిపోయింది.

"చాలా థ్యాంక్స్! నన్నామాత్రం గుర్తుంచు కున్నారు"

"అదేం మాట? ఇంతకీ పెళ్ళి గురించి..."

"మీకు ముందే చెప్పాను..." అంది స్మిత.

"ఆ మాటకి అర్థం లేదు, ఎందుకు అంత కాలం ఆగడం?"

"కారణాలు చెప్పడం కష్టం"




"ఈ కొత్త కంపెనీలో కాంపు లెక్కువగా వుంటాయి. ఈరోజు బాంబే వెళ్తున్నాను, హెడ్డా ఫీసులో పనుంది, ఒక వారంలో వస్తాను. ఈలోపు పెళ్ళి విషయం ఆలోచిస్తే బాగుంటుంది. సరే, మీ బస్సేదో వస్తున్న ట్లుంది, నే వెళ్తాను'' అంటూ వెళ్ళిపోయాడు హుస్సేన్.

స్మితకి సంతోషంగానూ వుంది, దుఃఖమూ కలిగింది. పర్ఫ్యూమ్ బాటిల్ హాండ్‌బాగ్‌లో పెట్టుకుంది. 'ఇతడెందుకు వుద్యోగం మారినట్లు? కాంపులెక్కువట. ఆ మాట ఎంత చల్లగా చెప్తున్నాడు? తనకున్న బాధ అతనికి వున్నట్లే లేదు. తనని చూడకుండా అతను నిశ్చింతగా వుంటున్నాడా? లేక మంచి వుద్యోగమని బాధగావున్నా సర్దుకుంటున్నాడా? ఈ విషయం తను అడగలేదు. ఆలోచనల్లో వుండగానే ఎక్కాల్సిన బస్సు వచ్చింది. ఆమె సికింద్రాబాదులో బస్సు మారాక దాదాపు నలభై నిమిషాల బస్సు ప్రయాణం. అంతసేపూ అతడి ఆలోచనలే. వారం రోజులు వుండడని ముందే తెలిసేసరికి ఆమెకి తీరని ఆవేదనగావుంది. చాలాసార్లు అతడు చెప్పి వెళ్ళచ్చుకదా అనుకుంది కానీ ఇప్పుడు మాత్రం ఇలా చెప్పినందువల్ల రెట్టింపు బాధ కలుగుతుందని గ్రహించింది. ఏక్సిడెంటల్‌గా దెబ్బ తగలడం వేరు, చెప్పి మరీ కొట్టడం వేరూ అనుకుంది.

ఆలోచనల్లోవున్న స్మిత తను దిగాల్సిన స్టాపు వచ్చినా గమనించలేదు. అప్పుడే ఒక కంఠం ఆమెని పలకరించింది.

"క్యా, ఆప్ నహీ ఉతరేగే?'' అన్నాడో పెద్ద మనిషి ఆమె సీటుకి ముందున్న రాడ్ మీద చిన్నగా శబ్దం చేస్తూ.

స్మిత తుళ్ళిపడి కిటికీలోంచి బయటికి చూసింది. అతనికి ధన్యవాదాలు చెప్తున్నట్లు చూసి, కంగారుగా బస్సు దిగింది.

బస్సు దిగి నడుస్తుంటే అతడు కూడా అనుసరించాడు.

"నేనిక్కడ దిగుతానని మీకెలా తెల్సు?'' అంది.

అతను నవ్వి వూరుకున్నాడు.

తనను పలకరించిన మాట గుర్తొచ్చింది.

"యూ నో తెలుగూ?!'' అంది.

"ఎందుకా సందేహం?! నేను తెలుగువాణ్ణే. రోజూ ఇదే టైంలో ఇదే స్టాపులో దిగుతాను'' అన్నాడు.

"అవునా? నేనెప్పుడూ చూళ్ళేదే?'' అంది ఆశ్చర్యంగా.

"నేను మాత్రంమిమ్మల్ని రోజూ చూస్తున్నాను. మీరు మరీ తలెత్తకుండా వెళ్ళిపోతారుగా'' అన్నాడు నవ్వుతూ.

"మీరు పని చేసేది విద్యావిహార్‌లో కదూ!''

"అవును''

"హిమాయత్‌నగర్‌నుండి వస్తారటగా?!''

"నా విషయాలన్నీ మీకెలా తెలుసండి?'' కోపంగా, ఆశ్చర్యంగా అడిగింది. "నేనో డాక్టర్‌ని. మీ స్కూల్‌కి రెండు వీధుల అవతల నా క్లినిక్ వుంది. నేనా క్లినిక్ పెట్టి అయిదేళ్ళయింది. ఈ వూళ్ళో అందరూ నాకు పరిచయస్తులే. పక్క పోర్షన్లో ప్రాణంపోయినా పట్టించుకోని సిటీకీ, ఈ విలేజ్ ఎట్‌మాస్ఫియర్‌కీ చాలా తేడావుంది'' అన్నాడు.

స్మిత నవ్వింది. తను మరీ అంత స్పృహలేకుండా ఎలావుంది. తనని లోకం గమనిస్తుందనే ఆలోచనే తనకు కలగదు.

"మీ పేరేంటి?'' అడిగాడు డాక్టర్.

"ఇన్ని తెలుసుకున్నారు, మరి పేరడగలేదా?'' నవ్విందామె.

"అయ్యో, మీ గురించి చెప్పిన ఆ రెండు విషయాలు కావాలని సేకరించినవి కావండి. రోజూ ఇక్కడ దిగి, విద్యావిహార్ వైపు వెళ్ళడం నేను చూస్తూనేవున్నాను. అందులో ఎవరో చెప్పాల్సింది లేదు. పోతే మొన్నెవరో ఒకతను ఇక్కడే మీరలా దూరంగా నడుస్తుంటే చూపించి 'ఆవిడ హిమాయత్ నగర్నుంచి వస్తారు ' అని చెప్పారు'' అన్నాడు.

స్మిత తల పంకించి "స్మిత... మీ పేరేంటి?'' అంది.

"శంకర్'' అన్నాడు.

అలా మాట్లాడ్తూ నడుస్తున్నారు. స్మిత స్కూల్లోకీ, శంకర్ ఇంకా ముందుకీ వెళ్ళిపోయారు.

స్టాఫ్ రూంలో అడుగు పెట్టేవరకూ అడుగడుగునా పిల్లల నమస్కారాలు, వాళ్ళిచ్చే



పువ్వులూ స్వీకరిస్తూనేవుంది. అందులోవున్న ఆనందం స్మితని మరో లోకానికి తీసికెళ్తుంది.

మొదటి పీరియడ్ ఆమెకి లీజర్. హాండ్ బాగ్ అల్మర్లో పెట్టి చార్టు దగ్గరికెళ్ళి టైం టేబుల్ చూసుకుంది. టైం టేబుల్లో అన్ని క్లాసులూ మారినా మొదటి పీరియడ్ మాత్రం ఎవ్వరికీ మారదు. ఎందుకంటే క్లాస్ టీచర్ షిప్ వుంటుంది కాబట్టి. అది మారిస్తే అనేక సమస్యలు వస్తాయి. రోజు స్మితతోపాటు అరుంధతి కూడా వుండేది. ఈరోజు ఆమె లీవ్‌లో వున్నట్లుంది. ఇతర సబ్జక్ట్ టీచర్లయితే లీజర్ పీరియడ్స్‌లో తర్వాతచెప్పాల్సిన పాఠాలకి ప్రిపేరవుతుంటారు. కానీ ఆమె సబ్జక్ట్ డ్రాయింగ్ కావడాన ఆమెకి ప్రిపరేషనేమీ అవసరం లేదు. ఏవో బొమ్మలు వేయడం, కరక్షన్లు చేయడం, సలహాలివ్వడం, గోల చేయకుండా కంట్రోల్ చేయడం అంతే.

అరుంధతి వుంటే ఏదో మాట్లాడ్తూ కాలక్షేపం చేసేది.

విసుగ్గా ఎప్పుడు బెల్ అవుతుందా అని చూస్తుంటే స్మితకి సెంటు సీసా గుర్తొచ్చింది. కాస్త స్ప్రే చేసుకుందామా అనుకుంది. మళ్ళీ ఛ... ఏ ప్రిన్సిపాలో వస్తే బాగోదు, వింతగా చూస్తారు అనుకుంది.

ఇంతలో ఫస్టుపీరియడ్ అయిపోయింది. స్మిత చాక్‌పీసులు, డస్టరు తీసుకుని ఎనిమిదవ తరగతిలో అడుగుపెట్టింది.

"టీచర్! మీరు చెప్పినట్లు చార్ట్స్ వేశాం, చూడండి" అంటూ నలుగురైదుగురు పిల్లలు చార్టులు పట్టుకుని, మిగిలిన వాళ్ళు అవి చూట్టానికి బిలబిలా వచ్చారు. ఆమెకి గాలిపీల్చుకోవడమే ఇబ్బందిగా అనిపించింది.

స్మిత కోపంగా "ముందు మీరంతా మీ ప్లేసెస్‌కెళ్ళి కూర్చోండి" అంది.

అంతా బిక్క మొహాలేసుకుని వెళ్ళారు.

అంతకుముందు రోజు స్మిత "మీరంతా ఒక్కొక్కరూ పావలానో అర్ధరూపాయో చొప్పున మనీ కలక్ట్ చేసి, చార్టులు కొని నేనిచ్చే ఈ కొటేషన్స్ అందంగా, కళాత్మకంగా రాయాలి" అని చెప్పి ఎవరెవరు ఏమేమి రాయాలో విపులంగా చెప్పింది. దాని ఫలితమే ఇది.

ఒక్కొక్కళ్ళనీ పిలిచి, చార్టులు చూసింది. కొన్ని బాగున్నాయి, కొన్ని ఫర్లేదు, కొన్ని మరీ అధ్వాన్నంగావున్నాయి. అలాంటివాటిని బాగా వేసినవాళ్ళకిచ్చి వాటిని మళ్ళీ వేయమని చెప్పి, స్టాక్ రూం నుండి సుత్తి, మేకులు తెప్పించి అప్పటికప్పుడు ఆ చార్టులు గోడలకి కొట్టించింది. క్లాసుకి గొప్ప కళ వచ్చింది. పిల్లలతోబాటు స్మిత కూడా ముచ్చటగా చూసింది.

ఆరోజు మాత్రం ప్రతి క్లాసులో అదే కార్యక్రమం. కొన్ని తరగతులలో స్వయంగా స్మితే రాసింది, పిల్లలకి రాకపోతే.

టీచర్లలో కొంతమంది అభినందించారు ఆమె వూహకి. కొందరు ముఖాలు మాడ్చుకున్నారు.

ఆ సాయంత్రం స్మిత బాల్కనీ తలుపు తెరవలేదు. ఆ వారమంతా అంతే. ఈమె ప్రవర్తనకి విడ్డూరపడిన తల్లి సంబరంగా 'స్మిత మారిపోయింది, ఏ దేవుడి చలవ వలనో బుద్ధిమంతురాలయింది' అనుకుంది. ఆ వూహతోనే ఆవిడ స్మిత ఇంటికొచ్చే సమయానికి టీ రెడీగావుంచి "తాగవే, పాపం అలిసిపోయినట్లున్నావు" అనడం మొదలెట్టింది. ఆ వారం దాటాక యధాప్రకారం... మళ్ళీ అంతే!

ఇప్పుడు సికింద్రాబాదు స్టేషన్లోనే స్మితని పలకరిస్తున్నాడు శంకర్. బస్సులో ఎవరిదారి వారిది, మళ్ళీ దిగి స్కూలు వరకూ నడిచే దారిలో మాటలు. అతనేవో మాట్లాడుతుంటాడు. స్మిత పరధ్యాన్నంగా వింటుంటుంది. స్కూలు వచ్చేవరకూ అది తప్పదు.

ఆ రోజు స్మిత ఒక క్లాసులో బొమ్మ వేస్తుండగా ఆయా వచ్చి "అమ్మా! మీ కోసం ఎవరో వచ్చారు" అని చెప్పింది.

స్మిత ఆశ్చర్యపోయి తను ఈ స్కూలు అడ్రను ఎవరికీ ఇవ్వలేదు. ఆఖరికి ఇంట్లో కూడా సరిగా తెలీదు. కొంపతీసి ఆ డాక్టర్ కాదుగదా అనుకుని నిరాసక్తంగా బయటికొచ్చింది. ఆయా స్టాఫ్ రూం వైపు చూపింది, అక్కడున్నారన్నట్లు.

రమ్య కూర్చునివుంది. "ఏయ్, నువ్వా?" అంది ఆనందంగా.

"లేకపోతే నీ ఇడియట్ అనుకున్నావా?" అంది చిరుకోపంతో.




''పోవే, అడ్రసే ఇవ్వలేదు ఇడియట్‌కి. పూరకరారు మహానుభావులు, ఏమిటి కథ?'' నవ్వింది స్మిత.

''సాయంత్రం ఇంటికి రావచ్చు. అయినా ఇంత కష్టపడి ఇక్కడికి ఎందుకొచ్చానో తెలుసా? వుహూ చెప్పను సస్పెన్సు...''

''నువ్వూ నీ బోడి సస్పెన్స్... పీజీలో సీటొచ్చిందా?''

''అసలు అప్లయి చేయిందే''

''ఏదో వుద్యోగం వచ్చుంటుంది''

''పప్పులో కాలు''

''నా కాలు నేలమీదేవుందిగానీ అమ్మాయిగారి పెళ్ళి సెటిలయి వుంటుంది, అంతేనా?''

''ఎందుకో ఈ విషయం నీకేముందు చెప్పాలన్పించింది''

''చాలా థాంక్స్ రమ్యా! ఈ అభిమానం ఎప్పటికీ వుండాలిమరి అన్నట్లు మా కాబోయే అన్నో తమ్ముడో ఏం చేస్తాడు?''

''బాంక్ ఆఫీసరట''

''బాగుంటాడా?''

''ఏమో! మీ హుస్బెన్‌తో పోలిస్తే...''

''ఏయ్ దొంగా! ఇడియట్టేదో గొప్ప అందగాడైనట్లు...''

''ఆఁఆఁ ఏంటి ప్లేట్ మారుస్తున్నావు? ఏమంటున్నాడిప్పుడు?''

''వుండవే రమ్యా! ఇప్పుడే వస్తాను'' అని తాను వచ్చిన క్లాస్‌రూంలోకి మళ్ళీ వెళ్ళి క్లాస్ లీడర్‌ని అల్లరి చేయకుండా చూసుకోమని చెప్పి ప్రిన్స్‌పాల్ దగ్గరికెళ్ళింది.

''సర్! చాలాదూరం నుండి నా ఫ్రెండ్ వచ్చింది. లాస్ట్ పీరియడ్ నాకు సెవెన్త్ క్లాసుంది. వాళ్ళకి వర్క్ ఇచ్చి, నేవెళ్ళిపోతాను'' అంది. స్కూల్లో చేరాక ఇంతవరకూ ఆమె పర్మిషన్ అడగలేదు.

''ఫర్లేదు వెళ్ళండి. అన్నట్లు క్లాస్‌రూములన్నీ కళగావున్నాయి, మీరేయించిన చార్టులతో'' అన్నాడు ప్రిన్స్‌పాల్.

ఆ మాత్రం గుర్తింపుంటే చాలనుకుని ''ఐడియా మాత్రమే నాది, పిల్లలే కష్టపడ్డారండీ'' అంది.

''సైన్సు టీచర్లు రకరకాల ఫిజికల్ అండ్ బయలాజికల్ చార్టులు, సోషల్ టీచర్లు మాపులు వేయించచ్చు. కానీ వాళ్ళకి అశ్రద్ధ. ఎప్పుడు ఇంటికి పోదామన్న ధ్యాస తప్ప మరేమీ వుండదు, సరే మీరెళ్ళండి'' అన్నాడు.

ఆలశ్యంగా వచ్చిన స్మితని విసుక్కుంటూ ''ఏమైంది?'' అంది రమ్య. జరిగిన విషయం చెప్పింది. హాండ్‌బాగ్ తీసుకుని ఇద్దరూ రోడ్డున పడ్డారు. దార్లో శంకర్ కనిపించాడు.

''ఈరోజు త్వరగా వెళ్ళిపోతున్నారేం?'' అన్నాడు శంకర్.

''కాస్త పనుంది'' అంది స్మిత.

''రేపు వస్తారు కదా?!'' అని అతను వెళ్ళిపోయాడు.

''ఎవరీ పెద్ద మనిషి?'' అంది రమ్య.

''పేరు శంకర్. ఇక్కడ క్లినిక్ పెట్టుకున్న డాక్టర్. సికింద్రాబాద్ నుండి వస్తాడు. సిటీలో అతనికి రెండిళ్ళు వున్నాయట. నాలుగేళ్ళ క్రితం భార్య చనిపోయిందట''

''ఇంతేనా, ఇంకేమైనా చెప్పాడా?'' నవ్వింది రమ్య.

''ఇప్పటివరకూ అయితే తిన్నగా మాటల రూపంలో చెప్పలేదుగానీ, ధోరణి చూస్తే మాత్రం ఏదో అనుమానంగానేవుంది. నేను సరిగా వినకపోయినా, పట్టించుకోకపోయినా ఏమేమో చెప్తుంటాడు, విసుగూ విరామం లేకుండా. అంతా మంచి డాక్టరంటూ ప్రశంసిస్తుంటారు. ఏమైనా అందామన్నా, గుమ్మడికాయల దొంగలా భుజాలు తడుముకున్నట్లవుతుందని వూరుకుంటున్నాను''

''ఆఁఆఁ... మొహమాటానికి పోతే...''

''అది కాదు రమ్యా! అతను కాస్త పెద్దవాడే, మరీ మన ఏజ్‌గ్రూప్ కాదు. త్వరపడి నేనేమైనా అంటే నాకలాంటి చెడ్డవుద్దేశాల్లేవు. ఒక ఆడపిల్లతో మాట్లాడ్డమే నేరమా?'' అంటే

''ప్రొద్దున లేచిన దగ్గర్నుండీ పాలవాడితోనో పనిమనిషితోనో మొదలెడ్తే రాత్రి పడుకునే వరకూ మనం చాలామందితో మాట్లాడ్తాము. మాట్లాడ్డం తప్పనికాదు, మాట్లాడే ధోరణి బాగుండాలి కదా?''

''నిజమే రమ్యా! కేవలం ఒక బస్‌మేట్‌గా, ఒక ప్రదేశంలో పని చేసేవాడిగా ఫ్రెండ్లీగా మాట్లాడితే నాకేం అభ్యంతరం లేదు. కానీ

దాన్ని అలుసుగా చేసుకుని పిచ్చి వేషాలేస్తే మాత్రం గట్టిగా బుద్ధి చెప్పాలనే నిర్ణయించుకున్నాను. ఇండైరెక్టు వాగుళ్ళకి నేనేం రియాక్ట్ కాదల్చుకోలేదు'' అంది స్మిత.

రమ్య నవ్వి ''అది సరే... ఇంతకీ హీరో ఏమంటున్నాడు?'' అంది.

''ఏం లేదు, పెళ్ళి కోసం తొందరపడుతున్నాడు''

''ఎలాగో చేసుకోదలిచాక నీకైనా జాగెందుకు?''

''ఏమో నాకు ఓసంవత్సరంఆగడమేమంచిదన్పిస్తోంది. ఈలోపు కాలం చాలా మార్పులు తీసుకురావచ్చు''

''ఇంట్లో పరిస్థితి ఎలావుంది? అమ్మా వాళ్ళేమంటారు?''

''నేనేం చెప్పానని వాళ్ళనడానికి? ఒకప్పుడు అతన్నే చేసుకుంటాను అన్నాను. కాదూ కూడదూ అన్నారు. ఆ అనుమానంలోనే అమ్మ సిఐడీలా కాపు కాస్తుంటుంది. ఈమధ్య ఆ ఇడియట్ కంపెనీ మారి ఒకటే కాంపులు. దాంతో నేను పెద్దగా బాల్కనీ ఛాయలకి వెళ్లడం లేదు. పాపం అమ్మ అతన్ని మర్చిపోతున్నాననుకుని నా మీద నిఘా తగ్గించింది''

''ఏమో తల్లీ త్వరగా తేలిపోతే బాగుంటుంది''

''తేలకేం చేస్తుందిగానీ నాకో సందేహం రమ్యా... నేనంటే ప్రేమలో పడ్డాగనక అతని కెరీర్ గురించి ఆలోచించడంలేదు. నీది అరేంజ్డ్ మారేజ్ కదా మరే కళతో సంబంధం లేని వ్యక్తిని ఎందుకు చేసుకుంటున్నావు?'' అంది స్మిత.

''అతను ప్రస్తుతానికి బాంక్ ఆఫీసరేగానీ నిజానికి మంచి ఫొటోగ్రాఫరట. ఉద్యోగం మానేసి స్టూడియో పెట్టే ఉద్దేశంలో వున్నాడు. అతన్లో నాకు చాలా నచ్చింది టాలెంటే'' అంది రమ్య.

''ఇప్పుడు నాకు నిజంగా సంతోషంగా వుంది రమ్యా. అయితే ఇక అమ్మాయిగారి ప్రతి కదలిక్కీ ఒక స్నాప్ అన్నమాట''

ఇంతలో బస్సొచ్చింది. ఇద్దరూ ఎక్కారు.

★ ★ ★

హుస్సేన్ లేని ఆ వారమంతా స్మితకి వెలితిగా అన్పించింది. బరువుగా, భారంగా వారం గడిచింది. అతని రాకకోసం ఎంతో ఎదురుచూసింది. అతడొస్తాడని త్వరగా స్నానం ముగించి, అతడికెంతో ఇష్టమయిన ఆరెంజ్ కలర్ చుడీదార్ వేసుకుని, జుట్టు ఆర్పుకుంటున్న వంకతో బాల్కనీలో నిలబడింది. సమయం గడిచిపోతోంది గానీ అతను రాలేదు. చివరికి అన్నం తినడానికి సమయమే లేదు. నిజానికి టిఫిన్ బాక్స్‌లో కూడా పెట్టుకోవాలన్పించలేదు కానీ తల్లి తిడుతుందన్న భయంతో పెట్టుకుని బయల్దేరింది.

అడవి కాచిన వెన్నెలలా తను తొడిగిన ఈ డ్రెస్సు నిరుపయోగంగా అన్పించింది. ఆ డ్రెస్సు వేసుకున్న మొదట్లో అతడు 'చాలా బాగున్నావు' అంటూ సైగ చేశాడు. ఆ తర్వాత చెప్పకపోయినా దీక్షగా, పరవశంగా చూసేవాడు. బస్టాపు చేరేవరకూ ఆమె మనసులో ఆశ మిణుకుమిణుకుమంటూనేవుంది. కానీ బస్సు వచ్చే వరకూ కూడా అతని జాడే లేదు. ఆ రాత్రీ రాలేదు. కోపంతో, బాధతో ఆ తర్వాత రోజు బాల్కనీ తలుపు తీయలేదు.

మర్నాడుదయం కిందికి దిగి కూడా అతని కోసం పైకి చూళ్ళేదు. కానీ హుస్సేన్ దారిలో ఆమెని కలిశాడు.

''హలో స్మితా, బాగున్నారా? పని కానందున ఇంకోరోజు బాంబేలోనే వుండాల్సొచ్చింది'' అన్నాడు.

స్మిత చిన్నగా నవ్వింది. అతను కావాలని అశ్రద్ధ చేయలేదని వినగానే ఆమెకు ఆనందం కలిగింది. బయటికెళ్లాక లక్ష పనులు వుంటాయి. తనకి కోపం ఎందుకు రావాలి? అనుకొంది.

''పర్ఫ్యూమ్ ఎలా వుంది?''

స్మిత నిజానికి దాన్ని తెరిచి చూళ్లేదు. అతనిచ్చిన పర్సు కూడా వాడలేదు. 'వాటిని భద్రంగా దాచుకోవాలేతప్ప వాడకూడదు, ఒక వేళ వాటి అవసరం వుంటే కొనుక్కోవాలి' అనుకుంది. అతనంటే స్మితకి అంత ఆరాధనా భావం. అయినా ఈ మాట చెప్తే మరోలా అనుకుంటాడని ''ఆఁ ఆఁ చాలా బాగుంది'' అంది.

''ఇంతకీ పెళ్లి విషయం ఏమంటారు?



ఎన్నాళ్లిలా చూసుకుంటూ గడపడం?''

''చెప్పానుగా ఒక సంవత్సరం ఆగమని''

''ఎందుకు ఆగడం? ఏపని చేసినా సరైన కారణముండాలి''

''ఈలోపు నాకో మంచి వుద్యోగం రావచ్చు''

''స్మితా ముందు చదువు పూర్తవ్వాలన్నారు. తర్వాత వుద్యోగం రావాలన్నారు. ఇక ఇప్పుడేమో మంచి వుద్యోగం. మంచి అంటే ఎంతవరకూ. ఎక్కడివరకూ?''

''మీరూ గ్రహించేవుంటారు. మా ఇంట్లో మిమ్మల్ని చేసుకోవడం ఎవరికీ ఇష్టంలేదు. బహుశా మీ ఇంట్లోనూ ఒప్పుకుంటారనే నమ్మకం నాకు లేదు. మిమ్మల్ని చేసుకోవడం అంటే అన్నిటినీ, అందరినీ వదులుకొని రావడమే. కనీసం నాకో మంచి వుద్యోగం లేకుండా మీతో వచ్చేస్తే... హుస్సేన్! ప్లీజ్ నన్నర్థం చేసుకోండి''

''అంటే నామీద ఆపాటి నమ్మకం లేదా?''

''లేకకాదు, ప్రేమున్నచోట నమ్మకం వుండి తీరుతుంది. మీరో అబ్బాయి. మీకెలా చెప్తే అర్థమవుతుంది, ఇలాంటి పరిస్థితిలో వున్న ఆడపిల్ల మనస్తత్వం? ఒక్క సంవత్సరం ఆగలేరా ఇన్నాళ్లు ఆగారు''

''అప్పుడు మాత్రం మీరు ఈ మాటమీద వుంటారని నమ్మకమేంటి? ఇప్పటికే దాదాపు మూడేళ్లవుతోంది. నేనింకా వెయిట్ చేస్తూ కూర్చుంటే అది నా ఫూలిష్‌నెస్ అవుతుంది. మీరు కేవలం మీ గురించి ఆలోచిస్తే నా సంగతేంటి? నాకూ చాలా ప్రెషర్స్ వున్నాయి.ఇంట్లో పెళ్లిచేసుకోమని ఎప్పట్నుండో వత్తిడి చేస్తున్నారు. అటు వాళ్లమాట వినక, వాళ్లకి సరయిన కారణం చెప్పక...ప్చ్ ఇదేం బాగాలేదు. చుట్టుపక్కలవాళ్లు ఎవరేమనుకుంటారోనని, మీ ఇంట్లోవాళ్లు నన్నే విలన్‌గా చూస్తారేమోనని ఎన్నాళ్లండీ ఇలా? నేనేదో తప్పు చేసినట్లు అందరి ముందూ ఫీలవడం నాకిష్టంలేదు. ఇన్నాళ్లూ మిమ్మల్ని అర్థంచేసుకున్నాను. ఇప్పుడు మీరు నన్నర్థం చేసుకుంటే బాగుంటుంది''మొదటిసారిగా హుస్సేన్ గొంతులో తీవ్రత చూసి ఆశ్చర్యపోయింది స్మిత.





''ఇంతకీ మీ వుద్దేశమేంటి?'' అంది స్మిత.

''మళ్లీ మొదటికొచ్చారా? స్మితాజీ! మీకు సరిగ్గా వారం రోజులు గడువిస్తున్నాను. మీరు నిజంగా నేను కావాలనుకుంటే నాతో రండి. ఇద్దరం పెళ్లిచేసుకుందాం. లేకుంటే మాత్రం ఇంకా మీకోసం ఎదురుచూసే ఓపిక నాకులేదు. మా ఇంట్లో చూసిన సంబంధం ఏదో ఒకటి చేసుకుంటాను. మీ ఇష్టం, బాగా ఆలోచించుకోండి. వచ్చేవారం సరిగ్గా ఇదే సమయానికి మీకోసం ఎదురుచూస్తాను'' అని చెప్పి వెళ్లిపోతున్న హుస్సేన్ని విస్మయంగా చూస్తుండిపోయిందామె.

రెండుమూడు బస్సులు వచ్చాయి, వెళ్లాయి. ఆమె ఆశ్చర్యంలోంచి తేరుకోవడానికి చాలాసేపు పట్టింది. 'ఇతను హుస్సేనేనా ఇదంతా నిజమేనా? లేక తను కల కంటోందా?' అనుకుంది స్మిత.

★ ★ ★

స్కూల్లో ఎవ్వరితో ఏమీ మాట్లాడాలనిపించడం లేదు. క్లాసుల్లో బొమ్మలు వేయడానిక్కూడా చేతులు రానట్లేవుంది. ఏదో బొమ్మలు వేయండి అని చెప్పడం, సరిగా గమనించకుండానే కరక్షన్లు చేయడం, స్మిత తానేం చేస్తోందో తనకే తెలియని స్థితిలోవుంది.

హుస్సేన్ మాటలు చెవుల్లో పదేపదే వినిపిస్తున్నాయి. కళ్ళు మూసినా, తెరిచినా తీవ్రంగా తనతో మాట్లాడిన దృశ్యమే కనిపిస్తోంది.

''ఈ రోజు గురువారం. అంటే మళ్ళీ గురువారం వరకూ తనకు గడువిచ్చాడు. తనని నిజంగా కావాలనుకుంటే తనతో వచ్చేయమని చెప్పాడు. పోనీ వెళ్ళిపోతే? ఇన్నేళ్ళుగా పెంచి, పెద్దచేసిన అమ్మా, నాన్నలనీ, ఇంకా అందర్నీ విడిచిపెట్టి వెళ్ళిపోగలదా? తల్లిదండ్రులు ఎంత కోపగించుకుంటారు? అంతకంటే ఎంత విలపిస్తారు? బంధు మిత్రవర్గంలో వాళ్ళ పరువేమయినా మిగుల్తుందా? కష్టసుఖాల్లో పాలు పంచుకోని బంధుమిత్రుల వ్యాఖ్యానాలు పట్టించుకోకపోయినా, తల్లిదండ్రులు వెంటనే ఆవేశపడినా నెమ్మదిగా అర్థం చేసుకుంటారు, మళ్ళీ దగ్గరకి తీస్తారు అనుకున్నా అసలేదో తప్పు చేసినట్లు, దొంగతనం చేసినట్లు అతడితో ఎక్కడికో పారిపోవడం ఎంత వరకూ సమంజసం?

అతను పెళ్ళి చేసుకుందామనే అంటున్నాడు. తనూ అతన్ని చేసుకోవాలనే నిర్ణయించుకున్నప్పుడు పోనీ సంవత్సరం ఆగే బదులు అతడి కోరిక ప్రకారం ఇప్పుడే చేసుకుంటే వచ్చే నష్టమేంటి? కాస్త ముందూ వెనకా అంతేగా తేడా. ఉహూ. అతనికి మాత్రం అంత పట్టుదల ఎందుకు? సంవత్సరమంటే ఎంతలో తిరిగొస్తుంది? ప్రేమకోసం ఎన్నిత్యాగాలు చేసినవాళ్ళు లేరు. అయినా తనేమంత పెద్ద షరతు పెట్టిందని? కేవలం ఒక సంవత్సరం ఆగమంది. దానివల్ల తనకు రెండు ప్రయోజనాలువున్నాయి. ఒకటి అతడి ప్రేమ ఎంతవరకూ నిజమో తెలుస్తుంది. రెండోది ఆర్థికంగా తను కూడా కొంత నిలదొక్కుకోగల్గుతుంది. ఈ లోపు తల్లికూడా తనని అర్థం చేసుకోగలిగితే తండ్రి మనసు కూడా మార్చి వాళ్ళే దగ్గరుండి పెళ్ళి జరిపించే అవకాశంవుంది.

అలాంటి అవకాశాలు జారవిడుచుకుని అంత కక్కుర్తి పడాల్సిన అవసరమేముంది ఇప్పుడు? అసలు హుస్సేన్ని తను ఫిజికల్‌గా కోరుకోవడం లేదు. అతనంటే తనకి కేవలం ఆరాధనా భావముంది. అయినా ఎల్లకాలం అతన్ని కేవలం చూస్తూ కూర్చోవడం భావ్యమూకాదు, సాధ్యమూ కాదు కాబట్టి ఒక క్రమపద్ధతి కోసం సమాజం ఏర్పరచుకున్న వివాహ వ్యవస్థనే ఆశ్రయించదలచుకుంది. అతడి మీద ప్రేమవల్లనే కదా ఆ నిర్ణయానికొచ్చింది.

హుస్సేన్ ఎందుకింత తొందరపడుతున్నట్లు? ఏమన్నాడు? 'ఎన్నాళ్ళిలా చూస్తూకూర్చోవడం' అనేకదా. తనకి అతన్ని చూస్తూ కూర్చోవడంలోనే పరమానందం వుంది. అది అద్వితీయమైనదీ, అద్భుతమైనదీగా కన్పిస్తోంది. కానీ తానంత పిచ్చిగా, వెర్రిగా అభిమానించిన హుస్సేన్ ఆలోచనలు తనకంటే భిన్నంగా ఎందుకు వున్నట్లు? ఎందుకు వుండకూడదు? మనిషికో బుద్ధి, జిహ్వాకోరుచి అంటారు. తను ఇష్టపడినంతలో ఇద్దరి ఆలోచనలు సమానంగా వుండాలని లేదే. సమాంతరంగా కూడా వుండచ్చు. ఇంతకీ అతను తనని శారీరకంగా మాత్రమే కోరుకుంటున్నాడా? ఛఛ... శారీరక వాంఛ తనకి ఎందుకో తుచ్ఛంగా అన్పిస్తుంది.

హుస్సేన్ దృష్టిలో ప్రేమంటే అదేనా? ఇవాళా రేపూ వస్తున్న నవలల్లో, సినిమాల్లో ప్రేమంటే శారీరక వాంఛేనన్నట్లు చూపిస్తున్నారు. ఒకర్నొకరు రాసుకు తిరగడం, మీదమీద పడడం ఇవేనా ప్రేమంటే అదే ప్రేమయితే ఆ నీచమయిన ప్రేమ తనకి అక్కర్లేదు. తన దృష్టిలో ప్రేమంటే మహోన్నతమైనది. అది మాటలకందనిది, అనుభవించాల్సిందే తప్ప చెపితే అర్థంకానిది. ప్రేమించిన వ్యక్తిని పదేపదే వీలయితే ఇరవైనాలుగ్గంటలూ చూడాలనిపిస్తుంది. తన అనుభవాలూ, ఆలోచనలూ అన్నీ వారితో చెప్పాలనిపిస్తుంది. తన అనుభూతులన్నీ పంచుకోవాలన్పిస్తుంది. అంతకు మించి పిచ్చి ఆలోచనలే రావు. అదే నిజమయిన ప్రేమగా తాను భావిస్తోంది.

తనది అమలిన శృంగార సిద్ధాంతం. ఒక వ్యక్తి గురించి కలలు కనడం, చూడడం, మాట్లాడ్డం అంతవరకే తప్ప అంతకుమించితే పవిత్రత కోల్పోయినట్లూ, శ్రుతితప్పి స్వరాలు అపస్వరాలయినట్లు అన్పిస్తుంది. కానీ తన ఆలోచన ఎంతవరకూ ఆచరణయోగ్యం? కేవలం కలలవరకేనా, కళవరకేనా? ఈ నిజజీవితంలో ఆ పవిత్రప్రేమ సాధ్యమవుతుందా? అలాంటి వెధవ కోరికలున్నప్పుడు పెళ్ళిపెటాకులెందుకూ ఊరికే కలలుకంటూ కూర్చోకపోయావా అంటాడా హుస్సేన్?!

భవిష్యత్తు సంగతి తెలీదుగానీ ఇప్పటివరకూ మాత్రం తనకి శారీరకవాంఛ అనేది మనసులో ఏ మారుమూలో కూడా లేదు. అలాంటప్పుడు తను పెళ్లి చేసుకుని అవతల వాళ్లని అది హుస్సేన్ కావచ్చు, మరొకరు కావచ్చు. ఇబ్బంది పెట్టే హక్కు తనకెక్కడిది? కానీ తను హుస్సేన్ని చూడకుండా వుండగలదా? లేదనేకదా పెళ్ళి చేసుకోడానికి కమిట్ అయింది.

అసలు తను ఏ కొండకోనల్నో నదీ, సముద్రాలనో, చెట్లనో, జంతువులనో . ప్రేమించక హుస్సేన్ని ఎందుకు ప్రేమించినట్లు? అవయితే తనకే నిర్బంధాలూ పెట్టవు. లోకం కూడా ఏ వంకా పెట్టకుండా ప్రకృతిని చూస్తే పులకించిపోతుంది. గొప్ప కళాసక్తి అంటూ ప్రశంసించేది కానీ ఇప్పుడలా కాదే? అందమయిన ఏ ప్రకృతి దృశ్యాన్ని చూసినా లేని తప్పు ఒకవ్యక్తి మరోవ్యక్తిని చూస్తే ఎందువల్ల తప్పవుతుంది? చూసినంతలో ఏం తరిగిపోతుందని?



వ్యక్తులు మాత్రం ప్రకృతిలోంచి వచ్చినవాళ్ళు కారా? ఒక పువ్వునో, పక్షినో చూస్తేనే ప్రకృతి ఆరాధన, మనిషిని చూస్తే మాత్రం పిచ్చి లేక ఉన్మాదమూ అవుతుందా? ఇది మాత్రం సౌంద ర్యారాధన ఎందుకు కాదు?

హుస్సేన్ పెట్టిన గడువు నిజమయినదా? తమాషాగా తనలో పెళ్ళి గురించి ఒక సీరి యస్‌నెస్ తీసుకురావడానికి అలా అని వుంటాడా? ఒకవేళ ఈ వారంలో తను పెళ్ళికి అంగీకరించకపోతే అతను నిజంగా మరో అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడా? అది అత నికి సాధ్యమా? తను అతణ్ణి ప్రేమించినంతగా అతను తనను కావాలనుకోలేదా? కానీ కావాల నుకున్నాడని చెప్పేందుకు అనేక నిదర్శనాలు న్నాయికదా! ఒకవేళ అతను మరో అమ్మాయిని గనుక చేసుకుంటే ఇన్నాళ్ళూ అతను కనబరి చిన ప్రేమంతా కూడా నాటకమనేకదా అర్థం. ఉహూఁ హుస్సేన్ అలాంటివాడు కాదు. అతని మొహంలో, కళ్ళల్లో ఎంత నిజాయితీ కని పిస్తుంది? తనలా అతనికి కళాహృదయం లేదేమో. ప్చ్... లేకపోతే అసలు ఇష్టాలూ, అయిష్టాలూ ఎలా కలుగుతాయి? ప్రతి మని షిలోనూ సౌందర్యంపట్ల అభిమానం వుంటుంది. ఆ లక్షణం బహుశా మానవుడికి మాత్రమే వుందేమో. అందువల్లనే మనిషి అవసరార్థం చేసే పనులు కూడా వీలైనంత అందంగా చేయడానికి ప్రయత్నిస్తాడు. చలి, వాన, ఎండలనుండి రక్షించుకోడానికి నీడని చ్చే గూడు ఏర్పర్చుకుంటే చాలు నిజానికి. కానీ ఇంటిని వీలయినంత అందంగా, ఆకర్ష ణీయంగా నిర్మించుకుంటున్నాం. తరిచి చూ స్తే ప్రతి పనిలోనూ ఈ లక్షణం కనిపిస్తుంది.

మరి తనను ప్రేమించిన హుస్సేన్ తనతో పంతానికిపోయి మరో స్త్రీని ఎలా చేసుకోగలుగు తాడు? ఒకవేళ చేసుకుంటే తనని మర్చిపోగ లుగుతాడా? ఉదయం లేస్తూ, ముఖంమీది నుండి దుప్పటి తొలగిస్తూనే తనకోసం వెతికిన కళ్ళు, రాత్రులు తనకు వీడ్కోలు చెప్పిగానీ నిద్రపోని కళ్ళు తనని అంత తేలిగ్గా మర్చిపో తాయా? ఆ విషయం అతనికి తెలియదా? తెలిసీ చేసుకుంటాడా?

అసలిన్ని తర్జనభర్జనలెందుకు? అతని ఇష్టప్రకారంగానే అతని కోసం వెళ్ళిపోయి, పెళ్ళి చేసుకుంటే ఏమవుతుంది? తనకీ మంచి దో, పిచ్చిదో ఏదో ఒక ఉద్యోగముంది. నెమ్మ దిగా చూసుకుంటే మరో మంచి ఉద్యోగమే దొరకచ్చు. ఆర్థికంగా అయితే పెద్దగా ఇబ్బందిపడాల్సిన అవసరం వుండదు. మరి తనెందుకు సందేహిస్తోంది...? పురుషుడు వృక్షం, స్త్రీ తీగ అనుకోకపోయినా ప్రస్తుత పరిస్థితిలో అయితే మాత్రం హుస్సేన్‌తో గడప దాటడం తనకి సమ్మతం కాదు. అతని దగ్గర తాను ఆశించిన పట్టు దొరకనట్లు, అతని దగ్గర తనకు భద్రత లేనట్లు అనిపిస్తోంది. ఇదేంటి ఈ విచిత్ర ఆలోచన? తానొక మనిషి. తాను ఒక వస్తువైనట్లు భద్రతేంటి...?

హుస్సేన్ తనని తాత్కాలికంగా పెళ్ళిచేసు కున్నా కొద్దికాలంలో విడిచి వెళ్ళిపోయి మరో పెళ్ళి చేసుకుంటే? అదేకదా అమ్మ భయం. ఒకవేళ అలా వెళ్ళినా చట్టం ఈతని పక్షానే వుంటుందనికదా అమ్మ చెప్పేది. అప్పుడు తనేమంది? చట్టం కోసం బలవంతంగా భార్యా భర్తలుగా చలామణీ కావడం గొప్ప సంగతి కాదు. ఏ చట్టమూ ఆదేశించకపోయినా ఒకరి మీద ఒకరు ప్రేమతో, ఇష్టంతో కలిసుండాలి. అంతే తప్ప భార్య వుండగా మరో పెళ్ళి చేసుకునే వీలులేదు కాబట్టి తప్పనిసరిగా ఆ భార్యతోనే వుండడం అనేదాన్ని తాను సమ ర్థించలేనంది. హుస్సేన్‌కి నాలుగుకాదు నలభై పెళ్ళిళ్ళు చేసుకునే అవకాశం వున్నా అందుక తడు సమ్మతించక తనతోనే వుంటే అది తనకు నిజమయిన సంతోషాన్నిస్తుంది- అని భావించింది.

ఇంతకీ తనిప్పుడు ఏం చేయాలి? హుస్సేన్ చెప్పినట్లు వెళ్ళిపోడానికి తన మనసు ఎదురు తిరుగుతోంది. ఈ వారం దాటితే హుస్సేన్ మరో అమ్మాయిని చేసుకోగలుగుతాడా? ఆ ఊహ ఒక పక్కన అపనమ్మకంగా వుంది, మరో పక్కన భయంగా వుంది. ఒకవేళ అదే జరిగితే హుస్సేన్ని తాను మునుపటిలా నిర్భయంగా చూడగలుగుతుందా? ఆ వచ్చే భార్యామణి ఎవరో "సిగ్గులేదూ, నా భర్తని చూట్టానికి? నువ్వు సరయిన ఆడపిల్లవేనా? నువ్వు చూట్టా నికి పెళ్ళికానిమగాళ్ళుఇంకెవరూ దొరకలేదా?" అన్నట్లు చూస్తే తను తల ఎక్కడ పెట్టు కుంటుంది? మునుపు అతన్ని చూస్తూ పట్టుబ




డినప్పుడు అమ్మ, అక్క చూసిన చూపులకే తాను తాళలేకపోయింది. అప్పుడు తానేం తప్పు చేయడంలేదు అనే ఆత్మవిశ్వాసం తన కుండేది. కానీ అతనే పెళ్లిచేసుకుంటే తనకి ఆత్మవిశ్వాసం ఎక్కడుంటుంది? అతన్ని చూసే అర్హత తనకెక్కడుంటుంది?

ఎందుకు వుండకూడదు? క్రిములు, కీటకాలూ అతన్ని చూడగాలేంది, గాలీ, ధూళి అతన్ని అంటుకోగాలేంది ప్రాణానికంటే మిన్నగా ప్రేమించిన తను చూస్తే దోషమవుతుందా? ఇదెక్కడి న్యాయం. న్యాయం, ధర్మం సంగతి తర్వాత. తనని నిర్లక్ష్యంచేసి వెళ్లిపోయిన హుస్సేన్ని తానేం ముఖం పెట్టుకుని చూడగలుగుతుంది. తనకి మరీ అంత ఆత్మాభిమానం లేదా? ఇందులో అభిమానం కోల్పోవడమేముంది? నిజం ఆలోచిస్తే వేరే అమ్మాయిని చేసుకోవడంలో హుస్సేన్ తప్పేముంది? తనని ప్రేమించినందుకేగా దాదాపు మూడేళ్లు నిరీక్షించాడు. అప్పటికీ తన ఆలోచన చెప్పి అవకాశమిచ్చాడు. అయినా తానే నిర్ణయం తీసుకోలేకపోతోంది. తను ఏ విషయమూ సరిగా తేల్చుకోలేకపోతోంది. అలాంటప్పుడు హుస్సేన్మీద కోపం తెచ్చుకోవాల్సిన అవసరమేముంది? తనకెందుకింత సందిగ్ధావస్థ?

తన మనసు, బుద్ధి ఇంకా పరిపక్వత చెందలేదా? తనకి ఏం చేయాలో, ఏంచేస్తే ఏమవుతుందోనని భయంగా, గుండె దడగా వుంది. ఈ విషయం అమ్మతో చెప్పేస్తే? అతన్నీ తననూ కూడా చీపురుకట్ట తిరగేసితంతుంది. పోనీ తనని కొంతలో కొంత అర్థం చేసుకునే అత్తయ్యకి చెప్తే... లాభంలేదు. మునుపే ఆవిడ చెప్పింది, తాను ఒక ముస్లీమునో. సిక్కునోగాక ఇంకెవ్వర్ని ఇష్టపడినా తీసుకొచ్చి చేసేవాళ్ళం అని. హుస్సేన్ ఏ రకంగానూ తనకు భర్తగా సరిపోడనే ఆవిడ అభిప్రాయం. హరనాథ్గారికి చెపితే పరిష్కారమార్గం చెప్తారేమో, హారతి, రమ్య ఏమంటారో?

ఉహూ వీల్లేదు. ఇది తన వ్యక్తిగత సమస్య. దీనికి పరిష్కారమేమిటో స్వయంగా తానే ఆలోచించుకోవాలి. దాని ఫలితం ఎలాంటిదయినా దాని నెపం తనమీదే వుండాలి తప్ప అవకాశవాదిలా వాళ్ళు చెప్పినట్లు చేశాను గనక నా కర్మిలా కాలింది అని మాత్రం తానెప్పటికీ అనుకోకూడదు.

మరి తాను ఎలాంటి నిర్ణయం తీసుకోవాలి...

అదో అంతులేని ప్రశ్నగా తయారయింది.

చివరికి స్మిత ఒక నిర్ణయానికి వచ్చేసింది. అతను అంతగా ఆగలేకపోతే పోనీ, మరో పెళ్ళి చేసుకోనీ. ఓ సంవత్సరం ఆగడానికే ఇష్టపడనివాడితో తాను జీవితాంతం ఎలా కలిసుండగలుతుంది? తను మాత్రం వెంటనే అతనితో వెళ్లి పెళ్లిచేసుకోడానికి సమ్మతించదు. అనుకుంది. అప్పటికీగానీ ఆమె మనసు కాస్త స్థిమితపడలేదు.



వారంలో మూడురోజులు గడిచాయి. ఆదివారమొచ్చింది. ఇదివరలో అయితే ఆదివారాలు టీవీలో ఏవో ప్రోగ్రాములువస్తుంటే ఇంట్లో అందరూ లీనమైపోయి చూస్తుంటే స్మిత హుస్సేన్ని చూస్తూ మైమరచిపోయేది. అతను చుట్టుపక్కల బిల్డింగుల్లో జనాలని గమనిస్తూ ఎవరూ లేకపోతే తనకేవో సైగలు చేసేవాడు. కొన్నిసార్లు గదిలోంచి తలుపు బార్లా తెరిచిపెట్టి అక్కడే నిలబడో, మోకాళ్లమీద నమాజ్ చేస్తున్న పద్ధతిలో కూర్చునో రకరకాలుగా సైగల సంభాషణ సాగించేవాడు. చాలా అర్థమయ్యేవి. కొన్నిసార్లు అర్థంగాక అడిగితే మళ్ళీ మళ్ళీ చెప్పేవాడు. అప్పటికీ అర్థం కానట్లు ముఖం పెడితే నుదుటిమీద సుకుమారంగా కొట్టుకుని ''ఒట్టి మట్టి బుర్ర'' అన్నట్లు చూసేవాడు. అతన్నలా చూస్తున్నంతసేపూ ప్రపంచంలో నిజంగా ఇంత ఆనందం వుందా?

ప్రేమంటే ఇంత మధురంగా వుంటుందా అనుకునేది. మరుక్షణంలోనే హుస్సేన్ విషయమై తల్లి తిట్టిపోస్తుంటే పువ్వు పక్కన ముళ్లులా ఆనందం వెంటే ఆవేదన వుండితీరాలేమో అనుకునేది.

కానీ ఈరోజు పరిస్థితి వేరు. తనని కాపుకాసే తల్లి పక్కగదిలోంచి ఇప్పుడే రాదని తెలిసినా, బయట హుస్సేన్ తనకోసం ఎదురుచూస్తున్నాడని తెలిసినా తనకి బాల్కనీ తలుపు తెరవాలని లేదు. అంటే తనలో హుస్సేన్ని చూడాలనే కోరిక నశించిందా? హుస్సేన్ మీదున్న ప్రేమంతా మాయమయిందా? లేదు తన మనసు నిండా అతడే వున్నాడు. ఇప్పుడే కాదు ఎప్పటికీ వుంటాడు. అతన్ని చూడాలని మనసు ఆరాటపడుతోంది. కానీ చూడడం మాత్రం సముచితంగా వుండదని తన మనసు చెప్తోంది. తాను తనకి తప్పుగా తోచనంతవరకూ ఏ పని చేయడానికయినా వెనకాడదు. తన మనసు అంగీకరించని పనిమాత్రం ఎవరికోసమూ చేయదు.

తానెందుకు తలుపుతీసి బాల్కనీలోకి వెళ్లలేకపోతోంది. తనకి తెలియకుండానే హుస్సేన్ని కోపగించుకుంటోందా? కాదు తనకి అతని మీద కోపమే లేదు. అతన్ని చూడాలన్న తీవ్రకోరికని తానే బలవంతంగా అణచిపెడ్తోంది. ఎందువల్ల? ఒకవేళ బాల్కనీలోకి అడుగుపెడితే అతనింకో విషయం మాట్లాడడు. కేవలం పెళ్ళి గురించే అడుగుతాడు. తాను తన నిర్ణయం చెప్తుంది. తన నెగిటివ్ ఆన్సర్ విన్న హుస్సేన్ ప్రతిచర్య ఘోరంగా వుండచ్చు. అది చూసి తాను సహించలేదు.

మనసు నిలుపుకోలేని స్మిత మూసివున్న కిటికీ అద్దంలోంచి అతన్ని చూడడానికి లేచింది. గోడకి కన్నంవేసే దొంగలా తానిట్లా చూడడం భావ్యం కాదనుకుంటూనే చూసింది. ఏదో ఒక అస్పష్ట ఆకారం అటూ ఇటూ పచార్లు చేస్తోంది. అది షోగ్లాస్ అవడంవల్ల అతను హుస్సేనో కాదో తేల్చుకోలేకపోయింది. తలుపు తీస్తే... ఊహూ తీయకూడదు, మరెలా తెలుస్తుంది? తెలియకపోతేనేం? ఆ పచార్లు చేస్తూ ఎదురుచూసేది హుస్సేన్ అయితే తన మనసుకి సంతృప్తిగా వుంటుంది.

తలుపు బోల్టు దగ్గర ఒక రంధ్రం కనిపించింది. అందులోంచి చూస్తే? అకస్మాత్తుగా ఆమెకో నవల గుర్తొచ్చింది. ఆ నవలలో హీరో హీరోయిన్ని అలాగే చూస్తాడు. కానీ అది ఆమె స్నానం చేసేటప్పుడు. అందుకే ఆ సీన్ నచ్చలేదు. మగవాళ్ళందరూ స్త్రీలని శారీరకంగానే కాంక్షిస్తారా? అంతకుమించి వాళ్ళకి వేరే ఆకర్షణే కనిపించదా? తానెందుకు ఆడ, మగ అంటూ వర్గీకరణ చేస్తోంది? మగవాళ్ళలో మాత్రం శారీరక సంబంధం లేకుండా ప్రేమించేవాళ్ళు, అభిమానించేవాళ్ళూ వుండరా? రాయప్రోలు సుబ్బారావు, కృష్ణశాస్త్రి, కరుణశ్రీ- వీళ్ళంతా అమలిన శృంగారతత్వాన్ని ఎంత చక్కగా చెప్పలేదు?

ఇలా ఆలోచించుకుంటూనే ఆ రంధ్రంలోంచి చూసింది. హుస్సేనే అంత చిన్న కన్నంలోంచి అతని భావాలేవి స్పష్టంగా కనపడకపోయినా అతను ఇటే చూస్తున్నాడని మాత్రం గమనించింది. బహుశా చాలా కోపంగా వుండివుండాలి. 'ఈ పిల్ల తనతో ఆటలాడుకుంటోందా? అసలు నిజంగా పెళ్లి చేసుకునే వుద్దేశముందా లేదా?' అని పళ్ళు కొరుకుతున్నాడేమో అనుకుంది. తృప్తిగా నిట్టూర్చింది. అనడమేగాని ఇతను తనను విడిచివెళ్ళలేడు అనుకుంది.

మళ్ళీ కిటికీ అద్దం దగ్గరికొచ్చింది. అలా చూస్తుంటే ఆమెకి చటుక్కున ఒక ఆలోచన తట్టింది. ఆ రూపాన్ని నిశితంగా, పరిశీలనగా చూసింది. వెంటనే లోపల్నుండి కాన్వాస్, స్టాండు, రంగులు, కుంచెలూ గట్రా అన్నీ తెచ్చుకుంది. మంచం ఓ పక్కకి జరిపి స్టాండు కిటికీలోంచి బయటికి చూసేందుకు వీలుగా ఏర్పాటుచేసి, దానికి కాన్వాస్ తన ఎత్తుకి సరిపోయేట్లు అమర్చింది. రెండు మూడురకాల ఆయిల్ పెయింట్స్‌తీసి ఆ గ్లాసులోంచి కనిపిస్తున్న హుస్సేన్ అస్పష్టరూపానికి చిత్రరూపం ఇచ్చింది. కనిపిస్తున్నదానికి ఇంకాస్త ఆకర్షణీయంగా, అందంగా రంగులేసింది. నొక్కులు నొక్కులుగా గాలి అలికిడికి కదుల్తున్న నీళ్లలో మనిషి నీడ ఎలా తొణికిసలాడుతుందో ఇక్కడ హుస్సేన్ బొమ్మ కూడా అలా తయారయింది. బొమ్మ సగం కూడా పూర్తిగాకముందే హుస్సేన్ అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు. కానీ స్మిత ఏకాగ్రతతో తన మనసుని కదిలించిన ఆ రూపాన్ని చిత్రించింది.




బొమ్మ పూర్తయ్యాక ఆమెకి కొండంత సంతృప్తి కలిగింది. కానీ ఆ బొమ్మ చూసేవాళ్ళకి ఎలా వుంటుంది? దానికి తానేం పేరుపెడితే వాళ్లు దానిని తన దృష్టితో చూడగలుగుతారు? అయినా టైటిల్‌ని బట్టి చిత్రలేఖనానికి పేరొచ్చేటట్లయితే అది ఆ చిత్రలేఖనం గొప్పతనమెలా అవుతుంది? చూస్తూనే మనసు కదిలించే బొమ్మలే నిజమయిన కళాఖండాలు. చిత్రలేఖనానికి కొన్నిసార్లు వ్యాఖ్యానాలు అవసరమౌతాయి. అంతమాత్రంలో వాటి గొప్పతనం ఎందుకు తగ్గుతుంది. అలా అంటే కేవలం సంగీతానికి లేని గొప్పతనం సాహిత్యం అందులో సమ్మేళనమైనప్పుడు అమోఘంగా వున్నట్లనిపిస్తుంది. అందువల్ల సంగీతం కంటే సాహిత్యమే గొప్పదని అనగలమా?

ఏమిటీ పిచ్చి ఆలోచనలు? కాకిపిల్ల కాకికి ముద్దన్నట్లు తను వేసిన బొమ్మ గనక తనకి బాగానేవుందేమో. తల్లి, సోదరి అయితే అది హుస్సేన్ని చూసి వేసిన బొమ్మగా ఆధారాలు లేకపోయినా, ఒక పురుష ఆకారంగా తెలుస్తోంది కాబట్టి దాన్నో పెయింటింగుగా చూట్టం కూడా వాళ్లకి నచ్చదు. తననో దోషిగా, ఇంకా పచ్చిగా మాట్లాడితే ఒకవేశ్యని చూసినట్లు చులకనగా చూస్తారు. ఆ చూపులు తాను భరించలేదు. పోతే శరత్... వాడో వెర్రిమొహం వాడికేం తెలుసు? ఏదో నాలుగు హాస్యపు మాటలు వినరడానికి మించి వాడి బుర్ర ఇంకా ఎదగలేదు. స్మితకి నవ్వొచ్చింది. అందరూ తన బుర్ర ఎదగలేదు అంటుంటే తనకి శరత్ ఎదగనట్లు కనిపిస్తున్నాడు.

అలా బొమ్మని చూస్తుండగా ఆమెకి ఆ ముఖం మీదనుండి గ్లాసు నీడలు చిత్రించినట్లయితే ఏ వ్యాఖ్యానమూ లేకుండా చూడగానే అర్థం కావచ్చు అనుకుంది. అదేపనిచేసింది. తెలుపు, లేత బూడిదరంగుల కలయికతో అద్దపుఛాయలు తీసుకురాగలిగింది. అంతా ముగించి ఆ పెయింటింగ్ గోడవేపుకి తిప్పి, మరోసారి కిటికీ తలుపులోంచి హుస్సేన్‌కోసం చూసింది. అతను కన్పించలేదు.

రెండోరోజుకి కావల్సిన బట్టలు ఇస్త్రీ చేసుకుందామా అనుకుంది. మళ్ళీ బద్ధకంగా అనిపించింది. పాటలు వింటూ పడుకుంది.

గురువారం రానే వచ్చింది. ఆరోజు స్మిత రోజుకంటే కాస్త ముందుగానే స్కూలుకి వెళ్లిపోదామా అనుకుంది. కానీ ఈ వారంరోజులూ వీలయినంతవరకూ అతనికి కన్పించకుండా, తప్పనిసరిగా ముఖం కన్పించినా తలదించుకుని వేగంగా నడవడం చేసింది. అందువల్ల ఈరోజు అతను కూడా కాస్త ముందే వెళ్లి బస్‌స్టాపులో నిలబడితే?

రానని ఖచ్చితంగా చెప్పేయాలి. అందులో దాక్కోవాల్సిన పనేముంది? ఏమో ఆమె మనసు మొరాయించింది, ఆ సన్నివేశాన్ని ఎదుర్కోలేనంటూ. సున్నితమయిన ప్రేమని గాయపరిచే తీవ్రమయిన మాటలేమైనా అంటే, మునుపటికంటే తీక్షణంగా మాట్లాడితే, తన మనసు తట్టుకోలేదు. హుస్సేన్‌పట్ల తనకున్న అభిమానం, ఆదరణ తగ్గడానికి వీల్లేదు అనుకుంది. ముందురోజే ప్రిన్స్‌పాల్‌కి మూడ్రోజులు రానని చెప్పివచ్చింది.

ఏడున్నరయినా మంచం దిగని స్మితని "లేచేదుందా? ఈరోజు ఆదివారం కాదు" అంది సంధ్య.

"స్కూలుకెళ్ళడం లేదు"

"ఏమైంది? ఎందుకని?"

"ఏమో వెళ్ళాలని లేదు"

"ఒంట్లో బాలేదా?"

"ఆఁ ఒక మూడ్రోజులు సెలవు పెట్టాను"

"అన్నీ రహస్యాలే. అడిగితే తప్ప ఆ విషయం చెప్పావా? చస్తూ బతుకుతూ లేచి వంటచేశాను"

"నేను చేయమన్నానా? తర్వాత చేసేది కాస్త ముందుచేశావు అంతేకదా. ఆ మాత్రానికి నేనేదో నిన్ను కష్టపెట్టినట్లు"

"మీరెందుకు చేయమంటారు? నాకే ఒళ్ళు కొవ్వెక్కి చేస్తున్నా. దర్జాగా నేను మాత్రం పడుకోకూడదూ, ఏడున్నరదాకా? అసలు నాకే బుద్ధిలేదు, వుంటే బాగుండేది"

స్మితకి పరమ చిరాగ్గా అన్పించింది. తను దర్జాగా పడుకుందా? తనెంత అశాంతిగా బాధపడుతోంది. దానిక్కారణం వేరే ఎవరో కాదు నిజమే. కానీ ఈ వయసులో వున్న పిల్లలకి కూడా ఏవో కష్టనష్టాలు వుంటాయని, వాళ్లని కాస్త మనశ్శాంతిగా బతకనిద్దామని ఎందుకు

అనుకోదు? తనకోసం రోజూ పెందలాడే లేచి వంటచేస్తుంది నిజమే. తన మనసునిండా ఆ కృతజ్ఞతా భావముంది. కానీ చేసిన విలువ మిగలకుండా ఏవేవో మాటలంటుంటే తాను కృతజ్ఞత ఎలా తెలియజేయగలుగుతుంది? అదే సినిమా తల్లులయితే తమ పిల్లల్ని ఎంత అల్లారుముద్దుగా చూసుకుంటారు? కనీసం తమ పిల్లలమీద ఈగను కూడా వాలనీయరు. అందుకే అవి సినిమాలు. నిజజీవితాలు, సినిమాలు ఒకటికావు. అందులో చూపేవన్నీ అద్భుతాలు, అసంభవాలు. అవన్నీ ఒట్టి రంగుల కలలు. కానీ వాస్తవాలు మాత్రం ఎంత కఠినంగా వుంటాయి?!

ఆ క్షణంలో తల్లిమీద కోపంతో అసలు హుస్సేన్ని ఇప్పుడే పెళ్లిచేసుకుంటే అనుకుంది.

తల్లి విసుక్కుంటూ లోపలికెళ్ళిపోయింది. లేచి గ్లాస్ డోరులోంచి చూస్తే హుస్సేన్ నిలబడివున్నాడు. 'నేను రావడంలేదు, వెళ్లి నీపని చూసుకో' అనుకుంది మౌనంగా.

పనులన్నీ ముగిసి, స్నానంచేసి, అన్నంతిని పక్కమీదే జారిగిలబడింది. మరోసారి పెయింటింగు తనివితీరా చూసింది.

వెంటనే లేచి బట్టలు మార్చుకుంది. "అమ్మా! మా కాలేజ్కోసారి వెళ్ళొస్తాను, కాస్త పనుంది" అంది.

"ఒంట్లో బాగాలేదని, ఇప్పుడు వెళ్లకపోతేనేం?"

"కాదు, త్వరగా వచ్చేస్తాను"

"పెద్దదానివైపోయావు, కాదంటే ఆగుతావా, వెళ్లు" అంది సంధ్య.

స్మితకి చాలా కోపమొచ్చింది. కానీ ప్రయాణం మాత్రం ఆపదల్చుకోలేదు. తనెంత సున్నితంగా ప్రవర్తించినా తనతో అంత కఠినంగా ఎలా వుండగలుగుతారు వీళ్ళంతా అనుకుంది. అదక్కడే మర్చిపోయింది.

బస్సు త్వరగానే వచ్చింది. హరనాథ్గారు ప్యూన్తో మాట్లాడ్తూ కనిపించారు. సమీపించి విష్ చేసింది.

"ఏం స్మితా! బాగున్నావా, చాలాకాలమైంది కన్పించి"

"జాబ్ చేస్తున్నాకదా కుదరడంలేదండీ. ఈరోజు లీవ్ పెట్టాను"

"ఇంకేంటి సంగతులు? డిప్రెషన్ తగ్గినట్లేనా?"

"సర్! అవన్నీ మీకు తర్వాత వివరంగా చెప్తాను. ఒక చిన్న కోరిక, కాదనరుగా?!"

"చెప్పు, ఏమిటి?"

"ఏంలేదు, ఒక్కసారి మా ఇంటికి రాగలరా?"

"ఆక్షేపనేంటి? నీ పెళ్ళికి వస్తాలే"

"ఆ పెళ్ళి జరిగినప్పటి సంగతి చూద్దాంలెండి. ఇప్పుడు మాత్రం"

"సర్లే, నేను రావటం ఏమంత విశేషంకాదు. కొంతసేపు వెయిట్ చెయ్యి, ఓ క్లాసుంది, తీసుకుని వచ్చేస్తా"

స్మిత గోరింటాకు చెట్టు దగ్గర కూర్చుంది. రమ్య తన పక్కన లేకపోతే ఈ చెట్టుదగ్గర అందమేం వుంది? అంతా బోసిగా వుంది. అసలు అందము, కళ అనేవి ఎందులో వుంటాయి? హుస్సేన్ మరో పిల్లని చేసుకుని అక్కణ్ణుంచి వెళ్ళిపోతే ఆ బిల్డింగుకి కళా కాంతీ వుంటాయా?

రమ్యకి ఫోన్చేసి, కాలేజ్కి రమ్మని చెప్పాల్సింది. ఇందాక తనకి ఆ ఆలోచన రాలేదు. ఇప్పుడు రమ్య వుంటే ఎన్నో కబుర్లు చెప్పుకునేవాళ్ళు. రమ్య, తనూ కలిసి ఈ చెట్టుకింద చెప్పుకున్న కథలు, కబుర్లు ఎన్నో! మళ్ళీ ఆ కాలం రమ్మన్నా వస్తుందా? తామిద్దరినీ చూసి ఎంతమంది ఈర్ష్యచెందేవాళ్లో. మొత్తానికి రమ్య పెళ్ళిచేసుకోబోతోంది. ఆ వచ్చేవాడు మంచివాడై, రమ్యని అర్థంచేసుకుని, నొప్పించకుండా వుండాలి. అప్పుడు రమ్య, 'నేను ఆనందంగానే వున్నాను, నువ్వు కూడా ప్రేమించకుండా పెళ్ళి చేసుకోవాల్సింది స్మితా' అని వుత్తరాలు రాస్తుందేమో, నవ్వొచ్చింది.

ఇప్పుడు తన పరిస్థితి రమ్యకి చెప్తే ఏమంటుంది? హుస్సేన్ ఏమన్నాడో అదే అంటుంది. రమ్యకి ఒక విషయాన్ని నాన్చడం ఇష్టముండదు. అయితే పెళ్ళి చేసుకో, లేకుంటే పూర్తిగా మర్చిపో అంటుంది.

అదే హారతి అయితే, "విషయాన్ని కాస్త లౌక్యంగా టాకిల్ చేయమంటుంది. మరీ తొందరపాటు నిర్ణయాలు తీసుకోకుండా, తాడు



తెగేవరకూ లాగకుండా జాగ్రత్తగా నడిపించాలి వ్యవహారాలు అంటుంది.

తన స్నేహితులు ఒక్కొక్కరూ ఒక్కోరకం. ఏ ఒక్కరికీ పోలిక లేదు. రమ్య స్త్రీపురుషులమధ్య కలిగేది నిజమయిన ప్రేమ కాదు కేవలం ఆకర్షణే అంటుంది. రేపు పెళ్ళయితే తన మాటలు తనే వెనక్కి తీసుకుంటుందని స్మిత ఎప్పుడూ ఆ విషయమై వాదించలేదు. నాన్సీ కాస్త తన దారిలోనే వున్నట్లు కనిపిస్తుంది. కొన్నిసార్లు భిన్నంగా వున్నట్లనిపిస్తుంది. వీణ దృష్టిలో సృష్టిలో వున్న మగవాళ్ళందరూ విలన్లే. గౌతమిది మరీ చిత్రమయిన మనస్తత్వం.

ఆమె ఒక్కోసారి ఉత్తరంలో రాస్తుంటుంది, తనకు మాట్లాడ్డమే బద్ధకమని. ఎవ్వరూ ఆమెని పలకరించకపోతే సుఖంగా వుంటానని. మళ్ళీ తను ఆలస్యంగా వుత్తరం రాస్తే కోపగించుకునేది.

ఇలా అర్థంలేని అస్తవ్యస్తపు ఆలోచనలు ఆమెని ముసురుకుని వుండగా హరనాథ్ వచ్చి,

''ఏమాలోచిస్తున్నావు, లే'' అన్నారు. ఆయన కారు టర్న్‌చేసి రోడ్డుమీదికి వచ్చాక ''ఇల్లెక్కడ?'' అన్నాడు. ఆమె చెప్పింది.

కొద్దినిమిషాల్లో హిమాయత్‌నగర్ వచ్చేశారు. స్మిత లెఫ్ట్, రైట్ అంటూ చూపిస్తుంటే హరనాథ్ ఒక ఇంటిముందు కారాపాడు. ఇద్దరూ దిగారు. హరనాథ్ కారు దిగి బిల్డింగుని పై నుండి కిందికి ఒకసారి తేరిపారచూశాడు.

"రండి సార్! మేముండేది పైన" అంది.

ఇద్దరూ మెట్లెక్కారు. ఆయన వస్తారో రారోనన్న వూహలో తల్లికి అసలు విషయం చెప్పలేదు స్మిత. తలుపు తీసిన సంధ్య మామూలుగా వెళ్ళిపోతోంది. వెనక నిలబడ్డ హరనాథ్‌ని చూళ్ళేదు.

"అమ్మా! మా లెక్చరర్... హరనాథ్‌గారని చెప్తా చూడు"

సంధ్య వెంటనే చీరకొంగు భుజాలనిండా కప్పుకుని "నమస్తే" అంది కాస్త బిడియంగా. ఆయన ప్రతినమస్కారం చేశారు.

హాల్లో రెండు సోఫాలున్నాయి. నాలుగయిదు కుర్చీలు మడిచి గోడకి నిలబెట్టి వున్నాయి. ఓ పక్కగా టీపాయ్ వుంది. గోడలకి రెండుమూడు పెయింటింగులు, కాలెండర్లూ వున్నాయి. ఆ పెయింటింగులు ఏమంత గొప్పగా లేవు. ఒకమాదిరిగా వుండి తెలిసినవాళ్ళెవరయినా బహుశా స్మితే వేసి వుంటుంది అనుకునేట్లు వున్నాయి. హరనాథ్ ఇంటిని గమనిస్తూ వచ్చి కూర్చున్నాడు.

"మంచినీళ్ళు తాగుతారా?" అంది స్మిత.

"ఆఁ ఇవ్వు... దీనికి రెంటెంత?" అన్నాడాయన.

స్మిత ఫాన్ వేసి "వెయ్యి రూపాయలు. రండి చూద్దురుగాని. ఈ హాలుగాక రెండు గదులు, డైనింగ్‌హాలు, కిచెనూ వున్నాయి" అని మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది. హరనాథ్ లేచే ప్రయత్నం చేయలేదు.

"నువ్వూ కూర్చో. ఏమిటి సంగతి?" అన్నాడు.

"నా మైండేం బాగాలేదు సార్. మీతో కాసేపు మాట్లాడ్తే బాగుంటుందని. నాలుగు మంచిమాటలు చెప్పండి సార్"

"మూడు సంవత్సరాలు విన్నాక కూడా ఇంకా నా మాటలు వినాలనే వుందా? ఇప్పుడు టీచర్‌వయ్యావు. నువ్వే ఎదురుచెప్పాలి" అంటూ నవ్వాడాయన.

"అలా అనకండి సార్. పీసాఫ్ మైండ్ వుండాలంటే ఏం చేయాలి?"

"తక్కువ ఆలోచించి, ఎక్కువ పనిచెయ్యి"

"అసలు ఆలోచనలు రాకుండా వుండాలంటే ఏంచేయాలో అర్థంకావడంలేదు. సర్! మిమ్మల్ని విసిగిస్తున్నానని తెలుసు. కానీ ప్లీజ్, నేను మీ అమ్మాయిని అనుకోండి. మీనుండి ఏదో మెసేజ్ కావాలనుకుంటున్నాను. అది నన్ను మళ్ళీ మామూలు మనిషిని చెయ్యాలి"

"ఇప్పుడు నువ్వేం వింతమనిషివా?" అని నవ్వి, "స్మితా! నీకు నేను చెప్పేదీ, చెప్పగలిగిందీ ఒక్కటే, నువ్వు సిన్సియర్‌గా కష్టపడు. నీ కాన్‌సన్‌ట్రేషనంతా ఆర్టుమీదకి డైవర్ట్‌చేయి. అప్పుడు నువ్వెక్కడో వెతుకుతున్న పీసాఫ్ మైండ్ నిన్నే వెతుక్కుంటూ వస్తుంది"

"సర్! నా డ్రాయింగ్స్ చూస్తారా, ఓపికుందా?"

ఓఁ తప్పకుండా. ఏదీ తీసుకురా?"

స్మిత అయిదారు స్కెచ్‌బుక్స్ తీసుకొచ్చింది. అవన్నీ ఆయన పక్కనపెట్టి, తను రెండుమూడ్రోజుల క్రితం వేసిన హుస్సేన్ అస్పష్టం ఆకారపు పెయింటింగు తెచ్చి చూపింది. స్మిత తల్లి ఆ దగ్గర్లో లేకపోవడం గమనించి, గొంతు తగ్గించి "సర్! అతన్ని తప్ప ఇంక దేన్నీ వేయాలనే అన్పించదు. ఇది అతన్ని గ్లాస్‌డోర్‌లోంచి చూస్తూ వేసింది" కాస్త సిగ్గుపడుతూనే చెప్పింది.

"వండ్రఫుల్... ఇది చాలా బాగుందే. నీ ఆలోచన చాలా బాగుంది. స్మితా! ఒక పని చేయి. కళాభవన్‌లో పెయింటింగ్స్ కాంపిటిషన్ పెట్టారు. లాస్ట్‌డేట్ కూడా దగ్గర్లోనే వుంది. ముందు దీన్ని పాక్‌చెయ్యి. ఇప్పుడు వెళ్తూ వెళ్తూ అక్కడ ఇచ్చి వెళ్తాను. కొంత డబ్బు డిపాజిట్ చేయాలి, పర్లేదు నేను చేస్తాను" అన్నాడు.

స్మిత ఆశ్చర్యంగా చూసింది. "పెద్దపెద్ద ఆర్టిస్టులు పంపిస్తారేమోకదా, ఇదెక్కడ సెలక్ట్ అవుతుందండీ" అంది.

"రిజల్టు గురించి ముందే ఆలోచించకూడదు. ఏమయితే అదవుతుంది. ఇదయితే పెయింటింగే కదా, ఇవ్వడంలో తప్పేముంది?"




''సరే, పాక్‌చేసిస్తాను. మీకు సేమ్యా ఇష్ట మేనా?''

''అలాంటి మర్యాదలు ఇంకోసారి. వీల యితే కాస్త కాఫీ పెట్టివ్వు చాలు, నే త్వరగా వెళ్ళాలి''

స్మిత వేగంగా వెళ్ళి కాఫీ పెట్టి తెచ్చింది. అలాగే ఆ పెయింటింగ్‌కి నాలుగైదు న్యూస్‌పే పర్లు చుట్టి సెలో టేప్ అంటించింది.

సంధ్యకి వెళ్ళొస్తానని చెప్పి హరనాథ్ బయ ల్దేరాడు. స్మిత పెయింటింగ్ పట్టుకుని దిగింది. కారు వెనకసీట్లో పెడ్తుండగా ''స్మితా! వూరికే కాలక్షేపం చేయకు. మంచి బుక్స్ చదువుతుండు. నాతో ఏదైనా పనుంటే నిర్భ యంగా రావచ్చు'' అన్నాడు.

''చాలా థాంక్సండీ'' అంది స్మిత. కారు కదిలి వెళ్ళిపోయింది.

తిరిగి వచ్చిన స్మితకి కాస్త మనసు కుదుట పడినట్లయ్యింది. హరనాథ్ దాన్ని మెచ్చుకో వడం, కళాభవన్లో ఇస్తాననడం స్మితకి కొత్త ఉత్సాహాన్ని తెచ్చిపెట్టాయి. అయితే సార్ చెప్పినట్లు తను సిన్సియర్‌గా కష్టపడితే తనకి నిజంగా మనశ్శాంతి దొరుకుతుందన్నమాట... అనుకుంది ఆనందంగా.

ఆ మూడ్రోజులూ అలా స్కూలుకి వెళ్ళ కుండానే, చాటుమాటుగా హుస్సేన్ని చూస్తూ, బొమ్మలేస్తూ, పుస్తకాలు చదువుతూ గడిపింది. ఆదివారం కూడా అదే పద్ధతిలో వెళ్ళిపో యింది.

సోమవారం స్కూలుకి బయల్దేరుతుంటే ఆమెకి ఏదో తెలియని భయం. ఇప్పుడు హుస్సేన్ వచ్చి నిలదీస్తే ఏం చెప్పాలి అను కుంది. కిందికి దిగి అప్రయత్నంగా ఓరగా ఆ బిల్డింగ్‌వేపు చూసింది. హుస్సేన్ ఆమెని చూసి, నిర్లక్ష్యంగా తల తిప్పేసుకున్నాడు.

బహుశా ఈ నాలుగు రోజులూ తనకోసం ఎంతో ఎదురుచూసి వుంటాడు. వెళ్ళనందుకు కోపమొచ్చింది, నిజమేకదా... అనుకుంది. కానీ అతనలా తల తిప్పుకోవడం బాధగా అన్పించింది. తనుమాత్రం అతన్ని బాధించ లేదా? బస్టాపులో ఎదురుచూస్తాడని తెలిసీ వెళ్ళకుండా వుండలేదా? ఈ పదిరోజులూ కనీసం బాల్కనీ తలుపు తెరవలేదు. తన తృప్తికోసం చాటుగా చూసిందంతే. మరి దాని కి అతను కూడా నిర్లక్ష్యమనే అనుకొని వుండాలి. కానీ తాను నిజంగా అతన్ని అల క్ష్యం చేయడంకాదు. అతనంటే ఇప్పటికీ, ఎప్పటికీ ప్రేమే. పరిస్థితి అలా ప్రవర్తింపచే సింది అంతే.

ఇప్పుడు హుస్సేన్ ఏమని నిర్ణయించుకు న్నాడో. ఇంత బాలెన్స్‌లేని పిరికి పిల్లకోసం ఎదురుచూట్టం అనవసరం. హాయిగా పెళ్ళిచే సుకుంటే ఏ బాధా వుండదు అనుకున్నాడేమో. ఆ వూహే స్మితకి భయంగా, కంపరంగా అన్పించింది.

'ఇతను నావాడు. నాకోసమే, నాకు నచ్చే లక్షణాలతో సృష్టించబడ్డాడు. ఇతను తాత్కాలి కంగా కోపం తెచ్చుకున్నా నన్ను అర్థంచేసు కుంటాడు. నాకోసం ఎంతకాలమైనా నిరీక్షిస్తా డు' అనుకుంటూ వేగంగా బస్టాపువైపు నడి చింది.

* * *

హుస్సేన్ గురించి ఆలోచించుకుంటూ పర ధ్యానంగా నడుస్తున్న స్మితని, ''ఏం, నాతో మాట్లాడదల్చుకోలేదా?'' అంటూ పలకరించా డు శంకర్.

''చూళ్ళేదు, ఏదో ఆలోచన్లో వున్నాను''

''ఎవరి గురించి''

''... ...''

''సర్లే, సీక్రెటయితే చెప్పొద్దులే''

''అసలు మీరు సిటీలో వుంటూ క్లినిక్ ఇక్కడెందుకు పెట్టారు?'' అలా కాకపోతే తనకి రిలీఫ్‌గా వుండేది కదా అనుకొంటూ అడి గింది స్మిత.

''నా భార్యకి పల్లెటూళ్ళంటే ఇష్టం. ఇది పెద్ద పల్లెటూరు కాకపోయినా, కాస్త ఆ మాది రిగా వుంటుందికదా. మా అంకుల్ ఇక్కడే వుండడంవల్ల మాక్కూడా ఈ ప్లేస్ బాగానే వుంటుందన్పించింది. సిటీలో వున్న ఇళ్ళు రెంట్‌కిచ్చి ఇక్కడే వుండేవాళ్ళంకానీ, పిల్లలు కాస్త పెద్దవుతుండగా, ఆమెని అలా తీసికెళ్ళి పోయాడు దేవుడు. వాళ్ళ చదువుకోసమే నేను మళ్ళీ సిటీలో వుండాల్సొస్తోంది''

''పిల్లలెందరు? హాస్టల్లో పెట్టొచ్చుగా?''

"ఇద్దరూ చిన్నపిల్లలే. హాస్టల్లో పెడితే బెంగ పెట్టుకుంటారని ఆలోచిస్తున్నాను. ప్రస్తుతానికయితే వాళ్ళు స్కూలునుండి వచ్చేసరికి మా అమ్మ ఇంట్లో వుండి, చూసుకుంటోంది. ఆవిడా పెద్దదయిపోయింది, అదే నాకు దిగులు"

స్మిత మౌనంగా వింటోంది.

"మూడ్రోజుల్నుండీ ఎందుకు రావడంలేదు?"

"ఒంట్లో బాలేదు"

"ప్రాబ్లమేంటి? నన్నడిగితే మందిచ్చేవాణ్ణి కాదా!"

"... ..."

"స్మితాజీ!..." అంటూ ఏమో చెప్పబోయాడు శంకర్. స్మిత చుర్రున చూసింది. ఆ పిలుపు హుస్సేన్ మాత్రమే పిలవాలి. అతని పద్ధతిలో ఇంకెవరయినా పిలిస్తే ఆమెకి నచ్చడంలేదు.

శంకర్ ఆ చూపు గమనించలేదు.

"మీరు మా ఇంటికి రావాలి. మా ఇంటిని, అమ్మని, పిల్లల్ని చూపించాలి. ఎప్పుడొస్తారు?"

"నేనెందుకు రావడం?" విసుగ్గా, పెడసరంగా అడిగింది.

శంకర్ నొచ్చుకున్నాడు. ఏమీ మాట్లాడలేదు.

'లేనిపోని అనుమానాలతో అతన్ని బాధించానా? అసలు అతనికి అలాంటి ఉద్దేశం లేదేమో... హుస్సేన్ ప్రేమలో పడ్డాక నా బుర్ర సరిగా పనిచేయడంలేదు' అనుకుంది.

"అయాం సారీ. మరోలా అనుకోకండి. నాకెలా కుదురుతుంది, వీలయితే వస్తాలేండి" అంది.

శంకర్ నవ్వి "మీకు కుదిరినప్పుడే రండి" అన్నాడు.

ఇంతలో స్మిత స్కూలు వచ్చేసింది. అతను దాటి వెళ్ళిపోయాడు.

అడపాదడపా రమేష్ వుత్తరాలు రాస్తూనేవున్నాడు.

ఎంత నిగ్రహించుకుందామనుకున్నా హుస్సేన్ని చూడకుండా వుండలేకపోతోంది. ఎక్కువగా చాటుమాటుగా, అప్పుడప్పుడూ బాల్కనీలోంచి చూస్తోంది. హుస్సేన్ మునుపటి సైగలు, నవ్వులూ మానేశాడు. అతను కూడా సూటిగా చూట్టంలేదు. దొంగచూపులు చూడడం, ఎప్పుడైనా చూపులు కలిస్తే కోపంగా వుంటోంది అతని చూపు.

తనకోసం కోపంతోనే అయినా అసలు ఆగుతున్నాడా లేదా అనేది స్మితకి అర్థంకాలేదు. అతనంత పట్టుదలగా వుంటే తానెందుకు పలకరించడం అనుకుంది.

ఒకరోజు స్మిత ఇంటికొచ్చే సమయానికి హరనాథ్ కారు ఇంటిముందు పార్క్చేసివుంది. స్మిత హుస్సేన్కోసం చూపులతో వెతుకుతూనే ఆయన ఎందుకొచ్చినట్లబ్బా! అని ఆశ్చర్యానందాలతో ఒక్క అంగకి రెండు మెట్లచొప్పున ఎక్కుతూ వచ్చింది. బయటి తలుపు తీసేవుంది. ఎదురుగా హాల్లో హరనాథ్ కూర్చుని కనిపించాడు. ఆయనకి ఎదురుగా కూర్చున్న శరత్ తల వెనకభాగం కన్పిస్తోంది. తల్లి ఓపక్కగా నిలబడి ఆయనతో మాట్లాడుతోంది. చెప్పులు విడిచి "గుడీవినింగ్ సర్, ఎంతసేపయింది మీరొచ్చి?" అన్నది.

"ఆఁ ఒక పావుగంటైంది. నువ్వేంటి మరీ ఇంత లేటు?"

"రోజూ ఇంతేనండీ... చెప్పానుగా స్కూలు చాలా దూరమని"

ఈ మహానగరంలో నీకు మరో స్కూలే దొరకలేదా? తీసుకునే జీతంకంటే ఎక్కువ స్ట్రెయినవుతున్నట్లున్నావు. అన్నట్లు నీకో గుడ్ న్యూస్... నీ పెయింటింగ్కి సెకెండ్ ప్రైజొచ్చింది"

"సర్! మీరు జోక్చేయడంలేదుకదా?"

"నాది జోక్ చేసే ఏజ్కాదు, పైగా మీలాంటి పిల్లల్తో"

"సారీ సర్... మరోలా అనుకోకండి. నాకు నమ్మాలన్పించడంలేదు"

సంధ్య, శరత్ అప్పటికే ఆ వార్త వినడాన వాళ్ళకిప్పుడు ఆశ్చర్యంగా లేదు. శరత్ తమాషా చూసినట్లు చూస్తున్నాడు. సంధ్య ముసిముసిగా నవ్వుతూ లోనికి వెళ్ళింది.

"సరే నమ్మకు. వాళ్ళిచ్చే రెమ్యూనరేషన్ నేనే తీసుకుంటా"




''ఇదంతా మీవల్లే జరిగింది, మీకే థాంక్స్ చెప్పాలి''

''థాంక్స్ తీరిగ్గా చెబుదువుగాని ముందు కాస్త రిఫ్రెషయిరా. మీ ఫాదర్ ఎన్నింటికొస్తారు? అందరం కలసి కళాభవన్‌కి వెళ్దాం''

సంధ్య పకోడీల ప్లేటు తెచ్చి హరనాథ్ ఎదురుగా టీపాయ్‌మీద పెట్టి ''వాళ్ళ నాన్నగారొచ్చాక మేమిద్దరం కలసి వస్తాం, పిల్లల్ని తీసికెళ్ళండి'' అంది.

స్మిత కాశ్మీర్ సిల్కు చీర కట్టుకుని బయల్దేరింది. శరత్, స్మిత ఇద్దరూ కారు వెనక సీట్లో కూర్చున్నారు.

కళాభవన్‌లో హరనాథ్ అనేకమందిని స్మితకి పరిచయం చేశాడు. చాలామంది స్మితని అభినందించారు.

స్మితకి అదంతా ఒక కలలానే గడిచిపోయింది. ఈ బహుమతి, ఈ ప్రశంసలు ఇవేవీ నిజానికి తనకు దక్కవు. ఆ ఇడియట్‌వల్లే ఈ పెయింటింగ్ వేసింది. అతన్ని చూస్తూ, ఏదో కాస్త కల్పించి వేసింది.

ఈ సమయంలో హుస్సేన్ తన పక్కన వుంటే ఎంత బాగుండేది? ''ఏయ్ దొంగా! అది నువ్వే, ఆ ఖ్యాతి నీదే... వ్వెవ్వెవ్వె'' అని చెప్పివుండేది. కానీ అతను గొప్ప కోపంమీదున్నాడు. అతనికి ఎలా చెప్పగల్గుతుంది? తన ఈ సంతోషం అతనితోనే పంచుకోవాలనుంది. స్మిత శారీరకంగా అక్కడున్నా ఆమె మనసెప్పుడో రెక్కలు కట్టుకుని హుస్సేన్ దగ్గరికి వెళ్ళిపోయింది. శరత్ మాట్లాడ్తుంటే తల పంకిస్తోందిగానీ నిజానికి ఒక్కమాటా ఆమె బుర్రకి ఎక్కలేదు. తన పక్కన హుస్సేన్ వుండాల్సిందని పదే పదే అనుకుంది.

ఒక్కో పెయింటింగ్ ఒక్కో కళాఖండంలా భాసిస్తోంది. అవి చూస్తుంటే స్మితకి ఏదో లోకంలో విహరిస్తున్నట్లుంది. అక్కడ కలసిన ఆర్టిస్టులు ఆర్టుకి సంబంధించిన రకరకాల విషయాలు వూపిరాకుండా మాట్లాడుకుంటుంటే స్మితకి ఒకరకంగా సిగ్గుగా అన్పించింది. తన పెయింటింగ్ బాగుంటే బాగుండి వుండచ్చు. అదంతా హుస్సేన్ మహత్యం, లేకపోతే అస్పష్టంగా కనబరచిన ఆ షోగ్లాస్ మహత్యం. అంతకుమించి ఈ అవార్డువలన తాను గొప్పదిమాత్రం కాలేదు. వాళ్లందరితో పోల్చుకుంటే ఆర్టు గురించి తనకేం తెలుసని? వీళ్ళందరిముందూ తానో మరుగుజ్జులా అన్పిస్తోంది.

హరనాథ్‌గారన్నట్లు తన శ్రద్ధాసక్తుల్ని కళవేపు మళ్ళించాలి అనుకుంది స్మిత. అప్పుడే తల్లీ, తండ్రీ లోనికి ప్రవేశించారు.

ఆ ఎగ్జిబిషన్ మరో నాలుగురోజులుమాత్రం వుంటుందని చెప్పారు. మరునటిరోజు స్కూల్లో ప్రిన్స్‌పాల్‌కి, నందగోపాల్‌కీమాత్రం చెప్పింది విషయం. ఆయన చాలా సంతోషం వెలిబుచ్చి, ఆరోజు మధ్యాహ్నంనుండే వెళ్ళిపొమ్మని, మిగిలిన మూడ్రోజులూ కూడా సెలవు తీసుకోమనీ చెప్పి ''గాబరా పడకండి, పే కట్ చేయనులే'' అని నవ్వాడు.

ఆరోజు మేనత్త కుటుంబాన్ని, శిరీషని, ఆమె భర్తని వెంటబెట్టుకు వెళ్ళింది స్మిత. ఆ తర్వాతిరోజు హారతి, రమ్య, నాన్సీలని తీసుకు వెళ్ళింది. ఆమె కలలు కన్న హుస్సేన్‌మాత్రం వూళ్ళోలేడు.

నాలుగోరోజు రాత్రి పడుకున్న స్మితకి నిద్ర పట్టలేదు. హుస్సేన్ మళ్ళీ ఎక్కడికి వెళ్ళినట్లు? కాంపుకా? తల్లిదండ్రుల దగ్గరికా? అతను గనుక వూళ్ళో వుండివుంటే తన పట్టుదల పక్కనపెట్టి అతన్ని మాట్లాడించి, ఎగ్జిబిషన్‌కి తీసుకెళ్ళి వుండేది. తన హృదయోద్యానంలో పూసిన మొదటి పరిమళభరిత పుష్పాన్ని సమర్పించడానికి అతను లేడు. వినేవాళ్ళు లేనప్పుడు ఎంత చక్కటి పాటయితే ఏంలాభం? పంచుకోడానికి కావలసిన వ్యక్తి లేనప్పుడు ఆనందానికి అర్థంవుంటుందా? ఒకప్పుడు తనకు హారతి, రమ్య, నాన్సీలంటే ప్రాణం. ఇప్పటికీ వాళ్ళ స్థానం వాళ్ళదే. కానీ నిశితంగా ఆలోచించి చూస్తే వాళ్ళ స్థానాలని హుస్సేన్ అధిగమించాడా అన్పిస్తుంది. అతను తన జీవితంలో ప్రవేశించాక వాళ్ళు కొంతవరకూ చిన్న గీతలయ్యారా అన్పిస్తుంది. కానీ ఈ పరిస్థితి రాకపోతేనే తను సుఖంగా, శాంతంగా వుండగలిగేది కదా అనుకుంది.

మళ్ళీ రెండురోజుల తర్వాతగానీ హుస్సేన్ గది తలుపులు తెరుచుకోలేదు. అతన్ని కళ్ళారా చూసి ఎన్నాళ్ళయిందో. ఏమయినాసరే, ఈరోజు అతన్ని బాల్కనీలో నిలబడి స్పష్టంగా

చూడాలనుకుంది. అతనికి తనమీద కోపంగా వున్నాపర్లేదు. అతన్ని తన ప్రాణంకంటే అధికంగా ప్రేమించింది. అతని కోపం ఎలాగైనా పోగొట్టాలి. అవార్డు సంగతి చెప్పాలి. హుస్సేన్ ఏమంటాడు? 'నావల్లేగదా నీకా బహుమతి వచ్చింది. మరి ఆ డబ్బుతో నాకేం కొంటున్నావు?' అంటాడా? అయినా అతను అడగాలా? అతనికి ఏం ప్రెజెంట్ చేస్తే బాగుంటుంది? ఒక మంచి పెన్ కొనిస్తే? అతనేం రైటరా, పెన్ను చూసుకు మురిసిపోడానికి? సిగరెట్ తాగుతాడు గనక ఒక చక్కటి లైటర్ కొనిస్తే? ఛ...ఛ... అవన్నీ వెధవ ఆలోచనలు! ప్చ్... హుస్సేన్‌కి ఏమిచ్చినా తక్కువే. అయినా తన మనసే ఇచ్చాక ఇంకోటి ఇస్తే ఎంత, లేకపోతే ఎంత? హుస్సేన్ తన గురించి ఇంత ఆలోచిస్తాడా?

అతను ఎదురుగా లేనప్పుడు తను పడే నరకయాతన అతనూ అనుభవిస్తాడా? అనుకుంది.

గంటసేపు ఎదురుచూసినా హుస్సేన్ గదిలోంచి బయటికి రాలేదు. ఒకపక్కన స్కూలుకి ఆలస్యమవుతోంది. ప్రిన్సిపాల్ తనంతట తానుగా నాలుగురోజులు సెలవు తీసుకోమంటే, ఇప్పుడు ఆలస్యంగా వెళ్ళడం బాగోదు. జాలి తలిస్తే అలుసు చేసినట్లుంటుంది - అనుకుని స్మిత ఇంకా అతనికోసం ఎదురుచూడకుండా వెళ్ళిపోయింది. బస్టాపు వరకూ కూడా వెనక్కి తిరిగి చూస్తూనే నడిచింది అతనొస్తాడేమోనన్న ఆశతో.

ఆ సాయంత్రం అతడికోసం అర్ధరాత్రివరకూ ఎదురుచూసింది. పన్నెండున్నరవరకూ మెలకువగానే వుండి చూసింది. అకస్మాత్తుగా లైటు వెలిగింది, అతను కన్పించలేదు. రెండు నిమిషాల్లో లైటు ఆరిపోయి, తలుపులు మూసుకున్నాయి. ఆ నిమిషంలో స్మితకి అతనిమీద విపరీతమయిన కోపం వచ్చింది. ఆ కోపం అంతలోనే కన్నీళ్ళరూపంలో బయటికొచ్చింది.. తనేం నేరం చేసిందని తననిలా ఏడ్పిస్తున్నాడు?

ఆమెకి పాత సంఘటన గుర్తుకొచ్చింది. తన గదిలో లైటు వెలుగుతుంటే అతనెప్పుడూ నిద్రపోయేవాడు కాదు. అక్కడే నిలబడి ఇంకా పడుకోవేం అంటూ సైగచేసేవాడు. కానీ ఈరోజో... అతనికోసమే చూస్తోందని తెలిసి కూడా మొహం చూసకుండా పడుకున్నాడు.

స్మిత చూపూ, మనసూ ఎంతగా అటువైపు లాగుతున్నా శతవిధాలా నిగ్రహించుకోడానికే ప్రయత్నించింది. మనసులో గూడుకట్టుకున్న పిచ్చిప్రేమని, అతను మొహమైనా చూపక సతాయిస్తున్నందువల్ల కలిగే బాధని దాచుకుంటూ, తనుకూడా వీలయినంతవరకూ తప్పుకునే తిరుగుతోంది. తన కళ్ళని, కాళ్ళని బాల్కనీవైపు మళ్ళకుండా అతి కష్టంమీద సాధించినట్లనిపించినా రోజులో ఏదో సమయంలో అవి మొరాయిస్తున్నాయి.

ఆరోజు సాయంత్రం టీకప్పు చేతబట్టుకొని వద్దనుకుంటూనే బాల్కనీలోకి వెళ్ళి, చూడొద్దనుకుంటూ అటు చూసింది స్మిత. కిటికీలు, తలుపు - అన్నీ బార్లా తెరిచివున్నాయి. కొండంత సంతృప్తి కలిగింది. కిటికీలోంచి కనిపించే అద్దంలేక గోడ బోసిగా వుంది. ఇల్లు సర్దినట్లున్నాడే ఇడియట్ అనుకుంది. 'లోపల పిల్లలు పెడుతున్నాడా, ఎంతకీ కన్పించడు?' అనుకుంది. చాలాసేపు చూసి, విసుగ్గా లోనికొచ్చేసింది. రాత్రి పడుకోబోయేముందు చూస్తే లైటు వెలగలేదు. అప్పుడే పడుకున్నాడు కాబోలనుకుంది. మరుసటిరోజు ఉదయం, సాయంత్రం కూడా అంతే, తలుపులు తీసేవున్నా అతను కన్పించలేదు. స్మిత మనసులో రకరకాల వూహలు.

. ఎందుకిలా దాగుడుమూతలు ఆడుతున్నాడు? తను వెంటనే పెళ్ళికి అంగీకరించనందుకు అతనికెంత కోపమొచ్చిందో ప్రదర్శిస్తున్నాడన్నమాట అనుకుంది. మూడోరోజు ఉదయంగానీ అసలు విషయం ఆమెకి అర్థం కాలేదు. ఆ ఇంటి ఓనరు ఇంకెవరికో గది చూపించి, ఏవో వివరాలు చెప్తున్నాడు.

'అంటే హుస్సేన్ ఇల్లు ఖాళీచేసి వెళ్లిపోయాడన్నమాట' స్మితకి గుండె ఆగినంతపనయ్యింది. అంత నిర్దాక్షిణ్యంగా హుస్సేన్ తనని విడిచి వెళ్ళిపోతాడని ఆమె భావించలేదు. స్మిత మనసులో తుఫాను చెలరేగింది. తాను తిండి తినకుండా వుండగలదేమోగానీ హుస్సేన్ని చూడకుండా ఎలా వుండగలదు? ఎందుకిలా అర్థాంతరంగా వెళ్లిపోయాడు? ఎక్కడికెళ్ళాడు? అసలు హైదరాబాద్‌లో వుండి




వుంటాడా? ఇంకెక్కడికయినా ట్రాన్స్ఫర్ అయ్యుంటాడా? ఆ సంగతి తనకు చెప్పాల్సిన బాధ్యత, కొత్త అడ్రసు ఇవ్వాల్సిన అవసరమూ లేదనుకున్నాడా? తను అతనికి ఏమీకాదా? కాదనుకునే అలా వెళ్ళిపోయాడా? తన గుండె నిండా అశాంతిరేపి, తాను మాత్రం ఎంత ప్రశాంతంగా వెళ్లిపోయాడు? మంచంమీద బోర్లాపడుకుని చాలాసేపు ఏడ్చింది స్మిత.

శిరీష పెళ్ళికిముందు సంఘటన గుర్తొచ్చిందామెకి. తను తమాషాకి ఇల్లు మారుతున్నామని చెప్పినప్పుడు అతడెంత విచారవదనం పెట్టాడు? అదంతా బూటకమా? లేక అప్పుడు నిజంగా తనను అంత ప్రేమించాడేమో, పెళ్ళికి వెనకాడినందుకు, ఆ ప్రేమనంతా కోపంగా మార్చుకుని వుంటాడా? అదే తనయితే ఆ పని చేయగలిగేదా? అతను లేని వూహనే తాను తట్టుకోలేకపోతోంది. మరి తనను చూడకుండా హుస్సేన్ నిశ్చింతగా వుండగలననే వెళ్ళాడా?

ఎంత ఏడ్చినా ఆమెకి గుండె బరువు తీరినట్లన్పించలేదు. తన బాధని ఎవరికయినా చెప్పుకోవాలన్పించింది. ఇంట్లో ఎవరికయినా చెప్తే, ఓదార్చకపోగా, ఇంకాస్త బాధ కలిగే మాటలంటారు. స్నేహితులకి, హరనాథ్ గారికి చెప్తే... ఏమంటారో?

ఎవ్వరితో మాట్లాడాలన్న కోరికలేదు. చుట్టూ పదిమంది అరిచినట్లు మాట్లాడినా, ఆమె బుర్రకి ఆ మాటలేవీ ఎక్కడంలేదు. అన్నం తినాలన్పించదు, పడుకున్నా నిద్ర పట్టదు. గట్టుతెగిన వాగుల్లా కళ్లల్లోంచి నీళ్లు మాత్రం కాలువలై ప్రవహిస్తున్నాయి.

అనేక తప్పులకి కోర్టులు శిక్షలు విధిస్తాయి. హుస్సేన్ చేసిన ఈ తప్పుకి ఎలాంటి శిక్ష వేయాలి? అసలు లోకం దృష్టిలో ఇది తప్పవుతుందా? ఏం చేశాడతను? తనను కొట్టాడా, తిట్టాడా, తన ఆస్తికి నష్టం కలిగించాడా? ఏమీలేదే? ఆతను ఎంత బుద్ధిమంతుడు. తను కావాలనుకున్నచోటుకి తను వెళ్ళాడు. కానీ అది అతని తప్పే. మానసికంగా తనని బాగా గాయపరిచాడు. ఒకరకంగా నిశ్శబ్దంగా, నిర్దాక్షిణ్యంగా హత్య చేశాడు.

స్మిత స్కూలుకి వెళ్తోందిగానీ మునుపటిలా చురుగ్గా లేదు. నీరసంగా, నిస్సత్తువగా, అతని తలపులతో పరధ్యానంగా వుంటోంది.

"ఇదిగో శుభలేఖ. రమ్య వచ్చింది, ఈ ఉత్తరమిమ్మంది" అంది తల్లి కార్డుతోపాటు ఒక మడిచిన కాగితం అందించి-

ముందు కార్డు చూసి, ఉత్తరం చదివింది. ప్రత్యేక విషయాలేంలేవు. తను వచ్చేవరకూ ఆగలేకపోయినందుకు క్షమించమని రాసి, పెళ్ళికి తప్పక రావాలని పదేపదే రాసి అండర్లైన్ చేసి మరీ చెప్పింది.

'రమ్యా! నువ్వెంత అదృష్టవంతురాలివే, ఎవరి ప్రేమలోనూ పళ్ళేదు. ప్రేమ ఓ చక్కని సరోవరంలా భ్రమింపచేసి, దానిలో దిగేట్టు చేస్తుంది. తీరా దిగాక కానీ అర్థంకాదు, అదొక ఊబి అని' అనుకుంది.

స్మిత చిత్రలేఖనం కూడా అంటుకోవటంలేదు. పెన్సిల్ తీసినా, కుంచె పట్టుకున్నా అతడి రూపం తప్ప మరింకేమీ వేయాలన్పించటంలేదు. ఏపని చేస్తున్నా, ఎవరితో మాట్లాడుతున్నా అతని ఆలోచనలు మాత్రం నీడలా వెంటాడుతున్నాయి. భరింపశక్యంకానీ ఆవేదన పిచ్చికి దారితీస్తుందేమో అనుకుంది. ఎవరూ వుండని ఏకాంత స్థలానికి వెళ్ళి పెద్దపెట్టున ఏడవాలన్పిస్తోంది. ప్రేమకి పర్యవసానం దుఃఖమేనా? అసలిది ప్రేమేనా? లోకంలో తనే ప్రేమని రుచి చూసిందా? ఈ ఆవేదన తనకేనా, అందరిస్థితీ ఇలాగే వుంటుందా? తనని వదిలి వెళ్ళిపోయిన వాడికోసం తనెందుకు బాధపడుతోంది? తనకు పౌరుషం లేదా? ఇక జీవితాంతం తను ఇలా ఏడుస్తూ గడపాల్సిందేనా? అసలు ఏ చార్మినార్లోనో వుండాల్సిన హుస్సేన్ ఇంకెక్కడా ఇల్లే దొరకనట్లు ఒచ్చిచ్చి ఈ హిమాయత్నగర్లోనే, అదీ తమింటెదురుగానే వుండాలా? వున్నంతలో ఇద్దరి చూపులూ ఎందుకు కలవాలి? అది ప్రేమగా ఎందుకు పరిణమించాలి? పెడగా వుంటూనే పెనవేసుకున్నాడే? అతని జ్ఞాపకాలని చెరిపేయడం ఎలా? అవి అనుక్షణం తనని హింసిస్తూనే వుంటాయా?

పాత డైరీలు తీసింది. హుస్సేన్ గురించి రాయని పేజీ అంటూలేదు. ఒక్కో పేజీలో ఒక్కో సంబోధన వుంది. అతను, హుస్సేన్, ఇడియట్, వీ.ఐ.పీ, సెంటుసీసా, పరిమళ్,



రిషీ ఇలా అతనికి పెట్టుకున్న లెక్కలేనన్ని పేర్లు.

డ్రాయింగ్ పుస్తకాలు తీసింది. ఈమధ్యలో ఆమె ఇతర బొమ్మలంటూ వేయలేదు. ఏదో దీక్ష పట్టినట్టు అన్నీ అతని బొమ్మలే. అవి చూస్తూ ఆమె మనసు మరింత శోకించింది. లేచి పెన్ను తీసుకుని ఒక కాగితానికి వెనక వైపు రాసింది.

నిను చూడలేకపోతే
ఈ కళ్ళు నాకెందుకు?
నిను చేరలేకపోతే
ఈ కాళ్ళు నాకెందుకు?
నీకు విన్పించలేకుంటే
ఈ స్వరం నాకెందుకు?
నువ్వు చదవలేవంటే
ఈ రాతలు నాకెందుకు?
నిను పొందజాలనపుడు
అసలు అందమెందుకు?
ఇవ్వలేని, దాచుకోలేని
ఈ మనసు నాకెందుకు?

ఒకపక్కన అలా రాస్తుంటే, కన్నీటిబొట్లు జారిపడుతున్నాయి. ఆ ఆవేశంలోనే ఇంకో కవిత రాసింది.

నా అంధకారపు జీవితంలో
మెరపు తీగవై మెరిశావు
ఊసులాడీ, ఆశలు రేపీ
ఆనందానికి అర్థం తెలిపీ
అందకుండా పోతావా?
నిను పొందాలని తపిస్తుంటే
వినోదం తిలకిస్తావా?
తిరిగి తిమిరంలో వదిలేస్తావా?
చీకటిని చీకటిగా వుండనీక
నీ క్షణిక వెలుగురేఖతో
నా ఉనికిని చూపి, ఉన్నతి తెలిపి
తుదకు గేలిచేసి, కలవర పరుస్తావా?
పసిపాపని పైకెత్తి, అల్లీబిల్లీ తిప్పి
ఎత్తి కొట్టేంత గొప్పవాడివా నీవు?

ఆ తర్వాతేం రాయాలో తోచలేదు. పుస్తకాలన్నీ అల్మర్లో పెట్టేసి, గత స్మృతులు నెమరువేసుకుంటూ ఎప్పటికో నిద్రపోయింది.

తప్పనిసరిగా రమ్య పెళ్లికి వెళ్లింది. బలవంతంగా ముఖానికి చిరునవ్వులు పులుముకుంది. ఆ సంతోష సందర్భంలో రమ్యతోనే కాదు హారతితో కూడా తన బాధ చెప్పలేకపోయింది. హరనాథ్‌కి కూడా ఆ విషయం చెప్పాలన్పించలేదు. అందుక్కారణం ఆయన అనే మాటలు స్మిత ముందుగానే ఊహించింది. ''చూశావా, ప్రేమా, గీమా అంటూ ఏమేమో అన్నావు. నిజానికి అదంతా పెద్ద డ్రామా. ఈ కాలం పిల్లలకి అసలు ప్రేమంటే తెలిస్తేకదా, అంతా ఆకర్షణ మాత్రమే'' అనేవారేమో. దాదాపు పెద్దవాళ్ళందరి మాటలూ ఇలానే వుంటాయి. యవ్వనంలో ఎవరో ఒకర్ని ఎంతో కొంత ప్రేమించిన పెద్దలే ఆ వయసుదాటితే చాలు ప్రేమని పురుగుకంటే హీనంగా చూస్తారు. రేపు తనూ ముసలితనం వస్తే అలాగే అంటుందా? ఉహూ, తాను నిజమయిన ప్రేమని రుచి చూసింది, అందుకే తను జన్మలో ప్రేమనీ, ప్రేమించినవాళ్ళనీ చులకనగా చూడదు.

తన హృదయం మీద ఎవరో పాదంమోపి ప్రయాణిస్తున్నంత భారంగా కాలం గడుస్తోంది. ఆ బాధలోనే వేదనలోనే రెండునెలలు గడిచిపోయాయి.

ఆరోజు క్రిస్టమస్ కావడాన స్కూలు లేదు. కుటుంబీకులందరూ సరదాగా ఇందిరాపార్కు ప్రోగ్రాం పెట్టుకున్నారు. స్మిత తను రానని భీష్మించుకుకూర్చుంది. అందరూ వెళ్ళిపోయాక తలుపు గడియపెట్టుకుని, పాటలు వింటూ, హుస్సేన్ని గుర్తు చేసుకుంటూ పడుకుంది.

కాలింగ్‌బెల్ మోగితే బద్ధకంగా వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా హుస్సేన్.

కలా, నిజమా అన్నట్లు చూస్తుంటే ''ఎలా వున్నారు?'' అన్నాడు.

ఏడవలేక నవ్వుతూ ''బాగున్నా'' అంది.

మునుపు చరణ్‌తో వచ్చినప్పుడు తల్లి తిడుతుందనే భయంతో లోపలికి ఆహ్వానించలేకపోయింది. ఈవేళ ఇంట్లో ఎవరూలేరు, అసలే పద్ధతి కాదని ఆ ఖాళీస్థలంలోనే కుర్చీ వాల్చి కూర్చోమంది.

అతను ఇక్కణ్ణుంచి వెళ్లిపోవడం తనకు నచ్చలేదని, అసలలా చెప్పాపెట్టాకుండా వెళ్లిపోవడం భావ్యంకాదని, తను జీవచ్ఛవంలా బతుకుతున్నానని చెప్పాలనుకుంది. కానీ





చిత్తరువులాటి ముఖానికి తేజస్సు నిచ్చే చిహ్నం!


ఐటెక్స్
బంగారు తేజస్సు


వనితల ఘనత వృద్ధిచెంద -
భారతీయ సంస్కృతి మరింత
విస్తరించ....
ఐటెక్స్
పూర్ణిమా కుంకుం
మంగళదాయకమైన సౌభాగ్యపు చిహ్నం
అరవింద్ లాబరేటరీస్,
మద్రాసు 600 033

ఒక్కమాటా నోరుదాటి బయటికి రావడంలేదు.

''ఇంట్లో ఎవరూ లేరా?''

లేరన్నట్లు తల అడ్డంగా వూపింది.

''స్మితా! రేపు ఇరవైఏడున నా పెళ్లి. ఇన్నాళ్ళూ మీ కోసమే ఆగాను. కానీ మీరెంతకీ విషయం తేల్చడంలేదు. మారేజెస్ ఆర్ మేడిన్ హెవెన్ అంటారు. బహుశా మనిద్దరికీ రాసిపెట్టిలేదేమో'' అంటూ డైరీలోంచి వెడ్డింగ్‌కార్డు తీసిఇచ్చాడు.

స్మితకి భూమి తలక్రిందులైనట్లుగా వుంది. 'ఆడలేక మద్దెల ఓటన్నట్లు వైరాగ్యం వల్లిస్తున్నావా?' అనుకుంది. అతను వద్దని వారిస్తున్నా వినకుండా టీ, మిక్చరూ తీసుకొచ్చి టీపాయ్ మీద పెట్టింది. అతనేమేమో మాట్లాడుతున్నాడు, ఒక్కమాటా ఆమె బుర్రకి ఎక్కలేదు. ఆమె హృదయం అగ్నిపర్వతమయ్యింది. అతనున్నంతసేపూ ''ఎందుకిలా తొందరపడ్డావు?'' అనయినా అడక్కుండా స్థిరంగా వున్నట్లే కన్పించింది. హుస్సేన్ గడపదాటడం ఆలస్యం తలుపుభోల్టు పెట్టేసుకుని గుండె బరువు తీరేవరకూ ఏడ్చింది.

కప్పు కడుగుతుంటే ''కాఫీ బాగుంది'' అనే మాట చెవుల్లో మళ్ళీ విన్పించింది. కాఫీ, టీలకి తేడా తెలియని ఇడియట్ అనుకుంది.

టీపాయ్ మీదున్న కార్డు చేతిలోకి తీసుకుంది. పైన మిస్టర్ రాజారాం అండ్ ఫామిలీ అని రాశాడు. కనీసం తన పేరు రాసేంత ధైర్యం కూడా లేదా? బహుశా ఇంట్లో తనొక్కతే వుంటుందని ఊహించివుండడు. మర్యాదస్థుడిలా పెద్దలకే ఇచ్చిపోదామనుకున్నాడు కాబోలు.

మరుసటిరోజు స్కూలునుండి తిన్నగా హారతి ఇంటికెళ్లొస్తానని చెప్పింది స్మిత. కాచిగూడ వచ్చేసరికి అయిదున్నరయింది. హారతి సాదరంగా ఆహ్వానించింది. పలకరింపులయ్యాక మీమధ్య నేనెందుకంటూ కరుణాకర్ వెళ్లిపోయాడు. మామూలు ముచ్చట్లయ్యాక స్మిత అసలు విషయం చెప్పింది.

''ఏమో, స్మితా! నీ ఆలోచనలకీ, ఆచరణకీ పోలికే కన్పించడంలేదు. అసలా అబ్బాయి, నువ్వూ ఉత్తరదక్షిణ ధృవాల్లా వున్నారు. మీకు పొంతన కుదరడం కష్టమంటే కాదూ, కూడదు అతనే నా ప్రాణమన్నావు''

''ఇప్పటికీ అదే అంటున్నా. హారతీ! హుస్సేన్ నా ప్రాణం కాదు అంతకంటే ఎక్కువేమో అన్పిస్తుంది''

''అలాంటప్పుడు పెళ్ళి చేసుకోవాల్సింది. పిరికివాళ్ళకి ప్రేమెందుకు?''

''పిరికితనం కాదు హారతీ. నేనేదో ఇంట్లోవాళ్ళకి భయపడి అతన్ని చేసుకోలేదంటే నిజంగా అది ఆత్మవంచన. అమ్మ అర్థంలేని అనుమానాలతో నన్ను కాస్త బాధపెట్టిన మాట నిజం. అంతమాత్రాన నా పెళ్ళికి అమ్మ అవాంతరం కాదు. నా పిచ్చి నమ్మకాలే నన్ను వెనకడుగు వేయించాయి''

''అతనికయినా బుద్ధి వుండొద్దూ. ప్రేమ, దోమ అంటూ ఆడించినవాడు ఆపాటి ఆగలేకపోయాడా?''

''హారతీ! ఆలోచిస్తే అతని తప్పు కూడా లేదన్పిస్తోంది. అతను మాత్రం ఎంతకాలమని ఎదురుచూస్తాడు? అంతా నాలాగే వుంటారనుకోవడం, వుండాలని ఆశించడం న్యాయం కాదేమో. అసలు నా కథలో విలన్లెవరూ లేరు. అలా జరగాల్సివుంది, జరిగింది అంతే. అయితే అది తట్టుకునే శక్తే లేదనిపిస్తోంది. భరించలేకపోతున్నా హారతీ! హుస్సేన్ పెళ్లిచేసుకోవడంవల్ల నాకేం నష్టం లేదు. నీకు చాలా సార్లు చెప్పాను. నేనతన్ని ఫిజికల్‌గా కోరుకోవడంలేదు. రోజూ చూడగలిగితే చాలు. అయితే ఆ చూట్టం దొంగలా, దోషిలాగాక నిర్భయంగా, నేనేం తప్పు చేయడం లేదు, ఈతన్ని చూసే అర్హత నాకుంది అనే ధీమాతో చూడగల్గాలి. ఇప్పుడది సాధ్యమా చెప్పు?''

హారతి ఏమీ మాట్లాడలేకపోయింది.

''ప్లీజ్! హారతీ! అలా మౌనంగా వుండకు. నాకు ఓదార్పు కావాలి. నా మనసు కుదుటపడే మాటలు చెప్పు'' దీనంగా అడిగింది.

అలా అన్నదేగానీ హారతి మాటలేకాదు, ఎవ్వరి ఉపదేశాలూ స్మితకి ఉపశమనం కలిగించలేకపోయాయి. చుట్టూ ఎందరున్నా ఆమెలో ఒంటరితనం చోటుచేసుకోసాగింది.

ఆమె ప్రతిభని ఎప్పుడూ ప్రశంసించే ప్రిన్సిపాల్ ఆమె తరచు పరధ్యానంగా వుండడం సహించలేకపోయాడు. ఒకటి రెండుసార్లు విసుక్కున్నాడు.





''మిస్ స్మితా!'' కోపంగా వుంది ప్రిన్సిపాల్ గొంతు ఆరోజు.

స్మిత ఉలిక్కిపడి, బిత్తరపోయి చూసింది. తడబాటుగా లేచి నిలబడి ఏమిటన్నట్లు చూసింది.

''మార్నింగ్ మీకు సబ్‌స్టిట్యూషన్ క్లాసుందని చెప్పాను''

''సారీ సర్! గుర్తులేదు. ఏ క్లాసుకి వెళ్లమంటారు?''

''అంత మతిమరపయితే ఎలా? ఈరోజు ముగ్గురు టీచర్లు రాలేదు. మీరంతా మీ రెస్పాన్సిబిలిటీ ఫీలవ్వాలి. అయినా మీకేమైంది, ఈమధ్య మరీ ఇలా అయ్యారు. మీకు పర్సనల్ ప్రాబ్లంస్ వుండచ్చు, కానీ అవన్నీ స్కూల్లో కొచ్చాక మర్చిపోవాలి, లేకపోతే...'' అని విసుక్కుంటూ వెళ్లిపోయాడు ప్రిన్సిపాల్.

స్మితకి కళ్లవెంట నీళ్ళు తిరిగాయి. అతని వాక్యాన్ని తానే పూర్తి చేసుకుంది. నిజమే అయనన్నదాంట్లో తప్పేముంది? పని సరిగా చేయలేకపోతే ఉద్యోగం మానేయాలి అనుకుంది. రెండు నిమిషాలలాగే నిలబడిపోయింది. దాన్నుండి తేరుకుని, ఖాళీగా కన్పించిన క్లాసులోకి వెళ్ళింది. స్కూలయిపోయాక అంతా ఇంటిముఖం పడితే స్మిత ప్రిన్సిపాల్ గదిలోకెళ్లింది. ఆయన ఏవో లెసన్ ప్లాన్‌లు చూస్తున్నాడు.

''ఎక్స్‌క్యూజ్‌మీ!'' అంది స్మిత.

అతను తలెత్తి ఏమిటన్నట్లు చూశాడు.

''సర్! రేపట్నుండీ నేను స్కూలుకు రావడంలేదు''

''రిజైన్ చేస్తున్నారా? ఏమైంది? పొద్దున నేనన్నదానికేనా? మరీ ఇంత సెన్సిటివ్ అయితే ఎలా? కాస్త నా పరిస్థితి కూడా ఆలోచించండి. టీచర్లు ముందు అప్లై చేయకుండా, ఇష్టమొచ్చినట్లు లీవులు పెడ్తారు. ఒకేరోజు ముగ్గురు టీచర్లు లీవు, అంటే ఆ క్లాసులన్నీ ఖాళీగా వున్నాయి. లీజర్ పీరియడ్‌లో మీరు మీ బాధ్యతగా ఫీలై ఆ క్లాసులు తీసుకోవాల్సిందిపోయి, చెప్తే కూడా మర్చిపోయానంటే ఎలా? పైగా సైన్స్ టీచరొచ్చి 15 రోజులు లీవ్ కావాలంటుంది. అన్ని కోపాలూ మీమీద చూపినట్లున్నాను''

''మీరు నన్ను కన్విన్స్ చేయాల్సిన అవసరం లేదండీ. నేనే మీ స్థానంలో వుంటే ఇంతకంటే అరిచేదాన్ని. ఇదేదో బెదిరింపనుకోకండి. నాకు మీమీద ఎలాంటి కోపమూలేదు. ఇన్నాళ్ళూ మీరు నామీద చూపిన అభిమానానికి కృతజ్ఞతలు. నా సొంత సమస్యలతో మీకు చికాకు కలిగించి వుంటే క్షమించండి. మీరన్నట్లు అవి ఇక్కడ గుర్తు రాకూడదు. అలా మర్చిపోలేకపోతే ఉద్యోగం చేయకూడదు''

''అన్నిసార్లూ ఇంత డెలికసీ పనికిరాదండీ. ఏదో కోపంలో అన్నాను. వాటిని సీరియస్‌గా తీసుకోవద్దు. మీరు రిజైన్ చేయడానికి వీల్లేదు. ఇక పదండి మళ్ళీ బస్సెళ్ళిపోతుంది''

''సర్! సాధారణంగా ఎవరైనా కోపంలో చాలా నిజాలు మాట్లాడ్తారు. నా పరిస్థితి మెరుగై, నేను మళ్ళీ ఉద్యోగం చేయదలచుకుంటే మీ దగ్గరే చేస్తాను, ఇప్పుడు మాత్రం నన్ను వెళ్ళనివ్వండి''

''సరే, మీ ఇష్టం. ఎనీవే ఐ ఎప్రీషియేట్ యువర్ టాలెంట్. నానుండి మీకేమయినా సహాయం కావాల్సివుంటే ప్లీజ్ డోంట్ హెసిటేట్. ఐ విష్ యూ గుడ్‌లక్. ఇదిగో మీ ఎమౌంట్ తీసుకోండి''

''థాంక్యూ సోమచ్. ఎదురుగా అనకూడదు గానీ, నిజంగా బాస్ అంటే మీలా వుండాలండీ'' అంటూ గద్గదకంఠంతో వచ్చేసింది స్మిత.

ఆ స్కూలుతో రుణం తీరిపోయిందన్నట్లు దిగులుగా చూసింది. ఈమధ్య తన బాధకి పిల్లలే కొంతవరకూ ఔషధంగా పనిచేశారు. రేపట్నుండీ దానిక్కూడా దూరం కాబోతున్నాను. పరిస్థితి ఇంకా దుర్భరంగా వుంటుంది. దాన్ని ఎలా ఎదుర్కోవాలో అనుకుంది.

* * *

స్మిత మనసంతా గందరగోళంగా వుంది. గుబులు గుబులుగా వుంది. తాను అనవసరంగా తొందరపడిందా? తనది ఆవేశం కాకపోతే మరేంటి? తను అంతగా ఆవేశం చెందాల్సిన లేక కోపం తెచ్చుకోవాల్సిన మాటలేమన్నాడు ప్రిన్సిపాల్? అంతకు వందరెట్లు కోపంగా, చిరాగ్గా ఇతర టీచర్లని ప్రిన్సిపాల్ విసుక్కోవడం, మందలించడం తను ఎన్నోసార్లు గమనించింది. వాళ్ళంతా తనలా రిజైన్

చేసి వెళ్ళిపోయారా, లేదే?! వాళ్ళందరికంటే తను భిన్నమైనదా? ఎందులో? నాలుగు బొమ్మలు వేసినంతలో తను ఇతర్లకంటే భిన్నమైనది, ప్రత్యేకమైనదీనా? తనలో నిజానికి ఏం గొప్పతనం వుందని? ఒకరిచేత చిన్నమాట కూడా పడలేని ఇంత సుకుమారత్వం తనకెక్కణ్ణుంచి వచ్చింది? ఈ లక్షణంవల్ల తనేం సుఖపడుతోంది? అదనపు బాధలు తప్ప.

అయినా ప్రిన్సిపాల్‌కి తనంటే ప్రత్యేకమయిన అభిమానం వుంది. ఏ వ్యక్తికయినా ఒకరిపట్ల వున్న అభిమానం లేక అసహ్యం నోటిమాటల ద్వారా చెప్పాల్సిన అవసరం లేదు. వారి చూపులు, చేతలే ఆయా భావాలని స్పష్టంగా తెలియజేస్తాయి. ఆమె ప్రతిభని స్వయంగా ఎన్నోసార్లు మెచ్చుకున్నాడాయన. ఆమె సెలవు కావాలని కోరితే నిరభ్యంతరంగా తీసుకోమని చెప్పేవారు. కొన్నిసార్లు ఆమె రావాల్సిన బస్సు తప్పిపోయి తర్వాతి బస్సుకి రావడాన చాలా ఆలస్యమయినా ఏమీ అనకపోగా నవ్వుతూ "మళ్ళీ బస్ మిస్సయ్యిందా?" అని మాత్రం అనగల్గిన అతని సహృదయత ఎందరు పెద్దమనుషులకుంటుంది?

ఆయన చూపిన ఆప్యాయతని, ఇచ్చిన ప్రశంసలని అంగీకరించకల్గిన తను బాధ్యతను విస్మరించినందుకు కాస్త నిష్ఠూరంగా మాట్లాడినంతలో దాన్ని స్వీకరించే సహృదయత తనకి లేదా? నిజమే ఈ అభిప్రాయం చాలామంది వెలిబుచ్చారు. తనలో వున్న లోపాల్లో ఇదీ ఒకటి. ఎంత కావాల్సిన వాళ్ళయినా సరే మాట పడడం మాత్రం తనకు సహించరానిదిగా వుంటుంది. సామాన్యంగా తను తప్పు చేయదని తనపై తనకు అమితమయిన నమ్మకం. ఒకవేళ పొరపాటుగా తప్పు చేసినా అది ఇంకొకరు చెప్తే భరించేశక్తి తనకు లేదు. ఇది చెడ్డగుణం అని తెల్సినా మార్చుకోలేకపోతోంది.

అసలు ఒకవ్యక్తిలో రకరకాల లక్షణాల మేళవింపు ఎలా కలుగుతుంది? వ్యక్తులు తమకి నచ్చినవిధంగా తాము తమని తీర్చిదిద్దుకోకల్గుతారా? అది నిజంగా సాధ్యమయితే ఏ వ్యక్తయినా ఉన్నతమయిన లక్షణాలనే ఇష్టపడి వాటినే అలవరచుకోవాలికదా?! అదేజరిగితే ఈ లోకంలో ఇంత అరాచకత్వం ఎందుకు చోటుచేసుకుంటుంది? అందరి సంగతి ఎందుకు? తన విషయమే ఆలోచిస్తే తనలో వున్న అంశాలన్నీ తనకు నచ్చినవీ, తను కావాలని నిర్ణయించుకున్నవీ కాదే? తనలో మంచీ చెడూ లక్షణాలు కలగూరగంపలా వున్నాయి. తనకి ఎప్పుడూ శాంతంగా, చల్లగా వుండాలనే వుంటుంది. కానీ కొన్ని కొన్ని పరిస్థితుల్లో హద్దుమీరిన ఆవేశం మండే సూర్యుడిలా పొగలు గక్కుతుంది. మళ్ళీ వెంటనే చల్లబడిపోతుంది. కానీ దానివల్ల లాభమేముంది? చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లే పరిస్థితి చెయ్యిజారిపోతుంది.

ఇలా ఎడతెరిపి లేని ఆలోచనలతో ఇల్లు చేరింది. చెప్పులు విడిచి, కాళ్ళు కడుక్కుని బట్టలు కూడా మార్చుకోకుండానే మంచంమీద వాలిపోయింది. తల్లితో విషయం ఎలా చెప్పాలి, విని ఆమె ఎలా ప్రతిస్పందిస్తుంది అని అప్పటికి చాలాసార్లు అనుకుంది. ఆ సమయంలో రమ్యతోనో, హారతితోనో కాసేపు మాట్లాడ్తే బాగుండుననుకుంది. రమ్య పెళ్ళి చేసుకొని అందీ అందనట్లు వెళ్లిపోయింది. హారతి దగ్గర్లోనే వుందికాని ఆ సమయంలో వెళ్తానంటే తల్లికి నచ్చదు. ఏవో అభ్యంతరాలు చెప్తుంది. వాటికి సమాధానాలు చెప్పి ఎలాగో వెళ్ళినా ఆమె భర్త, పిల్లలు ఏమైనా అనుకోవచ్చు. అన్నిటినీమించి స్వతంత్రంగా అన్పించదు, తను మనసువిప్పి మాట్లాడలేదు.

"లేచి, చీర మార్చుకో, ఇప్పుడేం నిద్ర?" అంది తల్లి. స్మిత బోర్లా పడుకోవడం చూసి.

"నిద్రపోవడంలేదు"

"రొట్టెల డబ్బాలో చపాతీలున్నాయి, పెట్టుకు తిను"

స్మిత చీర మార్చి నైటీ వేసుకుంది. కానీ చపాతీ తినాలన్పించలేదు. ఆలోచించి అలసిపోయిన తల అమృతాంజన్ కావాలంది.ఆల్మర్లోంచి అమృతాంజన్ సీసా తీసి తలకి రాస్తుంటే శరత్ రెండు వుత్తరాలు తీసుకుని ఆమె దగ్గరికి వచ్చాడు.

ఆ వాసనకి ముక్కుపుటాలెగరేసి అభినయిస్తూ "ఏమప్పా? రొంబ తల్నొప్పా?" అన్నాడు తమిళాన్ని అనుకరిస్తూ.

మరోసమయంలో అయితే స్మిత రెట్టింపు వుత్సాహంతో హాస్యపూరిత సమాధానం ఇచ్చేదే




గానీ అప్పుడుమాత్రం ఆమె పట్టించుకోలేదు. అతనడిగిన ప్రశ్నకి బదులు ఇవ్వకుండానే ''నాకేనా వుత్తరాలు?'' అంది.

''ఆఁ నీకుగాక ఎవరికొస్తాయి ఈ బరువైన వుత్తరాలు? ఒకటి రామాయణం, ఇంకోటి మహాభారతం. భాగవతం కూడా వచ్చినట్లుందికానీ పాపం అమ్మ చేతిలోకెళ్లింది'' అన్నాడు శరత్.

స్మిత అయోమయంగా చూసి ''నా లెటర్ అమ్మెందుకు తీసుకుంది?'' అంది.

''ఏమో, నన్నడుగుతావేం? చదవడమయితే చూశా. వుంచిందో, చింపేసిందోమాత్రం తెలీదు'' అని వెళ్లిపోయాడు.

స్మితకి తల్లిమీద కోపమూ వచ్చింది, భయమూ వేసింది. రమేష్ రాసిన వుత్తరమేమో. ఆ పిచ్చిరాతలు చూసి అది హుస్సేన్ రాసిన వుత్తరమే అనుకుంటుందేమో. హాయిగా ఇల్లు వదిలిపోయాడనుకుంటే ఇంకా వదల్లేదా ఈ శనిగ్రహం అనుకుందేమో. ప్చ్... ఎందుకిలా జరుగుతోంది? ఆ రమేష్‌కి అసలు బుద్ధి, పౌరుషమూ లేవా? తను జవాబు రాయకపోయినా వన్‌వే ట్రాఫిక్‌లా లెటర్లెందుకు రాస్తాడు?

అయినా తనకెందుకు భయం? తనేం తప్పుచేసింది? అతనిమీద జాలేసి, జవాబు రాయాలన్పించినా దాన్ని తన అంగీకారంగా తీసుకుంటాడని, అలాంటి అభిప్రాయంగాని, ఆశలుగానీ రమేష్‌లో పెంచడం ఇష్టంలేక తన మనసుని కఠినం చేసుకుంది. ఆ సంగతే చెప్తేసరి. చెప్పినంతలో నమ్మితే, అనవసరమయిన అనుమానాలు లేకపోతే తన పరిస్థితి ఇంత దారుణంగా వుంటుందా? ప్రాణప్రదంగా ప్రేమించిన హుస్సేన్నే తను ఆమడ దూరంలో వుంచింది. అలాంటిది ఇంకెవరితో నయినా చొరవగా వుండగలదా తను?

స్మితకి స్నేహితులు వుత్తరాలు రాస్తే వాటిని ఆత్రంగా తీసి చదువుతుంది. కానీ ఆ అస్థిమిత మనసుతో ఆమెకి చదవాలన్పించలేదు. ముందు తల్లితో వుద్యోగం సంగతి చెప్పి కాస్త వూపిరి పీల్చుకోవాలన్పించింది.

ఆ ఉత్తరాలు అలా పక్కమీద పడేసి మళ్ళీ పడుకుంది. టీ కప్పుతో గదిలో ప్రవేశించిన తల్లికి ఆ చింపని ఉత్తరాలు, ఆ పక్కనే కళ్ళు తెరిచి శూన్యంలోకి చూస్తున్న స్మిత కన్పించేసరికి సంతృప్తిగా అన్పించింది. కూతురు ఇంట్లో వాళ్ళకంటే బయటివాళ్ళకే ప్రాముఖ్యం ఇస్తుందనే భావన ఆమెని బాధిస్తుంది. ఆమె స్నేహితురాళ్ళకి తరచు వుత్తరాలు రాయడం, వాళ్ళు రాసే వుత్తరాలు మురిసిపోతూ, ముసిముసి నవ్వులతో చదువుకోవడం, వాళ్ళతో గంటలతరబడి కాలక్షేపం చేయడం - ఇవేవీ సంధ్యకి నచ్చవు.

''ఇవాళేంటో ఒకేసారి మూడుత్తరాలొచ్చాయి. ఇంకోటి ఎవరో గౌతమీ అట. నాన్సీనేమో బాగా రాస్తుందికదా అని చింపాను. టేబుల్‌మీదుంది, తీసుకో'' అంది సంధ్య టీకప్పు పక్కనే వున్న స్టూలుమీద పెడుతూ.

'నిజానికి ఏదో అనుమానంతోనే చింపివుంటుంది. తీరా తన వూహ తప్పయ్యేసరికి ఎంత తెలివిగా కప్పిపుచ్చుకుంటోంది? అందులో తనకొచ్చే నష్టమేం లేకపోయినా పిల్లలకి నేర్పాల్సిన పెద్దలే ఇతర్ల వుత్తరాలు చదివితే ఎలా? అయినా తను పరాయిదా, కన్నకూతురేగా? అయినాసరే తను చదవమని ఇస్తే తప్ప చదవకూడదు' అనుకుంది స్మిత.

''ఇదిగో టీ తాగు'' అంది సంధ్య.

''ఊహుఁ నాకొద్దు''

''ఏం? ఎందుకు?''

''తాగాలని లేదు''

''పోనీ, కాఫీ పెట్టనా?''

''ఒద్దు... అమ్మా! రేపట్నుండీ నేను స్కూలుకి వెళ్ళను'' ఒక్క ముక్కలో విషయం చెప్పి బరువు దించుకుందామనుకుంది స్మిత.

''ఎన్నాళ్ళు?''

''ఎప్పటికీ''

''ఎందుకు?''

''మానేశాను''

''ఎందుకు?'' ఈసారి దాచుకున్నా దాగని కోపంతో అంది సంధ్య.

ఒక నిమిషం స్మితేం మాట్లాడలేదు.

కానీ సంధ్య జవాబుకోసం చూస్తోంది.

''నా మైండేం బాగోడంలేదు'' తప్పుచేశానన్న భావంతోనే తలొంచుకుని చెప్పింది స్మిత.

''నువ్వా దరిద్రుణ్ణి ఇంకా మర్చిపోలేదా?''

''... ...''

''నా పిచ్చిగానీ నువ్వెందుకు మర్చిపోతావు?''

''... ...''

''మీ నాన్న సమర్థుడు గాకపోబట్టి ఆడపిల్లల జీతాలకి ఎదురుచూడాల్సిన పరిస్థితి వచ్చింది'' నిష్ఠూరంగా అంది సంధ్య.

''ఇంట్లో డబ్బెంత అవసరమో నాకు తెల్సు. ఆడ, మగ అన్న బేధం నాకులేదు''

''అవును... లేదు కాబట్టే నీ ఇష్టమొచ్చినట్లు చేస్తున్నావు. నిన్నటిదాకా ఎవరయినా చూస్తారన్న నదురూ బెదురూ లేకుండా వాడిని చూస్తూ నిలబడ్డావు. నేను సిగ్గుపడి చచ్చానందుకు. ఇవాళ ఉద్యోగం మానేశానంటున్నావు. నేనేం చేయగలను? పెద్దదానివైపోయావు, నీ ఇష్టమొచ్చినట్లుండు. ప్రశ్నించడానికి నేనెవర్నమ్మా. ముందీ టీ తాగు'' అంది సంధ్య.

''నువ్వు సిగ్గుపడాల్సినంత నేరం నేనేం చేయలేదు, ఇకముందు కూడా చేయను. చాటుమాటుగా తప్పుదారిలో నేనేం నడవలేదు. అతనంటే నాకిష్టమని స్పష్టంగా చెప్పాను. అరిచే కుక్కలు కరవవన్నట్లు అసలు మీకు చెప్పడమే తప్పయిపోయింది''

''ఆఁఆఁ... పిల్లి పాలు తాగుతూ తననెవరూ చూట్టంలేదనుకుంటుందట. నువ్వు చెప్పకపోతే మాకు తెలిసేది కాదా? అస్తమానూ ఆ బాల్కనీలో నిలబడ్డమేగా? అసలు తప్పంతా నాదే, మీ నాన్నకి తెలియకుండా కాపాడుతూ వచ్చాను''

''చెప్పకపోయావా, నేనొద్దన్నానా?''

''నువ్వెందుకు ఒద్దంటావు? నీకు ఎవరంటే భయముందిగనుక? పిల్లలకి పెద్దలు భయపడాల్సిన కాలమొచ్చింది, అంతా కలికాలమహిమ'' బుగ్గలు నొక్కుకుంది సంధ్య.

స్మిత అసహనంగా చూసింది. విషయం ఎక్కణ్ణుంచి ఎక్కడికి పోతుందో అర్థంకాకుండా వుంది. రాజారాం ఇంకా ఇంటికి రాలేదు. ఆయన ఇంట్లో వున్నంతసేపూ అందరూ అన్ని విషయాలూ రహస్యంగానే మాట్లాడుకుంటారు. అది సామాన్యంగా ఇంటి యజమానికిచ్చే గౌరవం కావచ్చు లేక భయంవల్ల కావచ్చు.

తండ్రి త్వరగా ఇంటికొస్తే వాతావరణం కాస్త చల్లబడుతుందేమో అనుకుంది స్మిత. అంతలోనే మనసులో వున్న భావాలన్నీ తల్లి మాటల్లో కోపరూపంలో వచ్చేస్తేనే మంచిది - అనుకుంది.

''చూడమ్మా! నీ ఇష్టమొచ్చినట్లు మాట్లాడు. కానీ నా మనసుకి తెల్సు, నేనేం తప్పు చేయలేదని. ఇప్పుడీ వుద్యోగం మానడం కూడా నేను కావాలని చేసింది కాదు. నాన్న కష్టపడి సంపాదిస్తుంటే రాణీలా కూర్చుని తినాలనేది నా వుద్దేశంకాదు. నేను చేయాల్సిన పనులు సరిగా చేయలేకపోతున్నాను. అలాంటప్పుడు వుద్యోగం చేయడం న్యాయంకాదని అన్పించింది''

''ఇంతటికీ కారణం వాడేగా. మునుపెన్నడయినా నిన్నొక మాట అని వున్నానా? వాడో శనిగ్రహంలా దాపురించాడు''

''అతన్నెందుకంటావు? నీక్కోపం వస్తే నన్ను''

''ఎవర్నని ఏం లాభం? అంతా నా ప్రారబ్ధం''

''సరే, ఇప్పుడు నువ్వేమన్నా, ఈ వుద్యోగం విషయంలోమాత్రం నేను చేయగలిగిందేమీ లేదు. కానీ త్వరలో మరో వుద్యోగం చూసుకుంటాను. కాస్త అప్పటివరకూ ఓపికపట్టు''

''... ...''

''నాకు తెల్సు... నాన్న జీతంలో చాలాభాగం అక్క పెళ్ళికి చేసిన అప్పులకే పోతుందని. నేను మరో ఉద్యోగంలో చేరేవరకూ ఆ అప్పులు పెండింగ్‌లో పెడ్తే... ఈ విషయం నాన్నకి కాస్త నచ్చచెప్పు'' అంది స్మిత అనునయంగా.

సంధ్యకి కూడా కోపం తగ్గింది. కూతుర్ని అర్థంచేసుకోడానికి ప్రయత్నించింది.

ఆరిపోయిన టీ వున్న కప్పును ఇద్దరూ పట్టించుకోలేదు.

సంధ్య మౌనంగా అవతలికి వెళ్ళిపోయింది.

స్మితకి కొంతవరకూ మనసు స్థిమితపడినట్లే అన్పించింది. ఆమెకి తల్లిమీద కోపం రాలేదు. సానుభూతి కలిగింది. తనని వాళ్ళ






ంతా అర్థంచేసుకోరనే ఆలోచించకపోతే, తనే వాళ్ళని ఎందుకు అర్థంచేసుకోకూడదు? పూర్వం తల్లి తనని ఎంతగా ప్రేమించింది? తను సామాన్యంగా ఏమీ అడగకపోయినా, ఏదయినా ముచ్చటపడి అడిగితేమాత్రం అవి కొనిచ్చేవరకూ ఆవిడకి మనశ్శాంతి వుండేదికాదు. ఫలానా పదార్థం తినాలనిపిస్తోంది అంటే చాలు, వెంటనే నడుంకట్టుకుని ఆ వంటకం చేసిపెట్టేది. చిన్నకూతురంటే పిచ్చిప్రేమని అంతా వెక్కిరించినా లెక్కచేసేదికాదు. పెరుగుట విరుగుటకొరకేనన్నట్లు ఆ అభిమానమంతా ఆగ్రహంగా మారింది.

అందుకు కారణం ఎవరు? స్వయంగా తనే వేసుకుంది. అంత కావాలనుకునే తల్లి కోరిక ప్రకారం తను నడిచుంటే ఆ ప్రేమ ఇప్పటికీ చెక్కుచెదరకుండా వుండేదేగా? కానీ ఆవిడకి అది చిన్నకోరికే కావచ్చుకానీ తనకది చేయలేని పనిగా అన్పించింది. కట్టిన ఇల్లయితే ఇష్టంలేకపోతే కూలగొట్టచ్చుకానీ ఆకారం కన్పించని ప్రేమసౌధాలని నిర్మూలించడం ఎలా? తన మనసే తన అధీనంలో లేనప్పుడు తల్లి ఆజ్ఞనుమాత్రం తనెలా పాటించగలుగుతుంది? ఆ పని చేయలేకపోయినందుకే తల్లికి తను శత్రువైపోయింది.

'అతన్ని ప్రేమించి నే పొందాలనుకుంది ప్రశాంతి కానీ ఆర్జించింది అశాంతి' అనుకుంది ఆవేదనగా.

నెమ్మదిగా ఉత్తరాలు చింపి చదివింది. ఒకటి రమ్య, రెండోది వీణ రాశారు.

రమ్య భర్తతో కలిసి చూసిన ప్రదేశాలన్నిటినీ వర్ణిస్తూ, భర్త మోహన్ మనస్తత్వాన్నీ, మంచితనాన్నీ తెలియజేస్తూ, తమతోబాటు స్మిత, హుస్సేన్‌కూడా వుంటే ఇంకా బాగుండేదని, ఏవేవో కవితాత్మకంగా రాసింది. ముఖ్యంగా బృందావన్ గార్డెన్స్ అందాలుమాత్రం ఒంటరిగాకంటే జంటగా చూస్తేనే బాగుంటుందని రాసి మోహన్ తీసిన కొన్ని ఫొటోలు కూడా పంపింది. వాటిలో కొన్ని వారెళ్ళిన ప్రదేశాలవి, కొన్ని వారివి వున్నాయి.

అవి చూసిన స్మిత తన్మయురాలయింది. మోహన్ చాలా ప్రతిభావంతంగా తీశాడని మనసులోనే మెచ్చుకుంది. రమ్య అలా ఎప్పటికీ ఆనందంగానే వుండాలనుకుంది. పిచ్చి రమ్య, ఇంకా హుస్సేన్ తనవాడనే అనుకుంటోందా, అతడిప్పుడు పరాయివాడు అనుకుంది.

వీణ తనకీమధ్య వుత్తరాలే రాయడంలేదని, స్మిత బొత్తిగా మారిపోయిందని, కనీసం తన పుట్టినరోజుకి కార్డు కూడా పంపలేదని సున్నితంగా నిందిస్తూ రాసింది.

'ప్చ్... పిచ్చి వీణా! నేనిప్పుడు మునుపటి స్మితని కాను. మనసులేని మనిషిని. అన్నం తిన్నానో, లేనో కూడా మర్చిపోతున్న నేను నీ పుట్టిన్రోజు గుర్తుంచుకోలేదంటే ఆశ్చర్యమేముంది? ఎనీవే, అయాం ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ యార్' అనుకుంది.

★ ★ ★

ఉద్యోగం మానేసినందున పొద్దున్నే వెళ్ళాల్సిన హడావిడి లేదుగదా పనిమనిషెందుకని అంట్లుతోమడం, బట్టలుతకడంవంటి పనులు తనే చేపట్టింది స్మిత. వంట ఎలాగూ సంధ్యే చేసుకుంటుంది.

ఉదయం పదిన్నరకల్లా అన్ని పనులూ అయిపోయి, స్నానం, భోజనం కూడా ముగిస్తోంది స్మిత. అప్పటివరకూ ఫరవాలేదు. ఇక ఆపైన రాత్రివరకూ గడవడంమాత్రం ఆమెకి బహు కష్టంగా వుంటోంది. శరత్ కాలేజీకి వెళ్ళిపోతాడు. తండ్రి ఆఫీసుకి వెళ్తాడు. వున్నా తండ్రితో పెద్దగా మాట్లాడదు. ఇక తల్లితో మాట్లాడే విషయాలే వుండవు స్మితకి, మామూలు మాటలుతప్ప.

ఏమయినా పుస్తకాలు చదువుదామని తెరిస్తే అవి బుర్రకెక్కడంలేదు. కళ్ళు యాంత్రికంగా చదువుకుంటూపోతాయి. పేజీ తిరగేయబోయినప్పుడు చూస్తే అందులో ఒక్క ముక్క కూడా అర్థమైనట్లుండదు. మళ్ళీ వెనక్కి రావడం... అదీ వరస. విసుగ్గా పక్కన పెట్టేస్తుంది పుస్తకం.

తిరిగి తిరిగి ఎన్నిసార్లు ప్రయత్నించినా ప్రతిసారీ అదే సమస్య ఎదురౌతోంది. మనసు ఎంత నిగ్రహించుకున్నా అతి కష్టంమీద అర పేజీ చదవలేకపోతోంది. అక్షరం అక్షరంలో హుస్సేనే కనిపిస్తుంటాడు.

అతను నిలబడినట్లో, పచార్లు చేస్తూనో, కుర్చీలో దర్జాగా కూర్చుని పిట్టగోడమీద కాళ్ళు పెట్టుకునో, తనని చూసి చిర్నవ్వు నవ్వుతూనో, పిచ్చెక్కుతోందని, పెళ్ళెప్పుడని, బాగున్నావని రకరకాల సైగలు చేస్తూనో దర్శనమిస్తాడు.

వాస్తవంలో వెళ్ళిపోయి కళ్ళల్లో మాత్రం నిలిచిపోయాడు.

తనెందుకు హుస్సేన్ ప్రేమలో పడింది? తను గొంతువరకూ కూరుకుపోయినట్లు, ఊపిరాడనట్లు బాధపడ్తోంది. అతను తన జీవితంలో ప్రవేశించకమునుపు ఎంత సుఖంగా, శాంతంగా వుండేది? హాయిగా, మత్తుగా కూర్చున్నచోటే నిద్రపోతూ, ఏ చీకూ చింతా లేకుండా, చూసేవాళ్ళంతా ఈర్ష్యపడేట్లు గడిపేది. కానీ ఇప్పుడో... ఇతరులతో చెప్పించుకోవాల్సిన దశ, తనపట్ల తనకే ఏహ్యత కలిగే పరిస్థితి ఏర్పడింది.

ఎందుకిలా జరిగింది?

దీనిక్కారణం ఏమిటి?

ఇది యౌవన ప్రభావమా?

ఈ వయసులో ఇలాంటి బాధ తప్పదా?

అందరికీనా, లేక ఆర్టిస్టుకేనా?

తనేం పెద్ద ఆర్టిస్టా?

కాకపోవచ్చుకానీ కలల్లో తేలే స్వభావం కదా!




అయినా గొప్పగొప్ప కళాకారులంతా ప్రేమలో పడిన దాఖలాల్లేవే?

లేవని తనెలా చెప్పగలదు? ప్రేమించి వుండచ్చు. ఆ ప్రేమలు సక్సెసయి వుండచ్చు.

కొన్ని ఫెయిలయి వుండచ్చుకదా!

మరి అలాంటివాళ్ళు ఇక కళజోలికే పోకుండా సర్వం వదిలేసి తనలా విలపిస్తూ కూర్చోలేదే?

అసలు తనంతగా వాళ్ళెవరయినా బాధపడివుంటారా? ముఖ్యంగా హుస్సేన్ని తను ఆరాధించినట్లు?

లేకేం? ప్రపంచంలో తనే మొదలూ, చివరా ఐనట్లు? గాలిబ్, మీరాబాయివంటివాళ్ళు రాసింది విరహగీతాలు కాదూ? వర్డ్స్‌వర్త్, జాన్ కీట్స్‌లాంటి మహాకవులు ప్రకృతిని ప్రేమించలేదా, ఆరాధించలేదా?

అసలు ప్రేమంటే ఏమిటి?

రోజులు, నెలలు చూస్తూ కూర్చోవడమేనా?

అలా ఎన్నాళ్ళని వీలుంటుంది?

అది సాధ్యంకాకపోతే ఏడవడమేనా?

ఏడవడం గొప్ప లక్షణం కాదు. మొదట్లో సానుభూతి కనబరిచినా తర్వాత అసహ్యించుకుంటారు ఎవరయినా?

అంటే ఒకరు అసహ్యించుకునేంత నీచస్థితిలో ఉందా తను?

ఇంతకంటే సిగ్గుపడాల్సింది ఇంకేమైనా వుందా?

అసలు జీవితమంటే ఏమిటి?

జీవితానికో సార్థకత వుండాలంటారుకదా!

జీవితంలో పెళ్ళి ఒక భాగమేతప్ప పెళ్ళే జీవితం కాదుగా. పెళ్ళివరకూ రాని ప్రేమకోసం తనకింత ఆవేదనెందుకు? చాలామంది పెద్దల దృష్టిలో తనదో సమస్యేకాదు. నిజమేనేమో, తనే భూతద్దంలో చూస్తోందేమో. చిన్న గాయాన్ని గిల్లి గిల్లి రాచపుండులా చేస్తోందేమో... వీల్లేదు, దీన్నుంచి బయటపడాలి.

కానీ అందుకు తనేం చేయాలి? తను కావాలని ఇలా కాలేదు. మరి మామూలు మనిషి కావడం తన చేతిలో పనిలా కన్పించడంలేదు. హుస్సేన్ని మరిచిపోవాలని చేసే ప్రయత్నాలన్నీ విఫలమవుతున్నాయి. ఏ పనిలోనూ మనసు నిమగ్నం కావడంలేదు కళ్ళు మూసినా తెరిచినా అతని రూపమే కన్పిస్తోంది.

అన్ని జంతువులకంటే మనిషి వున్నతుడనీ, ఇతర ప్రాణుల్లా గాక మనిషి తన జీవితాన్ని తాను నిర్దేశించుకోగలుగుతాడనీ అనేకమంది పెద్దలు అభిప్రాయపడ్డారుకదా! మరి తన జీవితాన్ని తాను తీర్చిదిద్దుకోలేదా? ఈ చిన్న ఎదురుదెబ్బకే తాను ఓటమిని అంగీకరిస్తే ఎలా? ఇక తన జీవితం ఇలా అంతం కావల్సిందేనా? నిన్నమొన్నటివరకూ తనో మంచి కళాకారిణి కావాలన్న ఆశలన్నీ తుంచేసుకోవాల్సిందేనా? తన జీవిత ప్రయాణంలో ఎదురయిన ఒక బాటసారికోసం తన మార్గంమరిచి, గమ్యంలేని గాలిపటం కావాల్సిందేనా?

అలా అంతూ దరీ లేని ఆలోచనలతో స్మిత నిరాసక్తంగా నిస్పృహగా కాలక్షేపం చేస్తోంది.



ఆరోజు పనులన్నీ అయిపోయాక హారతి ఇంటికి బయల్దేరింది స్మిత.

"హలో ఆర్టిస్టూ! స్కూలుకి పోలేదా?" అంది హారతి.

"ప్చ్... ఆ పిలుపు మానవా? స్కూలు మానేశా?"

"ఏమైంది, బంగారంలాంటి వుద్యోగమన్నావు"

"ప్లాటినంలాంటి ప్రిన్స్‌పాల్ అని కూడా అన్నానా? ఏమో, ఏ పనిమీదా మనసు నిలవడంలేదు, అందుకే..."

''స్మితా! నీ పద్ధతి నాకేం నచ్చడంలేదు. మూడేళ్ళక్రితం ఎంత చురుగ్గా, చలాకీగా వుండేదానివి? ఎందుకిలా తయారవుతున్నావు?''

''హారతీ! నన్ను చూస్తే నాకే అసహ్యమేస్తోంది. అతన్ని చూడకుండా వుండలేకపోతున్నా. అతని ఆలోచనలు నన్ను పిచ్చిదాన్ని చేస్తున్నాయి. ప్రేమని గురించి మహానుభావులయిన కవులూ, రచయితలూ కూడా మహత్తరమైనదంటూ రాస్తే నిజమే అనుకునేదాన్ని. కానీ దాని పరిణామం ఇంత నరకప్రాయంగా వుంటుందని ఇప్పుడే తెలుస్తోంది''

''ఏమో స్మితా! నీకేం చెప్పాలో తెలియడంలేదు. పోనీ పెళ్ళి చేసుకోవాల్సింది''

''నాకూ అదే అన్పిస్తోంది''

''రైలు కదిలాక స్టేషన్‌కెళ్తే ఏంలాభం. అదో పీడకలలా మర్చిపో. అమ్మా నాన్నా చూపిన పిల్లాణ్ణి చేసుకుని సుఖంగా వుండు''

స్మిత కోపంగా చూసింది. ''వ్యంగ్యమా?'' అంది.

''ఇందులో వ్యంగ్యమేముంది? పోనీ నువ్వేం చేయాలనుకుంటున్నావో చెప్పు, నా మాట పక్కనపెట్టి''

''హారతీ! నేనిప్పుడు పెళ్ళికి తొందరపట్టంలేదు. కేవలం హుస్సేన్ని మర్చిపోతేచాలు. కానీ అది నావల్ల కావడంలేదు''

''కాకేంచేస్తుంది? అతను ఇంకోదేశం వెళ్ళాడనుకో. ఒకసారి మనసుపడ్డాక మరచిపోవడం కష్టమేనని నాకుతెల్సు. కానీ అసాధ్యంమాత్రం కాదు''

''హారతీ! ఎలా చెప్పాలో అర్థంకావడంలేదు. అతన్ని మర్చిపోవాలనే సాధ్యమైనంతవరకూ ప్రయత్నిస్తున్నాను. ప్చ్... కానీ... ఈ లోకంలో నా అంత పిచ్చిగా, వెర్రిగా ఇష్టపడ్డవాళ్ళు ఇంకోళ్ళు వున్నారో లేదో? వున్నా అలాంటి వాళ్ళకి హుస్సేన్‌లాంటి కఠినాత్ముడు, నిర్దయుడూ మాత్రం తారసపడివుండడు. లేకపోతే నన్నిలా వదిలేసి వెళ్ళగలిగేవాడా? నే పడ్తున్న నరకయాతన చెప్పడానికి ఏ భాషా చాలదు''

''లోపలున్న బాధని చూసే ఎక్స్‌రే కూడా వస్తుందేమోలే'' అని నవ్వి ''నీ బాధ నాకర్థమయ్యింది కానీ...'' అంది హారతి.

''హారతీ! ఉద్యోగం మానేశాక మరీ ఘోరంగా వుంది. అసలీ హైదరాబాదు వదిలేసి, మరో కొత్త ప్రదేశానికెళ్తే కాస్తయినా మర్చిపోగలుగుతానన్పిస్తోంది'' అంది స్మిత.

''స్థలమార్పిడి క్కావాలంటావా? అది శారీరక ఆరోగ్యానికి ఉపకరిస్తుందేమోగానీ మానసికంగా పనిచేయదు. పిచ్చిపిల్లా! 'వూరు మారినా ఉనికి మారునా?' అనే పాట వినలేదా? నువ్వెంత దూరమెళ్ళినా నీ మనసుమాత్రం నీవెంటే వుంటుందికదా! పోనీ ఆ మనసు వదిలేసే మార్గమేమైనా వుందేమో చూడు'' నవ్వింది హారతి.

''పిల్లికి చెలగాటం, ఎలుకకి ప్రాణసంకటం అన్నట్లు, నన్ను చూస్తే నీకు హాస్యంగా వుందా?'' అంది స్మిత.

''తులసీదాస్ తెల్సా?'' అంది హారతి.

''తెలుసు, హిందీ కవి''

''ఆయన భార్యని పిచ్చిగా ప్రేమించేవాడట. ఒకసారి ఆవిడ పుట్టింటికి వెళ్ళినప్పుడు, ఆయన ఆ ఎడబాటు భరించలేక ఒకపక్కన వరదలొచ్చి గంగానది పొంగిపొరలి ప్రవహిస్తున్నా లెక్కచేయక, దానికి అడ్డంగాపడి ఈదుకుంటూ అవతలి ఒడ్డు చేరుకుని అత్తారింటికి వెళ్ళాడట. ఆ పరిస్థితిలో భర్తని చూసిన ఆయన భార్య ఆ పిచ్చిప్రేమకి పరవశించక పోగా అవమానించిందట. తనపై చూపే ప్రేమ ఏ దేవుడిమీదో నిలిపితే దానికో అర్థం, పరమార్థం చేకూరుతాయని చెప్పిందట. దానితో కళ్లపొరలు తొలగినట్లయి తులసీదాస్ రామభక్తుడై గొప్ప కవి కాగలిగాడు''

''ఈ కథ తెల్సు... వాళ్ళు ధన్యజీవులు'' అంది స్మిత.

''చూడు స్మితా... తాగుబోతుకి తాగుడు మానడం కష్టంగానే వుంటుంది. కానీ గట్టిగా తాగకూడదని నిర్ణయించుకుంటే అసాధ్యమా చెప్పు. తాగాలన్న కోరికతోబాటు దాన్ని అదుపు చేసుకునే శక్తి కూడా అతన్లోనే వుంటుంది. ఈ ప్రేమ కూడా మత్తులాంటిదే. ఆలోచనాశక్తిని అణిచేస్తుంది. అతనిమీది ప్రేమని మరో విషయంమీదికి డైవర్ట్‌చెయ్యి''




"ఇలా ఎన్నోసార్లనుకున్నా హారతీ, కానీ..."

"కానీ లేదు, అర్థనా లేదు. నువ్వీపని చేయాలి. నువ్వు పూర్వపు స్మితవి కావాలి. పేరుకు తగ్గట్లు నవ్వుతుండాలే తప్ప శోకదేవతలా ఏడుస్తూ కూర్చుంటే నే భరించలేను. ఈ లోకంలో మనిషికి అసాధ్యమంటూ ఏదీ లేదు. నువ్వు మారాలి, మారుతున్నావు అంతే..." అంది హారతి.

"హిప్నొటైజ్ చేస్తున్నావా?"

"అవసరంలేదు. మనసుని మించిన మందే లేదు. స్మితా! నామీద నీకేపాటి అభిమానమున్నా నా మాట విను. మనం నవ్వుతూ పదిమందిని నవ్వించాలేతప్ప ఏడుస్తూ ఏడ్పించే అర్హత మనకి లేదు.

"అది నాకూ ఇష్టంలేదు"

"చూడు స్మితా! ఎప్పుడో విన్న జ్ఞాపకం. తెలివైన వ్యక్తి జనులు తనపై రువ్విన రాళ్ళని కూడా వినియోగించుకుంటాడట. ఈ ప్రేమ కూడా నీకేమైనా వుపయోగపడ్తుందేమో ఆలోచించు" అంది హారతి.

"అవును, ఆ కొటేషన్ నాకు చాలా ఇష్టం" అంది స్మిత సాలోచనగా.

"నీకు అన్నీ తెలుసు. మరి తెలిసి తెలిసి ఇంత పిచ్చిదానివెలా అయ్యావో అర్థంకావడంలేదు. మనం బాగున్నంతవరకే మన విలువ. ప్రాణం పోయేవరికి చీమలు కూడా చుట్టుముడతాయి. కష్టనష్టాలనేవి ప్రతి మనిషి జీవితంలోనూ వుంటాయి. సమయం వచ్చినప్పుడు చెప్తాను నేనెన్ని విషమ పరిస్థితులు దాటి ఇలా వున్నానో. కష్టం లేని సుఖం సుఖంగా వుండదు. ఒక దీపం తాను వెలిగుంటేనే ఇతర దీపాలని వెలిగిస్తుందని, నువ్వు ఆదర్శంగా వుండి, ఇతర్లని..."

"వద్దులే హారతీ! అంత పెద్ద వూహలు చేయకు. మొత్తానికి ఈరోజునుండీ నువ్వు చెప్పినట్లు వుండడానికి చూస్తాను"

"చూస్తాననకు, చేస్తానను"

"అలాగే, హుస్సేన్‌మీదున్న ప్రేమని ముస్లిమ్ ఆర్కిటెక్చర్‌మీదికి మళ్ళిస్తాను, అదే నా స్పెషలైజ్డ్ సబ్జక్టుగా తీసుకుంటే"

"బాగుంది. ఆ పనేదో త్వరగా చెయ్యి. ఈ హైదరాబాదులో నవాబుల కట్టడాలకేం కొదవ లేదు. అవన్నీ పూర్తయితే ఢిల్లీ కూడా పోవచ్చు. నీవెంట నేనూ వస్తాను కావాలంటే. నీ పెయింటింగ్స్ ఎగ్జిబిట్ చేస్తానంటే ఆ ఖర్చు నేనే పెట్టుకుంటా. అలాగే అందులో బాగున్న పెయింటింగ్స్ ఫ్రీగా తీసేసుకుంటా"

"ఆఁ ఆఁ మరీ అంత డీప్ డ్రీమ్స్‌లోకెళ్ళకు"

"నీలా నేను పగటి కలలు కనను. భవిష్యత్తులో జరిగే వాస్తవాలనే వూహిస్తున్నా"

"అవన్నీ సరేగానీ, నేనో స్కూలు పెడ్తే ఎలా వుంటుంది?"

"బానే వుంటుంది పెట్టు. బాధ్యతలు పెరిగితే అనవసర ఆలోచనలు తగ్గుతాయి. పెట్టుబడి కావాలంటే కొంత నేనిస్తాను"

"ఏం పిల్లలకి ఫ్రీ ఎడ్యుకేషన్ అనుకునేవు?"

"అక్కర్లేదు తల్లీ! నా పిల్లలు మంచి స్టాండర్డ్ కాన్వెంటులొదిలేసి, నీ కొత్త స్కూలుకెందుకొస్తారు?"

"ఏయ్! నేనంటూ స్కూలు పెడితే అల్తూ ఫాల్తూ స్కూలు పెట్టను"

"అదే నాక్కావాల్సింది. మరో శాంతినికేతన్ పెడ్తావా?"

"చెప్పను, చేసి చూపిస్తాను"

"ఇప్పుడు నాకు నచ్చావే స్మైలూ" అంది హారతి, స్మిత బుగ్గమీద గిల్లి నవ్వేస్తూ.

★ ★ ★

హారతితో చెప్పినట్లు స్మిత హుస్సేన్‌మీది ప్రేమని మహమ్మదీయ నిర్మాణాలవైపు మళ్ళించింది. చూసిన ప్రతిసారీ,

"అబ్బ... ముస్లిం ఆర్కిటెక్చర్ ఎంత బాగుంటుందే" అంటూ ఆయా కట్టడాలని తన్మయంగా చూసే స్మితని,

"ఈ మాట నాతో వెయ్యిసార్లయినా అనుంటావు. అవేవీ నీ హుస్సేన్ కట్టలేదు" అందోసారి రమ్య ఆమెని వెక్కిరిస్తూ.

ఆ మాటలు గుర్తొచ్చినప్పుడల్లా నవ్వుకుంటుంది స్మిత.

స్మిత రకరకాల నవాబుల కట్టడాలు సిటీలో ఎక్కడెక్కడున్నాయో ఒక లిస్టు తయారుచేసు

కుంది. మొదట యూనివర్సిటీ భవనంతోనే ప్రారంభించాలి అనుకుంది. ఆర్ట్స్ కాలేజీ వెలుపలి భాగంకంటే లోపలి భాగం మరింత కళాత్మకంగా, నైపుణ్యమయిన పనితనంతో వుండడం గమనించింది.

వివిధ కోణాల్నుండీ ఆ భవనాన్ని పెన్సిల్‌తో స్కెచెస్ గీసుకుంది. పూర్తి భవనాన్ని అవుట్‌లైన్స్ గీసింది. అందుకామెకి రెండురోజులు పట్టింది. ఆ రెండ్రోజుల్లో అనేకసార్లు ఒకవిధంగా వుద్యోగం వదిలేయడం కూడా మంచిదే అయ్యిందేమో అనుకుంది.

చాలా శ్రమపడి ఆయా భాగాలు గీసినప్పటికీ ఎవరయినా ఫొటోలు తీసి ఇస్తే పెయింటింగ్ వేయడం సులువేమో అన్పించింది. అది ఎలాగో వీలు కాదు గనుక ఇంతకుమించి మరో మార్గం లేదుకదాని తనకి తనే సర్దిచెప్పుకుంది.

ఇంటికొచ్చి ఆ స్కెచెస్ ఆధారంతో కాన్వాస్ మీద ఆయిల్ పెయింట్స్‌తో చిత్రించింది. సంతృప్తికరంగా రానప్పటికీ నిరాశ చెందలేదు. 'ప్రాక్టీస్ మేక్స్ ఎ మాన్ పర్‌ఫెక్ట్' అన్నట్లు అలవాటయితే బాగా వేస్తానేమో. ఈ విషయంలోమాత్రం నేను ఓడిపోవడానికి వీల్లేదు అనుకుంది స్థిరంగా.

అది చూసిన తల్లి ''బొమ్మలేయడానిక్కూడా ఇంకేం దొరకలేదా? ఇంతకంటే రోడ్డెమ్మట కన్పించే చెత్తాచెదారం వేయరాదూ?'' అంది.

స్మిత కోపం తెచ్చుకోలేదు. మునుపటిలా అమ్మ మాటలు లెక్కచేయకూడదు. ఆవిడలాగే సంసారపక్షపు స్త్రీలా మాట్లాడుతుంది. ఎంతో కొంత చదువుకుని, మంచి పుస్తకాల, మంచి గురువులమధ్యా పెరిగిన తను చేయదలచిందేదో మౌనంగా చేయడం, తెలిసీ తెలియక ఆవిడేమైనా అంటే వాటిని విననట్లు వూరుకోవడం ఉత్తమం అనుకుంది.

స్మిత నవ్వుతూ, ''ఇవేవీ ఆ పిల్లాడు కట్టలేదులే'' అంది రమ్య మాటలు గుర్తుచేసుకుంటూ.

''స్మితా! ఒక మాట అడుగుతా, నిజం చెప్తావా?'' అంది సంధ్య.

''అడుగు... అబద్ధం ఎప్పుడూ చెప్పను, వుంటే భగవద్గీత తీసుకురా'' అంది తను వేసిన బొమ్మ చూసుకుంటూ.

''అతనింకా కనిపిస్తున్నాడా నీకు?''

''ఎవరు?''

''ఆ తురకబ్బాయి''

''పేరు హుస్సేన్''

''ఏదో ఒకటిలే... కన్పిస్తున్నాడా?

''నువ్వేం బెంగపడకు, అతడి పెళ్ళయిపోయింది. ఆ అల్మర్లో వెడ్డింగ్ కార్డుంది, కావాలంటే తీసి చూడు''

''చూశావా, అంత నికరంలేనివాడికోసం మమ్మల్ని ఎదిరించి నానా రాద్ధాంతం చేశావు. నీ మంచికోసంకాదూ వద్దని వారించింది. అతన్ని నమ్ముకుని ఇంట్లోంచి పోయుంటే ఏం జరిగేది?'' అంది తల్లి.

''ఇందులో అతని తప్పేం లేదు. నాకోసం చాలాకాలం ఆగాడు. సరే, అయ్యిందేదో అయ్యింది, మళ్ళీ మళ్ళీ ఆ విషయాలు గుర్తుచేయకు''

''ఎంత తేలిగ్గా కొట్టిపారేస్తున్నావు? నోరు జారితే తీసుకోవచ్చుగానీ, కాలుజారితే తీసుకోవడం కష్టం. నీగురించి నేనెంత దిగులుపడ్డానో నీకేంతెలుసు? తిన్న తిండి కూడా వంటబట్టలేదు''

స్మిత మంచినీళ్ళుతాగే వంకతో అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

తర్వాత ఫొటోలు చూస్తూ చార్మినార్ వేసింది. అది బాగా వచ్చిందని ఆమెకి అన్పించడమేగాక రాజారాం కూడా కూతురి పనితనాన్ని మెచ్చుకుని-

''స్మితా! నా బంగారుతల్లీ! నువ్వు ఉద్యోగం చేయకపోయినా నష్టమేంలేదు. మన అప్పులు కూడా ఒక సంవత్సరంలో తీరిపోతాయి. ఈలోపు శరత్ చదువు కూడా పూర్తవుతుంది. నువ్విలా పెయింటింగ్ చేయడమే బాగుంది. నీకు మంచి పేరు రావాలి. నిన్నో మంచి ఆర్టిస్టుగా అందరూ పొగుడుతుంటే వినాలనుంది. నే బతికుండగా నా కోరిక తీరుతుందా?'' అన్నాడు ఆమె తల ఆప్యాయంగా నిమురుతూ.

స్మితకి కళ్ళెమ్మట నీళ్ళు తిరిగాయి. ''నాన్నా! అంతమాట అనకండి... ప్లీజ్. నిజానికి





నాలో అంతటి గొప్పతనం లేకపోయినా మీ ఆశీస్సులుంటే సాధించడానికి కృషిచేస్తాను. నాకేమయినా పేరొస్తే దానికి మూలం మీరే నాన్నా'' అంటూ ఆయన ఒడిలో తలపెట్టింది.

ఓరోజు దీక్షగా బొమ్మలేస్తూ కూర్చున్న స్మితని చూసిన అహల్య ''నేనొచ్చి గంట దాటింది, నిజంగా గమనించలేదా?'' అంది.

''లేదత్తయ్యా! సారీ, నిజంగా చూళ్ళేదు, మావయ్యా, సుచరితా రాలేదా?'' అంది స్మిత.

''వాళ్ళు రాలేదులే. మొత్తానికి నాకు చాలా సంతోషంగా వుంది. ఒకదశలో నిన్ను చూస్తే చాలా విసుగేసింది. కుక్కతోక వంకర అన్నట్లు నిన్ను మార్చడం ఎవరితరమూ కాదు. చేతులారా జీవితాన్ని పాడుచేసుకుంటోందని, మీ అమ్మా, నేను బాధపడేవాళ్ళం'' అంది.

''నిజమే అత్తయ్యా! నేనూ అలాగే అనుకున్నాను''

''ఏమైతేనేం, మారావు... అంతేచాలు. కారీ ఆన్. నీ పని నువ్వు చూసుకో, నేను అమ్మావాళ్ళతో మాట్లాడ్తాను''

''నేనంత రాచకార్యం వెలగబెట్టడంలేదులే, టీ పెట్టనా?'' అంటూ అహల్యతోబాటు ఇవతలి గదిలోకి వచ్చేసింది.

అహల్య ఇంటికెళ్ళిపోతుంటే మరుసటి రోజు తానొస్తానని చెప్పింది స్మిత. అహల్య అలాగే రమ్మని చెప్పి వెళ్ళింది.

★ ★ ★

''హలో మేడం! ఆఫ్టరె లాంగ్ టైం. మరీ నల్లపూసవైపోయావే'' అంది సుచరిత.

''గొప్పేలే, గుచ్చి మెళ్ళో వేసుకోరాదూ?'' అంది స్మిత.

''నల్లపూసలు ఇప్పుడు వేసుకోకూడదుగా'' అంది సుచరిత.

''ఇంత ఆలశ్యమైందేం స్మితా?'' అంది అహల్య లోపల్నుండి వస్తూ.

''వంట లేటయింది''

''ఏం భోజనం నే పెట్టనా? ఎందుకు తినొచ్చావు?''

''నువ్వింకా లేటుగా. ఈమధ్య ఆకలీ, నిద్రా కూడా ఎక్కువయ్యాయి''

''ఆరోగ్యకరమయిన లక్షణం. నా వంటయ్యాక మళ్ళీ తిందుగాని''

ఇల్లు సర్దుతున్నా. గదిలో కూర్చుందుగాని రా'' అంది సుచరిత.

''వస్తాలే, నువ్వెళ్ళు. కాసేపు అత్తయ్యతో మాట్లాడాలి''

''రా స్మితా! స్టవ్‌మీద సాంబారుంది'' అంది అహల్య.

''స్మిత వంటింట్లోకి దారితీసింది. అహల్య నిలబడి వంట చేస్తుంటే స్మిత పీటమీద కూర్చుంది.

''ఎంతవరకూ వచ్చింది నీ పెయింటింగ్?''

''పర్లేదు. ఒక్కోదానికి వారం, మహా అయితే పదిరోజులూ పడ్తోంది. అత్తయ్యా! ఫ్రాంక్‌గా చెప్పాలంటే ఇప్పటికీ అతన్ని నేను మర్చిపోలేదు. కానీ ఆ ప్రే... ఇష్టాన్ని కళారూపంగా మార్చగలుగుతున్నా. మొన్నటివరకూ అతను గుర్తొస్తే ఏడ్చేదాన్ని. కానీ ఇప్పుడుమాత్రం అలాంటి ఆలోచన్లు వచ్చినప్పుడు బొమ్మలేయడమో, కవిత్వం రాయడమో చేస్తున్నా. ఇందువల్ల బాధకంటే సంతోషం కల్గుతోంది''

''బాగుంది. చెత్తాచెదారంలోంచి కూడా బయోగాస్ తీస్తున్నారు. నిన్ను ఇన్‌స్పైర్ చేయగలుగుతున్న అతని చిహ్నాలు నీలో నిలిచిపోయినా నష్టమేంలేదు. ఇంతకీ కవిత్వం ఎప్పుడు మొదలెట్టావు, నాకు చెప్పనేలేదు''

''అసలు నీకు చూపితేనే నాకు సంతృప్తి. కానీ అది... చూపాలంటేమాత్రం నాకే సిగ్గుగా వుంది. బయటివాళ్ళయితే పర్లేదుగానీ''

''ప్చ్... నువ్వింకా పూర్తిగా ఎదగలేదు. ఆర్టిజ్ ఆర్ట్. అది విరహంకావచ్చు, విషాదం కావచ్చు. ఒక్కోసారి ఆర్టిస్టు నగ్నంగా వున్న స్త్రీని మోడల్‌గా కూర్చోబెట్టుకుని బొమ్మ వేయాల్సివుంటుంది. అంతమాత్రాన అందుకు సిగ్గుపడాలా'' అంది అహల్య.

స్మిత మేనత్తవంక కృతజ్ఞతగా చూసింది. 'తన తల్లి ఇంత వున్నతంగా ఎందుకు ఆలోచించదు' అనుకుంది.

''రేపు తెచ్చి చూపిస్తానత్తయ్యా. గొప్పగా వుండదులే ఇప్పుడేకదా రాస్తున్నా. కానీ ఇప్పుడు మరో దిగులు పట్టుకుంది'' అంది స్మిత.

''అవన్నీ ఎవరు పబ్లిష్‌చేస్తారనా?'' అహ

ల్యా నవ్వింది.

''ఛఛ... అదికాదు'' అంటూ నవ్వి ''నాన్న చాలా ఇబ్బంది పడుతున్నారు. నేనుకూడా ఎంతో కొంత సంపాదిస్తే...''

''నిజమే... నువ్వింకో ఉద్యోగం చూసుకో''

స్మిత ఒక నిమిషం ఆగి ''అత్తయ్యా! నేనో స్కూలు పెట్టాలని ఆలోచిస్తున్నాను. ఎలా వుంటుంది?'' అంది.

''ఆలోచనయితే మంచిదేగానీ, అది నీకు ఎంతవరకూ సరిపోతుందో చూసుకో. ముందు నీ కెపాసిటీ ఏమిటో ఆలోచించు''

''ఇతర విషయాలు ఏమోగానీ, టీచింగ్ ఫీల్డంటే నాకు చాలా ఆసక్తి ఏర్పడింది. స్కూలయితే బాగా చూసుకోగలననే నమ్మకం వుంది''

''టీచింగుకీ, ఎడ్మినిస్ట్రేషన్‌కీ తేడా వుంది. జీతం తీసుకుని ఉద్యోగం చేసిరావడం తేలికే గానీ, జీతమిచ్చి పనులు చేయించుకోవడం చాలా కష్టం. పదిరకాల మనస్తత్వాల వాళ్ళుంటారు. వాళ్ళచేత తిన్నగా చదువు చెప్పించాలంటే ఒకర్ని పొగడాలి, ఒకర్ని మందలించాలి, ఒకర్ని బుజ్జగించాలి, ఇంకొర్ని మచ్చికచేసుకుని లాలనగా చెప్పాలి''

''నువ్వు మరీ నన్ను బెదరగొడ్తున్నావే?'' నవ్వింది స్మిత.

''ఈ మాటకే బెదిరిపోతే ఇక స్కూలేం పెడ్తావు?''

''లేకపోతే ఏమిటత్తయ్యా! టీచర్లు మరీ అలానేం వుండరు. మహా అయితే ఉద్యోగంలోంచి తీసేస్తామంటేసరి, అందరూ తిన్నగా వుంటారు. ఇవేం గవర్నమెంటు వుద్యోగాలా తమ ఆటలన్నీ సాగించుకోడానికి టీచర్లు''

''అదే తెలివితక్కువతనం. నువ్వు చూసిందే లోకం అనుకుంటే ఎలా? ఒక టీచర్ వుంటాడు, ప్రతిరోజూ లేటుగానే వస్తాడు. ఎంత చెప్పినా వినడు. అతన్ని తీసేస్తావు. ఇంకో టీచర్, అతన్లో ఇంకేదో లోపం, తీసేస్తావు. ఇలా ఎంతమందిని? రోజుకో టీచర్ని మారిస్తే స్కూలేం నడుస్తుంది? పేరెంట్సుకి నమ్మకమెలా కుదుర్తుంది?''

''అయితే నే స్కూలు మెయింటెయిన్ చేయలేనా?'' అంది నిరుత్సాహంగా.

''అలా డీలాపడిపోకు. ఇదో చిన్న ఎగ్జాంపుల్‌మాత్రమే. ఇడ్లీపిండి రుబ్బినట్లు ఈజీచెయిర్లో కూర్చుని టీచర్లని పురమాయించడమే అనుకున్నావా స్కూలంటే. దేనికయినా సీరియస్ థింకింగ్ వుండాలి. నిజంగా పెట్టదలచుకుంటే ఈ విషయంమీద బాగా వర్కవుట్ చెయ్యి. మీ మావయ్యకి చాలామంది పెద్దలతో పరిచయాలున్నాయికదా. ఆయనద్వారా వెళ్ళి కొందరు ప్రిన్సిపాల్స్‌ని, మేనేజ్‌మెంట్స్‌ని కలువు. అన్నీ ఆలోచించి, చేయగలనన్పిస్తే పెట్టు''

''పైగా నాకు ప్రైమరీ స్కూలంటే ఇంట్రస్ట్ లేదు. వాళ్ళకి చదువు చెప్పడంకంటే తీసుకోవాల్సిన రిస్కెక్కువ''

''మరి, ఒకేసారి హైస్కూలు పెడ్తే వున్న స్కూళ్ళు వదిలేసుకుని పిల్లలొచ్చి చేరతారా? ప్రైమరీ క్లాసెసంటే అంతగా ఆలోచించరు గానీ పెద్దక్లాసుల్లో చేర్పించాలంటే ఏ తల్లి దండ్రులయినా ఆలోచిస్తారు. ముందు మంచి ఇంప్రెషన్ కలిగించుకోవాలి''

''నిజమే... ఒకటి రెండు సంవత్సరాలు పిల్లలు ఎక్కువమంది రాకపోవచ్చు. అంటే ఆదాయమే వుండదు. అయినా టీచర్లకి జీతాలు, బిల్డింగ్ రెంటూ, ఇతర ఖర్చులూ తప్పవు'' అంది స్మిత.

''అదీ... మంచీ చెడూ అలా ఆలోచించాలి. ఇవాళా రేపూ స్కూళ్ళూ కాలేజీలూ అన్నీ కమర్షియల్ అయిపోయాయి. నువ్వేదో టాగూర్లా లోకాన్ని వుద్ధరించడానికి ఆదర్శంగా స్కూలు తెరుస్తానంటే కుదిరేపని కాదు. పైగా వెనకేం డబ్బులేదు. అలాంటప్పుడు మరీ డబ్బు చేసుకోవాలన్న దురాశ లేకపోయినా కొంతయినా కమర్షియల్‌గా ఆలోచించాలి. మరీ ఫీజులు కూడా కట్టలేని లొకాలిటీలో స్కూలు పెడితే చిప్ప చేతిలోకొస్తుంది'' అంది అహల్య.

''నిజమే... ఎకనామికల్‌గా కాస్త పర్లేదనుకునే ఏరియా చూసుకోవాలి. మరి, మావయ్యతో చెప్తావా నా విషయం?''

''నేనెందుకు చెప్పడం, నువ్వే అడుగు. ఆపాటి చొరవ లేకపోతే స్కూలేం పెడ్తావు?





అయినా ఇంట్లో మనుషుల దగ్గరే ఇంత మొహమాటపడితే కొత్తవాళ్ళదగ్గరికేం వెళ్తావు? ఎలా మేనేజ్ చేస్తావు? అన్నిటికంటే ముందు సోషల్‌గా వుండడం నేర్చుకో'

అప్పటికి అహల్య వంట పూర్తయ్యింది.

అంతా భోజనాల దగ్గర ముచ్చట్లు చెప్పుకుంటూనే మధ్యలో స్మిత స్కూలుపెట్టే విషయం కూడా మాట్లాడారు.

''ఎప్పుడయినా నాకు తోచనప్పుడొచ్చి ఏదో క్లాసు తీసుకుంటే జీతమెంతిస్తావ్?'' అంది సుచరిత.

''ఇవ్వను, ఎకౌంట్‌లో రాసుకోమంటాను'' అంది స్మిత.

''ఈపాటి తెలివుందంటే పర్లేదు, నువ్వు స్కూలు పెట్టొచ్చు''

''ఐ.ఎస్.ఐ. ముద్రలాగా నువ్వు సర్టిఫై చేస్తే చాలా?'' అంది స్మిత.



హుస్సేన్ దూరమయినా అతని స్మృతులు తనతోనే వున్నాయనే తృప్తి స్మితకి సంతోషమే కలిగిస్తోంది. ఒక్కోసారి అతనిచ్చిన వి.ఐ.పి. పర్సునో, సెంటుసీసానో చేతిలోకి తీసుకుని అపురూపంగా స్పృశిస్తోంది. వాటిని చెక్కిలికి ఆనించుకుని ఏదో అద్వితీయమైన ఆనందం పొందుతుంది.

''నీ వుద్యోగాలు నీ వ్యక్తిత్వంలో కలిసిపోయాయి. ఇడియట్! నిజంగా నువ్వే వి.ఐ.పి.లాగే ప్రవర్తించావు. మామూలు మనిషిలా అందితే నువ్వు వి.ఐ.పి. వెలా అవుతావు? అందుకే అందనంత దూరమెళ్ళిపోయావు. నువ్వే అనిర్వచనీయమైన పరిమళానివి. ఈ జీవితంలోనే కాదు ఇంకో పది జన్మలెత్తినా నిన్ను మర్చిపోగలనా అన్పిస్తోంది. నీకు ఇడియట్టని పేరు పెట్టుకున్నందుకు నన్నే పెద్ద ఇడియట్‌ని చేసి వెళ్ళిపోయావుకదూ?!

'నువ్వు చూపిన ప్రేమంతా ఏమయిపోయింది? నేను నీకు గుర్తున్నానా? పొరపాటున రోడ్డుమీద కన్పిస్తే పలకరిస్తావా? అసలు గుర్తుపడ్తావా?' తన ఆలోచనలకి తనే నవ్వుకుంది.

పాటలు విని చాలా రోజులైంది అనుకుంటూ కాసెట్ల దగ్గరికెళ్ళింది స్మిత. ఓ కాసెట్ అందుకుని పెట్టింది. ఆ కాసెట్టంటే ఆమెకి చాలా ఇష్టం. అది రమ్య ప్రెజెంట్ చేసింది.

మాటల మధ్యలో ఓసారి స్మిత తనకి ఇష్టమయిన రెండు పాటలు చెప్పి అవి పదేపదే రివైండ్ చేసుకుని వింటానని అంత పిచ్చి ఇష్టమనీ చెప్పింది. రెండ్రుజులయ్యాక రమ్య ఓ కాసెట్ చేతిలో పెట్టి వినమంది.

విన్న స్మిత ఆశ్చర్యానందాలకి అంతే లేదు. ఆమె చెప్పిన రెండు పాటలే. రివైండ్ చేయాల్సిన అవసరం లేకుండా ఒకవేపు మొదటి పాటే మళ్ళీ మళ్ళీ రికార్డ్‌చేసుంది, అలాగే రెండోది.

అప్పట్నుండీ వాళ్ళిద్దరూ మరింత సన్నిహితులయ్యారు.

ప్లే నొక్కేసరికి ''జొవాదా కియావో నిభానా పడేగా'' అని పాడ్తోంది టేప్.

ఆ పాట వింటూనే మత్తుగా నిద్రపోయింది స్మిత.

ఒకపక్కన డ్రాయింగులు వేస్తూనే తరచు లైబ్రరీలకి వెళ్ళడం, మెంబర్‌షిప్ కార్డు మీద పుస్తకాలు తెచ్చుకోవడం, కొన్నిసార్లు హరనాథ్ గారి దగ్గర పుస్తకాలు తెచ్చి చదవడం చేస్తోంది. వీలయినంతవరకూ సమయం వృధాకాకుండా చూసుకుంటోంది.

ఒక పక్కన స్కూలుకి సంబంధించిన వివరాలు కనుక్కుంటోంది. ఆర్థిక ప్రయత్నాలు చేయసాగింది. హారతి ఇచ్చే డబ్బుతోబాటు అనెంప్లాయ్‌మెంట్ స్కీమ్‌కింద తన పేరున లోన్‌కి అప్లయిచేసింది.

ఏయే విషయాలకి ఎవరెవర్ని కలవాలో జగదీష్ చెప్పడమేగాక స్వయంగా చాలా

మందిని పరిచయం చేశాడు. అందువల్లనే కొంత సులభమయ్యింది. పబ్లిసిటీకోసం పాంప్లెట్లు పంచిపెట్టడం, వాల్ పోస్టర్లు అంటించడం, అక్కడక్కడా నాలుగు రోడ్ల కూడళ్ళదగ్గర బానర్లు తగిలించడం, పత్రికల్లో ఎడ్వర్‌టైజ్ చేయడం వంటి వ్యవహారాలు రాజారాం, జగదీష్‌లు చేయించారు. ఫర్నిచర్ కొనుగోలు సంగతి సంధ్య, అహల్య భుజానవేసుకున్నారు. అనేక ఆలోచనలు చేసి చివరికి 'జ్ఞానభవన్' అని స్కూలుకి పేరు నిర్ణయించారు.

ఆరునుండి పదో తరగతివరకూ క్లాసులు.

ఏడు, పది తరగతులలో ఒక్క విద్యార్థి కూడా చేరలేదు. మామూలు పేపర్ద్వారా పబ్లిసిటీనే గాక ఇంటింటికి వెళ్ళి స్వయంగా చెప్పడంవల్ల ఆరో తరగతి పిల్లలు అతికష్టంమీద ఇరవైఒక్కమంది, ఎనిమిదో తరగతిలో పదకొండు మంది, తొమ్మిదో తరగతిలో ఏడుగురు చేరారు. విద్యార్థులకి ఏ ఎంట్రన్సూ లేదు. ఫీజు కడితే దున్నపోతులయినా పర్లేదు అన్నట్లుంది అందరికీ. ఏడు, పదీ తరగతుల్లో ఖాళీ బెంచీలు, నా కర్మింతేనా అన్నట్లున్న ఒక గీతయినా రాయని బ్లాక్‌బోర్డూ స్మితని వెక్కిరిస్తున్నట్లే అన్పించి సిగ్గుపడింది. తప్పదులే, స్కూలు పెట్టీ పెట్టగానే వందలకొద్దీ విద్యార్థులు కావాలంటే ఎలా వస్తారు. ఈ మాత్రం రావడమే గొప్ప. వీళ్ళందర్నీ శ్రద్ధగా పట్టించుకుని బాగా చదివించి, తెలివైనవారిగా తయారుచేసి మంచి రిజల్టు సాధిస్తే ముందు సంవత్సరం మరింత అభివృద్ధి చెందుతుంది. తర్వాత్తర్వాత ఒక్కో మెట్టూ ఎక్కచ్చు అనుకుంది స్మిత.

ప్రతి శనివారం మధ్యాహ్నం స్కూలయిపోగానే ఓ గంట ఆటలకి కేటాయించింది.

డ్రాయింగుతోబాటు సైన్సు తనే చెప్పసాగింది స్మిత. శరత్ తాను లెక్కలు చెప్తానన్నాడు. శరత్‌ది షిఫ్టు కాలేజ్ కాబట్టి పన్నెండింటికే ఇంటికొచ్చేస్తాడు. మూడే క్లాసులు కాబట్టి కాస్త ఫ్రిపేరయితే సోషల్ చెప్పడం కూడా కష్టం కాదనిపించింది శరత్‌కి. అహల్య ఎం.ఏ. ఇంగ్లీష్ లిటరేచర్ చేసింది. తన చదువెలాగో వృధా అవుతోందని ఇంగ్లీషు, తెలుగు తను చెప్తానంది. ఇక హిందీకి మాత్రం ఒక పండిట్‌ని పెట్టుకోక తప్పలేదు. మూడే క్లాసులు కాబట్టి పార్ట్‌టైం టీచర్‌గా అప్పాయింట్ చేశారు. ప్యూన్ అవసరం లేదన్పించింది.

బిల్డింగు రెంటూ, హిందీ పండిట్ జీతం, మరికొన్ని స్టేషనరీ ఐటమ్సు కొనడానికి అయ్యే ఖర్చూ కలిపి పదహారు వేలయ్యింది. ఆ సంవత్సరానికి. అహల్య, శరత్, స్మిత ఒక్క పైసా కూడా తీసుకోకుండా కష్టపడ్డారు. పిల్లల జీతాలు పదివేలకి పైగానే వచ్చాయి. డొనేషనంటూ పైసా తీసుకోలేదు. అదే అన్ని సబ్జక్టులకీ టీచర్లని నియమిస్తే ఇంకా చాలా డబ్బు అవసరమయ్యేది.

స్మిత తన పేరున తీసుకున్న లోను, హారతి అప్పుగా ఇచ్చిన డబ్బూ కలసి ముప్పయి అయిదు వేలయింది. అందులో ఎనిమిది వేలు ఫర్నిచర్ తీసుకున్నారు. ఏడువేలు పబ్లిసిటీ కోసం ఖర్చుచేశారు. పదహారువేలు అద్దె వగైరాలకి పోగా నాలుగువేలు మిగిలింది. వచ్చిన రాబడితో కలిపి సుమారు పధ్నాలుగూ పదిహేను వేలు వరకూ వుంది.

రెండో సంవత్సరం అహల్య తెలుగు తనవల్ల కాదని, ఇంగ్లీషు మాత్రమే చెప్తానంది. దాంతో మరో తెలుగు పండిట్‌ని నియమించవలసి వచ్చింది. శరత్ డిగ్రీ పూర్తయ్యింది. తాను అప్పుడే వుద్యోగం చేయననీ, ఎం.బి.ఏ. చేస్తాననీ అన్నాడు. కానీ తను కావాలనుకున్న యూనివర్సిటీలో సీటు రాలేదని చేయలేదు. క్రితం సంవత్సరంలాగే ఆ యేడు కూడా రెండు సబ్జక్టులూ చెప్పాడు. ఆ సంవత్సరం విద్యార్థులు మరో పాతికమందివరకూ పెరిగారు. వున్న డబ్బూ, వచ్చిన రాబడిలోంచి అయిన ఖర్చు తీసెయ్యగా ఎనిమిది వేలవరకూ మిగిలింది. ఆ రెండు సంవత్సరాలు అప్పు తీర్చడానికి పైసా కూడా కట్టలేదు. ఇంట్లో కూడా దమ్మిడీ ఖర్చు పెట్టలేదు.

ఇక మూడో సంవత్సరంనుండీ కాస్త పుంజుకుంది. సైన్సు తప్పించి తక్కిన అన్ని సబ్జక్టులకీ టీచర్లని నియమించింది. క్లర్కుని, ఒక ఆయాని, ఒక డ్రిల్ మాస్టర్ని కూడా పెట్టింది. అహల్యకి, శరత్‌కి కృతజ్ఞతలు చెప్పుకుంది. శరత్ ఆ ఏడు ఎం.బి.ఏలో జాయినయ్యాడు.

స్మిత కొంత అప్పు తీరుస్తూ, కొంత డబ్బు




ఇంట్లో ఖర్చు పెట్టగలుతోంది.

ఈలోపు ఒకటి రెండుసార్లు ఏవో సంబంధాలొచ్చాయని తల్లిదండ్రులు ఒప్పించడానికి చూశారు. కానీ స్మిత ఏవో సాకులు చెప్పి తప్పించుకుంది.

స్కూల్లో తీరికవేళల్లో పుస్తకాలు చదవడం, సాయంత్రాలు పెయింటింగ్ వేయడం అలా వాటుచేసుకుంది. స్కూలు దినదిన ప్రవర్ధమానం అవుతోంది. కష్టపడి పనిచేసే టీచర్లయితేనే నిలబడ్తున్నారు. చదువు చెప్పడాన్ని మొక్కుబడిగా భావించక బాధ్యతగా స్వీకరించే వాళ్ళని అభిమానించి, ప్రోత్సహిస్తోంది. స్కూలు మంచి ఫలితాలు సాధించడంతో పదిమందీ ప్రశంసిస్తున్నారు. క్రమంగా విద్యార్థుల సంఖ్యాపెరిగిపోయి బిల్డింగ్ మొత్తం అద్దెకి తీసుకోవలసి వచ్చింది.

మరో మూడేళ్ళు గడిచాయి. అప్పంతా తీరిపోవడమేగాక కొంత డబ్బు మిగిలింది. ఆ సంవత్సరం కాలేజీపెట్టాలని చర్చలు జరిపింది. కాలేజంటే మామూలు జూనియర్ కాలేజ్‌లాగాక అన్ని లలితకళలకి సంబంధించిన కోర్సులు, హాండీక్రాఫ్ట్స్, జర్నలిజం, హోంసైన్సు వంటి ప్రొఫెషనల్ కోర్సులన్నీ పెట్టాలని ఆమె ఆలోచన.

ఆమె ఆలోచన విన్నవారిలో దాదాపు అందరూ నవ్వారు. కలలు కనడానికి ఒక పరిమితి వుండాలన్నారు. కానీ స్మిత నిరుత్సాహపడలేదు. రైట్ బ్రదర్స్ ఏరోప్లేన్ కనిపెట్టకముందు ఒక యంత్రం పక్షిలా గాల్లో ఎగురుతుందని చెప్తే ప్రజలు పగలబడి నవ్వుంటారు. సామాన్యంగా కార్యరూపం ధరించని ఆలోచన అవనమ్మకంగా, అపహాస్యంగానే కన్పిస్తుంది. ఒక మనిషిని గురించి ఇతర్లు అంచనా వేసేటప్పుడు, వాళ్ళు అప్పటివరకూ చేసిన పనులు దృష్టిలో వుంచుకుంటారు. కానీ ఆ వ్యక్తి తనను గురించి తాను తన సమర్థతని బట్టి అంచనా వేసుకుంటాడు- అని ఏదో పుస్తకంలో చదివింది. నిజమే తనేమంత గొప్ప పనులు చేసిందని ఇతరులకి తనపై నమ్మకం ఏర్పడ్తుంది? ఇప్పుడు చేసి చూపి వాళ్ళ అంచనా తారుమారు చెయ్యాలి. ఎంత కష్టమయినా సరే తను అనుకున్నట్లే అనేక రకాలయిన ప్రొఫెషనల్ కోర్సులున్న కాలేజీ స్థాపించి, దాన్ని సమర్థవంతంగా నిర్వహించాలి. వీలయినంత తక్కువ ఫీజులుపెట్టి ప్రతిభావంతులయిన విద్యార్థులని సానబట్టిన వజ్రాల్లా తీర్చిదిద్దాలి అనే దృఢసంకల్పం కలిగిందామెలో.

కానీ స్కూలు పెట్టినంత సులువయిన పని కాదు ఆ రకపు కళాశాల తెరవడం అని త్వరలోనే గ్రహించింది. ఉన్న డబ్బుతో ఒకేసారి అన్ని కోర్సులూ ప్రారంభించడం సాధ్యంకాలేదు. గ్రాంటుకోసం అనేకమంది చుట్టూ అనేక పర్యాయాలు తిరగవలసివచ్చింది. ఆ కాలంలో పెయింటింగ్ గురించి ఆలోచించడానికి కూడా సమయం దొరకలేదు. గంటలు సెకన్లలా దొర్లిపోతున్నట్లు, కాలం మరీ వాయువేగంతో పరిగెడుతున్నట్లూ అన్పిస్తోంది.

తను మరీ మోయలేని భారం నెత్తిన వేసుకున్నానా అని కొన్నిసార్లు అన్పించినా అంతలోనే అనేకమంది మహనీయులతో పోల్చుకుని ఈపాటి చేయలేకపోతే జీవితమే వ్యర్థం అని సమాధానం చెప్పుకుంది. రోజుకి ఇరవై గంటలపైన పనిచేసిన వారితో పోల్చుకుంటే తనేం కష్టపడ్తోంది అనుకుంది.

ఆ సంవత్సరం జ్ఞాన్‌భవన్ ఆవరణలోని ఖాళీ ప్రదేశంలో ఆమె కోరిక ప్రకారం ఆ బిల్డింగ్ ఓనర్ మరో షెడ్ నిర్మించాడు. స్కూలు షెడ్‌లోకి మార్చి అసలు భవనాన్ని కాలేజీగా మార్చింది. రెండో సంవత్సరంలో అన్ని కోర్సులూ చేటుచేసుకున్నాయి. ఆయా వృత్తుల్లో నిష్ణాతులయినవారిని గురువులుగా నియమించింది. ఇప్పుడు స్మిత ఏ సబ్జక్టూ బోధించడం లేదు. ప్రిన్స్‌పాల్‌గా వుండి తన విధి సమర్థవంతంగా నిర్వహిస్తోంది.

జగదీష్‌కి ప్రొఫెసర్‌షిప్ వచ్చిన కారణాన్ని పురస్కరించుకుని ఒక ఆదివారం రోజు చిన్న పార్టీ అరేంజ్ చేసుకున్నారు. దగ్గరి వాళ్ళందర్నీ పిలిచారు. శిరీష, ఆమె భర్త కూడా పూర్నుండి వచ్చారు. చాలా కోలాహలంగా వుంది. ఆడ, మగ, చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా అంతా ఒకరిపై ఒకరు చమత్కారాలు విసురుకుంటూ సంతోషంగా వున్నారు, భోజనాలయ్యాయి.

వచ్చిన వాళ్ళలో కొందరు స్మిత పెళ్ళి గురించి అడిగారు. అన్నివిధాలుగా స్థిరపడిన ఆమె పెళ్ళికి ఆటంకమేమిటని ప్రశ్నించారు.



సరయిన కారణం చెప్పలేక సంధ్య సతమత మైపోయింది. తండ్రి మౌనం వహించి దిగులుగా కూర్చున్నాడు.

''అసలు పెళ్ళి గురించి నువ్వేం అనుకుంటున్నావు స్మితా?!'' అన్నాడు జగదీష్.

''... ...''

''చెప్పవేం? అసలు చేసుకోవా?''

''ఇప్పట్లో ఆ వుద్దేశం లేదు''

''ఇప్పటికే ముప్పయ్యేళ్ళు దాటాయి. ఇంకెప్పుడు, పళ్ళూడి, తెల్ల జుట్టొచ్చాక చేసుకుంటావా?'' అంది అహల్య.

స్మిత నవ్వింది ఏమీ అనకుండా.

''ఎవర్నయినా చూడమంటావా?'' మళ్ళీ అహల్యే అంది.

''అత్తయ్యా... దాపరికం లేకుండా నా సంగతంతా చెప్పాను. అతన్ని నేను పూర్తిగా మర్చిపోయినప్పుడే చేసుకుంటాను''

''అప్పుడు నువ్వు చేసుకుందామన్నా నిన్నెవరూ చేసుకోరు''

''అయితే నష్టమేం లేదుగా''

''నీకు లేకపోవచ్చు. కానీ చూసేవాళ్ళంతా మమ్మల్నంటారు''

''ప్లీజ్ అత్తయ్యా! ఈ ఒక్క విషయంలో మాత్రం నామాట వినండి. పెళ్ళి అవసరమ న్పిస్తే నా పెళ్ళి నేను చేసుకుంటాను. ఈ విషయంలో మీకు కష్టం కలిగిస్తే క్షమించండి. కానీ నేనేం చేయలేను'' అని అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

మరో రెండు సంవత్సరాలు గడిచిపో యాయి. శరత్‌కి మద్రాసులో వుద్యోగమొచ్చి అక్కడికి వెళ్ళిపోయాడు. వెళ్ళిన సంవత్స రంలోపే ఒక తమిళ యువతిని తీసుకొచ్చి ఆమెనే చేసుకుంటానని చెప్పాడు. రాజారాం, సంధ్యలు అయిష్టంగానే ఒప్పుకున్నారు. శరత్ రిజిష్టర్ మారేజ్ చేసుకుని తిరిగి వెళ్ళిపోయా డు.

స్కూలు, కాలేజీ కూడా బాగా అభివృద్ధి చెందాయి. ఇప్పుడు విద్యార్థులకేం కొదవలే దు. ఏదో ఒక లలితకళలో ఆసక్తి గలవారికే జ్ఞాన్‌భవన్‌లో ప్రవేశం లభిస్తోంది.

స్మిత తీరికసమయాన్నంతా మంచి పుస్తకా లు చదవడానికీ, పెయింటింగ్ వేయడానికీ వినియోగిస్తోంది. కవిత్వం వ్రాయడం మానే సింది. దాన్ని పెద్ద సీరియస్ విషయంగా తీసుకోలేదామె. దాదాపు పురాతన కట్టడాలన్ని టినీ తన చిత్రలేఖనంలో బంధించింది. వాటిని చూస్తుంటే అందులో పరోక్షంగా హుస్సే న్నే చూస్తున్నంత పరవశం కలుగుతోంది. ఆమె ముఖంలో వింత కాంతి ఒకటి చోటుచేసు కుంది.

ఆరోజు స్మిత స్కూలుకి బయల్దేరుతుంటే ఉధృతంగా వర్షం పడుతోంది. రెయిన్‌కోట్ తొడుక్కుంటున్న కూతుర్ని చూసి ''బాగా వర్షం పడ్తోంది. ఈవేళ్టికి వెళ్ళకపోతేనేం?'' అంది సంధ్య.

''ఆ ఏమంత వర్షంలే?'' అంది స్మిత.

న్యూస్‌పేపర్ చదువుతున్న తండ్రి ''ఒకరి కింద చేసే వుద్యోగమయితే ఎండయినా, వాన యినా భయపడుతూ వెళ్ళాలి. ఈవేళ్టికి మానే స్తే ఏం పోతుందమ్మా?'' అన్నాడు.

''నేను పాటించని నియమాలు ఇంకొకరికి చెప్పలేను. ఆటోలో ఎంతసేపు వెళ్తాన్లే నాన్నా?'' అంది స్మిత.

''మొండిది, తను అనుకున్నది తప్ప ఇంకె వ్వరు చెప్పిందీ వినదు'' అంది సంధ్య.

''గాంధీజీ కూడా మొండితనంతోనే పైకొచ్చా డు తెల్సా?''

''ఆఁ ఆయన ఇలాంటి అల్పవిషయాల్లో మొండితనం చూపలేదు'' అంది తల్లి.

స్మిత నవ్వుతూనే చెప్పులు తీసుకుని బయ టికొచ్చేసింది. చాలా దూరం ఆటో దొరకలేదు. ఆటో జ్ఞాన్‌భవన్ ముందు ఆగేసరికి పావుగంట ఆలశ్యం అయ్యింది.

స్టాఫంతా ఎవరి క్లాసులకి వాళ్ళు వెళ్ళిపో యారు. ప్యూన్ మునగదీసుకుని ఆఫీస్ రూం బయట బెంచీమీద కూర్చున్నాడు. స్మిత తన పనులేవో చూసుకుంది. ఒకసారి రౌండ్స్‌కి వెళ్ళొ చ్చింది. వర్షమింకా పడుతూనేవుంది.

''నారాయణా! కాఫీ తెచ్చిపెట్టు'' అంది.

అతడు కొద్దిసేపట్లో కాంటిన్నుండి ఫ్లాస్కుతో కాఫీ తెచ్చి, కప్పులోకి వంపి ఇచ్చాడు.

కాఫీకప్పు పట్టుకుని కిటికీ దగ్గర నిలబ డింది స్మిత. కిటికీలోంచి రకరకాల పూల మొక్కలు అందంగా కన్పిస్తున్నాయి. రంగు రంగుల పూవులు వర్షానికీ, గాలికీ అల్లల్లాడు తుంటే ఆమెకి తన్మయంగా అన్పించింది. అంతలోనే గతస్మృతి ఒకటి కళ్ళముందు నిలి చింది.

ఒకరోజు జోరున వర్షం కురుస్తోంది. తాను బాల్కనీలో కుర్చీవేసుకుని కూర్చుంది. పైన స్లాబ్ వుండడం వలన బాల్కనీ తడవదు. హుస్సేన్ తన గదిలో కూర్చుని తననే చూస్తు న్నాడు. కానీ గదిలోంచి చూస్తే ఒకరికొకరు స్పష్టంగా కనిపించరు. అతడు చటుక్కున లేచి గొడుగు పట్టుకు బయటికొచ్చాడు. అలా నిలబడి తననే చూడసాగాడు. స్మితకి చెప్పలే నంత ఆనందమేసింది. ఆ క్షణంలో అతన్ని గాల్లో గిరగిరా తిప్పాలన్నంత ఆవేశం కలి గింది. కానీ అతని అవస్థని చూడలేక, ఆ సమయంలో అక్కడికి తల్లి వస్తే ఆ సన్నివేశం కాస్తా రసాభాసమై, దుఃఖపూరితమవుతుందని లోపలికి వెళ్ళిపొమనీ, జలుబుచేస్తుందనీ సైగ చేసింది. అయినా హుస్సేన్ లెక్కచేయకుండా చాలాసేపు నిలబడి చివరికి గదిలోకి వెళ్ళాడు. స్మిత 'వ్వేవ్వేవ్వే' అంటూ వెక్కిరించి నవ్వింది. అతడు ''జిందగీ భర్ నహీ భూలేంగే' యె బర్‌సాత్‌కి రాత్' అనే పాట పెద్ద సౌండుతో

పెట్టాడు. ఇద్దరూ నవ్వుకున్నారు. అప్పట్నుండీ ఆమెకి మరింత ఇష్టమయింది అతడంటే.

స్మిత నవ్వుకుంది. అతనింతవరకూ పొరపాటున కూడా ఎక్కడా కన్పించలేదు. తనూ అతని గురించి ఎవర్నీ వాకబు చేయలేదు. హుస్సేన్ ఇప్పుడెలా వున్నాడో. బహుశా ఇద్దరు ముగ్గురు పిల్లలు పుట్టి వుంటారు. భార్యా పిల్లలమధ్యలో తమ ప్రేమకథ ఎప్పుడో మరిచిపోయి వుండాలి. కానీ తానెందుకు మర్చిపోలేక పోతోంది? దానికి సమాధానం దొరకక ముందే ప్యూన్ పిలిచాడు?''

''అమ్మా! ఎవరో వచ్చారు, లోపలికి పంపాలా?''

''ఆఁ రమ్మని చెప్పు''

సుమారు ముప్పయ్యేడేళ్ళ వ్యక్తి ముఖాన చిరునవ్వుతో, ఒక పాపని వెంటబెట్టుకుని వచ్చాడు.

''నా కూతురు, ఆరో తరగతిలో జాయిన్ చేద్దామని...'' ఇంగ్లీషులోనే చెప్పాడు.

స్మిత మామూలుగా మాట్లాడ్తూనే పాపని ఇంటర్వ్యూచేసింది. అంతా అయిపోయాక ఎకౌంటెంట్‌ని పిలిపించి పేరు ఎంటర్ చేసుకుని, ఫీజు కట్టించుకోమని చెప్పింది.

''మేడమ్! మిమ్మల్నెక్కడో చూసినట్లుంది'' అన్నాడతను.

స్మిత పరిశీలనగా చూసి, ''మనిషిని పోలిన మనిమండచ్చు. నేను మిమ్మల్నెక్కడా చూసినట్లు లేదు'' అంది.

కాస్తాగి ''మీ పేరేంటి?'' అని అడిగింది.

''అంతా ప్రాణ్ అంటారు గానీ, అసలు పేరు నవప్రాచీన్''

స్మిత ముఖంలో సన్నగా నవ్వు, ''ఇప్పుడు గుర్తొచ్చింది. ఒకసారి కళాభవన్‌లో హరనాథ్‌గారు పరిచయం చేశారు. ఆ తర్వాత కూడా రెండుమూడుసార్లు కలిశారు. నాకు సామాన్యంగా అందరూ గుర్తుండరు. చాలా పరిచయం వుంటే తప్ప అందరి మొహాలూ ఒకేలా అన్పిస్తాయి. మీ పేరెందుకో నాకు చాలా తమాషాగా అన్పించింది. ఇప్పటికీ మీ పేరు కాస్త వింతగానే అన్పిస్తోంది, క్షమించండి''

''ఇందులో క్షమించడానికేముంది? మా నాన్నగారికి సంస్కృత, ఆంధ్రభాషలమీద మంచి కమాండ్ వుంది. కొత్తపాతల కలయిక అనే అర్థంలో నాకీపేరు పెట్టారట. కానీ ఎవరూ ఆ పేరుతో పిలవరు. ప్రాచీన్‌ని కుదించి ప్రాణ్ అంటున్నారు'' అంటూ గలగలా నవ్వేశాడు. ఆ నవ్వు సెలయేరులా వుంది.

ప్రాణ్ వెళ్ళబోతూ, ''పాపని రేపట్నుండీ స్కూలుకి పంపుతాను మేడమ్! వర్ణ గురించి మీరు కాస్త పట్టించుకుంటూ వుండండి. వాళ్ళ మదర్ చనిపోయాక లోన్‌లీగా ఫీలవుతోంది. పాత స్కూల్లో పిల్లలు రకరకాలుగా టీజ్ చేస్తున్నారని ఏడుస్తుంటే మీ స్కూలు గురించి విని ఇక్కడికి తీసుకొచ్చాను'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

అంత చిన్నవయసులో తల్లి లేకపోతే ఎంత దయనీయంగా వుంటుందో వూహించిన స్మిత వర్ణ పరిస్థితికి జాలిపడింది.

రోజూ వీలవ్వకపోయినా తరచు వర్ణని మాట్లాడించడం, దగ్గరికి తీసుకోవడం మొదలుపెట్టింది స్మిత. వీలయినంతవరకూ ఇతర పిల్లలకి అది వింతగా కన్పించకుండా జాగ్రత్త పడింది. వర్ణకి కూడా స్మిత పట్ల భయం తగ్గి ప్రేమ, చనువు ఏర్పడ్డాయి.

ప్రాణ్ ప్రతిరోజూ వర్ణని దింపి వెళ్ళేవాడు. సాయంత్రాలు మాత్రం పనిమనిషి వచ్చి వర్ణని తీసికెళ్ళేది. అతనికి తీరికదొరికి స్మిత కూడా బిజీగా లేనట్లనిపిస్తే కొంతసేపు మాట్లాడి వెళ్తున్నాడు. కొద్దికాలంలోనే ప్రాణ్‌పట్ల స్మితకి సదభిప్రాయం ఏర్పడింది.

ఆరోజు వర్ణని క్లాస్‌రూంలోకి పంపి ప్రాణ్ స్మితకోసం ఆఫీస్ రూంలో కొచ్చాడు.

''హలో, ఎలా వున్నారు?'' అంది స్మిత.

''బాగున్నాను... వర్ణ ఎప్పుడూ మీ గురించే చెప్తుంటుంది. ఇది వరలో అదెప్పుడూ దిగులుగా కన్పించేది. ఇప్పుడు చాలా సంతోషంగా వుంటోంది. అమ్మా, నాన్నా కూడా అదే అంటున్నారు చాలా థాంక్స్''

''ఇందులో నన్ను పొగడాల్సిందేమీ లేదు. ఈ వయసులో పిల్లలకి తల్లెంతో అవసరం. ఆ లోటు ఎవరూ తీర్చలేరు. కాస్త ఆత్మీయంగా మాట్లాడ్తున్నానంతే'' అంది స్మిత.




''అది కోరుకుంటోంది కూడా ఆ ఆప్యాయతే. సరే... ఈరోజు సాయంత్రం మీకు తీరిక వుంటుందా, నా పెయింటింగ్స్ ఎగ్జిబిట్ చేస్తున్నాను'' అంటూ ఇన్విటేషన్ కార్డు తీసి ఇచ్చాడు.

స్మిత కార్డు తీసుకుని వస్తానని చెప్పింది.

''మీకోసం చూస్తుంటాను'' అని ప్రాణ్ వెళ్ళిపోయాడు.

స్మితకి ఇదివరలో అతని గురించి పెద్దగా తెలీదు. ఒక ఆర్టిస్టుగా హరనాథ్ పరిచయం చేశారంతే. ఈరోజు- అతని పెయింటింగ్స్ చూస్తూంటే ఆమెకి చాలా ముచ్చటేసింది. ఇంత సింపుల్‌గా వుండే ఈ నవప్రాచీన్ ఇంత సమర్థుడా, ఇంత ప్రతిభావంతుడా అని ఆశ్చర్యపోయింది. మనసారా మెచ్చుకుంది. ఆవేళ ప్రాణ్ చూపులు ఆమెకి వింతగా అనిపించాయి. ఇంటికెళ్ళాక కూడా అతని చూపులు తనను వెంటాడినట్లే అన్పించింది.

ప్రాణ్ స్మితకి తరచు ఏవో కొత్తకొత్త పుస్తకాలు తెచ్చి చదవమని చెప్పడం, కొన్నిసార్లు తనదగ్గర లేని పుస్తకాలు ఆమెని అడిగి తీసికెళ్ళడం, కళ గురించి, కళాకారుల గురించి చర్చించడం, వర్ణగురించి చెప్పడం, ఒక్కోసారి మామూలు లోకాభిరామాయణం మాట్లాడుకోవడం ఇలా సాగుతోంది.

వర్ణ ప్రతిరోజూ ఒక గులాబీ పువ్వుతెచ్చి ఇస్తోంది. స్మిత సంతోషంగా అందుకుని, ఆమె బుగ్గమీద సుకుమారంగా గిల్లి ముద్దుపెట్టుకుంటోంది. ఒకరోజు వర్ణ వెళ్తుంటే స్మిత తమాషాగా వర్ణని పిలిచి ''నా పువ్వేది?'' అని అడిగింది.

''ఈరోజు డాడీ లేరుకదా, , బెంగుళూరు వెళ్ళారు'' అంది వర్ణ.

స్మిత ఆశ్చర్యంగా చూసి, ''డాడీ లేకపోతే ఇవ్వవా'' అంది.

''మా ఇంట్లో రోజ్ ప్లాంట్స్‌లేవు. డాడీ రెండు పూలు మనిద్దరికోసం తెచ్చి, ఫ్రిజ్‌లో పెడ్తున్నారు'' అంది వర్ణ.

''సర్లే... క్లాసుకెళ్ళు'' అని కంగారుగా చుట్టూ చూసింది స్మిత, ఎవరయినా విన్నారేమోనని. ఆమె మనసునిండా ఆలోచనలు మొదలయ్యాయి. ప్రాణ్ తనపట్ల ఆకర్షితుడయ్యాడా? అతనంటే తనకి మంచి అభిప్రాయం కలిగింది. కానీ తన గతం అతనికి తెలీదు. ఇదెందుకిలా జరుగుతోంది? అంతకుమించి స్మిత ఇంకేం ఆలోచించలేదు. అదే ఆమెలో. వచ్చిన ముఖ్యమైన మార్పు. పూర్వం అతిచిన్న విషయాల గురించి నరాలు చిట్లిపోతాయేమో అన్నట్లు ఆలోచించేది. కానీ ప్రస్తుతం అత్యవసరమయిన విషయాలు తప్ప అల్పవిషయాలనుకున్నవాటికి ప్రాధాన్యత ఇవ్వడంలేదు. ఆలోచన తక్కువ, ఆచరణ ఎక్కువ వుండాలని విశ్వసిస్తోంది.

తర్వాత రెండుమూడుసార్లు ప్రాణ్ కనిపించినా ఆ పువ్వు సంగతి తనకి తెలియనట్లే మాట్లాడింది స్మిత. ప్రిన్సిపాలన్న గౌరవం వర్ణలో కలిగించడానికి ఇప్పించివుండచ్చు. పాపని శ్రద్ధగా పట్టించుకుంటోందన్న కృతజ్ఞతతో కావచ్చు. లేదా సామాన్యంగా పురుషులకుండే స్త్రీ వ్యామోహం కావచ్చు అనుకుంది. అతన్ని చూస్తే వెకిలి వేషాలు వేసే వ్యక్తిలా కనిపించడు. గౌరవించదగ్గ సంస్కారవంతుడిలా వుంటాడు.

కోలముఖం, సన్నటి మీసాలు. మిలమిల మెరిసే కళ్ళు. నవ్వకపోయినా నవ్వుతున్నట్లు కనిపించే పెదాలు. నువ్వు గొప్ప కళాకారుడివని నేమాత్రం అప్పుడే సర్టిఫై చేయనంటూ బట్టతల వెనకడుగు వేసింది. చామనచాయగా వుంటాడు. ఇన్‌షర్ట్ చేసుకుని మనిషి హుందాగా, నిండుగా వుంటాడు.

ఒకరోజు వర్ణని క్లాస్‌రూంలో దించి ప్రాణ్ ఆఫీసుగదికొచ్చాడు. స్మిత పలకరించి కూర్చోమంది.

''ఎలా చదువుతోంది వర్ణ?''

''రిపోర్ట్ చూశ్ళేదా? సబ్జక్ట్ విషయంలో కాస్త డల్‌గానే వుంది గానీ డ్రాయింగ్స్ మాత్రం బాగా వేస్తోంది''

''పోన్లెండి, గొప్పగా చదివినవాళ్ళు మాత్రం ఏం చేస్తున్నారు? ఆర్ట్‌లో పైకొస్తే అదే చాలు''

''మీతో పూర్తిగా అంగీకరించలేను. ఇప్పటి సమాజంలో చదువుకూడా అవసరమే. డిస్టింక్షన్లూ, ఫస్టుక్లాసులు కాకపోయినా కనీసం డిగ్రీవరకయినా పాసవ్వాలండీ''

''టాగూర్ ఏం చదివాడు?'' నవ్వాడు ప్రాణ్.

''అయితే అంత ఆస్తిదాస్తున్నారా మరి?''

''నా మాటలు సీరియస్‌గా తీసుకోకండి. మీ అభిప్రాయాలు తెలుసుకోవాలని అన్నాను. వర్ణతో నేనూ అదే చెప్తాను. చదువు లేకపోయాక ఎవరు గౌరవిస్తారు చెప్పండి?'' అన్నాడు ప్రాణ్.

''నిజమే... కంపల్సరీ ఎడ్యుకేషన్ సిస్టమ్ అమలు చేస్తే తప్ప మనదేశం బాగుపడదు. నూటికి తొంభైమందికి చదువంటే శ్రద్ధలేదు''

''అంతా చదువుకుని తెలివిమీరిపోడాన్ని మన కుళ్ళు రాజకీయవేత్తలు సహిస్తారా? మన దేశానికి అంత అదృష్టమా?''

స్మిత బదులేం చెప్పలేదు.

''అన్నట్లు రేపు వర్ణ పుట్టినరోజు. మీరు తప్పక రావాలి''

''రేపు సండే కదూ, ఎక్కడికో వెళ్ళాలనుకున్నాను''

''వెళ్తే పగలు వెళ్ళండి, సాయంత్రం ఇంటికి రండి''

''తప్పదా?'' అంది స్మిత నవ్వుతూ

''ఉహూ తప్పదు. మీ స్టూడెంట్ అలుగుతుంది''

''అదసలు నన్ను పిలవనేలేదు, ఎలా అలుగుతుంది'' నవ్వింది.

''అది మిమ్మల్నే ముందు ప్రపోజ్ చేసింది. నమ్ముతారో లేదో మీ గురించి చెప్పడానికి దానికి టైమ్ సరిపోదు''

స్మిత నవ్వి, ''పిల్లల అభిమానం సంపాదించడం తేలిక. పెద్దల్లో వుండే కుళ్ళూ, కుచ్చితాలు వారిలో వుండవు కదా'' అంది.

అతను కూడా నవ్వేసి, జేబులోంచి విజిటింగ్ కార్డ్ తీసి ఇచ్చాడు.

అందులో పేరు పక్కన ఆర్ట్‌డైరెక్టరని డిజిగ్నేషన్ చూసి,

''ఏ సినిమాలు డైరెక్ట్ చేశారండీ?'' అని అడిగింది.

''కమర్షియల్ సినిమాలు ఒకటి రెండు తప్ప చేయలేదు. ఆర్ట్ మూవీస్, డాక్యుమెంటరీస్ చాలా చేశాను'' అన్నాడు.

మరికొంతసేపయ్యాక అతను లేచి ''మా ఏరియా తెల్సా? సంజీవరెడ్డినగర్, అమీర్‌పేట దగ్గర, కష్టమేం కాదులెండి'' అంటూ వెళ్ళిపోయాడు.

చాలా నిరాడంబరంగా వుంటాడు. వర్ణని అల్లారుముద్దుగా చూసుకుంటాడు. చూట్టానికి చాలా మంచి వాడిలాగే వుంటాడు. అయినా పుట్టినరోజు ఏమంత పెద్ద అకేషనని? అదోవంక చేసుకుని పిలవడం తప్ప. అసలు అతను ఎలాంటివాడు? ఏ వుద్దేశంతో తనని పిల్చాడు? వెళ్ళాలా, అక్కర్లేదా? వెళ్ళనంతలో జరిగే నష్టమేముంది- అనుకుంది.

లంచ్ బ్రేక్‌లో స్ప్రింగ్‌డోర్ దగ్గర నిలబడి ''ఎక్స్‌క్యూజ్‌మి మేడం'' అంది వర్ణ లోనికి తొంగిచూస్తూ.

పేపర్ చదువుతున్న స్మిత తలెత్తకుండానే 'గెటిన్' అంది.

వర్ణ ఆమె పక్కకొచ్చి నిలబడింది.

స్మిత తలెత్తి ''ఏం వర్ణా?! ఏం కావాలి?'' అంది.

''మేడం! రేపు మీరు మా ఇంటికి రావాలి, ప్లీజ్ వస్తారుగా''

''ఎందుకు?'' అంది స్మిత తెలియనట్లు.

''ఇప్పుడు చెప్పను. మా అమ్మ ఎలానూ రాదుగా'' అంది జాలిగా.

ఆమె జాలికళ్ళని, పొంగిపొరలే ఆప్యాయతనీ చూసిన స్మిత కాదనలేకపోయింది.

''తప్పకుండా వస్తాను. మరి నాకేం పెడ్తావు?''

''ఇప్పుడు చెప్పను'' అనేసి పరిగెత్తింది వర్ణ.

★ ★ ★

మధ్యాహ్నం టీవీలో కన్నడ సినిమా వస్తోంది. సంధ్య ఇంకా వంటింట్లోనే అవస్థలు పడుతోంది. రాజారాం ఒక్కడే కూర్చుని టీవీ చూస్తున్నాడు. స్మిత తలంటుకుని జుట్టు ఆర్పుకుంటోంది. ''సంజీవ్‌రెడ్డినగర్ వెళ్ళాలి. కానీ ఎలా? ఒక్కతే వెళ్ళాలా? అతని ఇంటి వాతావరణం ఎలా వుంటుందో? కొన్ని వెకిలి సినిమాల్లో చూపిస్తున్నట్లు లోపల ప్రవేశించగానే తననేదో చేస్తాడనే పిచ్చి వూహలు లేకపోయినా అభిమానం దెబ్బతినడానికి అసభ్యకరమయిన మాటలు చాలవా? అనుకుంది.

'ఛ... తనేంటి మరీ ఇంత చాదస్తంగా




ఆలోచిస్తోంది. వుడికిందో లేదో చూడ్డానికి అన్న మంతా పట్టిచూడాలా? ఇన్ని నెలలుగా చూస్తోంది. సభ్యతా, సంస్కారం తప్పి ఎన్నడూ ప్రవర్తించలేదు. పైగా వూరుపేరూ లేనివాడు కాదు. మంచి ఆర్టిస్టు. తన ఆలోచనే వక్రంగా వుందిరోజు అనుకుంది'

భోజనం చేసి, కొంతసేపు పడుకుంది. లేచే సరికి సంధ్య నిద్రపోతోంది. స్మిత టీ పెట్టి తనకి, తండ్రికీ కప్పుల్లో వంపి, సంధ్యకి ఫ్లాస్కులో పోసింది.

టీ తాగి తయారవుతుండగా సంధ్య లేచింది. తల్లికి విషయం చెప్పింది. ఆవిడ త్వరగా వచ్చేయమంది.

అలాగేనని తలూపి బయల్దేరింది.

ప్రాణ్ చెప్పినట్లే ఇల్లు తేలిగ్గానే దొరికింది.

ఇంటి ముందంతా విశాలమయిన ప్రదేశం. అక్కడక్కడా పూల మొక్కలున్నాయి. కాంపౌండ్ గోడ పక్కగా మామిడి, జామవంటి చెట్లున్నాయి. చూడగానే ఆహ్లాదకరంగా అన్పించింది.

స్మిత కాలింగ్‌బెల్ నొక్కాల్సిన అవసరం లేకుండా ఇంటి తలుపు కూడా తెరిచి వుంది. అందరూ కొత్త వ్యక్తులే. స్మిత బిక్కుబిక్కుమని చూస్తుంటే వర్ణ పరుగున వచ్చి 'గుడీవినింగ్ మేడం' అంది.

స్మిత బర్త్‌డే విషెస్ చెప్పి ఒక గిఫ్ట్‌పాకెట్ వర్ణ చేతిలో పెట్టింది.

''అరే మీకు ముందే తెల్సిపోయిందా, ఆఁ డాడీ చెప్పుంటారు'' అంది వర్ణ గొప్ప సత్యం కనిపెట్టినట్లు, చూపుడు వేలుతో చూపిస్తూ.

లోపల్నుండే ప్రాణ్ వచ్చి ''కూర్చోండి'' అన్నాడు.

అతడు లోపలికెళ్ళి ఇద్దరు పెద్దవాళ్ళని వెంటబెట్టుకొచ్చి ''ఈవిడ మా అమ్మ, ఈయన మా నాన్నగారు'' అని పరిచయం చేసి ''ఈవిడే జ్ఞాన్‌భవన్ ప్రిన్స్‌పాల్'' అన్నాడు వాళ్ళతో.

అతని తల్లి ''నా మనవరాలు ఎప్పుడూ మీ నామస్మరణే చేస్తుంటుందమ్మా, తల్లిలేని పిల్ల కదా'' అంది.

''ఇంత చిన్నవయసులో తల్లిపోతే చాలా కష్టం'' అంది స్మిత.

తర్వాత పెద్దావిడ లోపలికెళ్ళిపోయింది. ముసలాయన 'ఎక్కడుంటారు, తండ్రి ఏంచేస్తారు?'' లాంటి కుశల ప్రశ్నలు వేశాడు.

స్మిత తలచిన దానికీ, చూసిన దానికీ పోలికే లేదు. ఆ ఇంటి వాతావరణం, వ్యక్తులు ఆత్మీయంగా, ఆహ్లాదంగా అన్పించింది.

''ఎక్కువమందిని పిలిచినట్లు లేరు?'' అంది స్మిత.

''మిమ్మల్ని తప్ప ప్రత్యేకించి ఎవర్నీ పిలవలేదు. వాళ్ళంతా మా దగ్గరి బంధువులు. కాజువల్‌గా విష్ చేసిపోదామని వచ్చారు. ఈ చుట్టుపక్కల పిల్లల్ని మాత్రం వర్ణ పిలిచింది'' అన్నాడు ప్రాణ్.

''అయితే ఛీఫ్‌గెస్ట్ నేనేనన్నమాట'' నవ్వింది స్మిత.

అతను కూడా నవ్వి ''నా స్టూడియో చూద్దురుగాని రండి'' అన్నాడు. మరోసారి హరనాథ్ ఇంటిని గుర్తుతెచ్చేలా వుంది. కానీ ఇది మరీ అస్తవ్యస్తంగా, చిందరవందరగా వుంది. రకరకాల మేగజైన్లూ, పేపర్లూ, ఆయిల్ పెయింట్సూ, బ్రషెసూ, పెన్సిళ్ళూ, పెన్నులూ, వర్ణ ఆటవస్తువులు ఇవీ అవీ అని లేకుండా అన్నీ కలగలసి వున్నాయి.

''ఏంటండీ అన్నీ అలా పడేశారు?''

''శకుంతల దగ్గర, అదే కణ్వముని ఆశ్రమంలో జింకలూ, పులులూ కూడా కలసి సావాసం చేసేవట. ఇవి కూడా వస్తుభేదం లేకుండా కలిసుంటున్నాయి'' నవ్వాడు.

''కానీ ఇలా వుంటే అవసరానికి ఏ వస్తూవూ దొరకదుగా?''

''అలవాటయిపోయింది. ఇలా వుంటేనే సులువుగా కన్పిస్తాయి. మా అమ్మ, నా భార్య కూడా చెప్పి విసిగిపోయారు''

''మొత్తానికి అసలయిన ఆర్టిస్టు ఇల్లులా వుంది. ఎక్కడ పడితే అక్కడ రకరకాల రంగులు కింద పడిపోయి గమ్మత్తుగా వున్నాయి''

ప్రాణ్ నవ్వి ''ఈవిడ నా భార్య'' అన్నాడు ఒక పోర్ట్రెయిట్ చూపి. అందంగా ఆకర్షణీయంగా వుంది.

''మీది లవ్ మేరేజా?'' అంది.

ప్రాణ్ తలూపి ''మీకెందు కన్పించిందలా?'' అన్నాడు.

''సిక్స్త్ సెన్స్'' అంటూ నవ్వేసింది.

ఇద్దరూ హాల్లో కొచ్చారు. ఎవరో ఒకావిడ ఒక ప్లేటులో గులాబ్ జాం, మిక్చర్, ఐస్క్రీం కప్పు పెట్టుకు తెచ్చి ఇచ్చింది.

వర్ణ ''మేడం మీరిచ్చిన బొమ్మ చాలా బాగుంది'' అంది.

స్మిత ఆమె బుగ్గగిల్లి నవ్వింది.

ప్రాణ్ ఎప్పటికంటే చాలా వుత్సాహంగా కనిపించాడు. ఏవేవో మాటలు గలగలా మాట్లాడేస్తున్నాడు. తనకు తెలిసిన ఆర్టు గురించి, తను చూసిన సినిమా ప్రపంచం గురించి, సినీ ఇండస్ట్రీలో ఎంత నిజాయితీ వుందో అన్నీ ఒక క్లోజ్ ఫ్రెండుతో మాట్లాడినట్లు చెప్తున్నాడు.

''అసలు మీ భార్యెలా చనిపోయారు?''

బాధతో అతను వెంటనే మాట్లాడలేకపోయాడు.

''సారీ... మిమ్మల్ని డిస్టర్బ్ చేశానా? ఇప్పుడొద్దులెండి. ఇంకోసారి చెబుదురుగాని'' అంది స్మిత నొచ్చుకుంటూ.

''వర్ణ పుట్టిన రెండుసంవత్సరాలకి ప్రెగ్నెన్సీ వచ్చింది తనకి. అప్పట్లో వాళ్ళ నాన్నగారు చనిపోయారు. ఆ దిగులు మనసులో పెట్టుకుని మేమెంత చెప్పినా తిండి సరిగా తినేది కాదు. మందులు వేసుకునేది కాదు. అస్థిపంజరంలా తయారయింది... డెలివరీ కష్టమై పిల్లా తల్లీ ఇద్దరూ...'' గద్గదంగా వుంది అతని స్వరం.

''అయ్యో, అలాగా. ప్రాణ్‌గారూ! రియల్లీ అయాం వెరీ సారీ, గుర్తుచేసి బాధించినట్టున్నా''

''మర్చిపోతేకదా, గుర్తుచేయడానికి''

కొంతసేపు ఇద్దరూ మౌనంగా వుండిపోయారు.

ప్రాణ్ తల్లివచ్చి ''తినవేంటమ్మా?'' అని ''ఏరా, ప్రాణ్! తిననీయకుండా కబుర్లు చెప్తున్నావా?'' అంది.

కొంతసేపట్లో కూల్‌డ్రింక్ పంపారు.

ఇక వెళ్తానంటూ లేచింది స్మిత. భోజనం చేసి వెళ్ళమని పదేపదే అన్నారు అతని తల్లిదండ్రులు. అప్పటికే ఆలస్యమైందని చెప్పి స్మిత బయల్దేరింది.

ప్రాణ్ రోడ్డు వరకూ వెంటవచ్చాడు.

''థాంక్సండీ! వస్తారో, రారో అనుకున్నాను. ఈరోజు నాకు చాలా సంతోషంగా వుంది'' అన్నాడు ఆనందంగా.

ఎందుకో ఆ చూపు అదోలా వుంది.

స్మిత గమనించనట్లే ఆటోకోసం చూడసాగింది.

ప్రాణ్ చప్పట్లుకొట్టి ఖాళీగా పోతున్న ఆటోని పిలిచాడు.

ఆటో ఎక్కి కూర్చుంటే ''థాంక్యూ వన్స్ అగెయిన్'' అన్నాడు గాల్లో చెయ్యూపుతూ. ఆమె సమాధానంగా నవ్వింది.

ఆటోలో వున్నంతసేపూ ఆ ఇంటి వాతావరణమూ, అతని తల్లిదండ్రులూ, అతడి మాటలు నెమరువేసుకుంది. ప్రాణ్ ఏమీ తప్పుగా ప్రవర్తించకపోయినా, అతని తీరు కాస్త వింతగానే అన్పించింది. ఆ చూపులో, ఆ మాటలో ఏదో అద్వితీయమయిన సంతోషం. మాటలుగా చెప్పకపోయినా ప్రస్ఫుటంగా కనిపించే భావం... ప్రాణ్ తనని ఇష్టపడుతున్నాడని చెప్పక చెప్తున్నట్లుంది. అంతలోనే కాదు, అదంతా తన అపోహ, అనుమానం మాత్రమే. స్త్రీ పురుషులు కలసి మాట్లాడుకున్నంతలో దానర్థం అదేనా? అతను మామూలుగానే మాట్లాడివుండచ్చు. ఈవేళ అతిథిగా వెళ్ళింది గనుక మరింత చొరవగా, కలివిడిగా మాట్లాడి వుండచ్చు అనుకుంది.

ఆ ఆలోచనలు విడిపోకముందే ఇల్లు వచ్చేసింది. ఫేర్ చెల్లించి ఇంటివైపు నడిచింది. అప్పటికే తొమ్మిదయింది.

''ఇంత ఆలస్యమయిందేమ్మా?'' అన్నాడు రాజారాం.

''చాలా దూరం కద నాన్నా అప్పటికీ భోజనం చేయమంటే కాదని వచ్చేశా'' అంది స్మిత.

సంధ్య ముగ్గురికీ భోజనాలు వడ్డించింది. స్మిత ఆకలి లేకపోయినా, నాలుగు మెతుకులు నంజి, మంచమెక్కింది.

ఎంత తన్నుకున్నా నిద్రపట్టే సూచనలు కన్పించలేదు. ఆలోచనలన్నీ ప్రాణ్ చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

ఈ కొద్దికాలంలోనూ ప్రాణ్‌లో ఏదో మార్పు




కనిపిస్తోంది. అతను మామూలుగానే మాట్లాడి నట్లుంది కానీ అందులోనే ఏదో తేడా కూడా వుంది. అతనికి తనమీద ఏదో వుద్దేశమున్నట్లు తన మనసుకి తెలుస్తోంది. అతని చూపుకి తను తట్టుకోలేకపోతోంది. అది తన మనసులో గుచ్చుకున్నట్లు వుంటోంది. వీలయినంతవ రకూ కళ్ళు కలవకుండా జాగ్రత్తపడ్తూ తను ఎటో చూస్తూ మాట్లాడుతోంది.

ఏమిటీ వింత? ప్రాణ్ తన భార్యని ఎంతగా ప్రేమించాడో ఈవేళ తనకి స్పష్టంగా తెలి సింది. భార్య మరణవార్త తలచుకుని ఇప్పటి కీ ఎంత మథనపడుతున్నాడు? పైగా అతనికి ఒక కూతురుంది. అయినా అతను తనను కావాలనుకుంటున్నాడా? అలాంటి భావన అత నికి కలిగినట్లు మాటరూపంలో చెప్పకపోయినా తనకి అర్థమైంది. ఈ విషయంలో మాత్రం తనకి ఎలాంటి సందేహమూలేదు. వర్షతో పువ్వు ఇప్పిస్తున్నాడని తెలిసినపుడే అను మానం కలిగినప్పటికీ ఇప్పుడిప్పుడే దృఢపడు తోంది. అందులో అతన్ని పెద్దగా తప్పు పట్టా ల్సిందేమీ లేదు. పురుషులు సామాన్యంగా భార్య చనిపోయినా సంవత్సరం తిరక్క ముందే మళ్ళీ పెళ్ళి చేసుకుంటారు. అతను భార్యపట్ల అంత ప్రేమ వుండబట్టే ఇంత కాలం మరోపెళ్ళి చేసుకోకుండా వున్నాడు. కానీ తనని చూశాక... మళ్ళీ అతనిలో అలాంటి భావం కలిగిందేమో. తనేమంత అందంగా వుంటుంది? పైపై అందం చూట్టం లేదేమో? తను అందకత్తె కాకపోయినా ఆకర్షణవుందని తన స్నేహితులు కొందరు అనేవాళ్ళు. అది నిజమేనా? లేకపోతే ముప్పయ్యేళ్ళు దాటిన తనలో ఇంకా ఏమందముంటుంది?

కానీ అతన్ని తను ప్రేమించగలదా? తన గతమేమిటో అతనికి తెలియదు. తన మన సులో హుస్సేన్ స్మృతులు పోనంతవరకూ పెళ్ళెలా చేసుకోగలదు? చేసుకుంటే అతన్నే చేసుకోవాలనుకుంది. మరో వ్యక్తిని తన భర్తగా అంగీకరించేందుకు ఆమె మనసు ఒప్పుకో వడం లేదు. అందుకే హుస్సేన్ తన జీవి తంలోంచి వెళ్ళిపోయాక, పెళ్ళి ఆలోచనే రాలే దు.

సరే... ఈ విషయం గురించి ఇంతగా ఆలోచించడమెందుకు? అతను బయటపడి అడిగినప్పుడు చెప్పేస్తే సరి అనుకుంది. అప్ప టికి ఆమె మనసు కుదుటపడి. నిద్రపట్టింది.

★ ★ ★

కాలం గడుస్తూనే వుంది. ప్రాణ్ స్కూలుకి వస్తూనే వున్నాడు. స్మితతో మాట్లాడుతూనే వున్నాడు. కానీ తన భావాలు మాత్రం తెలియ జెప్పలేదు. స్మిత కూడా తనకేం అర్థంకానట్లే మెలగసాగింది.

ఒకరోజు వర్షని క్లాసురూంలోకి పంపి ప్రాణ్ స్మిత దగ్గరికి వచ్చాడు. పలకరింపులయ్యాక స్మిత ఇద్దరికీ టీ తెప్పించింది.

టీ తాగుతూ "హెూటల్ సరోవర్‌లో బుక్ ఎగ్జిబిషన్ పెట్టారు. నేను కొన్ని ఆర్ట్ బుక్స్ తీసుకోవాలి. మీరూ రారాదు? ఏమేం కొత్త బుక్స్ వచ్చాయో చూసినట్లుంటుంది" అన్నా డు ప్రాణ్.

స్మితకి బుక్ ఎగ్జిబిషన్ అనగానే మహా నందంగా అన్పించింది. ఎకౌంటెంట్‌కి చెప్పి, బయల్దేరింది.

ప్రాణ్ స్కూటర్ స్టార్ట్ చేసి, ఎక్కమన్నట్లు చూశాడు.

"ప్లీజ్, ఇఫ్‌యూ డోంట్ మైండ్, నేను ఆటోలో వస్తా" అంది.

"నా వెనక సీట్ ఖాళీగా వుంది... మీ ఇష్టం, మీకే డబ్బులు దండగ" అని స్మిత ఆటో దొరికి, ఎక్కేవరకూ స్లోగా నడిపాడు.

'ఇంత చదువుకుని, ఉద్యోగం చేస్తున్నా బామ్మ బుద్ధులు పోలేదు అనుకున్నాడేమో. నిజానికి స్కూటరెక్కినంతలో వచ్చే నష్టమే ముంది? తనకేమైనా అంటుకుంటుందా? తనే మయినా అపవిత్రమైపోతుందా? ఇద్దరు స్త్రీలు పక్కపక్కగా కూర్చుంటే లేని తప్పు, పురుషుడ యితే తప్పా? తను ఉన్నతంగా ఆలోచిస్తాను అనుకుంటూనే మరీ ఇంత చాదస్తంగా ఎందుకు ప్రవర్తిస్తుంది? ఏమో దీనికి సమా ధానం లేదు. కానీ తను మాత్రం శారీరకంగా నూ, మానసికంగానూ కూడా వేరొకరి స్పర్శని భరించలేదు? అనుకుంది ఆటోలో.

స్మిత ఆటో దిగి నిలబడేసరికి ప్రాణ్ స్కూ టర్ పార్క్ చేసి వచ్చాడు. ఇద్దరూ కలసి లోపలికెళ్ళారు. ప్రాణ్ మూడు వేలకి పైగా

## తన కలలు చెదిరి పోనీయకండి.
## అవి నిజం కానివ్వండి.
## అందుకై చేపట్టండి బాలల కానుక వృద్ధి నిధి.



మీ బిడ్డకు, తనతోబాటే పెరిగే కానుక నొకదాన్ని ఇవ్వండి. యూనిట్ ట్రస్ట్ వారి బాలల కానుక వృద్ధి నిధిలో పెట్టుబడి పెట్టండి. మీ బిడ్డకి 21 ఏళ్లు వచ్చే సరికల్లా, మీ పెట్టుబడి మొత్తం తన అవసరాలు తీర్చుకోవడంలో సహాయపడడానికి తయారుగా వస్తుంది.

మీరు ఒకేసారిగా కొంత మొత్తం కానుకగా ఇవ్వవచ్చు. లేదా ఏటేటా కొద్దిపాటి మొత్తాలు చేర్చుతూ రావచ్చు. ఏ పద్ధతి ఎంచుకున్నా సరే, తనకి 21 ఏళ్లు వచ్చే సరికల్లా లక్షాధికారి అయ్యేలా చూడొచ్చు. (తనకి అవసరమైతే 18 ఏళ్ల వయస్సులో డబ్బు వాపసు తీసుకునే వసతి ఉంటుంది).

యూనిట్ ట్రస్ట్ వారి బాలల కానుక వృద్ధి నిధి. ఎందుకంటే రవంత ముందాలోచనతో బంగారమంటి భవిష్యత్తుకు బాట వేయవచ్చు.

దరఖాస్తు ఫారాలు యూనిట్ ట్రస్ట్ శాఖలలోను, బ్యాంకులన్నిటిలోను, కలెక్షన్ సెంటర్లలోను స్వీకరించబడుతాయి.

దరఖాస్తు ఫారం గల కరపత్రం కోసమై ఏ యూనిట్ ట్రస్ట్ శాఖలోగానీ, ముఖ్య ప్రతినిధి లేదా ఏజెంటు వద్దగానీ సంప్రదించండి.

బాలల కానుక వృద్ధి నిధి

**~~13%~~ 14% డివిడెండు**

**బోనస్ ప్రతి ~~5~~ 3 ఏళ్లకొకసారి**




**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**

22 మిలియన్ల మంది పైగా యూనిట్ స్వంతదార్ల సేవకై అంకితం.

సెక్యూరిటీ పెట్టుబడులన్నిటిపైనా మార్కెట్ రిస్కు ఉంటుంది. పెట్టుబడి పెట్టే ముందుగా మీ పెట్టుబడి సలహాదారునుగానీ, ఏజెంటునుగానీ సంప్రదించండి.

**Branch Offices:** • Hyderabad Ph: 240030 • Vijayawada Ph: 63964
• Visakhapatnam Ph: 50275

Sista's UTI 1968 92 TE C

ఖర్చుచేసి ఆర్ట్ పుస్తకాలు కొన్నాడు. ఆ పుస్తకాలన్నీ ఫారిన్ కంట్రీస్‌లో పబ్లిషైనవే. పేపర్ చాలా ఖరీదయినదేగాక ఎక్స్‌పోర్ట్ ఛార్జెస్ వుంటాయి కాబట్టి ఆర్టుకి సంబంధించిన పుస్తకాలు వందల వందల రేట్లుంటాయి. స్మిత కూడా కొన్ని పుస్తకాలు కొంది. మోయలేనంత బరువుతో ఇద్దరూ బయటపడ్డారు.

''కాస్త రెస్టారెంట్‌లో కాఫీ తాగుదాం రండి'' అంటూ ప్రాణ్ ముందు నడుస్తుంటే, స్మిత అనుసరించింది.

ఆ పుస్తకాలమీదే మాట్లాడుకుంటూ కాఫీ తాగారు.

బిల్ పే చేసి, మెట్లు దిగుతూ ''ఇప్పుడు స్కూలుకా? ఇంటికా?'' అన్నాడు ప్రాణ్.

''స్కూలుకే'' అంది స్మిత.

''ఈ బరువుతో స్కూలుకెందుకు? పోనీ ఒక పని చేస్తాను. మీ ఎడ్రెస్ ఇవ్వండి, మీ బుక్స్ ఇంట్లో ఇచ్చేసి, నే వెళ్ళిపోతాను''

''మీకు రిస్క్ కాదా? మేముండేది హిమాయత్‌నగర్లో''

''ఏం పర్లేదు. ఇందులో రిస్కేముంది, నే మోస్తానా?'' అన్నాడు నవ్వుతూ.

స్మిత బాగ్‌లోంచి పెన్ తీసి ''ఏం పేపర్ లేదే?'' అంది.

ప్రాణ్ అప్పుడే తీసుకున్న పుస్తకాలు కొన్న రిసీట్ ఇచ్చాడు.

''ఫర్లేదు, ఇలాంటివి కూడా పనికొస్తాయే'' అని నవ్వి దాని వెనకవైపు అడ్రస్ రాసిచ్చింది.

ప్రాణ్ రెండు పుస్తకాల కట్టలూ కాళ్ళ దగ్గర జాగ్రత్తగా పెట్టుకుని, చెయ్యూపి ''ఇంతకీ ఇంట్లో ఎవరుంటారు?'' అన్నాడు.

''అమ్మా, నాన్నా... నాన్న రిటైరయిపోయారు కదా'' అంది.

స్కూటర్ కదలగానే ఆటో మాట్లాడుకుంది స్కూలుకి.

ఆ తర్వాత రెండు మూడుసార్లు ప్రాణ్ స్మిత ఇంటికి వచ్చాడు. అతను కళకి సంబంధించిన విషయాలు అనర్గళంగా మాట్లాడతాడు. పైగా చాలా చమత్కారంగా, హాస్యపూరితంగా మాట్లాడుతాడు. దాంతో అతడి రాక ఆమెకి ఆహ్లాదకరంగానే అన్పిస్తోంది తప్ప విసుగు కలిగించడం లేదు.

సంధ్య, రాజారాం అతని భార్య మరణవార్త, తల్లి లేని వర్ణ పరిస్థితి తెలిసి సానుభూతి చూపారు. రాజారాం ప్రాణ్‌మీద సదవగాహన ఏర్పర్చుకున్నాడు. రిటైరైన దగ్గర్నుండీ ఆయనకి మాట్లాడ్డానికి మనుమలే కరువైనట్లుంది. భార్యతో, కూతురుతో ఎక్కువ ' విషయాలే వుండవు. కానీ ప్రాణ్‌తో రాజకీయాలు మాట్లాడ్తే సంతృప్తిగా అన్పించింది. సంధ్యకి ఎక్కడో మారుమూల తన కూతురు ప్రాణ్‌ని చేసుకుంటే బాగుండునన్పించింది.

రోజు రోజుకి ప్రాణ్‌పట్ల గౌరవం పెరుగుతోంది స్మితకి. ఎప్పుడయినా వర్ణని అతడు గాక, అతడి తండ్రో, పనిపిల్లో తీసుకొచ్చి దింపి వెళ్తే 'అరె, ఈరోజు ప్రాణ్ రాలేదా' అనుకుంటోంది.

అతను అడపాదడపా ఢిల్లీ, మెడ్రాస్ వెళ్ళి పది, పదిహేను రోజులకి వచ్చేవాడు. అతను రెండు మూడు రోజులు వరసగా రాకపోతే 'ఓహో మళ్ళీ ఢిల్లీ వెళ్ళాడు కాబోలు' అనుకుంటోంది.

ఒక్కోసారి తనని తనే విసుక్కుంటుంది. అతనేం తన హస్బెనా? అతడెక్కడికెళ్తే తనకెందుకు? వస్తే ఏదో ఫ్రెండ్లీగా మాట్లాడడం లేకపోతే లేదు, అంతకుమించి అతన్ని గురించి తనెందుకు ఆలోచించాలి అని మనసుని దారిలోకి తెస్తుంది.

స్టాఫంతా వెళ్ళిపోయినా స్మిత చదువుతున్న పుస్తకం మధ్యలో ఆపలేక ఆఫీసురూంలోనే వుండిపోయింది. నవ్వుతూ ప్రాణ్ వచ్చాడు. నిజానికి వర్ణని పనిపిల్ల తీసుకెళ్ళిపోయింది.

అతనేవో మాట్లాడ్తూ కూర్చున్నాడు. స్మిత పుస్తకం బాగ్‌లో పెట్టేసి, మాటల్లోకి దిగింది.

''మీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి'' అన్నాడు ప్రాణ్.

స్మితకి అర్థమైనా ''ఏమిటది?'' అంది.

''మీరు పెళ్లెందుకు చేసుకోలేదు?'' అన్నాడు.

''అదో పెద్దకథ'' నవ్వింది స్మిత.

''నాకు వినాలని వుంది. ఒక ఫ్రెండ్‌గా

చెప్పాలన్పిస్తే...''

''తెలుసుకుని ఏం చేస్తారు?''

''ఏమీ చేయలేకపోవచ్చు. కానీ ఆత్మీయుల సంగతులు తెలుసుకోవాలన్పిస్తుంది. కనిపించిన ప్రతివారి కథలూ వినంకదా''

''............''

''మీ ఇష్టం, మిమ్మల్ని ఫోర్స్ చేయను. మీకు చెప్పాలన్పిస్తేనే చెప్పండి. నేనైతే నా విషయాలేవీ మీ దగ్గర దాచాలనుకోవడంలేదు''

స్మిత క్లుప్తంగా హుస్సేన్ గురించి చెప్పింది.

''నేను మీకు చెప్పేటంతటివాడిని కాకపోవచ్చు. కానీ ఒక్క విషయం. అతను మిమ్మల్ని మర్చిపోయి, హాయిగా పెళ్ళిచేసుకున్నప్పుడు మీరిలా వుండిపోవడంలో అర్థం లేదు''

''ప్రాణ్‌గారూ! మీరు కూడా అందర్లా ఆలోచిస్తే ఎలా? దీనికి త్యాగమనో, మరేదో పేరు పెడితే సరిపోదు. అది జరిగాక నాకు రెండు మూడు ఆఫర్స్ వచ్చాయి. కానీ నా మనసెందుకో వేరేవాళ్ళని భర్తగా ఒప్పుకోవడంలేదు. అతను ప్రేమ నటించి వుండచ్చు, కానీ నేనతన్ని మనస్ఫూర్తిగా ఇష్టపడ్డాను. ఇంకెవ్వర్నీ ఆ స్థానంలో ఊహించుకోలేకపోతున్నాను. అతను నా మనసుని బలంగా స్పృశించి వెళ్ళాడు. ఆ స్పర్శ అలా నిలిచిపోయింది'' అంది స్మిత.

''ఒకరకంగా మనిద్దరం ఒకేజాతి పక్షులం అన్పిస్తోంది. అతను మరో పెళ్ళి చేసుకున్నందువల్ల మీరు, నా భార్య మరో లోకం చేరినందువల్ల నేను ఒంటరివాళ్ళమయ్యాం''

స్మిత మౌనంగా వింటోంది.

''మనం ఎన్నో అనుకుంటాం. కానీ అన్నీ జరగవు. గతంలో జరగనివాటి గురించి ఆలోచిస్తూ వర్తమానాన్నీ భవిష్యత్తునీ వ్యర్థం చేసుకోకూడదండీ. మీరు పెళ్ళి చేసుకోవడంలో తప్పేముంది?''

''నేను పెళ్ళి చేసుకోవడం తప్పు అని నేననుకోవడంలేదు. కానీ హుస్సేన్ని మానసికంగా నా భర్తలాగే ఫీలవుతున్నాను. పెళ్ళి కేవలం బయోలాజికల్ నీడ్ కోసమని నేనెప్పుడూ అనుకోలేదు.

''కలలు కనడం తప్పుకాదు. కానీ కొంత ప్రాక్టికల్ థింకింగ్ కూడా వుండాలి. అతని గురించి మీరెంత తపించినా అతను మిమ్మల్ని పట్టించుకుంటాడా? తన సంసారం వదులుకుని మీకోసం వస్తాడా?''

''ప్లీజ్... మీరలా మాట్లాడకండి. హుస్సేన్ గురించి నేను తపించడంలేదు. అతను నా కోసం రావడంకాదుగదా కనీసం నా గురించి ఆలోచించే దశలో కూడా వుండివుండడు. అతన్నుండి ప్రస్తుతం నేనేం కోరుకోవడం లేదు''

''అదే పిచ్చితనం. మీక్కలిగే సంతోషాన్నో దుఃఖాన్నో మీతో పంచుకోడానికి ఒకవ్యక్తి మీకు అవసరం లేదా? స్నేహితులుగానీ, అక్క చెల్లెళ్లుగానీ ఎవరూ ఎల్లకాలం మనవెంట వుండరు. మన పూర్వీకులు తెలివితక్కువవాళ్ళు కాదండీ. వాళ్ళెంతో ఆలోచించే ఈ పెళ్ళి అనే అందమయిన బంధాన్ని ఏర్పరిచారన్పిస్తుంది''

''............''.

''నిజం చెప్పండి, మీకు పెళ్ళి అవసరమన్పించలేదా?''

''............''

''నా మాటలు కోపం తెప్పిస్తున్నాయా? నేను తప్పుగా మాట్లాడ్తున్నానా?''

''ప్రాణ్‌గారూ! నాకు నటన చేతకాదు. ఇప్పటికీ హుస్సేనంటే నాకు ప్రేముందనే అనుకుంటున్నాను. అతని జ్ఞాపకాలు పోనంతవరకూ మరో వ్యక్తిని భర్తగా ఒప్పుకోలేను. అనలది ధర్మం కాదని నా నమ్మకం''

''ఇంత చదువుకుని కూడా మీరింకా ఇలాంటి పిచ్చిభావాలు మనసులో వుంచుకోవడం బాగాలేదు. చాలామంది జీవితాన్ని ప్రయాణంతో పోల్చి చెప్పారు. అనేకమంది కలిసి ప్రయాణిస్తారు. కొందరు మధ్యలో దిగిపోతారు. ఇదీ అంతే. హుస్సేన్ని కూడా అలా ఎందుకనుకోరు?''

''ఎంత తేలిగ్గా చెప్పేశారండీ. అతన్ని కేవలం ఒక సహప్రయాణికుడిగా పోలుస్తున్నారా?''

''పోనీ మీ మనసుని స్పందింపచేసిన వ్యక్తి అందామా? మనని అనేక విషయాలు కదిలిస్తాయి. అంతెందుకు హుస్సేన్‌గాక మీకు





ఫ్రెండ్సెవరూ లేరా? వాళ్ళ జ్ఞాపకాలేమీ లేవా?''

''వున్నారు, కానీ ఇతర స్మృతులకీ, వీటికీ తేడా వుంటుంది''

''వుంటే నష్టమేంటి? అదంతా నాకు వింతగా లేదు. ఇట్స్ క్వైట్ నాచురల్. మనం యంత్రాలం కాము, విఆర్ హ్యూమన్ బీయింగ్స్. రకరకాల మనుషులు కలుస్తారు. వాటికి రియాక్టవుతూ వుంటాం. అవి గుర్తున్నంతలో తప్పులేదు. కానీ అవి తల్చుకుని బాధపట్టంలో మాత్రం అర్థంలేదు''

''ఒకప్పుడు బాధపడిన మాట నిజమేగానీ ఇప్పుడు నేనేం బాధపట్టంలేదు''

''కావచ్చు కానీ కాన్షస్‌గా, అన్‌కాన్షస్‌గా కూడా మీరతన్నే తల్చుకోవాల్సిన అవసరమేముంది చెప్పండి. ఎప్పుడో పూసిన పువ్వు అందమైందీ, పరిమళభరితమైందీ కావచ్చు. కానీ అది వాడిపోయాక్కూడా దాన్నే తల్చుకునే కంటే, మీ చుట్టూ వున్న లక్షల, కోట్ల పువ్వుల గురించి ఎందుకు పట్టించుకోరు?

''............''

''నా ఉద్దేశం అతనో వాడిపోయిన, పనికిమాలిన పువ్వని కాదు, ఏదోవిధంగా అతను మీకు దూరమయ్యాడు. అలాంటప్పుడు... మనిషెప్పుడూ ఆశాజీవిగా వుండాలండీ. నా భార్య చనిపోయింది. చాలా బాధపడ్డాను. కొన్నాళ్ళు అన్నం కూడా తినాలన్పించలేదు. అయినా ఏం చేస్తాం, పోయిన వాళ్ళతో మనమూ పోలేంకదా. నా భార్యని నేను పూర్తిగా మర్చిపోగలనా? ఆమెతో గడిపిన రోజులు గుర్తురాకుండా వుంటాయా? చెప్పండి''

మళ్ళీ అతనే అన్నాడు.

''మనకి నచ్చిన దృశ్యాల్లాగే, మనుషులు కూడా నిలిచిపోతారు. ఒకవేళ అలాంటి వ్యక్తుల్ని మర్చిపోతే వాళ్ళకి కళాహృదయం లేదనుకోవాలి. మీరు హుస్సేన్ని ప్రేమించడంవలన మీకు మనసుందని అర్థమైంది. అతనింకా గుర్తున్నాడంటే గొప్ప కళాహృదయమని తెలుస్తోంది''

తన ప్రేమని సంపూర్ణంగా అర్థం చేసుకుంది ఇతనొక్కడే అనుకుంది. అతనిపట్ల కృతజ్ఞతా భావంతో మనసునిండింది.

''స్మితగారూ! ఇవన్నీ మీకెందుకు చెప్తున్నానంటే...''

స్మిత అతని కళ్ళలోకి చూసింది.

ప్రాణ్ కాస్త తటపటాయించి ''మనం పెళ్ళి చేసుకుంటే?'' అన్నాడు ఆమెనే చూస్తూ.

ఇద్దరి చూపులూ కలిశాయి.

అతని భావాలు ముందే అర్థమైనందువల్ల ఆ చూపులో ఆశ్చర్యంలేదు. అతనిమీద సదభిప్రాయం, అంతకంటే ఉన్నత భావం వున్నందువల్ల ఆ చూపు కోపంగా లేదు. ఇన్నాళ్ళ సాన్నిహిత్యం తనకి తెలియకుండానే కొంత దగ్గర చేసుకుంది. ఆ కళ్ళు అతడిలో నిజంగా తనపట్ల ఇతనికి ప్రేమవుందా అని వెదికాయి.

''ఏమాలోచిస్తున్నారు? సమాధానం చెప్పరా?''

''నాక్కొంత టైమివ్వండి''

''ఓ.కే. టేక్ యువర్ ఓన్‌టైం''

స్మిత ఆలోచనలో పడింది. ఆమెకి మళ్ళీ హుస్సేన్ పెళ్ళిప్రసక్తి తెచ్చిన విషయాలు గుర్తొచ్చాయి. అతని విషయంలో ఆలస్యం చేసి అమృతాన్ని విషం చేసుకున్నాను. నిజమే ప్రాణ్ అన్నట్లు తానెందుకు పెళ్ళి చేసుకోకూడదు? పైగా ప్రాణ్‌కి ఏదీ దాచకుండా అన్నీ చెప్పింది. తనని అర్థం చేసుకున్నాడు. అతని స్మృతులు తనలో వున్నా అతనికి అభ్యంతరం లేదనే చెప్తున్నాడు. కానీ ఈసారి తను తొందరపడి తప్పు నిర్ణయం తీసుకోవడం లేదుకదా. ప్రాణ్ మంచి కళాకారుడు. అంతకుమించి సహృదయుడు. అతను తనని చేసుకుని హింసిస్తాడా? హుస్సేన్ తన జీవితంనుండి వెళ్ళిపోయాక తనకి పెళ్లి ఆలోచనే రాలేదు. ఎవరైనా ఆ ప్రసక్తి తెచ్చినా పట్టించుకోలేదు.

కానీ ఈవేళెందుకు ప్రాణ్ పట్ల మొగ్గుచూపుతోంది తన మనసు? ఏమిటీ విచిత్రం ఇన్నేళ్ళ తర్వాత అనుకుంది.

''మీరెన్ని చెప్పినా నాకెందుకో భయంగా వుంది. పెళ్ళయ్యాక కూడా ఇలా వున్నతంగా ఆలోచిస్తారా మీరు?''



''అంటే మిమ్మల్ని చేసుకోవడం కోసం నేనేదో పిచ్చికబుర్లు చెప్తున్నాననా మీ ఉద్దేశం? నన్ను మరీ అంత అండరెస్టిమేట్ చేయకండి. నేను మారను. పోయేవరకూ ఇలాగే మాట్లాడ్తాను''

''మరి హస్సేన్ విషయమై నామీద నిజంగా చులకనభావం ఏర్పర్చుకోరుగదా?''

''మీరేం తప్పు చేశారని చులకన చేయడానికి? మీరే చెప్పారుగా అతను మీ మనసుని స్పృశించాడని. ఆ స్పర్శలోంచి వచ్చిన స్మృతులు మిమ్మల్నెంతగా ఆనందింపజేసినా నాకేం అభ్యంతరం లేదు. కానీ బాధపడడం మాత్రం నాకు నచ్చదు. అయితే నాక్కూడా మీ మనసుని స్పృశించాలనుంది. మరి, నా స్పర్శతో కొత్త నీరొచ్చి, పాతనీరు కొట్టుకుపోయినట్లు మీ హుస్సేన్...'' అంటూ పెద్దగా నవ్వాడు ప్రాణ్.

స్మిత కూడా అతని మాటలకి ఆగకుండా నవ్వింది. చివరికి ''చూద్దాం లెండి, మీ స్పర్శకి ఎంత ప్రభావముంటుందో'' అంది.

ఆ తర్వాత ఇద్దరిమధ్యా నిశ్శబ్దం ప్రవేశించింది. కొంతసేపు మౌనంగా కూర్చున్నారు. ఇద్దరికీ ఇబ్బందిగానే వుంది.

''కాసేపేదయినా రెస్టారెంట్‌కెళ్దామా?'' అన్నాడు ప్రాణ్.

ఈసారి స్కూటర్ ఎక్కడానికి స్మితకి సందేహం కలగలేదుగానీ కాస్త సంకోచంగా ఎక్కికూర్చుంది.

ప్రాణ్ దోశకి ఆర్డరిచ్చి ''స్పీక్ సంథింగ్. అసలు మీకీ విషయం చెప్పాలని ఎప్పట్నుండో అనుకుంటున్నాను. కానీ, నా గురించి ఏమనుకుంటారోనని వెనకాడాను'' అన్నాడు.

''నాకెప్పుడో అర్థమైంది. కానీ మీకా సందేహం ఎందుకు కలిగింది?''

''నేను పెళ్ళయినవాణ్ణి, పైగా ఒక కూతురు కూడా వుంది. సామాన్యంగా ఏ ఆడపిల్లయినా రెండో పెళ్ళివాణ్ణి మనస్పూర్తిగా అంగీకరిస్తుందా అనుకున్నాను''

''మరి, ఈ రోజెలా అడిగారు?''

''ఎక్కువకాలం అలా సంశయిస్తూనే కూర్చోవడం కష్టమనిపించి ఇంకా ఇంకా నాన్చడమెందుకని...'' అన్నాడు ప్రాణ్.

స్మిత నవ్వి ''ఇంతకీ మీ అమ్మా, నాన్నా ఏమనుకుంటారో?'' అంది.

''వాళ్ళు నా మాటెప్పుడూ కాదనరు. పెద్ద జోక్ ఏమిటంటే, మీరు వర్ల పుట్టిన్రోజుకి వచ్చినరోజు రాత్రే నాన్న మీ వివరాలడిగారు. మీరు ఇంకా పెళ్ళి చేసుకోలేదని విని మిమ్మల్ని చేసుకోమని ప్రపోజ్ చేశారు'' అన్నాడు.

''చూసిన పది నిమిషాలకే ఇంప్రెస య్యారా?'' అంటూ నవ్వింది స్మిత.

హోటల్‌నుండి ఇద్దరూ స్మిత ఇంటికి వచ్చారు.

ఆ వార్త విన్న సంధ్య, రాజారాంల సంతోషానికి అంతులేదు.

త్వరలో ముహూర్తం నిర్ణయించి పెళ్ళి చేశారు. పెళ్ళి పెద్ద ఆర్భాటంగా చేయలేదు. చాలా దగ్గరివాళ్ళని మాత్రం పిలిచారు. శరత్ భార్యని తీసుకుని వచ్చాడు. శిరీష, ఆమె భర్త, అత్తమామలు వచ్చారు. హరనాథ్ ఏదో కాన్ఫరెన్సుండి కలకత్తా వెళ్ళడంవలన రాలేదు. రమ్య కొడుకు నెత్తుకుని వచ్చింది. సుచరిత, ఆమె భర్త మైసూర్‌నుండి వచ్చారు. ఇక తక్కిన వాళ్ళంతా హైదరాబాద్‌వాళ్ళే.

పెళ్ళయిన తర్వాత ఒకరోజు ప్రాణ్ ''మీరిద్దరూ, ఇక్కడ ఒంటరిగా వుండడం కష్టం, మాతో వచ్చేయండి'' అన్నాడు అత్తామామల్ని ఉద్దేశించి. ఆ విషయమై స్మిత అంతకుముందే తల్లితండ్రులని బ్రతిమిలాడింది. ఎంత చెప్పినా వాళ్ళు ఒప్పుకోలేదు.

''కాదులే బాబూ! ఎప్పుడయినా చుట్టం చూపుగా వస్తే బాగుంటుందిగానీ, పూర్తిగా మీ దగ్గర వుండడం పద్ధతీ కాదు, నవ్యంగానూ వుండదు'' అన్నాడు రాజారాం.

''అదేంటండీ అలా అంటారు? మేమేం పరాయివాళ్ళమా? మా దగ్గరుంటే బాగోకపోవడమేమిటి?'' అన్నాడు ప్రాణ్.

రాజారాం నవ్వి ఊరుకున్నాడు.

''ఎంతైనా నేను కొడుకును కానుగా. ఆ తేడా మీ మనసులోంచి ఎలా పోతుందిలే?'' అంది స్మిత.

రాజారాం నవ్వి ''అదేం లేదమ్మా. మనకా




భేదం, పట్టింపు లేనంతలో చూసేవాళ్ళు ఒప్పుకుంటారా?'' అన్నాడు.

''ఎవరండీ చూసేవాళ్లు? మనమేం చేసినా మనకోసం చేయాలి? మనకి నచ్చనివి లోకంలో ఎన్ని జరగడంలేదు?'' అన్నాడు ప్రాణ్.

''కాదులే బాబూ! మరీ వయసుమించిపోయినపుడు మీ దగ్గరే వుంటాంలే. ఎలాగో వున్న ఒక్క కొడుకూ ఊరుగాని ఊర్లో అరవదాన్ని చేసుకున్నాడుగా. అల్లుళ్ళే కొడుకులనుకుంటాం'' అంది సంధ్య కొంగు కళ్ళకి అద్దుకుంటూ.

''తనకి నచ్చినమ్మాయిని చేసుకున్నాడు. అందులో తప్పేముందమ్మా? ఏమయినా కష్టనష్టాలుంటే వాడే అనుభవిస్తాడు. సుఖంగా వుంటే మరీ మంచిది. నీకిష్టం లేకపోతే వాడి దగ్గర వుండద్దు, కానీ వాడిమీద కోపం మాత్రం పెంచుకోకు'' అంది స్మిత.

రాజారాం, ప్రాణ్ చూస్తూండిపోయారు.

ఇవన్నీ స్మితకి దృశ్యాలుగా కళ్ళముందు నిలిచాయి. తను ప్రాణ్‌తో పెళ్ళికి ఒప్పుకోడానికి దోహదం చేసిన ఇంకెన్నో సంఘటనలు, మరెన్నో అనుభూతులు మసక మసకగా కంటి నుండి దూరం కాబోతుండగా మెల్లగా నిద్రలోకి జారుకుంది.



రాత్రి మరీ ఆలస్యంగా నిద్రపోవడంతో స్మితకి ఒక పట్టాన మెలకువ రాలేదు. సంధ్య లేపినా బద్ధకించింది. తొమ్మిది గంటలకి లేచింది.

''అల్లుడు మంచివాడయిపోయి, నువ్విలా తయారయ్యావే. ఇప్పుడా లేవడం?'' అంది సంధ్య.

''రాత్రి సరిగా నిద్రలేదమ్మా. అయినా ఈరోజు స్కూలు, కాలేజీ లేవు. కాస్త ఆలస్యంగా లేస్తే పోయేదేముంది?'' అంటూ బ్రెష్ నోట్లో పెట్టుకుని వాష్‌బేసిన్ వైపు నడిచింది స్మిత.

టిఫిన్ తిని, కాఫీ తాగుతుండగా ప్రాణ్ ఫోన్ చేశాడు. తను బెంగుళూరునుండి బాంబే వెళ్లాల్సివచ్చిందనీ, రెండోరోజు ఫ్లైట్‌లో వస్తానని చెప్పాడు.

సంధ్య బియ్యమేరుతూ ''మీ అత్తామామగారెప్పుడు వస్తారు? అసలు పెళ్ళెక్కడ?'' అంది.

''పెళ్ళి గుంటూర్లోనే. వాళ్ళ చుట్టాలంతా అక్కడే వున్నారుగా. అంత దూరమెళ్ళాక అందర్నీ తిరగేసి రాకుండా ఎలా వస్తారు? చెప్పడమయితే వారంలో వచ్చేస్తామన్నారు''

''కనీసం వర్షనైనా ఇక్కడే వుంచి వెళ్ళాల్సింది''

''నేనెంతో చెప్పాను. అనవసరంగా దాని స్కూలు పోతుందని. వర్ష వెంటబడేసరికి వాళ్ళూ మెత్తబడ్డారు. వచ్చాక శ్రద్ధగా చదువుకుంటుందిలే అన్నారు అత్తయ్య'' అంది స్మిత.

''వంట నేచేస్తాన్లే. ఇక్కడ కూడా నీకెందుకు శ్రమ? ఏదో సినిమా కాస్సెటున్నట్లుంది, పెట్టుకు చూడు'' అంది స్మిత.

సంధ్య లేచి హాల్లో కెళ్లింది.

వంట నెమ్మదిగా చేసుకోవచ్చు. కొంతసేపు పెయింటింగ్ వేయాలని లేచింది స్మిత. ఆయిల్ పెయింట్స్ కలుపుతూ అనుకుంది స్మిత.

'ఈ మానస స్పర్శలమీద విద్యార్థి దశలో ఒక అవగాహన కలిగేట్లు చేయాలి. మనసున్న వాళ్ళకి స్పర్శ సహజమే. అయితే ఆ స్పర్శవల్ల సంతోషం పొందాలే తప్ప శోకించే పరిస్థితి రాకుండా చేసుకోవాలి. ఇలా ఆలోచించేట్లు ఆచరించేట్లు చేయగలగాలి'



▲ యజమానితో చుంబన పారవశ్యం

# సచిత్ర విచిత్రం

## పెంపుడు చింపాంజీ

ఎంచక్కా టీ-షర్ట్ ధరించి మగ్గులు మగ్గులు టీ తాగడం, చెంచాలకు చెంచాలు పంచదారని గుటకాయస్వాహా చేయడం, సరదాపుడితే టీ.వి. చూడడం ఈ చింపాంజీగారి హాబీలు. లండన్‌లోని బెన్నీబాంక్స్ ఇంట్లో ఓ కుటుంబ సభ్యుని హోదాలో ప్రేమగా పెంచబడుతున్న ఫ్రెడ్ అనే పేరుగల ఈ చింపాంజీని వెంటనే తరిమేయండని మున్సిపల్ అధికారులు పట్టుపడుతున్నారు. ఎందుకంటే వీటికి తిక్కపుడితే జనాన్ని పీకి పాకంపెడ్తాయని వారి భయం. అయినా చింపాంజీని వదలడానికి బెన్నీగార్కి ప్రాణం ఒప్పడంలేదట.



దర్జాగా వళ్లరసం లాగిస్తున్న చింపాంజీ ▶

# సామర్థ్యం పై సమీక్షలు

సెప్టెంబరు 'చతుర'లో ప్రచురితమైన తనికెళ్ల కల్యాణి రచన 'సామర్థ్యం'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఆరింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## చక్కని స్ఫూర్తి

(ప్రథమ బహుమతి రూ.100/-పొందినసమీక్ష)

ఎవరు అవుననా్న కాదన్నా ఆధునిక యుగంలో ఈ ప్రపంచాన్నేలుతున్నది 'డబ్బు' అనేది నిర్వివాదాంశం. పేరు ప్రతిష్ఠలు, పరువు మర్యాదలు, చదువు సంధ్యలు, అంద చందాలు, మంచితనం, మమకారం ఒకటేమిటి ఆఖరికి ప్రేమానురాగాల్ని కూడా దానికి తగ్గ మూల్యం చెల్లించే కొనగలుగుతున్నారన్నది అక్షర సత్యం.

ఇటువంటి వాతావరణంలో కూడా డబ్బే ముఖ్యంకాదనీ, ధైర్య సాహసాలు, తెలివితేటలతో ఎటువంటి విపత్కర పరిస్థితులలోనైనా విజయం సాధించవచ్చుననీ ఈ నవలలోని హీరోయిన్ శ్రుతి నిరూపించింది.

మధ్యతరగతి కుటుంబాలలోని స్త్రీలు భానుమూర్తి కుటుంబంలాంటి పరిస్థితులను ఎదుర్కొనవలసి వస్తే గత్యంతరంలేక రామచంద్రం, ప్రకాశంలవంటి దగ్గరి బంధువుల పంచనచేరి కుక్కలకంటే హీనంగా బతుకులు భారంగా వెళ్ళదీస్తుంటారు. ఆత్మాభిమానం ఉన్నవారైతే ధైర్యంచేసి ఆత్మహత్యలకు పాల్పడటం, వయసులో ఉన్న ఆడపిల్లలయితే తమకు ఎలాగూ పెళ్ళిళ్ళు చేస్తారన్న నమ్మకం ఉండదు కాబట్టి ముందూ వెనుకా ఆలోచించకుండా తెగించటం జరుగుతోంది.

ఇటువంటి పరిస్థితులను ఎదుర్కొంటున్నవారు, ఎదుర్కొనవలసి వచ్చేవారు శ్రుతి పాత్రను చూసి ధైర్యంగా, ఆత్మాభిమానంతో బతకడానికి కావలసినంత స్ఫూర్తిని తెచ్చుకుంటారు, ఈ నవల చదివిన తరువాత.

కాకపోతే శ్రుతి పాత్రచిత్రణే కొంత అసహజంగా కూడా ఉంది. ఒకే వ్యక్తి అందం, చదువు, మంచితనం, ధైర్యం, సమయస్ఫూర్తి, తెలివితేటలు కలిగి ఉండి, రాత్రి పొద్దుపోయే వరకు ప్రెస్ నడుపుతూ, కుటుంబభారాన్ని మోస్తూ, చదువులో ఫస్ట్, కళల్లో ఫస్ట్ రావడమనేది కథల్లోనే సాధ్యమవుతుందేమో. ఇటువంటి 'ఐడిల్ షీ'లు నిజజీవితంలో ఎక్కడా కనిపించరు. ఈ పాత్రకు కేవలం ధైర్యసాహసాలు, గుండె నిబ్బరం ఉంటేచాలు పరిస్థితులను అధిగమించడానికి. ఇన్ని సుగుణాలు అనవసరమేమో!

కేవలం కథ చివరిదాకా శుభం పలకడం ఇష్టం లేకపోతే వంశీకృష్ణ చదువు పూర్తి కానట్టుగానో, మరో విధంగానో చూపవలసింది. వీణతో అతని దాంపత్య జీవితం, ఆమె మరణం, అతని ఆత్మహత్యా ప్రయత్నం అనవసరమనిపించాయి. కేవలం సస్పెన్స్ కోసమే వీణ పాత్రను సృష్టించినట్టు, హీరో హీరోయిన్లను కలపడానికి ఆమె పాత్రను చంపివేసినట్టు అనిపించింది.

కాకపోతే శ్రుతి వయసు అమ్మాయిలు ఆ పాత్రలో తమనుతాము ఐడెంటిఫై చేసుకుని ఎంతోకొంత పరిస్థితులకు ఎదురీదడానికి సిద్ధ పడతారు. వీరికి చక్కని స్ఫూర్తినిస్తుంది ఈ నవల.

-ఎం.రాజశ్రీ
హైదరాబాదు

## ఈకాలం నవల

*(ద్వితీయ బహుమతి రూ.75/-పొందినసమీక్ష)*

'సామర్థ్యం' నవల పేరుకు తగ్గట్టుగా కొంతవ రకు ఈ కాలానికి చెందినది. నాయిక శ్రుతి తరతరాల వెనుకబాటు మనస్తత్వాన్ని వీడి, కఠినతర పరిస్థితుల్లో ధైర్యంగా నిలబడి కుటుంబ ఆత్మగౌరవాన్ని కాపాడడంలో నేటి ఆడపిల్లల సాహసానికి అద్దం పట్టింది. మధ్య తరగతి కుటుంబాలలోని సంఘటనలు చక్కగా చిత్రించబడ్డాయి. ముఖ్యంగా కడుపు శోకాన్ని దిగమింగి, కొడుకు సంసారానికి పెద్ద దిక్కుగా మిగిలిన లక్ష్మమ్మనీ, చిలిపిచేష్టల మనవడు భరత్‌నీ పాఠకులెప్పటికీ మర్చిపోలే రు.

అయితే, కొడుకుపట్ల ఎంతో శ్రద్ధాసక్తులు కనబరిచే రాఘవరావు వంశీకృష్ణ మనసు కని పెట్టలేకపోవడమూ, శ్రుతిని కోడలిగా చేసు కుందామనే ఊహే రాకపోవడమూ వీణ అంధురాలిగా పుట్టిన కన్నకొడుకుని అనుక్షణ మూ ద్వేషించడమూ సహజత్వానికి దూరంగా ఉన్నాయి. నాయికని పరిపూర్ణురాలిగానూ, ప్రతి నాయికని అందుకు పూర్తిగా భిన్నంగా నూ చిత్రించడమూ, వికలాంగుల్ని తోటి విద్యా ర్థులూ, ఉపాధ్యాయులూ ఎగతాళి చేసినట్లు చూపించడమూ అవాస్తవిక దృష్టినే స్పష్టపరు స్తున్నాయి. వీణ ఆత్మహత్య చేసుకోడం వంశీ కృష్ణ చిక్కి శల్యమై పోవడం, శరత్ శ్రుతికి మాత్రమే చేరిక అవడం, వంశీకృష్ణ శ్రుతిని తనకు జీవితాంతం తోడుగా ఉండమని దీనంగా వేడుకోవడం ఆమె అందుకు అంగీక రించడం ఫార్ములా పద్ధతిలోనే ఉన్నాయి.





ఇలాంటి కొన్ని లోటుపాట్లను మినహాయిస్తే, పాఠకులకి ఒక సందేశాన్ని ఇద్దామనే ఆకాంక్ష గల రచయిత్రి కలం నుండి వెలువడిన మంచి నవలగా భావించవచ్చు.

-ఎమ్.వి.లక్ష్మి
న్యూఢిల్లీ

## కృత్రిమ సంఘటనలు

*(తృతీయ బహుమతి రూ.50/-పొందినసమీక్ష)*

ఈమధ్య 'చతుర' నవలల్లో కనిపించే ఒక సామ్యం ప్రధానపాత్రను హైలైట్ చేసేందుకు కృత్రిమ సంఘటనలు ఉండడం... ఇతర పాత్రలకు దుర్మార్గాన్ని అంటకట్టడమూను. 'సామర్థ్యం' నవలలో అదే జరిగింది.

'శృతి' పాత్రను హైలైట్ చేసే ప్రయత్నం అడుగడుగునా జరిగింది. 'వీణ' పాత్రను అంతం చేయడం శృతి, వంశీకృష్ణలను కలి పేందుకేనా అని అనిపించింది. అందుకోసమే 'వీణ' ఒక గుడ్డిపిల్లాడ్ని కన్నట్లు ఉంది. మాసికాలు- ఒడుగులు లాంటి తతంగాలు న్నాయి. శృతి ఏ నిర్ణయం తీసుకున్నా అందుకు ఆమె మార్గం సానుకూలం చేస్తూపో యారు రచయిత్రి. తండ్రి పేరుమీద ప్రెస్ అని శ్రీనివాస్ ప్రెస్ అని ఆ తరువాత చెప్పడం. సుభద్రకు ఇరవై ఏళ్ళు అయినా నిండకుండా మగపిల్లవాడు (పేజీ 43) అదొక వింతా?- ఏది ఈ వాక్యంలో వింత? ఇరవై ఏళ్ళు నిండకుండా గర్భం రావడమా? మగ పిల్లాడిని కనడమా?

అసలు తండ్రి చనిపోయే నాటికి శృతి వయసు ఎంత? ఆమె మాటలు ఏ స్థాయిలో ఉన్నాయి. 'భరత్' విషయమూ అంతే. ము గింపు అయితే ఓ సినిమా సన్నివేశంలాగుంది. రామాయణంలో పిడకల వేటలా 'స్వప్న' వృ త్తాంతం ఒకటి... సజీవంగా ఉన్నది 'లక్ష్మమ్మ' పాత్ర మాత్రమే. సహజమైన పోకడలు పోయింది ఆ పాత్ర. తనికెళ్ళ కల్యాణి ఈ నవలా రచనలో మరింత సామర్థ్యం చూపిస్తే బాగుండేది.

శృతిని సర్వ కళావిశారదురాలిని చే సేందుకు కచేరీలు కూడా చేయించారు. వివాహ పత్రిక మీద "సన్నాయి సందడి"

బాగానే ఉందికాని గృహప్రవేశానికి 'పాల పొంగు' ఎబ్బెట్టుగా ఉంది. పాత్రౌచిత్యాలను ప్రశ్నించకుండా చదివితే 'సామర్థ్యం' మంచి నవలే.

-సి. ఈశ్వరరావు
విజయవాడ

## సజీవ రూపకల్పన

*(నాలుగవబహుమతి రు:25/- పొందిన సమీక్ష)*

ఆడపిల్ల సబలగా తన 'సామర్థ్యాన్ని' నిరూపించుకోగలదు. మగవాడి నీడకింద కనుమరుగైపోతున్న ఆడపిల్ల 'సామర్థ్యం' తన అస్థిత్వాన్ని రుజువు చేసుకోగలదు అనటానికి నిదర్శనం ఈ నెల 'చతుర' నవలలోని శ్రుతి పాత్ర.

తల్లిదండ్రులు గుండెలమీద కుంపటిగా భావించే ఆడపిల్ల కూడా మగాడిలా బాధ్యత తీసుకోగలదు. తనవాళ్ళ గురించి త్యాగం చెయ్యగలదు అని స్పష్టీకరించింది శ్రుతి పాత్రని రచయిత్రి మలచిన తీరు; వెనుకటితరంలో అత్తా, భర్తల ఆరడి పెత్తనాలకు బలయిన మేనత్తకు, ఈ తరంలో విశృంఖలత్వాన్ని స్వేచ్ఛగా భావించి వ్యక్తిత్వరహితంగా భ్రమలకుపోయి మోసపోయిన స్నేహితురాలికి స్ఫూర్తిగా శృతి వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దిన తీరు నేటి సమాజంలో ఆడపిల్లలకి మార్గదర్శకం కాగలదు.

'డబ్బు'ని వదులుకోలేక బాధ్యతలనుంచి పారిపోయిన రామచంద్రం 'డబ్బు'తో వ్యక్తిత్వాన్ని సంస్కారాన్ని గెలవాలనుకున్న వీణ, డబ్బుతో సంతోషానందాలను పొందాలనుకున్న స్వప్న పాత్రలద్వారా, మనిషికి మనిషికీ మధ్య నుండాల్సిన ఆప్యాయతానురాగాలు డబ్బుతో కొలిచే వ్యాపార వస్తువులుగా మారిపోయిన వైనాన్ని చూపించారు. 'ధన మూలమిదం జగత్' అంటూ నైతికవిలువలకు నీళ్ళొదిలేస్తున్న నేటి సమాజ స్వరూపాన్ని పాఠకుల ముందుంచిన విధం బావుంది.

అహంకారపు తొడుగులతో దర్పాన్ని ప్రదర్శిస్తూ తిరిగే సురేష్, ప్రకృతిపరంగా స్త్రీకి సిద్ధించిన వరమైన మాతృత్వాన్ని తూలనాడిన వీణల ద్వారా మానసిక అవసరం శారీరక అవసరంకంటే ఎంత నీచమైనదో, అసహ్యమైనదో తెలియజేశారు.

మధ్యతరగతి కుటుంబజీవన విధానాన్ని, స్థితిగతులను, అభిమానానుబంధాలను, వ్యక్తిత్వాలను, మనస్తత్వాలను, కుటుంబసభ్యుల మధ్యనుండే 'ఇంటిమసీ'ని కనులకు కట్టినట్లు చిత్రించటంలో కృతకృత్యులు కాగలిగారు రచయిత్రి.

అయితే మధ్యమధ్యలో కథని సాగదీసి చివర్న ఆదరాబాదరాగా ముగించినట్లనిపించింది. ముగింపు మరికొంత ఎఫెక్టివ్‌గా ఉండేవిధంగా కథని నడిపించి ఉంటే మరింత రక్తి కట్టేది నవల.

నేటి సమాజంలో సంబంధాలను, ముఖ్యంగా మధ్యతరగతి జీవితాలను 'డబ్బుమయంగా' మార్చేసిన విధానానికి 'సజీవరూపకల్పన' అయిన 'సామర్థ్యం'ను ఒక ఉత్తమ రచనగా చెప్పుకోవచ్చు.

-ఎన్. రాజేశ్వరి
హీరమండలం

## శాసించే డబ్బు

*(ఐదవబహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

ఈ లోకంలో డబ్బు అన్నిరకాల స్వార్థాలకీ కారణమైవుంది. డబ్బు మనుషులని శాసిస్తోంది. ప్రేమ- ఆత్మీయతలన్నవి డబ్బు, దాని ప్రభావంముందు దిగదుడుపే! అర్థాంతరంగా తండ్రి చనిపోతే, బంధువులు తన కుటుంబాన్ని ఆదుకోవడానికి తటపటాయిస్తూ, నీళ్ళు నములుతూవుంటే 'శ్రుతి' ఎంతో ఆత్మవిశ్వాసంతో సమస్యలని ఎదుర్కోవడం, విజయం సాధించడం మెచ్చదగినది. 'వుమన్స్‌లిబ్' గురించి ప్రసంగించేవారేగాని దాన్ని పాటించేవారు మన సమాజంలో తక్కువ. ఈ నవల్లో శ్రుతి పాత్ర ద్వారా స్త్రీలు సాధించలేనిది ఏదీలేదని రచయిత్రి చక్కగా నిరూపించారు. అందుకు రాఘవరావులాంటి మంచి మనుషుల సహాయం కూడా ఇంకా ఈ సమాజంలో లభ్యమవుతోందని ఎంతో హృద్యంగా చిత్రించా

రు. శారదమ్మ, ప్రసాద్‌లాంటి మంచివారు కూడా వున్నారని తెలిపినట్లే, వీణలాంటి మూర్ఖులు, తమ సమస్యలని ఎదుర్కోలేని బలహీనులున్నారని ఎంతో చక్కగా తెలిపారు. గుడ్డి పిల్లవాడు పుట్టాడని తెలిసిన వీణ ప్రవర్తన జుగుప్స కలిగేదిగాను, ఆపై ఎంతో జాలిగొలిపేదిగానూ వుంది. మాతృత్వం మరిచి, ద్వేషించే తల్లులుంటారా? అని అనిపించింది. అయితే అవిటివాడైన ప్రసాద్‌లో 'ఆత్మస్థయిర్యం' పెంపొందించి, తన చెల్లెలు ప్రీతినిచ్చి వివాహం చెయ్యడం, వారికోమార్గం చూపడం ద్వారా 'శ్రుతి' పాత్రని ఎలివేట్ చేశారు. అలాగే గుడ్డిపిల్లాడు శరత్‌ని శ్రుతి ఆదరించడం, చివరికి ఆ పిల్లవాడికోసం వంశీకృష్ణని వివాహం చేసుకోవడం ద్వారా 'సామర్థ్యం' నవలకి చక్కటి ముగింపునిచ్చారు. రామచంద్రం, ప్రకాశంలాంటి స్వార్థపరులు భార్యచాటు భర్తలు కోకొల్లలుగా, శ్రుతిలాంటివారు అరుదుగా కనిపిస్తారు. స్వప్నలాంటి అభాగినులు తమ కాళ్ళపై తాము నిలబడటం నేటి ఆధునిక సమాజంలో రాబోతోన్న మార్పు. 'సామర్థ్యం' నవలలో తనికెళ్ళ కల్యాణిగారి పాత్రల సృష్టి సజీవాలై నిలిచాయి. శైలి కూడా బావుంది. చెప్పదలచుకొన్నది చాలా 'సింపుల్'గా చెప్పారు.

-సి.రవితేజస్వీ
చింతలూరు

## మెప్పించిన నవల

*(ఆరవబహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

సెక్స్, వయలెన్స్, సస్పెన్స్‌ల వెల్లువలో తెలుగు నవలలు కొట్టుకుపోతున్న ఈ రోజుల్లో సెంటిమెంట్లు, కుటుంబసమస్యలు ఆధారంగా చేసుకొని నవల రాయడం సాహసమే. తనికెళ్ళ కల్యాణిగారి 'సామర్థ్యం' గొప్ప రచన అని చెప్పలేకున్నా చదివించి మెప్పించగల మంచి నవల.

శ్రుతి పాత్ర చిత్రీకరణ ఈ నవలకు హైలైట్. ఆ పాత్రను మలిచినతీరు నవలకు విలువ చేకూర్చింది. కుటుంబానికి పెద్దదిక్కు హఠాత్తుగా చనిపోతే ఆ సంసారం వీధిన పడవలసిన స్థితిలో ముందుకొచ్చి ఆ భారాన్ని తన భుజాలకు ఎత్తుకొని ఆత్మవిశ్వాసంతో, ముందుకు నడిచి తనవారందరినీ నడిపించి గమ్యం చేర్పించిన, ఉదాత్తపాత్ర శ్రుతి. ఎలాంటి ఆకర్షణలకు, ప్రలోభాలకు లొంగకుండా తన ఆశయాన్నే ధ్యేయంగా పెట్టుకొని జీవనసమరంలో వీరోచితంగా పోరాడి విజయశిఖరాన్ని అధిరోహించిన శ్రుతి పాత్ర అభినందనీయం, ఆదర్శనీయం.

అనుబంధాలు, ఆత్మీయతలు ఆర్థిక విలువలముందు దిగదుడుపేననే జీవితసత్యానికి తార్కాణంగా నిలిచే సంఘటనలు, పాత్రలు కూడా ఈ నవలలో దర్శనమిస్తాయి. ఈ నవలలో అధికశాతం పాత్రలు అన్నీ మంచితనంతో కూడుకున్నవే. ముఖ్యంగా స్త్రీ పాత్రలు. ఒక్క వీణ పాత్ర తప్ప. శ్రుతి మేనత్త సుభద్ర పాత్ర కూడా పాఠకుల మదిలో మహోన్నతంగా నిలిచిపోతుంది. చివరికి ఆమె చనిపోయిన సంఘటన శ్రుతినే కాదు, పాఠకులను కూడా స్పందింపచేస్తుంది.

శ్రుతి పాత్ర ఔన్నత్యానికి ఈ నవలలో మిగిలిన పాత్రలన్నీ దాదాపు దోహదం చేస్తాయి. ఆమె కుటుంబంలోని వ్యక్తులే కాకుండా రాఘవరావు, వంశీకృష్ణలాంటి పరిచయస్తులు కూడా మంచివారే. ఇందరి మంచి మనుషుల మధ్య, వారి సహాయ సహకారాలతో శ్రుతి తన జీవితాన్ని అనుకున్నట్లుగా మలుచుకోగలిగింది తప్ప ప్రత్యేకించి ఆమెకు ఎలాంటి క్లిష్టమైన సమస్యలు, బాధలు ఎదురుకాలేదు. అలాంటి వ్యక్తులను సంఘటనల్ని కూడా మరికొన్నింటిని నవలలో చొప్పించి ఆ సమస్యలను స్వయంగా శ్రుతే ఎలా పరిష్కరించుకోగలిగిందీ చిత్రించివుంటే ఆ పాత్రకు మరింత ఉదాత్తత చేకూరివుండేది.

**-ఇ.టి. రామారావు**
**శ్రీహరికోట**

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.

CHATURA Telugu Monthly Hyderabad – 500 482 Regd. No. H/HD/402

ఉషాకిరణ్ మూవీస్



# జీవితమే ఒక సినిమా




రామోజీరావు ఫణి రామచంద్ర

శ్యామసుందర కులకర్ణి తనికెళ్ళభరణి వేటూరి సిరివెన్నెల కీరవాణి సుధాకరరెడ్డి గౌతంరాజు భాస్కరరాజు అట్లూరి రామారావు